# రాహుల్ సాంకృత్యాయన్



# జయ యౌధేయ

# జయ యౌధేయ

రచన :
రాహుల్ సాంకృత్యాయన్

అనువాదం :
ఆలూరి భుజంగరావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం. : 1851
ప్రతులు : 1000
ప్రథమ ముద్రణ : మే, 1965
ద్వితీయ ముద్రణ : మే, 1976
తృతీయ ముద్రణ : జూలై, 1987
చతుర్థ ముద్రణ : డిసెంబరు, 1994

తెలుగు అనువాదం





టైటిల్ డిజైను : గోపి

వెల : రూ. 45-00

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన్ భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాద్ - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్

విజయవాడ, విశాఖపట్టణము, హైదరాబాదు, అనంతపురము,

గుంటూరు, హన్మకొండ, తిరుపతి, కాకినాడ.

ISBN : 81-7098-020-8

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్, విజయవాడ-520 004.

# బాష్పాంజలి

నా సత్యపతిలా
ప్రసవంలో ప్రాణాలర్పించిన
అభాగినులకు

—ఆలూరి భుజంగరావు

# తొలి పలుకు

"జయ యౌధేయ" చారిత్రాత్మక నవల. దీనిలో క్రీ. శ. 350-400 సం॥ ప్రాంతపు భారత రాజకీయ సామాజిక పరిస్థితులు చిత్రించబడ్డవి. ఆ రోజుల్లో యౌధేయ గణం ఒక బలమైన గణ వ్యవస్థ (ప్రజాస్వామిక వ్యవస్థ). ఈ గణం యమునా నదికీ, హిమాలయ పర్వతాలకూ మధ్యగా వుండేది.

మన చరిత్రకారులు ఈ విశాలమైన గణాన్ని గురించి కేవలం మౌనాన్ని వహించారు. సాధ్యమవుతే 'యౌధేయ' అన్న పేరునే చరిత్రలో లేకుండా చేసేవారు. కాని భూగర్భములో దాగిన నాణాలే స్వయంగా తమ చరిత్రను వేనోళ్ళ చాటు కున్నాయి.

తర్వాత అతివిశాలమైన యౌధేయ గణపు చరిత్ర వెలుగులోకి వచ్చింది. ఇక నిప్పుడు హిందూ విశ్వవిద్యాలయపు ప్రొఫెసరూ, భారతీయ చరిత్ర పరిశోధకుడూ అయిన డాక్టరు అల్టేకర్ కూడా యౌధేయుల పరాక్రమాన్ని ప్రశంసిస్తూ ఇలా అన్నారు; "భారతదేశాన్నుండి కుషాణుల శాసనాన్ని పారద్రోలడంలో గుప్త వంశము, భార, శివవంశాల కంటే యౌధేయులే ప్రధానమైన పాత్ర వహించారు."

నాలుగో శతాబ్దంలో సముద్రగుప్తుడు చెక్కించిన శిలాశాసనంలో ఇలా వ్రాసుకున్నాడు. "సర్వకరదాన ఆజ్ఞాకరణ ప్రణామాగమన" (పన్ను వసూలు చేసే అధికారాన్ని నమస్కారములను యిచ్చి 'యౌధేయులు' నన్ను సంతృప్తుణి చేశారు) పై శిలా శాసనము ద్వారా యౌధేయులను సముద్రగుప్తుడు పూర్తిగా నాశనం చేయలేదని కొన్ని అధికారాలను మాత్రం వారి నుండి పొందాడని తెలియు చున్నది. కాని అయిదో శతాబ్దారంభం నుండి యౌధేయగణాన్ని గురించిన నామ మాత్రపు చిహ్నాలయినా చరిత్రలో కనుపించవు. ఇందుమూలంగా స్పష్టపడే విషయం యౌధేయగణాన్ని చంద్రగుప్త విక్రమాదిత్యుడు విధ్వంస మొనర్చాడని.

నేనీ ప్రస్తుత నవలలో పై జెప్పిన యౌధేయగణాన్ని, దాని ధ్వంసలీలనూ చిత్రించాను. రాజవంశపు పేర్లను చరిత్రనుండి గ్రహించాను. యౌధేయ గణంలోని ప్రజలపేర్లు అలభ్యం. ఆనాటి సమాజ చిత్రణకు కాళిదాసు గ్రంథాలనూ, చైనా యాత్రికుడు ఫాహియాన్ యొక్క యాత్రా వివరణనూ అనుసరించాను. డాక్టర్ అల్టేకరూ, ప్రొఫెసర్ రాఖాల్‌దాసుబెనర్జీ మరియు డాక్టరు ఎల్.ఎన్. దండేకర్

మొదలయినవారి చారిత్రక గ్రంథాల నుండి సహాయమును పొందాను. గుప్తకాలపు శిలాశాసనములూ, నాణములూ బాగా వుపకరించాయి.

చంద్రగుప్తుడి వలన ధ్వంసపటలం గావించబడ్డ యౌధేయజాతి పూర్తిగా నాశనమైపోయిందా ? అన్న ప్రశ్నకూడా ఉదయిస్తుంది. ఆ ధ్వంస లీల నుండి బ్రతికి బయటపడ్డ యౌధేయ జాతి అక్కడక్కడా నామావశిష్టంగా మిగిలిపోయింది. భాగల్పూరు సంస్థానం నుండి ముల్తాన్ వరకు వున్న విస్తృతమైన ప్రదేశాన్ని జోహియావార్ అంటారు. "జోహియా" అన్న పదం "యౌధేయ"కు అపభ్రంశం.

మోహిస్తాన్ (కరాచీ ప్రాంతం) లో కూడా జోహియా ప్రజలుంటున్నారు. గుర్గాంవ్, అల్వార్ ప్రాంతపు మేవ్ జాతి (ముస్లిములు) ఇప్పటికీ యౌధేయ భూమి లోనే నివశిస్తున్నది. ఈ జాతి వీరగాధల్ని వింటూవుంటే రోమాంచితమవుతుంది. మతాంతరులై కూడా వారు యౌధేయ రక్తంలోని శౌర్యాన్ని మరువలేదు.

వీరేగాక అగ్రవాల్, అగ్రహరి, రస్తోగి మొదలుగాగల ఇప్పటి వైశ్యజాతులు కూడా ఆ వెనుకటి యౌధేయ సంతానమే - పాపం ! తమ గణం నాశనమయిన తర్వాత వీరు కత్తిని వదలి త్రాసును బట్టారు.

ఈ నవలలో చరిత్ర అస్థిపంజరంగా ఉపయోగపడ్డది. నా కల్పన ఆ పంజరానికి మాంసాన్ని చేకూర్చింది.

—రాహుల్ సాంకృత్యాయన్

# ప్రకరణ సూచిక

# సముద్రగుప్తుడు-యౌధేయులు

నాకు నాలుగు లేక నాలుగున్నర సంవత్సరాల వయస్సప్పుడు జరిగిన కొన్ని సంఘటనలు లీలగా జ్ఞాపకం. అంత క్రితపు నా జీవితాన్ని గురించి నాకేమాత్రమూ తెలియదు. కనుక నా జీవిత సంగ్రహం అనదగిన ఈ గ్రంథాన్ని అలనాటి సంఘట నలతోనే ప్రారంభించడం ఉత్తమం; ఉచితం కూడాను. కాని, పఠితలకు విషయం సుగ్రాహ్యం కావడానికి నా జననానికి రెండు మూడు సంవత్సరాల ముందు జరిగిన కొన్ని సంఘటనలను ముందుగా వివరిస్తాను. నిజంగా నా జననానికి అర్ధశతాబ్ది క్రితం జరిగిన అనేక సంఘటనలను గురించిన చారిత్రకానుభూతిని స్ఫురణకు తెచ్చుకొన్న ప్పుడల్లా; అద్యతన భావిలో యౌధేయజాతినే సర్వనాశనంచేసి, ఈ దేశ చరిత్రలో నుండే- యౌధేయ - అన్న శబ్దాన్నికూడా తుడిచివేయడానికి కావల్సిన సామాగ్రి ఒనకూడిం దనిపిస్తుంది. తమ సువ్యవస్థితమైన గణతంత్ర—ప్రజాస్వామిక—రాజ్యాంగాన్ని కాపాడుకోవడానికి మా జాతి మొత్తం ఒక్క పెట్టున విజృంభిం చింది. లక్షలకొలది స్త్రీ పురుషులు శస్త్రధారులై కదనరంగానికి వురికారు, నవ్వుతూ ప్రాణాలను అర్పించారు. అలాటి ఈ మహాజాతిని గురించిన, సాధారణమైన విషయం కూడా ముందుతరాలవారికి అందకుండా చేయడానికి ప్రయత్నాలు జరిగా యని వ్రాయడానికి బాధపడుతున్నాను. బాధను మించి సిగ్గుకూడా పడుతున్నాను! దేవ పుత్రశాహీ (కుషాణుడు)కి నడుములు విరగ్గొట్టింది మా యౌధేయజాతి! కాని ఈనాడు ఆ ఘన గౌరవాన్ని గుప్త వంశీయులు కొట్టేయాలని చూస్తున్నారు. మహా క్షత్రపుడైన రుద్రదామాను వెనుదిరిగి చూడకుండా తరిమికొట్టింది మేము. అతడి పరి పాలనలోని భూభాగానికి ఎల్లలు నిర్ణయించే అధికారాన్ని ఉజ్జయినినుండి మేము తీసు కొన్నాము. అనేకమంది శక వంశీయులైన సామంతులు యౌధేయుల ప్రజల పరా క్రమం ముందు వివశంగా తలలు వంచారు. కాని, ఈ మొత్తం గౌరవాన్ని గుప్త వంశానికి కట్టబెట్టడానికి మహాకవి కాళిదాసు మొదలయిన వారుకూడా ప్రయత్నం చేస్తున్నారు.

నా పుట్టుకకు మూడేండ్ల క్రితం జరిగిన విషయం. పరమభట్టారక, మహా రాజాధిరాజ మొదలుగాగల బిరుదులను ధరించిన సముద్రగుప్తుడు, మూడవసారి పశ్చిమ దిశకు దండయాత్ర సాగించాడు. అహిచ్ఛత్రమునకు రాజైన అత్యుడు, మధుర ప్రభువైన నాగసేనుడు సముద్రగుప్తుని ధాటికి తట్టుకోలేక అతడి పాదాలకు ప్రణమిల్లి లొంగిపోయారు. కాని, సముద్రగుప్తుడు కాంచీనగరం మీదకు-దక్షి

ఐమునకు దండు వెడలగానే, తిరిగి అత్యుడు తలఎత్తాడు. ఎదురు తిరిగాడు. వెంటనే సముద్రగుప్తుడు దక్షిణాన్నుండి సైన్యాన్ని అత్యుడి రాజ్యమైన అహిచ్ఛత్రం మీదకు నడిపించాడు. నాగసేనుడు మరికొంతమంది రాజులు అత్యుడికి బాసటగా నిలబడ్డారు. సైనిక సహాయంచేశారు. అయినప్పటికీ సముద్రగుప్తుడి బలపరాక్రమం ముందూ, సైనికశక్తి ముందూ నిలవలేకపోయారు. పరాజితులయ్యారు.

మధురవరకూవచ్చాక, సముద్రగుప్తుడికి వీర ప్రసవిని అయిన మా యౌధేయ భూమిని గురించీ జాతిని గురించీ అనేక విషయాలు తెలిశాయి. బంగారుపండే మా పంటభూములను, అమృతధారలు చేసే మా పాడిగోవులను, సర్వసుఖాలతో ఇంద్ర పురికి సమ మనదగిన మా పట్టణాలను గురించి విన్నప్పుడు, సముద్రగుప్తుడికి మా భూమిని జయించాలన్న ఆశ, కోర్కె కలగడం సహజం. కలిగింది కూడాను ! కాని యౌధేయులు అరాజకవాదులనీ, (రాజు లేని-గణతంత్ర వ్యవస్థ) వారి దేశంలో దేశ పరిపాలనకు సంబంధించిన ప్రతి చిన్న విషయంలోనూ యౌధేయులందరూ పాల్గొం టారని కూడా విన్నాడు. పై పెచ్చు కుషాణుడిని, మహాక్షత్రపుడుని ఓడించే నిమిత్తం కుణిందులు, అర్జునాయన్లు, యౌధేయులు కలసి ఒక గణతంత్ర స్వతంత్ర కూటమిని ఏర్పరచుకున్నారు. ఇలాటి స్థితిలో గణతంత్ర వ్యవస్థలోవున్న మమ్మల్ని తప్పకుండా ఓడించాలన్న పట్టుదల సముద్రగుప్తుడికి కలిగింది. సముద్ర గుప్తుడు మా బలాన్ని తప్పుగా అంచనావేశాడు. తన సంఘటిత ప్రచండసేనావాహిని ముందు మేము గడ్డిపోచలా తునాతునకలై తలలు వంచుతా మనుకొన్నాడు. కాని, యౌధేయులకు తమ మాతృభూమి ప్రాణాలకంటే ప్రియమైనది. తమ గణతంత్ర వ్యవస్థను నిలుపుకోడానికి ఎలాటి త్యాగానికయినా మేము సిద్ధమే! యువక-వృద్ధ, స్త్రీ-పురుష భేదం లేకుండా యౌధేయ జాతి మొత్తము కత్తిపట్టి సముద్రగుప్తుడిని ఎదుర్కోవడానికి సిద్ధమైంది. చావడమో లేక స్వాతంత్ర పరిరక్షణో అనే దృఢ సంకల్పంతో ఆనాడు మా జాతంతా అభిభూతమైంది. సముద్రగుప్తుడికి సహకరిం చిన మగధ, లిచ్ఛవి, కాశీ, కోసల, వత్స, పాంచాల, అంతర్వేది మొదలుగాగల రాజ్యాల రాజులు వారిసైనికులు ప్రళయాగ్నికి ఆహుతైన శలభాల్లా హతులౌతున్నారు. యుద్ధం యౌధేయ భూమిలోనికి అంతకంతకు జొచ్చుకుపోసాగింది. స్వాతంత్ర్య పరిరక్షణలో యౌధేయులు కూడా మరణించసాగారు. గుప్త సైనికులు మా పల్లె లను తగులబెట్టసాగారు. పంటకు వచ్చిన పొలాలను నాశనం చేశారు. స్త్రీలను, బాలుర్ని, వృద్ధుల్ని కనపడ్డ ప్రతివాళ్ళనూ హింసించారు. వాళ్ళ చేతుల్లో పడిన మా యువకులను చిత్రవధ చేశారు. ఇలాచేస్తే భయపడి యౌధేయులు తలలు వంచు తారని గుప్తసైనికుల ఆశ! కాని, యౌధేయులు అంతమాత్రానికే లొంగే రకం కాదు. ఎటూ ప్రాణాలకు తెగించారు తెగపడి పోరాడారు. ఆ సమయంలో యౌధేయ ప్రాంతమంతట్లోనూ సముద్రగుప్తుడి మీద ద్వేషానల జ్వాలలు తీవ్రంగా పెల్లుబికాయి.

కాని, చంద్రగుప్తుడి కాలంలో జరిగిన విధ్వంసాన్ని తల్చుకొంటే, సముద్ర గుప్తుడిని ఒకందుకు తప్పకుండా అభినందించవల్సి వుంటుంది. సముద్రగుప్తుడు వీరుడు. వీరుడిలో వుండవలసిన ఔదార్యం కూడా అతడిలో వుంది. కాని, చంద్ర గుప్తుడిలో ఆ ఔదార్యం మృగ్యం.

తన సైనికులు యౌధేయ స్త్రీ-బాల-వృద్ధులను హింసించారని విన్నప్పుడు సముద్రగుప్తుడు చాలా పశ్చాత్తాపాన్ని పొందాడు. తన యుద్ధ మంత్రినీ, సేనాధి పతినీ గట్టిగా మందలించాడు. తరువాత తను స్వయంగా యౌధేయ గణానికి ఈ విధంగా జాబు వ్రాశాడు : 'మా సైనికులు యౌధేయ జాతిపట్ల ఒనరించిన ఈ అత్యాచారానికి, లిచ్ఛవి వంశ దౌహిత్రుడనైన నేను చాలా పశ్చాత్తాపడుతున్నాను. లిచ్ఛవి దౌహిత్రుడు (సముద్రగుప్తుడి తల్లి కుమారిదేవి లిచ్ఛవి వంశీయురాలు) యౌధేయ గణాన్ని నాశనం చేయాలని ఎన్నడూ అనుకోలేదు, అనుకోడు కూడాను; యౌధేయులు, కుషాణుణ్ణి, అతడి ప్రభువులైన పారసీకుల్నీ దేశంనుండి తరిమివేయ డంలో వహించిన పాత్రను, చూపిన ప్రతాపాన్ని లిచ్ఛవి దౌహిత్రుడు శ్రద్ధాసక్తుల్తో గమనిస్తున్నాడు. యౌధేయుల ఈ ప్రబల పరాక్రమాన్ని చూచినప్పుడు మాతృవంశ మైన లిచ్ఛవి వంశం జ్ఞప్తికి వస్తుంది ఈ దౌహిత్రుడికి! లిచ్ఛవి వంశీయులు కూడా యౌధేయుల్లాగానే పరమ పరాక్రమవంతులు. వాళ్ళకూ వేయి సంవత్సరాల చరిత్ర వుంది. కాని, ఇప్పుడు లిచ్ఛవిగణం ఒక విషయం బాగా అర్థం చేసుకొన్నది. మినాందర్, కనిష్కుడు లాంటి వారి చేతులలోనుండి భారతదేశాన్ని కాపాడా లంటే ఈ దేశంలోని అన్ని గణాలూ రాజ్యాలూ ఏకమై ఒక బలమైన శక్తిగా తయారవాలి. అప్పుడు కాని అన్యదేశీయుల ముట్టడుల నుండి ఈ దేశాన్ని కాపాడ లేము. పై మహదాశయంతో, యౌధేయులు కూడా ఏకీభవించాలని మాత్రమే లిచ్ఛవి దౌహిత్రుడు కోరుతున్నాడు. మ్లేచ్ఛులైన విదేశీయుల హస్తాల్లో పడకుండా భారతదేశాన్ని కాపాడడమే దౌహిత్రుడి ఆశయం. యౌధేయులను హింసించడం గాని, వారి భూమిని అపహరించడంగాని మా ఆశయంకాదు. కనుక యౌధేయులు మా ఆశయాన్ని, హృదయాన్ని అర్థం చేసుకోగలరని ఆశిస్తున్నాను !"

ఎంత పౌరుషంగా పోరాడినప్పటికి, యౌధేయులు యుద్ధంలో బాగా దెబ్బ తిన్నారు. అపారనష్టానికి గురిఅయ్యారు. వెనక్కుతిరిగి ఆలోచించాల్సిన సమయం వచ్చింది. పైగా సముద్రగుప్తుడి పై జాబు యౌధేయులను మరికొంచెం ఆలోచించేట్టు చేసింది. ఇకనప్పుడు యౌధేయ గణాధ్యక్షుడైన మహారాజ, మహాసేనాధ్యక్ష కుమార యౌధేయుడు (కుమార యౌధేయుడు నా తండ్రి. మహా రాజ, మహాసేనాధ్యక్ష వారి బిరుదులు) అర్జునాయన గణాధ్యక్షుడు నరవర్మా, కుణింద గణాధ్యక్షుడు రోహితుడు-ఈ ముగ్గురూ కలసి గణతంత్ర స్వతంత్ర కూటమికి అధ్యక్షుడైన సుషేణుణ్ణి దౌత్యార్థిగా సముద్రగుప్తుడి దగ్గిరకు పంపారు. సముద్రగుప్తుడు చాలా ఆప్యాయంగా సుషేణుణ్ణి ఆహ్వానించాడు. అరమరికలులేకుండా

అతడితో మాట్లాడాడు, వ్యవహరించాడు. దేశరక్షణకు ఒక సమ్మిళితకోశాన్ని ఏర్పరుద్దామన్నాడు. అందులో యౌధేయగణం తరపున కూడా కొన్ని దీనార్లను వేయించమన్నాడు. అతడి ఈ షర్తుకు సుషేణుడు సమ్మతించాడు. సుషేణుడు తిరిగివచ్చి అన్ని విషయాలను గణసంస్థల్లో చెప్పాడు. గణాధ్యక్షుల సమ్మతితో సంధి జరిగింది. సముద్రగుప్తుడు యౌధేయుల ముఖ్యపట్టణమైన అగ్రోదకా (అగ్రా)కు వచ్చాడు. యౌధేయ జాతి బాంధవ్యాన్ని తాను కోరుతున్నానని తెలియజేశాడు. గణ సంస్థాగారంలో అతడు యౌధేయజాతి పెద్దలకు అభిముఖుడై మాట్లాడుతున్నప్పుడు పశ్చాత్తాపంతోటి, బాధతోటీ అతడి గొంతు రుద్ధం అయింది. కండ్లు చెమర్చాయి.

ఇలా అన్నాడు! "నావల్ల మీ జాతికి చాలా అరిష్టం జరిగింది. మీ బాధలకు కారకుణ్ణయిన నేను మీ ఎదుట వున్నాను. కోరిన దండన విధించండి!" అతడి మాటలు పూర్తికాకుండానే అతడి కండ్లనుండి అశ్రుధార ప్రవహించినది. మా గణ వ్యవస్థాపకులు అసలే విషాదంలో వున్నారు. సముద్రగుప్తుడి మాటలూ, అతడి అశ్రుపూరిత నయనాలూ, వ్యవస్థాపకుల హృదయాలను కలచివైచాయి. సముద్రగుప్తుడు తన సంభాషణను ముగిస్తూ మా తండ్రిగారైన కుమారయౌధేయుడి పాదాల మీద ప్రణమిల్లడానికి ముందుకు వరిగాడు. వెంటనే కుమారయౌధేయుడు సముద్రగుప్తుని కౌగలించుకున్నాడు. వరసగా వ్యవస్థాపకు లందరూ సముద్రగుప్తుని ఆలింగనం చేసుకున్నారు. ఎండుగడ్డిలో నిప్పురవ్వలా ఈ వార్త యౌధేయభూమి అంతట్లోనూ వ్యాపించింది. ప్రజల హృదయాలలోని ద్వేషక్రోధాలు అంతరించాయి. ప్రజలు ముక్తకంఠంతో, సముద్రగుప్తుణ్ణి ప్రశంసించసాగారు. కొద్దిరోజుల తరువాత సముద్రగుప్తుడు నా అక్కగారైన దత్తాను వివాహమాడి మహారాణిని చేశాడు. ఆనాటినుండి యౌధేయుల హృదయాల్లో సముద్రగుప్తుడికి ఒక సున్నితమైన స్థానం ఏర్పడ్డది.

* * *

నా అక్కగారైన దత్తాకు మొదటి సంతానం రామగుప్తుడు. అతడు పాటలీపుత్రంలోనే జన్మించాడు. రెండోమాటు గర్భిణీ అయినప్పుడు పురిటికి పుట్టింటికి పంపమని భర్తను కోరింది మా అక్క. సముద్రగుప్తుడు అంగీకరించి మా అక్కను అగ్రోదకాకు పంపాడు. అగ్రోదకాలో ఆమె రెండవ సంతానం చంద్రగుప్తుణ్ని కన్నది. చంద్రగుప్తుడికన్న నేను మూణ్ణెల్లు చిన్నవాడినట. నేను పుట్టినప్పుడు మా అక్క అగ్రోదకాలోనే వుందట. ఆ తరువాత ఒక సంవత్సరం వరకూ పుట్టింట్లోనే గడిపి, (భర్త ఎన్నోసార్లు కబురుచేయడంవల్ల) రాజధానికి వెళ్ళింది. మా అక్క చంద్రగుప్తుడిమీద కంటే నా మీదనే ఎక్కువ ప్రేమతో, గారాబాన్ని కనబరుస్తూ వుండేది!

రాజాంతఃపురంలో పాలు ఇచ్చే దాదులు చాలా మంది వుండేవారు. మహారాణి తన స్తన్యాన్ని చంద్రగుప్తుడికి ఈయవల్సిన అవసరం ఏ మాత్రం లేదు. అయినా తను స్వయంగా చంద్రగుప్తుడికి స్తన్యాన్ని ఇచ్చేది. మా ఇద్దరిని ఒడిలో కూర్చోబెట్టుకుని ఏవేవో కబుర్లు చెబుతూ వుండేది. అప్పుడప్పుడూ చంద్రగుప్తునితో పాటు నాకూ తన స్తన్యాన్ని ఇచ్చేది. ఈ దృష్టితో, దత్తాను నేను అక్కగానే కాకుండా తల్లిగాకూడా భావిస్తూవుండేవాడిని. అప్పుడప్పుడూ అక్క చంద్రగుప్తునికి స్తన్యాన్నిస్తూ ఇలా అంటుండేది. "యౌధేయ స్త్రీ పాలు ఇతరస్త్రీల పాలకంటే విశిష్టమైనవి!"

అక్క రాజధానికి వెళ్ళేటప్పుడు నన్నుకూడా తనవెంట తీసుకువెళ్తానంది. అమ్మకు నన్ను అక్కతో పాటలీపుత్రానికి పంపడం ఇష్టం లేదు. అందుకు కారణం అక్కమీద అమ్మకు విశ్వాసం లేకపోవడం కానీ, మరొకటిగానీ కాదు. అమ్మకు నేను ఒక్కణ్ణే కొడుకుని.... పైగా లేక లేక కలిగాను. "ఒక సంవత్సరం తర్వాత కొంచెం పెద్దవాడవుతాడు. అప్పుడు తప్పక పంపుతా"నని చెప్పి అక్కను ఒడబఱచి రాజధానికి పంపించింది అమ్మ.... కాని.... దురదృష్టం.... మరుసటి సంవత్సరానికి అమ్మ లేకుండా పోయింది! ఈ దుర్వార్త వినగానే అక్క ఆగ్రోదకాకు వచ్చింది. కొద్ది రోజులుండి రాజధానికి వెళ్ళిపోయింది. ఈ మాటు నన్ను తనతోపాటు రాజధానికి తీసుకుపోవడం తప్పనిసరయింది.

మా అమ్మ పేరు జయసేన. నేను చాలా చిన్నతనంలో, నా వూహలు వికసించకముందు ఆమెను చూశాను. అందువల్ల అమ్మ ఎలా వుంటుందోకూడా నాకు తెలియదు. కాని అమ్మ అచ్చం అక్కలాగే వుంటుందని కొంతమంది అంటుండగా విన్నాను. కనుక అమ్మను తల్చుకొన్నప్పుడు అక్క విగ్రహమే నా కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది.

మా అక్క దత్తా చాలా సున్నితమైన, సరళమైన స్వభావం కలది. సముద్రగుప్తుడి పట్టమహిషి అయినప్పటికీ ఆమెకు ఏ మాత్రమూ గర్వం వుండేది కాదు. అందరితో చాలా చనువుగా, కలుపుగోలుతనంతో మాట్లాడుతూ వుండేది. ఆమె చివరకు దాసీలమీదనయినా విసుక్కోవడంగానీ, కసురుకోవడంగానీ నేనెన్నడూ చూడలేదు! భర్తకంటే రెండేండ్లు ముందు [క్రీస్తుశకం 372లో] మా అక్క చనిపోయింది. మా అక్క మృత్యువుకు రాణీవాసంలోగానీ, నగరంలోగానీ దుఃఖించనివారు లేరు. అక్క మరణకాలంలో నేను దగ్గరలేను. సింహళంలో వున్నాను. అందువలన మృత్యువార్త నాకు చాలా ఆలస్యంగా అందింది. ఆ వార్త విన్న తరువాత నేను ఎన్నో నెలలు అన్య మనస్కుడనై దుఃఖంతో గడిపాను. అప్పుడు నేను అనూరాధపురపు మహా విహారంలో వున్నాను. ఎలాగో అనుమతి తీసుకొని చైత్యగిరి చేరుకొన్నాను. ఇక నక్కడ నా దుఃఖానికి మితిలేదు.

# బాల్యం

నా వూహలు వికసించిన నాటినుండి చంద్రుడు [చంద్రగుప్తుడు] నేనూ అభిన్న మిత్రులముగా, సోదరులుగా మెలిగాము. చంద్రుడు చిన్నతనమునుండి కొంటెగా, పొగరుబోతుగా, ఉద్దండుడిగా ప్రవర్తిస్తూ వచ్చాడు. దాస దాసీలను, పరిజనాన్నీ, ఇతర రాణీలను చండుకు తినేవాడు. ఆ చిన్నతనంలో కూడా అతడి ఆజ్ఞలను తిరస్కరించడానికి అంతఃపురంలో ఎవ్వరికీ ధైర్యం చాలేదికాదు! ముఖం చాటు చేసుకొని దాసీలూ, పరిజనమూ అతడిని చండశాసనుడనీ, క్రూరుడనీ, నిష్ఠురుడనీ— ఏమేమిటో అంటూండేవారు! కానీ, చంద్రుడు నాపట్ల మాత్రం ఎన్నడూ తన కాఠిన్యాన్ని ప్రదర్శించలేదు.

యౌధేయులం తల్లిని అజ్జుక అంటాము. చిన్నతనంలోనే మాతృ వియోగం సంభవించడంవల్ల, దత్తా నన్ను తల్లిలా పెంచడంవల్ల ఆమెను అజ్జుక అని పిలుస్తూండేవాడిని. అజ్జుక చంద్రుడిమీద విపరీతమైన గారాబాన్ని ప్రదర్శించేది. అతడలా మొండివాడు కావడానికి ఆమె చూపే అతి గారాబం కూడా కొంత కారణం. తన అభిప్రాయానికి ఏమాత్రం వ్యతిరేకం జరిగినా అంతఃపురాన్నంతా ఒక కొలిక్కి తెచ్చేవాడు. కనపడ్డ ప్రతి వస్తువునూ నాశనం చేసేవాడు. కనపడ్డ ప్రతివాడినీ కొట్టేవాడు. అక్కడికీ కోపం చల్లారక ప్రమదావనంలోని క్రీడా పర్వతం మీదకుపోయి బొమ్మలా మూతి ముడుచుకు కూర్చునేవాడు. అలాంటప్పుడు అజ్జుక నన్ను దగ్గరకు తీసుకొని, గడ్డం పుచ్చుకొని ఇలా అనేది – "జయా! నువ్వే చంద్రుణ్ణి అనునయించి తీసుకురాగలవు! పో! తీసుకురా" అనేది. నిజంగానే, నన్ను చూడడంతో చంద్రుడి కోపమంతా కర్పూరంలా కరిగిపోయేది. నవ్వుతూ వచ్చి కౌగలించుకొనేవాడు.

చంద్రుడు పెరిగినకొద్దీ అతడి స్వభావంలోకూడా కొంత మార్పు వచ్చింది. తనలోవున్న క్రూరమైన స్వభావాన్ని కొంతవరకు అణచుకొన్నాడు. సముద్ర గుప్తుడుకూడా నన్ను ప్రేమగానే చూసేవాడు, కాని, అధికమైన గారాబాన్ని చూపి నన్ను తనవైపు ఆకర్షించుకొనలేక పోయాడు. అందుకు కారణం అతడి రాజ్యాంగ వ్యవహారాలు, వందల సంఖ్యలోవున్న రాణులూ కావచ్చు. మరి వారందరికీ పోను, మా దగ్గరకువచ్చి, మాట్లాడి, ఆడి - మా హృదయాల్లో ప్రేమ భావాన్ని కలిగించడానికి సమయమేది? ఏ కొద్దిపాటి సమయమున్నా, అది రామగుప్తుడికి. సరి;

పోతుంది! అవును మరి! రామగుప్తుడు కాబోయే యువరాజాయె! రాముడి (రామ గుప్తుడి) స్వభావం చాలా మధురమైంది. ఇతడూ చంద్రుడూ తూర్పు పడమరలు. రామగుప్తుడిలోని మెతకదనాన్ని ఆధారం చేసుకొని పరిజనము, ఇతర దాసదాసీజన ములు—అతడినుండి చాలా అనుచితమైన లాభాన్ని పొందుతూ వుండేవారు.

అందరు పిల్లలులాగానే చిన్నతనంలో మాకూ కథలు వినాలనే ఆసక్తి ఉండేది. వివిధ దేశాల కథలు వినడమంటే మాకు మహా సరదా. సముద్రగుప్తుడికి యవనదేశపు ఉంపుడుగత్తె ఒకామె ఉండేది. ఆమె పేరు ఆదే. ఆదే తల్లి కులూపా వృద్ధురాలు. రకరకాలైన కథలు చెప్పి మనస్సులను రంజింపజేస్తూ వుండేది. మంచులా తెల్లగావున్న కేశజాలం ఆమె ముఖంమీద చిందరలాడుతూ వుండేది. డెబ్బయి ఏళ్ళు వచ్చినా ముఖంమీద ఒక్క ముడతైనా లేదు. కులూపా అక్కడికి వచ్చే పాతిక సంవత్సరాలు గడిచిపోయాయి. అయినా, యవన స్వరంలోనే మాగధీ భాషను మాట్లాడుతూ వుండేది. ఆమె మాకు చాలా ప్రియమైన పరిచారిక. అజ్జుక కూడా కులూపాను చాలా గౌరవించేది; ప్రేమించేది.

కులూపా స్వరం అదోగమ్మత్తు. 'హ' 'భ' ఈ రెండక్షరాలూ ఆమె పలుక లేదు. 'హలము' అనడానికి 'అలము' అంటుంది. 'శుభము' అనవల్సి వచ్చినపుడు 'శుఅము' అంటుంది. కులూపా మాకు చాలా పెద్ద పెద్ద కథలను చెపుతూ ఉండేది. ఆ కథలను వినేప్పుడు ఈ 'అ' ను అర్థం చేసుకోవడం పెద్ద కష్టం అయ్యేది. దేవతల, రాక్షసుల కథలను చాలా చిత్రవిచిత్రంగా వర్ణించి చెప్పేది ఆమె. ఆ కథలను వినేప్పుడు బాగానే వుండేవిగాని ఆ తరువాత రాత్రిపూట కండ్లు తెరవ డానికి కూడా హడలిపోతూండే వాడిని. రామగుప్తుడు పగటిపూట కూడా ఒంటరిగా వేసంగి గృహంలోకి పోవడానికి జంకేవాడు. కానీ, చంద్రుడు మాత్రం కొంచమైనా భయపడేవాడు కాడు. దయ్యాలూ, భూతాలూ, పిశాచాలూ—ఇవీ ఏవీ అతడిని భయ పెట్టలేవు. ఈ కథలను అతడు సరదాగా వింటూండేవాడు. కాకపోతే రామగుప్తుడిని జడిపించడానికి వీటిని సాధనంగా వాడేవాడు.

ఒకనాటి విషయం—ఆరోజు వసంతోత్సవం. అంతఃపురంలోని రాణులందరూ మన్మథపూజ కొరకు ఉపవనంలో ప్రోగుపడ్డారు. ఆనాడు రాణులందరూ పాటలు పాడతారు. మధుపాత్రలను మధువుతో నింపి ఒకరిమీద ఒకరు విసురుకొంటారు. కాలి అందెల రవళులతో అశోకపుష్పాలను వికసింప చేస్తారు. ఇవన్నీ చూడడానికి మేమూ వెళ్ళాము. అందెల రవళులతో పూవుల్ని వికసింపచేయడం ఒట్టి అబద్ధమని చంద్రుడు ముందే చెప్పాడు. మన్మథపూజ అయేసరికి పొద్దుగ్రుంకింది. మధు పాత్రలను విసరడం, నూపుర రవాలతో అశోక పుష్పాలను వికసింపచేయడం మొదలైనవి కూడా అయిపోయాయి. నేను అశోక పత్రాలవంక చూస్తూనే వున్నాను. కాని పూవు వికసించడం ఒట్టి అబద్ధమని తెల్సుకొన్నాను.

అదే సమయంలో చంద్రగుప్తుడు మరొక సరిక్రొత్త పరిహాసాన్ని ఆలో చిస్తున్నాడు. కొంతమంది దాసీలు యువరాజ భట్టారకుణ్ణి అతడి మహలువైపుకు తీసుకుపోతున్నారు. మేము ముందుగానే దారిలోవున్న ఒక మామిడి తోపులోకివెళ్ళి దాక్కున్నాము. అప్పటికి అంతగా పొద్దుపోలేదు. అయినా మామిడితోపులో దట్టంగా చీకటి అలుముకొని వుంది. మేము ఒక మామిడిచెట్టును ఎక్కి దాని గుబుర్లలో దాక్కొన్నాము. రామగుప్తుడు పరిజనంతో ఆ చెట్టుదగ్గరకు రాగానే నేను మా నిర్ణయం ప్రకారం మామిడి కొమ్మను అదేపనిగా ఊపసాగాను. చంద్రుడు ఒక రాగి కలశంలో గులకరాళ్ళను వేసి, అటూ యిటూ కదిపి మ్రోగిస్తూ, రకరకాలైన అరు పులు అరవసాగాడు. ఒక ముసలిదాసి భయపడి చెవులు రెండు మూసుకుని ముందుకు పరుగెత్తబోయి బోర్లపడ్డది. మరొక వామనుడు రెండు చేతులను పైకి యెత్తి గోలగా అరుస్తూ ఏడవసాగాడు. విపుణిక అనే మరొక దాసీ అక్కడే స్పృహతప్పి పడిపోయింది. రామగుప్తుడు ఇదంతా చూసి హడలిపోయి వెనక్కు పరుగుతీశాడు. చంద్రగుప్తుడు చప్పున కొమ్మమీదనుండి గులకరాళ్ళను మ్రోగిస్తూ రామగుప్తుడి వెంటపడ్డాడు. పదడుగులు వేసి రామగుప్తుడుకూడా క్రిందపడ్డాడు˙ ఇది చూచి చంద్రగుప్తుడు భయపడి నా దగ్గిరకు పరుగెత్తుకు వచ్చాడు. ఇలాంటి మోటు పరి హాసం ఆడినందుకు మేము చాలా పశ్చాత్తాపం పొందాము. కాని ముందు మా ప్రాణా లను రక్షించుకోవడం కర్తవ్యము. మేము అడ్డదార్ల పరుగెత్తుకుపోయి అజ్జుకను చేరు కున్నాము. అక్కడ ఏమీ ఎరుగనట్టు గంభీరంగా కూర్చున్నాము. అజ్జుక ఒక ఎత్తయిన, సుందరమైన ఏనుగు దంతపు పీఠంమీద కూర్చున్నది. ఆమె తన ఒక చేతిని పీటకొసకు ఆన్చి వుంచింది. పరిజనంతో మాట్లాడుతూ, రెండవ చేతిని వూగిస్తూ అనేక రకాలైన ముద్రలను కల్పిస్తున్నది. ఆమె యొక్క పొడవైన వెంట్రు కర్లో మల్లికా పుష్పాల మాలలు అందముగా తురుమబడినాయి. ఆమె కంకణాలూ, హారాలూ, కర్ణ కుండలాలూ—అన్నీ రకరకాలయిన పూవులతో తయారు చేయబడి నాయి. భుజముల మీదనుండి క్రిందికి జారుతూవున్న దుకూలంమీద బాతులూ, హంస మిధునాలూ అందముగా అల్లబడినాయి. చుట్టూ వున్న స్త్రీలు తలా ఒక వస్తువునూ పట్టుకుని నిల్చుని వున్నారు. ఒకామె చేతిలో ఛత్రముంది. మరొకామె చేతిలో చామర ముంది. ఇంకొకామె చేతిలో సుగంధ ద్రవ్యాలతో నిండిన బంగారు పళ్ళెం వుంది. ఇలాగే తలా ఒక వస్తువును పట్టుకుని నిలబడి వున్నారు. అజ్జుక ఆరోజు చాల సంతో షంగా వుంది. మహారాజు ఆ రాత్రి అజ్జుక మహలైన శ్రీగర్భంలోనే గడుపుతారట. అజ్జుక ఆనందానికి బహుశః అదే కారణం కావచ్చు.

అప్పుడు నాకూ చంద్రగుప్తుడికి కూడా ఏదో ఏడు నడుస్తూన్నది. మే మిద్ద రమూ అజ్జుకకు చెరొక ప్రక్కన నిలబడియున్నాము. అజ్జుక కూర్చుని వుండడం వలన మేము ఆమె భుజాలవరకూ వచ్చాము. చంద్రుడు అజ్జుక కాళ్ళదగ్గిర కూర్చుని, కాలి అందెలను కదపసాగాడు. ఆమె మేము తినడానికి లడ్డూలను పత్రి

మ్మంది పరిచారికల్ని. మేము బుద్ధిమంతుల్లా "మా కాకల్లేదు" అని మూతులు బిగించే శాము. ఇంతలో పరమభట్టారకుడు సముద్రగుప్తుడు వచ్చాడక్కడికి. "యదు; యదు; భట్టా!" అనే స్వరాలు మహలు నాలుగు మూలల్నా ప్రతిధ్వనించాయి. భట్టారకుడు బాగా దగ్గిరకు వచ్చాడు. అజ్జుక, ఆమె పరిచారికలు కూడా లేచి నిలబడి జయకారాన్ని పలికారు.

పరమభట్టారకుడు చేయి పుచ్చుకొని అజ్జుకను పీఠంమీద కూర్చోబెట్టాడు. తరువాత తనూ ప్రక్కన కూర్చున్నాడు. అంతఃపురంలో స్త్రీలకు కొదువలేదు. వందల సంఖ్యలో వున్నారు. పైగా ఒకరినిమించి ఒకరు అందగత్తెలు ! బంగారు తీగెల్లాంటి తలవెంట్రుకలు, గౌరవర్ణ శరీరచ్ఛాయ కల యవనదేశ స్త్రీలున్నారు. నీలపు తలవెంట్రుకలు ఎరుపు తెలుపు కల్సిన శరీరచ్ఛాయ కలిగిన పారసీక దేశ స్త్రీలున్నారు. గాంధార, సౌరాష్ట్ర, పార్వత్య దేశ స్త్రీలు కూడా యెంతో మంది వున్నారు. ఇంతమందిలోనూ అజ్జుకమీదనే పరమభట్టారకుడికి ప్రేమా; గౌరవమూను !

అజ్జుక, పరమభట్టారకుడు—ఈ రోజున వసంతోత్సవాన్ని ప్రత్యేకంగా జరుపు కోరేటారు. పరమభట్టారకుడు వీణావాదన ప్రవీణుడు. కోకిలలను కూడా మోహింప చేయగల తియ్యని గాత్రం అజ్జుకది. ఈ రోజు అంతఃపురంలో నృత్య, గాన, సంగీతాది విద్యలు ధన్యతను పొందుతాయి. వీణ వచ్చింది. పరమభట్టారకుడు మృదువుగా తంత్రులను మీటుతున్నాడు. నృత్యం చేయడంలో సాటిలేని దనిపించు కున్న చతురిక భావస్ఫోరకమైన ముద్రలను అభినయించ సాగింది. ఇంతలో నిపు ణిక రొప్పుతూ వచ్చి అజ్జుక కాళ్ళమీద పడ్డది. ఏడుస్తూ, ఎక్కుతూ ఇలా చెప్ప సాగింది.

"భట్టినీ! ('భట్టారకు'ని భార్యను 'భట్టినీ' అంటారు) రక్షించండి ! రక్షిం చండి! యువరాజు భట్టారకుల్ని బ్రహ్మపిశాచం పట్టుకొని ఎక్కడికో తీసుకు పోయింది. వామనుడు పిచ్చి యెక్కినట్టు ఏమేమిటో మాట్లాడుతున్నాడు. కంచుకి జనుడు ఆర్యలాత్ స్పృహ తప్పి పడివున్నారు!" అని ఆపేసింది నిపుణిక.

ఈ విషయాన్ని వింటూనే అజ్జుక, పరమ భట్టారకుడు లేచి నిలబడ్డారు. నిపుణిక అదుర్దాను, ఆమె స్వరంలోని భయ విహ్వలతను చూచి చంద్రుడికి నవ్వు రాసాగింది. నవ్వును కప్పిపుచ్చుకోవడానికి అజ్జుక చాటుకుపోయి, ముఖం దాచేసు కున్నాడు. ప్రతీహారి "ఇటు ఇటు భట్టా!" అంటూ చేతితో త్రోవచూపుతూ ముందు పోతున్నది. ఆమెను అనుసరించి భట్టారకుడు, అజ్జుక, పరిజనము, వామనుడు, చెవిటివాడు, మూగవాడు, గూనివాడు నడుస్తున్నారు. గూనివాడి పేరు కుభరకుడు. విషయమేమిటో ఎక్కడికి పోతున్నారో అనేది చెవిటివాడికి, మూగవాడికి అర్థం కాలేదు. వాళ్ళిద్దరూ దారిపొడుగునా "విషయం" ఏమిటని గూని కుభరకుడిని అడుగు తున్నారు. అతడు సౌంజ్ఞలతో చేతులు త్రిప్పుతూ కొంతవరకూ విషయాన్ని అర్థం

అయ్యేట్లు చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇంతలో చంద్రుడు చెవిటివాడితో, మూగ వాడితో "మిమ్మలను బలియాయడానికి తీసుకుపోతున్నారు!" అని తెలియచేశాడు. వాళ్ళిద్దరూ భయంతో వణికిపోసాగారు. ఎలాగయినా పారిపోవడానికి ప్రయత్నించ సాగారు. కాని, కుభరకుడు, పొట్టివాడైన రేవతకుడు వాళ్ళను విడిచిపెట్టలేదు.

క్షణంలో యువరాజు భట్టారక రామగుప్తునికి జరిగిన దుర్ఘటన అన్ని రాణి వాసాల్లోనూ తెలిసిపోయింది. మామిడితోపు దగ్గరకు పోయేసరికి రాణివాసాల్లోని వందలమంది దాసదాసీజనులు కాగడాలు పుచ్చుకొని పోగుపడ్డారు. రామగుప్తుడు ఇంకా అలాగే నేలమీద నిశ్చేష్టుడై పడివున్నాడు. అయితే అప్పటికి బాగా స్పృహ కొచ్చాడు. కాని, కండ్లు తెరవడానికి భయపడి అలాగే పడివున్నాడు. అజ్జుక చాలా భయపడ్డది. ఖిన్నవదనయై రామగుప్తుడి తలను తన తొడమీద పెట్టుకు కూర్చు న్నది. రెండు మూడుసార్లు "నాయనా! నాయనా!" అని పిలచినతరువాత రామ గుప్తుడు కండ్లు తెరచాడు. అప్పటికీ రాముడు ఇంకా భయంతో వణకుతూనే వున్నాడు. అది చలిరాత్రి. అయినా అతడి శరీరం చెమటతో తడిసిపోయింది. తరు వాత కొంతసేపటికి రామగుప్తుడు స్థిమితపడ్డాడు.

కాని, మహాపిశాచాన్ని గురించిన అనేక రకాలైన పుకార్లు రాజధానిలో వ్యాపించాయి. నిపుణిక, కంచుకి, వామనుడు—వీళ్ళు తాము కళ్ళారా మహా పిశా చాన్ని చూచినట్టు అనేకమైన చిలవలు, పలవలు కల్పించి కథలు చెప్పసాగారు. నెలల తరబడి శాంతికోసం జపహోమాలు సాగాయి. బ్రాహ్మణులు బాగా దక్షిణలు పుచ్చుకున్నారు. మహాభట్టారకుడు మహాభట్టారిక ముక్తహస్తులై దాన దక్షిణలు యిచ్చారు.

చంద్రుడు చేసే యిలాంటి కొంటెపనులకు అంతేలేదు. అతడు ప్రతిక్షణమూ ఏదో ఒక క్రొత్త కొంటెతనాన్ని గురించి ఆలోచిస్తూనే వుండేవాడు. ఉద్యాన వనంలో అనేక రకాలైన జంతువులున్నాయి. వాటిలో ఎర్రని ముఖంకల ఒక కోతికూడా వుంది. ఆ కోతి ముఖం చాలా ఎర్రగా ఉండటంవల్ల "ఎర్రమూతి" అంటూ వుంటారు దాన్ని. ఒకరోజున చంద్రుని దృష్టి ఎర్రమూతి మీద పడ్డది. మర్నాడు నన్ను తీసుకొని దానిదగ్గిరకు పోయాడు. అప్పటినుండి గంటల తరబడి ఆ ఎర్రమూతి దగ్గిర గడపసాగాడు. ఎప్పుడు ఏదో ఒక పండో, మిఠాయో తీసు కునిపోయి పెడుతూండేవాడు. కొద్దిరోజుల్లోనే ఎర్రమూతికి చంద్రుడికీ స్నేహం ఏర్పడింది. దాని వీపు నిమురుతూ గంటల తరబడి సమయాన్ని గడుపుతూండే వాడు. ఇది చూచి కులూపా, ఇతర పరిచారికలూ హడలిపోతూండేవారు. ఒక వారం తరువాత ఎర్రమూతి ముందుకాళ్ళను ఎత్తి, చంద్రుడి చేయిపుచ్చుకొని, వెనకాళ్ళతో అతనితోపాటు పచారు చేయసాగింది. ఇత నప్పుడు దాన్ని బంధ విముక్తి చేయించాడు. ఇప్పుడు మేము ముగ్గురం స్నేహితులమయ్యాము. చంద్రుడు దాన్ని తీసుకొని ప్రతిచోటా తిరిగేవాడు. దాసదాసీలను దుంపతెంపి పుత్రంపెట్టేవాడు.

చంద్రుడు సంజ్ఞ చేస్తేచాలు ఎలాటి అగడాన్ని చేయడానికయినా ఎర్రమూతి సిద్ధంగా వుండేది.

చంద్రుడు ఎర్రమూతి చేత చేయించే ఈ అల్లరి గురించి ప్రతిరోజూ మహారాణివద్దకు అనేక విన్నపాలు వస్తూవుండేవి. దాసులు రకరకాలుగా తమ బాధలను విన్నవించుకొనేవారు. దాసీలు తమకు జరిగిన అవమానాలను చెప్పుకొనేవారు. చంద్రుడు మాత్రం అన్నింటినీ తుడిచి పారేసేవాడు. ఇలా అనేవాడు :

"లేదు అజ్జుక! ఎర్రమూతి చాలా మంచిది. దాని జోలికి పోకపోతే అది ఎవరినీ ఏమీ అనదు. వీళ్ళు దాన్ని వెక్కిరించి రాళ్ళువేసి బాధిస్తారు. అలాచేసే వాళ్ళను చూస్తేనే దానికి కోపం! లేకపోతే అది చాలా మంచిది. కావాలంటే ఇప్పుడు వెళ్ళి పట్టుకొస్తాను చూడు" అంటూ పరుగెత్తేవాడు.

వామనుడు, కంచుకి మొదలైన వాళ్ళు "వద్దు భట్టినీ! వద్దు, తీసుకురానీయ వద్దు!" అంటూ దీనంగా ప్రార్థించేవారు. క్షణంలో చంద్రుడు పరుగెత్తుకు వెళ్ళి ఎర్రమూతిని తన వెంట తీసుక రాసాగాడు. అతడు దారిలోనే దానికి ఎన్నో బుద్ధులని చెప్పాడు "ఏయ్, ఎర్రమూతి ! జాగ్రత్తగా విను. మనం అజ్జుక దగ్గరకు వెళుతున్నాము. చాలా జాగ్రత్తగా బుద్ధిమంతుడిలా ప్రవర్తించాలి. ఏ మాత్రం కొంటెతనం చేశావో....నీతల రెండు వ్రక్కలయిందన్న మాటే. రాణి దగ్గరకు పోగానే తోకా చెవులు దించేసుకో, జాలిగొలిపేట్టు రాణి కండ్లలోకిచూడు" ఈ విధంగా బోధించాడు.

ఎర్రమూతిని చూడగానే ప్రజలు పరమభట్టారకుణ్ణి చూచినట్టు ప్రక్కకు తప్పుకో సాగారు. కాకపోతే "యదు యదు" అనే జయకారం మాత్రం లేదు. అంతే తేడా! ఎర్రమూతిని చూసి పరిచారకులు, కంచుకీ జనము, వామనుడు–భయపడి పోయారు. వామనుడు ఒక కంచుకి లంగాచాటున దాక్కున్నాడు. చంద్రుడు నేరుగా వచ్చి అజ్జుక కాళ్ళ దగ్గర కూర్చున్నాడు. ఎర్రమూతి కూడా అతడి పక్కనే కూర్చుంది. చాలా మంచిగా ఏమీ ఎరుగని దానిలా తల వంచుకు కూర్చుంది ఎర్రమూతి. ఇక నప్పుడు చంద్రుడిలా అన్నాడు: "చూశావా అజ్జుకా! ఎర్రమూతి ఎంత మంచిదో ! వీళ్ళు అనవసరంగా దాన్ని కవ్విస్తారు. తరువాత దానిమీదే నేరాలు చెబుతారు!"—అంటూ చంద్రుడు ఎర్రమూతి గడ్డం పుచ్చుకొని ముఖాన్ని పైకి ఎత్తాడు. దాని ముఖంలో అతి దయనీయత, కరుణా గోచరించాయి. చంద్రుడు అజ్జుక కాళ్ళవైపు సౌంజ్ఞ చేశాడు. ఎర్రమూతి చప్పున వంగి అజ్జుక కాళ్ళకు నమస్కరించింది. ఆమె అనాయాసంగా అనేసింది. "ఎర్రమూతి చాలా మంచిది!"

అక్కడున్న దాసీలు ఒక్క గొంతుతో సమాధాన మిచ్చారు. "కాదు భట్టినీ! ఇది చాలా కొంటె కోతి!" ఒక కంచుకి తన రవికెను చూపుతూ "ఇది నా రవిక చింపింది!" అన్నది. మరొకామె తన వల్లెను చూపుతూ "నా వల్లె అంతా

చింపేసింది!" అన్నది. కాని, చంద్రుడు మాత్రం ఎర్రమూతి చాలా మంచిద అభిప్రాయాన్ని అజ్జుక హృదయంలో కలిగించాడు.

చంద్రుడికి ఒకే కథను అనేకమార్లు వినడం యిష్టముండదు. అలాగే ఒక ఆటను ఎక్కువ రోజులపాటు ఆడడంకూడా ఇష్టముండదు. రెండు మూడు నెలలు తరువాత ఈ ఎర్రమూతి తతంగం కూడా పాతబడిపోయింది. చంద్రుడికి చెట్టు యెక్కడం, గుట్టమీదనుండి దూకడం, జీనూ కళ్ళెమూ లేకుండా గుర్రంమీద స్వారీ చేయడంలాటి సాహసోపేతమైన ఆటలంటే చాలా యిష్టం. ఇలాంటి సాహసోపేతమైన ఆటలాడుకోవడానికి పాటలీపుత్రంలోగానీ, రెండవ రాజధాని అయిన అయోధ్యలోగానీ అంతగా స్వాతంత్ర్యం లభించేదికాదు. కాని, మేము ప్రతి రెండు సంవత్సరాలకు ఒకమాటు ఆగ్రోదకాకు వెళ్ళేవారము. మా తండ్రిగారు ఆటపాటలలో ఏ విధమైన నిబంధననూ విధించేవారు కారు. ఇష్టమొచ్చిన ఆట ఆడుకో వచ్చును. అయినా, తోటిపిల్లలకు బాధ కలిగిస్తే కోప్పడేవారు. తోటివాళ్ళను ఏడిపించడం, బాధించడం చంద్రుడికో అలవాటు. ఆగ్రోదకాలోకూడా ఆ అలవాటు ప్రకారమే ప్రవర్తిద్దా మనుకొన్నాడు. కాని, యౌధేయ కుమారులు ముందుగానే అతడికి గుణపాఠం నేర్పారు. రెండుకాళ్ళ క్రిందుగా చేతులను పోనిచ్చి, ఎత్తి క్రింద పడేశాడు యౌధేయకుమారు డొకడు! దాంతో యౌధేయులంటే ఏమిటో తెలుసుకున్నాడు చంద్రుడు. ఒకటి మాత్రం ఒప్పుకోవాలి. చంద్రుడు యౌధేయ బాలురను ఏమాత్రమూ ద్వేషించలేదు. పైగా అక్కడి బాలురకు యెంతో ప్రేమ పాత్రుడయ్యాడు. ఆవేడు ఎనిమిదేండ్ల వయస్సులోనే చంద్రుడిలో ఆశ్చర్యకరమైన మార్పులు కనిపించేవి. ఆగ్రోదకాలోని అతని వ్యక్తిత్వం రాజధానికి పోయేసరికి పూర్తిగా మారిపోయేది. యౌధేయుల విద్యాబుద్ధులే విలక్షణంగా వుంటాయి. యౌధేయులు తమ సంతానాన్ని ప్రాణసమానంగా ప్రేమిస్తారు. అలాగని వళ్ళు అలవకుండాకూర్చోబెట్టి సోమరిపోతులను చేయరు. యౌధేయ బాలురకు, పుట్టగానే ఖడ్గాన్ని కడిగి ఆ నీళ్ళను తాగిస్తారు. వాళ్ళు చిన్నతనంనుండి కత్తులతోటే ఆడుకుంటారు. ఆపదలను యెదుర్కోవడమంటే వారికో సరదా! యౌధేయులకు ప్రాణమంటే ప్రీతిమెండు. జీవితాన్ని వాళ్ళు చాలా పవిత్రమైనదానినిగా విలువైనదిగా భావిస్తారు. కాని, మృత్యువుకు ఏమాత్రము వెరువరు. మృత్యువంటే అతినిర్లక్ష్యంగా వుంటారు. మాకు అప్పటికి సరీగా పదేళ్ళు నిండాయో లేదో, తోటిబాలురతో కలిసి మేము పందులనూ, ఎలుగుబంట్లనూ వేటాడడానికి అడవికి పోయేవారము. ఒక్కొక్కప్పుడు అడవి పందుల కోసం పొంచుండి అలాగే రాత్రి గడిపేసేవారము. మాకు విలువిద్య కూడా వచ్చు. ఆ విద్యలో మేమిద్దరమూ యెంతో ప్రశంసను పొందాము. కాని, బాణంతో పందిని వేటాడగలమా? అది బాణానికి లొంగుతుందా? పందికి తగిన ఆయుధం బల్లెమే. అదయినా సరైన ఆయువుపట్టున తగిల్తేనే లొంగుతుంది.

పదునాలుగవ ఏట చంద్రుడు మొదటిసారిగా పందిని కొట్టాడు. ఆ తరువాత కొదీ మాసాలకే నేను పందిని కొట్టాను. మేము వేటలో నేర్పరులము ఎప్పుడైనప్పటికీ, చిన్నతనంనుంచి వేటమీద అభిరుచి కలిగే వున్నామని చెప్పాలి.

మా యౌధేయ భూమిలో మరొక ఆచారం వుంది. ఎవడైనా యువకుడు ఒక మృగాన్ని వేటాడాడంటే, వెంటనే చుట్టూవున్న ప్రజలను ఈవిధంగా ఆహ్వానిస్తాడు. "ఈ అడవిలో ఎవరైనా సోదరులు వుంటే రండి! మృగం పడ్డది. వచ్చి మీ మీ భాగాలు పుచ్చుకుపొండి" అంటాడు. మొదట ఇది మాకు అర్థం కాలేదు. "కష్టపడి, వేటాడిన వ్యక్తి తన వేటలోని భాగాన్ని ఇతర్లకు ఎందుకు పంచిపెట్టాలి?" అనుకొనేవారము. కానీ, నా తండ్రి ఇలా చెప్పాడు: "ప్రపంచంలో ఏదైనా వస్తువు ఉత్పత్తవుతున్నదంటే, అది ఒక్కడి శ్రమవల్లనే కావడంలేదు. అనేకమంది శ్రమ ఫలితంగా ఒక వస్తువు ఉత్పత్తవుతుంది. ఒక వస్తువు కొరకు వందమంది శ్రమించి వుండవచ్చు. సఫలత మాత్రం ఒక్కడికే లభించవచ్చు. కానీ, ఆ సఫలతకు వెనుక తొంభై తొమ్మిదిమంది అసఫలురు వున్నారన్న విషయాన్ని మర్చిపోగూడదు. కనుక ఏ సఫలతకు సంబంధించిన ఫలితాన్నిగానీ, వ్యక్తి ఒంటరిగా తానే అనుభవించడం తగదు. అదికాక, అడవికి పోయిన పదిమందీ వేటలో తలాకొంచం భాగం పంచుకొని, సంతోషంగా ఇండ్లకుపోవడం బాగుంటుందా? లేక ఒక్కడే వేట మొత్తాన్ని తీసుకొని మిగిలినవాళ్ళు విచారంగా రావడం బాగుంటుందా?"

నాకు మొదటగా, ఆ అడవిలోనే, వేట సమయంలో, ఓ నూతనమైన భావన—ఆదర్శము-అంధకారంలో సూర్యకిరణంలా స్ఫురించింది!

దొరికిన వేటను అడవిలో వున్నవాళ్ళందరూ సమంగా పంచుకుంటారు. ఒక్కొక్కప్పుడు రాత్రిపూట వేటాడిన జంతువును అక్కడే కాల్చుకుని అందరం తినేసే వారము. చంద్రుడికి రాత్రిపూట వేటకు రావడం ఇష్టం వుండేదికాదు. నాకు మాత్రం మహా సరదా. ఎలాగో చంద్రుడినికూడా లాక్కొని పోయేవాడిని. అడవి పంది పడిపోగానే పిల్లలం నాలుగువైపులా పరుగెత్తి పుల్లలు పోగుచేసేవారము. అక్కడే ఆ పందిని కాల్చేవారము. అలా కాల్చిన పందుల్ని చలికాగుతూ, మెరుస్తున్న నిప్పుకణువులవంక చూస్తూ తినడమంటే నాకూ, చంద్రుడికి చాలా ఇష్టం! పందులను ముక్కలుగా కోసి కాలిస్తే కొవ్వుపదార్థమంతా కారిపోయి బాగుండదు. అలాకాకుండా మొత్తంగా కాలిస్తే కొవ్వుపదార్థంతో కలిసి మాంసంకూడా వుడికి బాగుంటుంది. ఇలా కాల్చిన మాంసం పాటలీపుత్రపు రాజవంశానికి బొత్తిగా రుచించదు. పాటలీపుత్రపు అంతఃపురంలో మాంసం వండడం అరుదైన రకం. దక్షిణ దేశంనుండి వచ్చిన యాలకులు లవంగాలు-మొదలైన సుగంధ ద్రవ్యాలువేసి వండుతారు. చిన్నతనంలో నాకుకూడా ఇలా సుగంధ ద్రవ్యాలువేసి వండిన మాంసమే నచ్చేది. కానీ పెద్దవాడినైనకొద్దీ వేటలో కాల్చిన సాదామాంసమే

ఎక్కువ యిష్టం కాసాగింది. ఇలా సాదాగా కాల్చిన మాంసం, యాలకులు, లవంగాలు వేసి ఎక్కువ నేతితో కాల్చిన మాంసంకంటే త్వరగా అరుగుతుంది. మొత్తం పందిని కాల్చడం చాలా ఆలస్యం, కనుక పందిని సెగకు పెట్టేముందే పొట్ట జీల్చి పేగులూ గుండే అన్నీ తీసివేసేవారు. అలాతీసివేసిన గుండే, పేగులూ మాలాటి పిల్లలకు ఇస్తుండేవారు. వేటలో పరుగెత్తడం, రాత్రంతా మేల్కొని నిద్ర కాయడం, పగటిపూట ఎండలో తిరగడం ఇవి నిజంగా కష్టమైన పనులే! కానీ, అప్పటి మా ఉత్సాహం ముందు ఆ కష్టం ఒకలెక్కా?

ఆ రోజుల్లో నీకు ఆగ్రోదకా బాగుందా? లేక పాటలీపుత్రం బాగుందా? అని చంద్రుణ్ణి అడిగితే చప్పున ఒక సమాధానం చెప్పలేక పోయేవాడు. తరువాత మా విద్యాభ్యాసం ప్రారంభం అయింది. మాకు ఆగ్రోదకా వెళ్ళడానికి సమయమే చిక్కేదికాదు. యెప్పుడైనా వెళ్ళినా అక్కడుండే ఒకటి రెండు నెల్లూ క్షణాల్లా గడిచిపోయేవి. చంద్రుడు నాట్యంలోనూ, సంగీతంలోనూ చాలా నేర్పరి. అయితే ఆ విషయాలలో నేనూ అతనికి తీసిపోను. కానీ, ఒక విషయంలో నేను చంద్రుడితో విధిగా ఓడిపోయేవాడిని. అది ఇతర్లని అనుకరించడం. వేషం వేయడంలో అతడు మంచి నేర్పరి. వేషాలు వేయడానికి కావలసిన అనేకమైన సామాగ్రులను కూడా ప్రోగుచేసుకొన్నాడు. నల్లని, తెల్లని నీలపు మీసాలు చిన్నవీ, పెద్దవీ- రంగు రంగు గడ్డాలూ, ముఖానికి వేసుకునే రంగులూ, స్త్రీ పురుషులు ధరించే వస్త్రాలూ, ఆభరణాలూ అనేకం ప్రోగుచేసుకొన్నాడు. చంద్రుడు చేసే అనేకమైన సాహసా లకు నేను నాయకత్వం వహిస్తున్నా ననడం అత్యుక్తే అవుతుంది. అయితే, అతడి సాహసాలకు నా ప్రోత్సాహం తప్పకుండా వుండేది. గూని భరతుడికి పెండ్లి చేసుకోవాలని మహా కోర్కె. కానీ, ఆ అష్టావక్రుడివంక కన్నెత్తి చూడటాని కయినా ఎవ్వతే ఇష్టపడేదికాదు. అంతఃపురంలోని దాసీలకూ, ఇతర పరిచారికలకూ ఇతడి పెండ్లి హాస్యం ఆడుకోడానికీ, కాసేపు నవ్వుకోడానికీ ఒక ఉపకరణంగా తయారయింది. దాసీలూ, పరిచారికలూ అతడిని పెండ్లాడుతామని నమ్మించి అనేక విధాల గోలచేశారు. ఇక ఇప్పుడు అతని దగ్గరకు ఎవరైనా వచ్చి, నిజంగా పెండ్లాడుతామన్నా నమ్మలేని స్థితికి వచ్చాడు. మా కప్పటికి పన్నెండు పదమూడు సంవత్సరాల వయస్సు వుంటుంది. చంద్రుడంటే భరతుడికి మంచి విశ్వాసం. నేను బాగా పురి ఎక్కించేసరికి పెండ్లికి సిద్ధపడ్డాడు. "నిన్ను ఒక త్రిలోక సుంద రైన అప్సరస వివాహమాడడానికి సిద్ధంగా వుంద"ని చెప్పాము. "నన్నే ఎందు కాడా"లని అత దడగవచ్చు, అందుకీ సమాధానాన్ని యోచించాము. ఆ అప్సరస ఎవరో కాదు. ఇంద్రుడి వేశ్య రంభ, ఏదో అపరాధం చేయడంవల్ల బ్రహ్మ కొడుకు అష్టావక్రుడు ఆమెను భూలోకంలో పోయి పడమని శపించాడు. కాళ్ళా వేళ్ళాపడ్డ తరువాత "నీవు భూలోకంలో నాలాటి గూనివాడినే వివాహ మాడినట్లయితే నీ శాపం పోతుంది. తిరిగి ఇంద్రలోకానికి వస్తావు!" అన్నాడు.

కన్య ఎక్కడుంది?— అన్నప్పుడు ఇప్పుడు వింధ్యాటవి ప్రాంతంలోని ఒక సామంతుడి ఇంట్లో పుట్టింది. అతడి కూతురు రూపంలో పెరిగి పెద్దదయిందని చెప్పాము. ఈ నాటకంలో మరి ఒకరిద్దరు స్నేహితులు, దాసీలు కూడ కలిశారు. కానీ, తీరా గూనివాడు ఒప్పుకొనేసరికి ఈ నాటకంలో పెండ్లి కూతురు పాత్రను ధరించడానికి ఏ దాసీ కూడా ధైర్యం చేయలేకపోయింది. చివరకు చంద్రుడు పెండ్లి కూతురు కావడానికి సిద్ధం అయ్యాడు. అజ్జుక లాగానే చంద్రుడు కూడా చాలా అందగాడు. రంగులో అతడికంటే నేను ఒకచాయ పసిమే, అయినప్పటికీ అతడి సౌందర్యంలో ఒకరకమైన మృదుత్వముంది. స్త్రీలకూ పురుషులకూ కూడా పొడు గాటి వెంట్రుకలు ఎటూ వుంటాయి. కాకపోతే వాటిని చక్కని వేణీబంధంలో ఇమడ్చటం అవసరం. చతురిక పెండ్లికూతురు కావడానికి జడిసింది. కానీ, చంద్రుడిని మాత్రం బాగా అలంకరించి తయారుచేసింది. రకరకాలైన పూవులను తురిమి జడవేసింది. చెవులకున్న కర్ణకుండలాల్ని తీసివేసి, ఆ స్థానంలో స్త్రీలకు ఉపయుక్తమైన కర్ణభూషణాలను అలంకరించింది. మెడలో ముత్యాలమాలలను వేసింది. చేతులకు సువర్ణ కంకణాలు, బాహు మూలాల్లో ముత్యాల సరాలు జార్చిన బాజ్‌బంద్‌లు, నడుమునకు చిరు గజ్జెలకటి- ఆభూషణము (వడ్డాణం), కాళ్ళకు అందమైన అందెలు, తలలో అక్కడక్కడా ముత్యాలూ, వజ్రాలూ అమర్చింది. చతురిక చాలా శ్రద్ధతో కండ్లకు సన్నని అంజనరేఖ దిద్దింది. కాళ్ళకు పారాణి పెట్టింది. శరీరానికి బంగారాన్ని పులిమింది. ముఖానికి సౌందర్యవర్ధకమైన కొన్ని చూర్ణాలను పూసింది. రెండు నారింజపండ్లను తెచ్చి కృత్రిమమైన స్తనాలను ఏర్పర చింది. తరువాత ఎర్రని వల్లెను శరీరంనిండా కప్పి మమ్మలను చూడడానికి పిల్చింది. మేము చంద్రగుప్తుడిని ఆ రూపంలో చూసి గుర్తుపట్టలేక పోయాము. మేమేకాదు. స్వయంగా అజ్జుకకూడా గుర్తుపట్టలేనంత అద్భుతంగా వుందా వేషం. అతడి ఆ వేషాన్ని చూసి నేను చకితుణ్ణయ్యాను. చతురికా ఇతర దాసీలూ “ఎంత చక్కగా వుంది చంద్రమ్మ!” అంటూ తడవ తడవకూ చంద్రుణ్ణి కౌగలించుకోనూ, ముద్దు పెట్టుకోనూ చేయసాగారు. నేను చంద్రుడితో యిలా అన్నాను “సోదరా! నీ వేషం అద్భుతంగా వుంది. ఏ మాత్రం గుర్తించడానికి వీలులేదు, వెళ్ళి ఒక మాటు అద్దంలో చూసుకో!”

చంద్రుడు అద్దంలో తన వేషాన్ని చూసుకున్నాడు. పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వాడు.

మేము గూనివాణ్ణి పిల్లను చూడడానికి పిల్చాము. చంద్రుడు స్త్రీ సహజమైన సిగ్గును, అభిమానాన్ని చక్కగా చూపించాడు. గూనివాడి ఎదురుగానే పూర్వజన్మపు శాపాన్ని గురించి అడిగాము. గూనివాడిని పెండ్లాడడంలో అభిప్రాయాన్ని తెలియ పరచమన్నాము కన్యను. చంద్రుడు మౌనంగా తలవూపి తన సమ్మతిని వ్యక్త పరచాడు. గూనివాడి ఆనందానికి మితిలేదు. వెంటనే బ్రాహ్మణుణ్ణి పిలిపించి

మంత్రాలు చెప్పించాము. మంగళహారతులు అయ్యాయి. ఇలా అన్ని తంతులు గడిచాక గూనివాడు క్రొత్త భార్యను ఏకాంతంలో కల్సుకోవడానికి తొందర పడ సాగాడు. మేము గ్రహాలు బాగాలేవనీ, తిదులు మంచివికావనీ—అనేకమయిన సాకుల్తో ఒక నెల గడిపాము! ఇతని పరిహాసం పాతపడ సాగింది. గూనివాడికి అవిశ్వాసం కలగసాగింది. అప్పుడు చంద్రుడిలా అన్నాడు. "ఏయ్ గూనీ! నీవు చాల దుర దృష్టవంతుడి వోయ్! ఆ పిల్ల ఇవ్వాళే గంగలో దూకింది. మన జయ (నేను) ఎలాగైనా రక్షిద్దామని తనూ నదిలో దూకాడు. కాని ఆ పిల్ల చేతికి దొరికితేగా? కొంతసేపటికి విసిగి జయ వడ్డుకు వచ్చాడు. చాలా సేపటివరకూ మేమలాగే వడ్డున నిలబడి చూస్తూనే వుండిపోయాము. కొంతసేపయ్యాక ఒక అప్సరస నీటిలోనుండి పైకి వచ్చింది—మొదట గాఢ నీలాలను స్ఫురింపచేసే తలవెంట్రుకలు, తరువాత చంద్రబింబంలాంటి ముఖము, అటుపైన శంఖులాటి మెడ, పిదప బంగారు కలశా ల్లాంటి స్తనాలు గల ఉరస్థలము, త్రివళులు, ఉన్నదో లేదో అనిపించే చిన్ని నడుము, విశాలమైన కటిస్థలము, అరటిస్తంభాల్లాంటి తొడలు, చివరకు కమలా ల్లాంటి పాదాలు కనిపించాయి! చూస్తూ వుండగానే ఆ సుందరి నీటినుండి, పైకి ఆకాశంలోకి ఎగిరిపోయింది. వెళ్తూ మమ్ములను సంబోధించి ఇలా అంది: "వివాహం కాగానే నేను శాపాన్నుండి విముక్తి పొందాను. ఇక నేను ఇంద్రసభకు వెళ్ళిపోతున్నాను. వెళ్ళబోయేముందు ఒకమాటు ఆర్యపుత్రుణ్ణి (గూనివాడిని- భర్తను ఆర్యపుత్రుడనటం ఆచారం) చూడాలని యెంతో యిదిగా వుంది! కాని, శాపవిముక్త నయ్యాక యిక యీ భూలోకంలో వుండరాదు. అయినా, ఆర్యపుత్రు డితో నా మాటలుగా ఇలా చెప్పండి: నేనొక రాత్రి, ఏకాంతంలో క్రీడాపర్వతం మీద తప్పకుండా ఆర్యపుత్రుణ్ణి కలుసుకొంటాను. తెల్లని స్ఫటికంలాటి వెన్నెల కాసే పౌర్ణమినాటి రాత్రి నాకోసం యెదురు చూడమనండి!" అన్నది.

మా మాటలు గూనివాడిలో గట్టి విశ్వాసాన్ని కలిగించాయి. పాపం. ఎప్పుడూ తెల్లని వెన్నెట్లో, వికృతమైన ఆకారంతో క్రీడాపర్వతంమీద కూర్చుని అప్సరసకోసం ఎదురుచూస్తూ వుండేవాడు. ఎంతకీ తన కరగ్రాహిణి—అప్సరసను మరువలేకపోయేవాడు. పోనీ, ఏ ముసలి పరిచారిక అయినా, అతడిని ప్రేమించ డానికి సిద్ధమైతే ఆ అప్సరసను మరువగలిగేవాడేమో!

# గాంధార యాత్ర

మాకు ఆరేండ్లు సరిగా నిండాయోలేదో చదువు కొరకు ముగ్గురు గురువులను ఏర్పరచారు. మాతోపాటు చదవడానికి మరి కొంతమంది సామంతుల పుత్రులను కూడా జతపరిచారు. ఆ సామంతుల పుత్రుల్లో వీరసేనుడు చాలా తెలివైనవాడు. అతడు కూడా మా జట్టులో కలిశాడు. ఇక యిప్పుడు ముగ్గురం స్నేహితుల మయ్యాము.

అక్షరాభ్యాసం రోజున మా అక్క అజ్జుక గొప్ప ఉత్సవాన్ని చేసింది. అధ్యాపకులకు నూతన వస్త్రాలూ, పలురకముల వస్తు వాహనాలను దానం చేసింది. నాతండ్రికి బౌద్ధమతమంటే యిష్టం. బుద్ధ భగవానుడిమీద అపరిమితమైన శ్రద్ధ. అలాగని వారికా మతంమీద గుడ్డి విశ్వాసం, పిచ్చినమ్మకాలూ ఉన్నాయనుకోడానికి వీలులేదు. వారు అప్పుడప్పుడూ బుద్ధుణ్ణి గురించి, బౌద్ధమతాన్ని గురించి నాకు చెబుతూ వుండేవారు. వారి మాటలు ఎంతో వినబుద్ధి అవుతూ వుండేవి. కాని, బౌద్ధమతాన్ని గురించి బాగా లోతుకుపోయి వారు మాట్లాడుతూ వుంటే నాకేమీ అర్థమయ్యేది కాదు.

అజ్జుక భర్త సముద్రగుప్తుడు, అతడి వంశీకులు గోవును, బ్రాహ్మణుణ్ణి, విష్ణువును పూజించేవారు. కాని, అజ్జుకయొక్క సానుభూతి, భక్తిశ్రద్ధలన్నీ ఎక్కువగా బౌద్ధమతం మీదనే వుండేవి. ప్రతి అష్టమి, చతుర్దశి, పౌర్ణమి మొదలయిన తిథుల్లో నగరానికి దక్షిణ దిశనున్న అశోకారామానికి వెళ్ళి తథాగతుని (బుద్ధుని) శరీర ధాతువును (ఎముకను) పూజించి వస్తుండేది. అప్పుడప్పుడు సంఘానికి విందు చేస్తూ వుండేది. ధర్మ ఉపదేశాలను శ్రద్ధగా వింటూ వుండేది. నేనూ అక్కతోపాటు ప్రతిసారీ అశోకా రామానికి వెళ్తూ వుండేవాడిని.

నేను చాలా చిన్న వయస్సులోనే వైభవోపేతమైన సముద్రగుప్తుడి రాజ మహలుకి వచ్చాను. దాదాపుగా నా బాల్య జీవితమంతా ఆ మనోజ్ఞమైన రాజభవనాల్లోనే గడిచిపోయింది. అప్పుడప్పుడు ఆగ్రోదకా వెళ్తూవుండేవాడిని. అయినా, అతిథిగానే! ఆగ్రోదకాలో కూడా నాకు సముద్రగుప్తుడి విస్తృతమైన రాణివాసం, దాస దాసీజనాలు, అతులనీయమైన సంపదలే జ్ఞాపకానికి వస్తూవుండేవి. మహారాణికి తమ్ముణ్ణీ, రెండవ రాజకుమారుడికి (చంద్రగుప్తుడికి) అత్యంత ఆత్మీయుణ్ణయిన

మిత్రుణ్ణి కావడం వలన నన్నక్కడందరూ తమ యజమానిగా, ప్రభువుగా చూస్తూండేవారు.

కాని, బాగా వూహలు తెలిశాక, అగ్రోదకారో నా స్వజనుల మధ్య, కలిసి మెలిసి తిరిగాక నాలోని యౌధేయత మేల్కొన్నది. నా రక్తనాడులు తీవ్రంగా స్పందించాయి. తరువాత క్రమంగా నాలో "నేను యౌధేయుణ్ణ"న్న భావన పటిష్టం కాసాగింది. పాటలీపుత్రంలో నాకు గౌరవము, ప్రభుత వున్నాయి. అవి భయంవలన లభించినవే కాని భక్తి, ఆత్మీయత వలన లభించినవి కావు.

అగ్రోదకారో దాదాపుగా ఒక వెయ్యి కుటుంబాలున్నాయి. కొన్ని గృహాలు బాగా సంపన్నమైనవి. సిరిసంపదలు కలిగి దాసదాసీజనాల్తో సమృద్ధిగా వున్నాయి. కొంతమంది వ్యాపారాది వృత్తులద్వారా బాగా ఆదాయాన్ని పొందుతున్నారు. కొన్ని కుటుంబాలు సామాన్యమైనవి కూడా వున్నాయి. ఇలాటి సామాన్య కుటుంబీకులకు దాసదాసీజనాలుగానీ పుష్కలంగా ఆదాయాన్నియగల మార్గాలు గానీ వుండేవికావు. అన్ని పనులూ తమ స్వహస్తాలతో చేసుకొంటూ వుండేవారు. ఆర్థికమైన ఈ వ్యత్యాసం వున్నప్పటికీకూడా ఆ వెయ్యి కుటుంబాలు ఒకే ఒక కుటుంబంగా మెలిగేవి! భోజనమూ, ఇతర విషయాల్లో సమానత్వాన్ని విధిగా పాటించేవారు. తిండికల ఒక కుటుంబం తిండిలేని తన ప్రక్కకుటుంబానికి విధిగా ఆహారాన్ని పంచి యిచ్చేది. అలాగే ఒకడు మధువును త్రాగుతూ మరొకడు పెదాలను చప్పరించుకొంటూ కూర్చోడమనేది అక్కడ జరగదు. లేనివారికి ఆహారాన్ని, మధువునూ అందించడం అక్కడ ప్రతి నాగరికుడూ తన కర్తవ్యంగా భావిస్తాడు.

అగ్రోదకారో నాకు పెదతల్లులూ, పినతల్లులూ తక్కువ. వదినెలూ, మరదళ్ళూ ఎక్కువ. నే నక్కడికి పోయానంటే, మా యింట్లో భోజనం చేసేవాడినే కాదు. ప్రతిరోజూ ఏ వదినె యింట్లోనుండో ఏ మరదలు వద్దనుండో విందుకు ఆహ్వానాలు వస్తూనే వుండేవి. నేను పదిహేను-పదహారేళ్ళ వాడినై సామూహికమైన నృత్యగానాది విలాస కార్యక్రమాల్లో పాల్గొనడం ప్రారంభించాక ఇక నక్కడున్న వదినెల్లో-మరదళ్ళల్లో నన్ను తమవాణ్ణి చేసుకోవాలన్న పెద్దపోటీ బయల్దేరింది. ఎంత ప్రేమా అనురాగం వుండేది వాళ్ళల్లో. నేను తండ్రికి ఒక్కడినే కొడుకును కావడం వలన నాకు స్వంత వదినెలంటూ ఎవరూ లేరు. కానీ అగ్రోదకారో వున్న తరుణులైన స్త్రీల నందరినీ నేను వదినెలగానే భావించేవాణ్ణి. వాళ్ళూ నన్ను తమ మరిదిగానే చూసేవాళ్ళు. అసలు యౌధేయులందరు "ఏక కుటుంబీకుల" మన్న భావనను కలిగివుంటారు. అందువలన 'తనా – పరా' అన్న ప్రత్యేక భావనను అక్కడ చూడలేము.

అగ్రోదకారో వ్యవసాయమూ, భూమి పంపకం కూడా యిలాగే ఉమ్మడిగా జరుగుతుంటాయి. సేద్యానికి యోగ్యమైనది; కానిది – సమస్త భూభాగమూ యౌధేయ జాతంతటికి చెంది వుంటుంది. సేద్యపుకాలం వచ్చినప్పుడు ఒక్కొక్క

కుటుంబం తనకు వున్న సాధనసంపత్తిని బట్టీ, అవసరాన్ని బట్టీ కావలసినంత భూమిని తీసుకొని సేద్యం చేసుకొంటుంది. పంటలు కోసుకున్న తరువాత మళ్ళీ మొత్తం భూమంతా యౌధేయ జాతికి చెందిపోతుంది. భూమి మీద ఏ ఒక్కడికీ అధికారం వుండదు. ప్రతివాడూ, తాను పండించుకోగలిగినంత పండించుకో వచ్చును. ఈ కారణం వలన కూడా యౌధేయ యువకులందరిలోనూ ఒకరకమైన భాతృభావన వ్యక్తమౌతూవుండేది. ఈ భాతృభావన, ఒక్క ఆగ్రోదకాలోనే కాదు, రోహతికి, ఖండితా, శ్రీమాల్, ఓసీ–మొదలయిన నగరాలలోని యౌధేయ యువకులందరూ పరస్పరం స్వంతసోదరుల్లా ప్రేమించుకొనేవారు. యౌధేయుల నగరానికి లేక గ్రామానికిగాని వెళ్ళి ఎవడయినా తను యౌధేయుణ్ణని తెలియపరిస్తే చాలు ఇక నక్కడున్న ఇండ్లన్నీ అతనికి స్వంతమైపోతాయి. ఏ విధమైన భేదమూ, వ్యత్యాసమూ లేకుండా తాను ఆ గ్రామవాసుల్లో ఒకడైపోతాడు. నేను ఎన్నోసార్లు పొరుగు గ్రామాలకు మా బంధువుల యిండ్లకు వెళ్ళినప్పుడు ఈ ఐక్యతాభావనను అనుభవించాను. ఆ యౌధేయ గ్రామాల్లోని వంటకాలూ, భోజనాలూ కూడా చాలా రుచిగా వుంటాయి. సముద్రగుప్తుడి పాకశాలలలోలా యౌధేయగ్రామాల్లో వందల వంటకాలు లభించవు. ఐతే ఏం? ఆ ఆత్మీయత, ఆ రుచి సముద్రగుప్తుడి పాకశా లలో సైతం దుర్లభమే!

రోజులు గడచినకొలది అజ్జుక ఆగ్రోదకాకు రావడం చాలావరకు తగ్గి పోయింది. కానీ ఆగ్రోదకాకు రావాలని ఎంతో ఉబలాటపడుతూ ఉండేది. ఎప్పుడైనా ఒకమాటు వచ్చినా తను గొప్పచక్రవర్తికి భార్యనన్న విషయాన్నే మర్చిపోయి, ఎంతో సాధారణంగా, సహజంగా వ్యవహరించేది అందరితోటీ! అజ్జుక ఒకనెల ఆగ్రోదకాలో వుండాలని వస్తే, రెండునెల్లు వుండేది. అమ్మ ఎటూ లేదు. ఇద్దరు చెల్లెళ్ళు వున్నారు. ఇక వదినెలకూ, పినతల్లులకూ కొదవలేదు!

కొద్దిరోజుల తర్వాత అజ్జుక ఆగ్రోదకాకు రావడానికి పూర్తిగా వీలుపడని స్థితి వచ్చింది. ఇకనప్పుడు నేను వెళుతూవుంటే నా చేతికి యిచ్చి ఎంతోమందికి లేఖలూ పంపుతూ వుండేది. ఆ లేఖలలో పేరుపేరు వరసనా అందరినిగురించి అడి గేది. తనకు ఆత్మీయులైన స్నేహితురాండ్రకు చుంబనాలనూ, ఆలింగనాలనూ ప్రదానం చేసేది. నే నా వుత్తరాలను ఇవ్వగానే ఆగ్రోదకాలోని స్త్రీలు యిలా అనే వారు "అబ్బ....దత్తాకు ఎంత జ్ఞాపకం! మమ్ములను ఎవరినీ మర్చేపోలేదు!"

ఒకమాటు యిదే విషయాన్ని అజ్జుకకు చెప్పాను. నవ్వి నా నుదుటిని ముద్దు పెట్టుకొని యిలా అన్నది. "అవును నాయనా! మర్చేపోలేని ఆ ఆత్మీయత యౌధేయ రక్తంలోనే వుంది! యౌధేయ భూమి నన్నిలా దూరంగా నెట్టివేసింది. అయినా నేను ఆజన్మాంతం యౌధేయ స్త్రీగానే ఉంటాను!"

ఈ మాటు నేను వర్షాకాలపు చివరిరోజులలో ఆగ్రోదకాకు బయలుదేరాను. వర్షాకాలం ఇంకా పూర్తిగా అంతంకాలేదు. తూర్పుగాలి బాగా అనుకూలంగా వుంది.

యవద్వీపం (జావాద్వీపం) నుండి మగధ సార్థవాహుల (వ్యాపారుల) ఓడలు చాలా కౌశాంబికి వస్తుంటాయి. అజ్జుక తన స్నేహితురాండ్రకు యిచ్చిన కానుక ర్తోటి ఒక పెద్ద ఓడే నిండిపోయింది. ఓడ తెరచాప ఎత్తారు. పశ్చిమానికి చరచరా వెళ్ళిపోతున్నది ఓడ. వారణాసి చేరాక నేను ఉపరిక్ (వైస్రాయి) అతిథిగా వున్నాను. సారనాథ్‌ను దర్శించాను. యౌధేయ రక్తం నన్నెలా ఉజ్జీవుణ్ణి చేస్తూ వుండేదో అలాగే అనాది మతమైన ఈ బౌద్ధమతం నన్ను అంతః ప్రేరితుణ్ణి చేస్తూ వుండేది. అందువలన ఆ మతంమీద నా హృదయంలో అపారమైన శ్రద్ధాభక్తులు వెలుగుతూ వుండేవి. అందువల్లే బుద్ధభగవానుడు ప్రథమంగా ఉపదేశామృతాన్ని వర్షించిన ప్రతిష్ఠానాన్ని చూడకుండా వుండలేకపోయాను. (ఝూన్సీ-ప్రతిష్ఠానం)లో ఒకరోజు మా ఓడను ఆపారు. ఇక్కడి రాజోద్యానంగానీ,రాజప్రాసాదంగానీ,పాటలీపుత్రంలోని రాజప్రాసాదంతోనూ,రాజోద్యానంతోనూ సరితూగవు. కానీ ఒకవిషయం మాత్రం నన్ను ఆ చిన్న వయస్సులోనే చకితుణ్ణి చేసింది. గంగా యమునా సంగమంలో కొంతమంది మునిగి ప్రాణత్యాగం చేసుకొనేవారు. అలా ప్రాణత్యాగం చేసుకొంటే నేరుగా స్వర్గానికి చేరవచ్చునని వారి అభిప్రాయం! ఐతే ఈ అభిప్రాయం సత్యమా, అసత్యమా అన్న విషయాన్ని నే నప్పట్లో నిర్ణయించే స్థితిలోలేను. కానీ, నేను పెద్దవాణ్ణి అయ్యాక, నా మనస్సులో బ్రాహ్మణుల మూర్ఖమైన ఆచారాల్లోనూ, అభిప్రాయాల్లోనూ బాగా జుగుప్సను కలిగించింది యిది ఒకటని గట్టిగా చెప్పగలను.

ప్రతిష్ఠానం దగ్గరనుండి మేము యమున చాలును అనుసరించాము. కౌశాంబీలో కూడా కొంతకాలం గడిపాము. అక్కడా ఉపరిక్ ప్రాసాదంలోనే విడిది చేశాము. అశోకుని మహలు, పాషాణ స్తంభములతో నిర్మించిన ఆస్థాన మండపాన్ని పాటలీపుత్రంలో చూశాను. కౌశాంబీలో కొన్ని శిలా ఖండాలనుకూడ చూశాను. వాటిమీద ఏవో కొన్ని లేఖలు చెక్కబడివున్నట్లు జ్ఞాపకం. అదే సంవత్సరం సముద్రగుప్తుడు కూడ ఒక శిలా ఖండంమీద లేఖను చెక్కించాడు. కౌశాంబీలో చూచిన రెండు శిలాఖండాల్లోనూ, ఒకదానిమీద సముద్రగుప్తుడూ పుట్టిన సంవత్సరమే లేఖను చెక్కించాడట. దానిలోని అక్షరాలను నేను కొద్ది కొద్దిగా పోల్చుకోగలను. కుమారామాత్యుడు, హరిషేణుడు చక్కని కవిత్వాన్నొకదానిని ఆ లేఖలో యిమిడ్చాడని అనుకొంటూ వుండేవారు.

కౌశాంబీనుండి మేము మధురకు చేరుకున్నాము! కుషాణుడి రాజప్రాసాదాలు యెన్నో అప్పటికి చెక్కుచెదరకుండా వున్నాయి. వాటిలో ప్రస్తుతపు మగధయొక్క రాజ్యాధికారులు వాసం చేస్తున్నారు. ఇంద్రప్రస్థానికి పోయాక ఓడలను వదిలాము. ఇక నక్కడినుండి యౌధేయ భూమి ప్రారంభం అవుతుంది. ఓడమీది సామాన్లను వూళ్ళోకిచేర వేయడానికి చాలాబండ్లుకావాలి. కాని,వాటికోసం నేను నిరీక్షించనవసరం లేదు. పరిచారకులే ఆ యేర్పాట్లను చూచుకొంటారు. నేను ఒక పరిచారకుణ్ణి వెంట తీసుకుని నేరుగా అగ్రోదకాకు చేరుకున్నాను. తండ్రిగారు నన్ను చూస్తూనే ఆలిం

గనం చేసుకుని, ముఖాన్ని ముద్దుపెట్టుకున్నారు. అప్పటికి రెండు సంవత్సరాలైంది వారు నన్నుచూచి. బాగా ఒడ్డూ పొడుగూ తేలిన నా శరీరాన్ని చూచి తండ్రిగారు పరమానంద భరితులయ్యారు. యౌధేయుల శరీర స్వాస్థ్యాన్ని దృఢతను చక్కగా కాపాడుకుంటున్నానని ప్రశంసించారు.

ఈమాటు నాకు మనోరంజకమైన యాత్ర చేయటానికి అవకాశం దొరికింది. పాటలీపుత్రంనుండి అగ్రోదకాకు ఎన్నోసార్లు ప్రయాణం చేశాను. అందువల్ల ఆ ప్రయాణంలో నాకు ఎలాంటి ఆనందమూ లభించేదికాదు. ఈ కొత్త యాత్ర నన్ను పూర్తిగా ఉత్సాహితుణ్ణి చేసింది. ఈమాటు నాన్నగారు గణపతి పదవినుండి విశ్రాంతి తీసుకొన్నారు. కొద్దిగా వ్యాపారం చేసేవారు. అదయినా నౌకర్లమీదగానే జరిగేది. వ్యాపారానికి పలువిధాలయిన వస్తువులు తీసుకుపోతూ వుండేవారు. తూర్పు దేశానికి సన్నని నూలువస్త్రాలు, బంగారు తీగెలతో అల్లిన రుద్రాక్షమాలలు, చందనం మొదలయిన సుగంధద్రవ్యాలు వ్యాపారానికి వస్తూవుండేవి. ఇవేకాకుండా కాంబోడియా దేశపు గుర్రాలు యెండు ద్రాక్ష కాపిషేయసురా మొదలయినవాటి వ్యాపారం కూడా ముమ్మరంగా జరిగేది. ఈ మాటు నాన్నగారు వ్యాపారానికి సార్థవాహులతో పాటు తానూ బయలుదేరుతున్నారు. నాన్నగారు ఇలా స్వయంగా వ్యాపారులతో పాటు బయలుదేరడానికి కారణం ఒక్క వ్యాపారాదర్శమేకాదు. తక్షశిలలోని మహారాజక చైత్యాన్ని చూడాలన్న కోర్కె పురుషపుర్ (పెషావర్) లోని బుద్ధభగవానుని భిక్షాపాత్రను దర్శించాలన్న కోర్కెలుకూడా ముఖ్యమైనవి.

అప్పటికి వర్షాకాలం గడిచిపోయింది. భూమి ఎండు వారింది. కాలువర్లో సడుల్లో నీరు సన్నగిల్లింది. పంటలు యిండ్లకు చేరాయి. సరిగా అదే సమయంలో నాన్నగారి వ్యాపారపు ముఠా తన ప్రయాణాన్ని సాగించింది. నేనుకూడా తమతో వస్తానన్నాను. నాన్నగారు నా మాటను దేన్నీ కాదనేవారు కాదు. నాన్నగారిలో గాంభీర్యం చాలా వుంది. దానికి తగ్గట్టుగానే మాధుర్యంకూడా వుంది. వారికి యౌధేయులు ప్రాణసమానులు.సముద్రగుప్తుడు ఎన్నోమార్లు ఉన్నతమైన పదవులను ఇస్తానని కబురుచేశాడు. కానీ నాన్నగారు వారి ఆహ్వానాలను ప్రతిసారీ తిరస్కరించారు. యౌధేయ జాతికి సేవచేయడమే వారి ఘనమైన జీవితాదర్శం. తన జీవితావసరాలకోసం ఎక్కువ డబ్బు సంపాదించుకోవడాన్ని కూడా ఆయన తన మిత్రుల కొరకూ, పరివారం కొరకూ మానారు. కానీ డబ్బు సంపాయించడమే జీవిత పరమావధి అనుకొనేవారుకాదు. ఇలా అంటూండేవారు. "యౌధేయులు ప్రస్తుతము ధనోపార్జనలో మునిగిపోయారు. ఇది యౌధేయజాతి పతనానికే కారణమౌతుంది."

మా వ్యాపారపుముఠా చాల పెద్దది. అందులో 500 బండ్లు, అసంఖ్యాకంగా ఒంటెలూ వున్నాయి. లక్షలు ఖరీదుచేసే వ్యాపారపు వస్తువులు వున్నాయి. కనుక దొంగల భయం యెక్కువ. యౌధేయ భూమిని దాటి కుషాణుడి రాజ్యంలో అడుగు పెట్టామంటే దొంగల భయం మరీ ఎక్కువ. అయినప్పటికీ మాకు దొంగల

భయంలేదు. మా వెంట నూరుగురు శస్త్రధారులైన గుర్రపు రౌతులున్నారు. వారు కాక ప్రతి బండివాడికీ కత్తిసామూ, కర్రసామూ వచ్చును! నీళ్ళూ, తిండి , గడ్డి సమృద్ధిగా దొరికే ప్రదేశాల్లోనే మేము బండ్లను దింపేవారము. వ్యాపార సామగ్రి కల బండ్లను మధ్యనవుంచి, శస్త్రధారులైన రౌతులు అటు ఇటు నడిచేవారు. పైగా యౌధేయుల బలపరాక్రమములు అందరికీ తెల్సు. అందువలన మావైపు కన్నెత్తి చూడడానికయినా దొంగలకు సాహసముండేదికాదు. ఈ మొత్తం ముఠా నాయకు లైన మా నాన్నగారు శస్త్రధారులై దర్పంగా ముందు నడిచేవారు.

సతజలాన్ని దాటిన తరువాత కుషాణుడి శక సైనికులు, అధికారులు కని పించసాగారు. పాటలీపుత్రంలో కూడా శక సైనికులూ, అధికారులూ అప్పు డప్పుడూ కనిపిస్తూ వుండేవారు. కానీ, ఇక్కడ చూసినట్లు బహుళ సంఖ్యలో వాళ్ళని ఎన్నడూ చూడలేదు నేను. శకులకు తమ గడ్డాలంటే విపరీతమైన ప్రేమ. వాళ్ళకా గడ్డాలమీద అంత ప్రేమ ఎందుకో నాకు అర్థం అయ్యేదికాదు. తమ గడ్డాల్లోని ఒక్క వెంట్రుక పాడుగావడాన్ని కూడా శకులు ఏలాటి పరిస్థితిలోనూ సహించేవారు కారు. గడ్డాలలో వాళ్ళ ముఖాలు గంభీరంగా వుండేవి. దాంతోపాటు విపరీతమైన క్రూరత్వంకూడా వాళ్ళ ముఖాలనుండి ప్రకటితమౌతుండేది.

వాళ్ళ వస్త్రధారణ కూడా ప్రత్యేకంగా వుండేది. మాలాగా చిన్ని చొక్కా లను ధరించేవారు కాదు. వాళ్ళు వేసుకొనే చొక్కాలు మోకాళ్ళ క్రిందివరకూ జారివుండేవి. నడుముకో పెద్దపట్టీని చుట్టుకొనేవారు. కాళ్ళకు సుత్తనలను (మేజో ళ్ళను) వేసుకొనేవారు. వాళ్ళ పాదరక్షలు సంచుల్లా వ్రేలాడుతూ, చాలా వదులుగా వుండేవి. వేషంలో యిలా వ్యత్యాసం వున్నప్పటికీ శకులు భారతీయ మతాలైన బ్రాహ్మణ-బౌద్ధ మతాలను అనుసరిస్తూ వుండేవారు. శకుల్లో కొంతమంది జైన మతానుయాయులు కూడా వున్నారు. కాని, వారి సంఖ్య బహు స్వల్పం. శకులు మాంసాహారులు. మాంసాహారాన్ని విసర్జించటం వారివల్లనయిన పనికాదు. అందు వల్లనే జైనమతాన్ని చాలా కొద్దిమంది మాత్రమే అవలంబించారు. పాటలీపుత్రపు రాజప్రాసాదంలో మ్లేచ్ఛులైన శకుల్ని గురించి అనేకమయిన నిందాత్మక వార్త లను విన్నాను. కానీ, నిజం చెప్పాలంటే, వారి గడ్డం తప్ప మిగిలినవి ఏవీ అంత నిందాత్మకమైనవిగా నాకు కనిపించలేదు వారిలో!

మా వెంట కొంతమంది యౌధేయ స్త్రీలుకూడా వున్నారు. ఈ స్త్రీలు తీర్థ యాత్రలను సేవించడానికి మాతో బయలుదేరారు. దారిలో శకస్త్రీలు ఈ యౌధేయ స్త్రీలను తమ ఇండ్లకు తీసుకుపోయి విందులు చేస్తున్నారు. సహజంగానే యౌధేయ స్త్రీలకు సురాపానమన్నా, నాట్యగానాదులన్నా చాలా ఇష్టం. కానీ మాతోపాటు బయలుదేరిన స్త్రీలు వ్రతనిష్ఠాపరులు గావడంవల్ల నాట్యగానాది విలాస కార్యక్రమా ల్లోనూ, సురాపానంలోనూ పాల్గొనేవారు కాదు. పైగా మా జట్టులోవున్న స్త్రీలలో

యువతులు తక్కువ. సగం వయస్సు గడచిన ప్రౌఢలు ఎక్కువగా వున్నారు. ఇందువల్లకూడా పై విలాస కార్యక్రమాల్లోకూడా పాల్గొనడం జరగలేదు.

మా జట్టు ఇరావతి, చంద్రభాగా, వితస్తా మొదలైన నదులనుదాటి తక్షశిలకు చేరింది. అక్కడినుండి ధర్మరాజిక మహాచైత్యం కనబడుతున్నది. పురుషులు బండ్లలోనుండే మహాచైత్యానికి నమస్కరించారు. కాని స్త్రీలు మాత్రం బండ్లుదిగి నుదురు, మోచేతులూ, మోకాళ్ళు భూమికానించి — ముమ్మారు నమస్కరించారు. నా పినతల్లి దేవసేన, చాలా భక్తి భావంకలది.ఆమెను అనుకరిస్తూ నేనూ ధర్మరాజిక చైత్యానికి నమస్కరించాను. మా జట్టులోని స్త్రీ పురుషులందరూ చైత్యానికి గౌరవసూచకంగా కొంతదూరం కాలినడకన నడిచారు.

తక్షశిలలో వ్యాపారపు ముఠాలు బసచేయడానికి చక్కని ఏర్పాట్లువున్నాయి. తోటలూ, మైదానాలూ, కాలువలూ, ప్రచురంగా వున్నాయి. కట్టెలు, ధాన్యం, పశువులకు గడ్డి– సంతలో కొనుక్కొనేవారం. కుషాణుడి రాజధాని పురుషపురం (పెషావర్). కాని తక్షశిల పురుషపురం కంటే వైభవోపేతంగా వుండేది. తక్షశిల పెద్ద వ్యాపారకేంద్రం కావడం వలన గొప్ప ధనికులైన వ్యాపారుల, సార్థవాహుల గృహాలు రాజదర్బారులను మరపిస్తూ వుండేవి. తక్షశిలనుండి వణిక్కులు తమ పణ్య వస్తువులను తీసుకొని కాంభోజ్,కపిషా, బాహ్లిక, పారసిక, యవన మొదలైన పాశ్చాత్య జనపదాలకు వ్యాపారనిమిత్తమై వెళ్తావుంటారు. తక్షశిలను దాటాక రెండురోజుల ప్రయాణం వరకూ మాత్రం బండ్లు పోగలవు. ఆపై ప్రయాణాన్ని కాలినడకను గానీ, లేక గుర్రాల మీదగానీ జరుపవలసి వుంటుంది. ఈ ప్రయాణ అసౌకర్యం వలన తూర్పు దేశాలనుండి వచ్చే వ్యాపారులు సాధారణంగా తమ సరుకుల్ని తక్షశిలలోనే విక్రయించుకుని వెనుకకు వెళ్తా వుంటారు. పాటలీపుత్రంలోని ప్రసిద్ధుడైన వణిక్కుడు (వ్యాపారి) గణదాసు కొడుకుకూడా తక్షశిలకు వచ్చి మమ్మలను కల్సుకున్నాడు.

నాన్నగారు తక్షశిలను గురించి చాలా విషయాలు తెలియపరుస్తూ వుండేవారు. ఇలా అనేవారు: "తక్షశిల ఒక్క వ్యాపార కేంద్రమేకాదు. ఒకప్పుడు ఈ తక్షశిల గొప్ప విద్యాకేంద్రం కూడాను. ఆ రోజులలో మగధ దేశంనుండి కూడా విద్యార్థులు విద్యాధ్యయనం కొరకు తక్షశిలకు వస్తుండేవారు. ఇప్పుడైతే పాటలీపుత్రం స్వయంగా ఒక విద్యా కేంద్ర మయింది. ఉజ్జయినీ మధురలు కూడా తగుమాత్రపు విద్యాకేంద్రాలయ్యాయి. ఇకపోతే తక్షశిలలో చదవడానికి ఉత్తరాపథం (పంజాబు) విద్యార్థులూ, పశ్చిమ దేశాల విద్యార్థులూ మాత్రం వస్తున్నారు" అన్నారు.

తక్షశిలలో చాలా విహారాలు వున్నాయి. అన్నిటిలోకి ముఖ్యమైంది, పెద్దది- ధర్మరాజిక మహావిహారం! ధర్మరాజిక విహారంలో పాషాణ ప్రతిమలు చెక్కబడినాయి. చుట్టుప్రక్కలగల ప్రతిమా గృహాల్లో బుద్ధ భగవానుడివి, అవలోకితేశ్వరు

డివి అతి సుందరమైన విగ్రహాలు విరాజిల్లుతున్నాయి. పూజాగృహాలలో అఖం డాలు వెలుగుతూ వుంటాయి. నాన్నగారు అఖండాన్ని వెలిగించడానికి పది దీనార్ల అక్షయనిధిని ధర్మంచేశారు. ధర్మరాజిక విహారాన్ని గురించి నాన్నగారు ఇలా అన్నారు: "బుద్ధభగవానుని నిర్యాణం తరువాత వారి శరీరధాతువు (అస్తులను) స్థాపనచేసి రాజగృహం, కుషీనగర్, వైశాలి, కపిలవస్తు, రామ్‌గ్రామ్ మొదలైన చోట్ల చైత్యాలను కట్టించారు. బుద్ధభగవానుడి నిర్యాణం తరువాత రెండు వందల సంవత్సరాలకు అశోకుడు రాజయ్యాడు. ఇకనప్పుడు అశోకుడు వనరాజ్యంలోని పలు ప్రాంతార్లో చైత్యాలను కట్టించాడు. అశోకుడు ధర్మప్రభువు కావడంవల్ల ప్రజలతడిని "ధర్మరాజ అశోక" అనికూడా పిలుస్తూండేవారు. అదే పేరుమీద యీ విహారానికి ధర్మరాజిక మహావిహారం అని పేరువచ్చింది" అన్నారు.

"అయితే, పాటలీపుత్రపు మహారాజయిన అశోకుని రాజ్యం, ఇంత వరకూ వ్యాపించివుండేదా?" అనడిగాను.

"ఇక్కడివరకేకాదు, ఇంకా ముందుకు, పశ్చిమానికి, యూభై యోజనాల వరకూ వారి రాజ్యం వ్యాపించి వుండేది. ఇప్పటికీ ఈ దేశాల ప్రజలు బౌద్ధమతానుయాయులే; ధర్మరాజ అశోకుడంటే ఈ ప్రజలకు ఎంతో ఆదరభావం. రాజ వంశాలు ఎన్నో వచ్చాయి. పోయాయి. కాని అశోకుడు ఈ ప్రజల హృదయాలలో చిరస్థాయి అయ్యాడు!" అన్నారు నాన్నగారు.

అశోకారామంలో [పాటలీపుత్రం] యవన, పారశీక, శక భిక్షువుల్నికూడా చాలా మందిని చూశాను. కాని, మొత్తం భిక్షువుర్లో గాంధారుల తరువాత శకుల సంఖ్యే ఎక్కువ! శక భిక్షువుర్లో విద్యా ప్రేమ చాలా ఎక్కువ. నా పినతల్లి నిత్యం విహారంలోకి వెళ్ళేది. శకవంశజ అయిన వశిష్ఠి అనే భిక్షుణియొక్క విద్యనీ, స్వభావాన్నీ, ఉపదేశాలనూ పొగడుతూ వుండేది. మేము ఇప్పుడు గాంధార దేశంలోవున్నాము. గాంధారులయొక్క వస్త్రధారణ చాలా విచిత్రంగా వుంటుంది. వాళ్ళ సుత్తనలు [మేజోళ్ళు] చాలా వదులుగా అనేకమైన ముడతలతో వికృతంగా వుండేవి. గాంధార స్త్రీల సుతనలుకూడా అలాగే వుండేవి. కానీ, పురుషుల సుత్త నలకంటే అందంగా, సున్నితంగా వుండేవి. స్త్రీ పురుషులిద్దరూ కంచుకాలను ధరించేవారు. గాంధార స్త్రీలు తలలపై వుత్తరీయాలను ధరిస్తారు. పురుషులు తల పాగాలను ధరిస్తారు. స్త్రీ పురుషులిద్దరూ కాళ్ళకు చెప్పులు వేసుకునేవారు. గాంధారుల వస్త్రాలంకారానికీ, శకుల వస్త్రాలంకారానికీ చాలా వ్యత్యాసం వుంది. శక స్త్రీ పురుషుల వస్త్రాలంకారం దాదాపుగా ఒకేలా వుంటుంది. అదే పొడుగాటి చొక్కా. అవే వదులైన పాదరక్షలు, అదే నడుము పట్టీ, అదే కోలటోపీ ఉభయుల వస్త్రాలంకారమూ అచ్చం ఒకేలా వుంటుంది. శక స్త్రీలు గాంధార స్త్రీలకంటే తక్కువ ఆభూషణాలను ధరిస్తారు. ముఖ్యంగా గాంధార స్త్రీలలో కర్ణభూషణం ధరించే అలవాటేలేదు! మగధ దేశీయులకంటే, యౌధేయులకంటే శకులూ,

గాంధారులూ చాలా ఎర్రగా వుండేవారు. గాంధారదేశంలో నల్లని, నీలి - కండ్ల వాళ్ళు ఎక్కువగా కనిపిస్తూ వుంటారు. అక్కడ శ్యామకేశినులకంటే స్వర్ణ కేశినులకే గౌరవం అధికం: నేను పురుషపుర్ [పెషావర్]రో కాంభోజదేశపు బౌద్ధ భిక్షుణిలను ఎంతోమందిని చూశాను. వాళ్ళలో నల్లనికండ్లు, నల్లని తల వెంట్రుకలు కలవారు కనుపించనే కనిపించరు. కొంతమంది తల వెంట్రుకలు లేత పసుపుపచ్చ కల్సిన తెలుపురంగులో వుంటాయి. గాంధారదేశంలో శకులు చాలా ఒదిగి ఒక రకంగా బానిసల్లాగానే వుంటున్నారు. అది నాకే మాత్రమూ నచ్చలేదు. కాని ఏం చేస్తారు? గాంధారుల రాజ్యం! ఒదిగి వుండక తప్పదు! శక రాజైన కుషాణుడు ఇప్పుడు స్వతంత్రుడు కాదని, పారశీక ప్రభువుకు సామంతుడయ్యాడనీ మా నాయనగారు చెప్పారు.

తక్షశిలలో మేము దాదాపు రెండు వారాలవరకూ వున్నాము. ఈ రెండు వారాల్లోనూ మా దగ్గిర వున్న వస్తువు లన్నింటినీ అమ్మేశాము. కొంతమందిని ఒండ్లకు కాపలాగా వుంచి, మిగిలిన వాళ్ళం గుర్రాలమీద పురుషపురానికి బయలు దేరాము. సింధునది, గంగానది కంటే పెద్దదని అంటుంటారు. కాని నాకు సింధునది అంత పెద్దదిగా కనిపించలేదు. ఇదే విషయాన్ని గురించి నాన్న గారిని అడిగాను. "గంగానది అంత వెడల్పు సింధునది లేదుకదా?" అన్నాను. "వెడల్పు లేకపోతే ఏం? ఈ నది చాలా వేగంగా ప్రవహిస్తుంది. రోతు కూడా ఎక్కువ!" అన్నారు నాన్నగారు. సింధు తటంనుండి చిన్న చిన్న పర్వతశ్రేణులు మార్గమధ్యంలో తగులసాగాయి. అక్కడినుండే నేను వెండి కొండలాంటి హిమా లయ పర్వత శిఖరాన్ని చూశాను. ఆ పర్వత శిఖరం దేవతలు, అప్సరసలూ వాసం చేస్తుంటారని మా పినతల్లి అంటుండేది. అయితే ఆ విషయాన్ని గురించిన సత్యాసత్యాల్ని, నిర్ణయించే శక్తి నాకింకా అప్పటికి రాలేదు.

సింధునదిని దాటి పుష్కలావతి మీదుగా చాలా రోజులకు పురుషపురాన్ని చేరాము. దేవపుత్ర శాహీ (కుషాణుడు) యొక్క రాజప్రాసాదాన్ని చూశాము. అతడి రాజప్రాసాదాలు చాలా అందంగా వున్నాయి. ఆ ప్రాసాదాల్లో చూచిన చిత్రకళను నేను మరెక్కడా చూడలేదు. పురషపురంలోని భవనాలు,వీధులూ చాలా ప్రశస్తంగా వున్నాయి. అక్కడే కనిష్క విహారాన్ని చూశాను. అశోకుడి తర్వాత మూడు వందల సంవత్సరాలకు మరొక బౌద్ధమతానుయాయి అయిన చక్రవర్తి వుద్భవిం చాడు. అతడే కనిష్కుడు. పురుషపురం (పెషావరు) అతడి రాజధాని. స్వర్ణరత్న జటితమైన ఈ మహా చైత్యాన్నీ, విహారాన్నీ అతడే కట్టించాడు. కనిష్కుడు పాటలీపుత్రాన్నీ, దానికి తూర్పున వున్న దేశాన్నీ జయించాడు. సువర్ణరత్న మయమై మెరుస్తున్న ఈ మహా విహారంలో బుద్ధుని భిక్షాపాత్ర భద్రపరచబడింది. మొదట ఈ భిక్షాపాత్ర లిచ్ఛవుల రాజధానియైన వైశాలిలో వుండేది. కనిష్కుడు తన సేనాపతికి వైశాలి నుండి ఈ భిక్షాపాత్రను, దానితోపాటె గొప్ప విద్వాంసు

తైన ఒక బౌద్ధ భిక్షువును తీసుకురావల్సిందని ఆజ్ఞాపించాడు. సేనాపతి ఈ భిక్షా పాత్రతోపాటు, మహాపండితుడు, మహాకవి అయిన ఆర్య సువర్ణాక్షికుమారుడు అశ్వఘోషుణ్ణి గాంధార దేశానికి తీసుకొని వచ్చాడు. అప్పట్లో గాంధారదేశాన్ని గురించి నాన్నగారు ఎన్నో విషయాలను చెప్పారు. వాటన్నింటినీ నేనప్పుడు అర్థం చేసుకోలేక పోయాను. కాని, నేను పెద్దవాణ్ణయి ప్రాచీన గ్రంథాలను చదవ డంలో పూర్తిగా లీనం అయినప్పుడు వారు చెప్పిన విషయాల సత్యత సాకారమై కన్నులకు కట్టేది. అరవై సంవత్సరాల తరువాత నేనీ విషయాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను. వీటిలో, తరువాత జీవితంలో నేను పొందిన అనుభవాలు, నేను సంపాయించిన జ్ఞానం తాలూకు ప్రభావం ఎక్కువగా కనపడవచ్చును.

భిక్షాపాత్రను దర్శించడానికీ, పూజించటానికీ మేము ఎన్నోసార్లు కనిష్క విహారానికి వెళ్ళాము. నాన్నగారు విహారంలోని భిక్షుల సాంగత్యం కోసంకూడా ఎన్నోసార్లు విహారానికి వెళ్ళారు. కనిష్క విహారంలోని ఆర్య అసంగ భిక్షువు గొప్ప విద్వాంసుడు. అతడి కీర్తి పాటలీపుత్రంలోని అశోకారామం వరకూ వ్యాపించింది. ఆర్య అసంగ విద్యాధ్యయనం అగాధం లాంటిది. అంత ప్రజ్ఞాధురీ ణతలోనూ పసిపిల్లలాటి సరళత్వం ఆశ్చర్యాన్ని గొల్పుతుంది! వయస్సు డెబ్బై దాటుతున్నాయి. ముఖాన ఒక్క ముడత కనిపించదు. ఎప్పుడూ ఓ చిన్న చిరునవ్వు ముఖమండలాన్ని ప్రజ్వలితం చేస్తూ వుంటుంది. బంగారు రంగు శరీరఛాయ, ఎర్రని కాషాయవస్త్రం వారి శరీరం మీద బాలసూర్యుణ్ణి పెనవేసుకున్న ఉషాకన్యను జ్ఞప్తికి తెస్తూ వుంటుంది. ఉదయాన్నే వారు తన కుటీరం నుంచి బయటికిరాగానే జిజ్ఞాసులైన భిక్షువులు, గృహస్థులు అనేకులు వారి చుట్టూ ప్రోగుపడేవారు. నాన్న గారు, మరి ఇతర గృహస్థులు కొంతమంది వారిని అనేక ప్రశ్నలువేస్తూ వుండే వారు. బౌద్ధమతాన్ని గురించి, యూనాన్ యాత్రలను గురించి అనేక ప్రశ్నలు వేస్తూ వుండేవారు. వాళ్ళ చర్యలు, లేక ప్రశ్నోత్తరాలు నాకేమాత్రమూ అర్థం అయ్యేవి కావు. అయినా, విసుగులేకుండా వుంటూ వుండేవాడిని. ఆర్య అసంగ మొదటిరోజున నేను నమస్కరిస్తుండగా, దగ్గిరకు తీసుకొని తల నిమురుతూ, మా నాన్నగారిని సంబోధించి ఇలా అన్నారు: "ఉపాసక్, సేనాపతి! నీ కుమారుడు చాలా మేధావి అవుతాడు బాగా చదివించు!"

నాన్నగారు అంజలిబద్ధులై "ఆర్యా! తమరే జయుణ్ణి పాదసన్నిధిని వుంచు కోవాలి!" అన్నారు.

"నాకేమీ అభ్యంతరం లేదు సేనాపతి. కాని నేనిప్పుడు చాలా వృద్ధుణ్ణయి పోయాను. నా ధ్యానానికిపోను చాలా కొద్ది సమయం మిగుల్తుంది. ఆ కొద్ది సమ యాన్నికూడా నీలాంటి జిజ్ఞాసువులు తీసుకొంటూ వుంటారు. ఇకపోతే జయుడి అధ్యయనానికి ఏ మాత్రము సమయముండదని విచారిస్తున్నాను" అన్నారు ఆర్య అసంగ.

"తమ పాదసన్నిధిని వుంటేనే చాలు; జయుడికి అనేకమైన విషయాలు బోధపడతాయి."

"అలాకాదు. నా దగ్గర వుండడం వల్ల ఇతడి సమయం చాలా వ్యర్థంగా పోతుంది. నా సోదరుడు వసుబంధు మీకు తెల్సుగా?"

"ఎందుకు తెలియదు? ఈ జంబూద్వీపంలో ఆచార్య వసుబంధును ఎరుగని వాలెవరు? వారెవరిని గురించి నేను తక్షశిలలోనూ, పురుషపురంలోనూ కూడా విచారించాను. వారిప్పుడక్కడ వుండటంలేదా?"

"లేదు. ఉండడంలేదు. వారు తూర్పుదేశాల్లో పర్యటనలు చేస్తున్నారు. ప్రస్తుతము వారినో మిథ్యావిశ్వాసం పట్టుకొని వేధిస్తూన్నది. అశోకుడిలాటి చక్రవర్తి నెవడినో ఒకణ్ని బౌద్ధమతానుయాయుని చేయగలిగితే తిరిగి బౌద్ధమతం ఐదారు వందల సంవత్సరాల వరకూ తన రెండు కాళ్ళమీదా నిరాటంకంగా నడుస్తుందని వారి విశ్వాసం."

"చక్రవర్తుల ఆశ్రయంతోనా?"

"అవును అదే వారి అభిప్రాయం! కాని నా అభిప్రాయం అందుకు పూర్తిగా భిన్నంగా వుంటుంది. బుద్ధభగవానుడు ప్రవచించిన ఈ మహాతంత్రం చక్రవర్తుల చేతుల్లోకి పోతే పూర్తి నిర్బలమూ, మలినమూ ఐపోతుందని నా విశ్వాసం! బుద్ధుడు ఈ మతాన్ని బహుజనహితాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రవచించాడు. బుద్ధభగవానుడు తన వుపదేశాల్లో పూర్వకాలంలో రాజనేవాడే లేడనీ, పరిపాలనా బాధ్యతల్ని ప్రజలే నిర్వహించేవారనీ వెల్లడించారు. ఇప్పుడు మీ యౌధేయ ప్రజలు ఎలాగైతే రాజ్యాంగ విషయాలను సమిష్టిగా పరిష్కరించు కొంటున్నారో, అలాగే వెనుకటి రోజుల్లో అన్నిచోట్లా జరుగుతూ వుండేది. కాని, ప్రజలు డబ్బుకు దాసులయ్యారు. డబ్బు ప్రోగుచేయడం నేర్చుకొన్నారు. భాగ్యవంతులు, బీదలూ అనే వ్యత్యాసాలు ఏర్పడ్డాయి. గ్రామాల ప్రక్కనే పెద్ద పెద్ద గోతులుండడం చూశారు కదా?"

"అవును చూశాము!"

"ఆ గోతులు ఎలా ఏర్పడ్డాయో తెల్సునా? ఆ గోతులనుండి మట్టితీసి పెద్ద పెద్ద భవనాలు నిర్మాణానికి ఉపయోగిస్తారు. ఇలాగే ధనిక బీద విషయాలను కూడా మనం అర్థ చేసుకొన వచ్చును. ధనికులకు డబ్బు ఆకాశంనుండి ఏమీ వూడి పడదు. నూటికి 99 మందిగా వున్న సాధారణ ప్రజలను తిండికీ, గుడ్డకూ అలమటింపచేసి, వాళ్ళ శ్రమను దోచుకొని, ఈ ధనికులు ధనికులౌతున్నారు. ఈ భవనాలూ—రాజప్రాసాదాలూ నిర్మింపబడుతున్నాయి. ఈ భవనాలకూ, రాజప్రాసాదాలకూ అడుగున అన్నార్తుల ఆర్తనాదాలూ, వివస్త్రుల వివశత-సమాధి చేయబడినాయి. ఈ రాజులూ, చక్రవర్తులూ సాధారణ ప్రజల్ని పీడించి తమ సౌఖ్యాలను నిర్విఘ్నంగా కొనసాగించుకొంటున్నారు. అలాంటప్పుడు సాధారణ ప్రజల సౌఖ్యా

నికి బద్ధశత్రువులైన వీరివలన, సాధారణ ప్రజలకోసరం ఉద్దేశింపబడిన బౌద్ధమతానికి ఏం ఉపకారం జరుగుతుందో చెప్పండి? తమ రాజప్రాసాదాల్లాగానే మణిఖచితమై, తళతళా మెరిసిపోయే ఒకటి రెండు చైత్యాలనూ, రాజప్రాసాదాలనూ కట్టిస్తారేమో! ఆ మాత్రానికి జరిగే ప్రయోజనం యేముంది? కనిష్కుడి రాజవంశం, తన మూడువందల సంవత్సరాల జీవితంలోనూ అందమైన విహారాలను కట్టించిన మాటనిజం. వాటిలో రాజప్రాసాదాల్లో కంటే అధికంగా వెండి, బంగారం, వజ్రాలూ వైఢూర్యాలూ ప్రోగుపడిన మాటకూడా నిజం. కాని, బౌద్ధమతం యీ వెండి, బంగారంకోసం, వజ్రవైఢూర్యాలకోసం కాదుగా?"

"బౌద్ధమతం వజ్ర వైఢూర్యాలకోసం యెన్నటికీకాదు. సాధారణ ప్రజల కోసమే, ఆర్యా!"

"నిజం చెప్పావు సేనాపతీ! బుద్ధభగవానుడి యీ పవిత్ర మతాన్ని యెలా యీ రాజుల చేతుల్లోనుండి తీసి, తిరిగి సాధారణ ప్రజలకు ఉపయోగకరమైందిగా చేయడమా? అని ఆలోచిస్తుంటాను! తథాగతుడు లిచ్ఛవి రాజకుమారుల రాజభోగాత్మకమైన ఘన సన్మానం కంటే, ఒక గణిక–అంబాపాలి–యొక్క ఆతిథ్యాన్ని యెందువల్ల ఉత్తమమైనదిగా స్వీకారయోగ్యమైందిగా ఎంచాడో తెల్సా?"

"ఆ తథాగతుడు (బుద్ధుడు) కలిమిలేముల వ్యత్యాసాలను, కొద్దీగొప్పా అనే తారతమ్యాలనూ నిర్మూలింపదలిచారు. అందువల్లే రాజసత్కారాన్ని తిరస్కరించి, వేశ్య ఇచ్చిన ఆతిథ్యాన్ని స్వీకరించారు!"

"ఈ నిర్మూలన ఒక్క భిక్షు సంఘం వరకే పరిమితం చేయదలచుకోలేదు వారు. గృహస్థుల్లో కూడా ఈ హెచ్చు తగ్గుల వ్యత్యాసాన్ని నిర్మూలించాలనుకున్నారు. అందువల్లే "ఉపాసక" "ఉపాసికా" సంఘాలను స్థాపించారు. కాని, నేటి స్థితి ఏమిటి!?"

"ఇప్పుడు బౌద్ధ ఉపాసకులు, ఉపాసికలు కూడ బ్రాహ్మణుల్లుగా వర్ణవ్యవస్థను పాటిస్తున్నారు!"

"అవును. బుద్ధుని శిష్యులు రాజుల్ని ఆశ్రయించడంవల్ల బౌద్ధమతం అభివృద్ధికి పోతుందనుకొన్నారు. కాని, అందువల్ల–దాని అసలైన ఆదర్శం–బహుజన హితానికే దూరమైంది! ఈ చతుర్విధ సంఘాన్ని (భిక్షుసంఘ-భిక్షుణీ సంఘ-ఉపాసక సంఘ-ఉపాసికా సంఘ) బుద్ధభగవానుడు మహాసముద్రంతో పోల్చాడు. చిన్న చిన్న నదులనబడే అన్య మత ధర్మాలన్నీ ఈ మహాసముద్రంలో అంతర్లీనం అయిపోతాయనీ, అయిపోవాలనీ బుద్ధభగవానుడి ఆశయం!"

"కాని, ఆర్యా! ఈ బ్రాహ్మణులు అంతర్లీనం కానిస్తేకదా?"

"కాని, సేనాపతీ! బుద్ధభగవానుడు ఈ బ్రాహ్మణులకు భయపడినట్లయితే ఋషివతన్ (సారనాథ్)లో ధర్మచక్ర ప్రవర్తన (ప్రథమ ధర్మోపదేశం) చేయగలిగేవాడే కాదు. తథాగతునియొక్క ఈ పవిత్రమతం ఈనాడు భారతదేశమే

కాకుండా చీనా, పారసికం, యవన మొదలైన అన్యదేశాల్లో కూడా ప్రసిద్ధమైందంటే అందుకు కారణం యే బ్రాహ్మణుల దయో లేక యే మహారాజుల దయో అనుకోవడం చాలా పొరపాటు! ఇంత కొద్ది సమయంలో యింత వ్యాప్తికి రావడానికి కారణం ఈ మతంలోని నిజాయితీయే! ఈ మహా మతంలో జీవకారుణ్యం ఉద్బోధింపబడ్డది. జ్ఞానప్రబోధానికి ప్రాముఖ్యం ఈయబడ్డది. సామాన్య ప్రజానీకానికి ఉపకారం చేయా లన్న భావన ప్రదర్శితమైంది. ఈ ముఖ్యమైన, ఉత్తమమైన లక్షణాలవల్లనే ఈ మతం ప్రపంచం నాలుగుచెరగులా వ్యాపించింది. కాని, ఈరోజున తథాగతుడి జన్మభూమియైన భారతదేశంలో ఈ మతానికి ఏ గతి పట్టిందో తెలుసా? మీరు యీ దేశంలోని విహారాలను, వారిలో ప్రోగుపడిన సంపదను చూసి బౌద్ధమతం చాలా అభివృద్ధికి వచ్చిందని అనుకోవచ్చును. కాని, వాస్తవానికి ఈ మతానికి ఈ దేశంలో చెదలు పట్టాయి. ఈ మతాశయమైన, సామాన్య ప్రజానీకపు ఉపయోగానికి మన మేమీ చేయడంలేదు....జీవన్మృతుల్లా గతాన్ని స్మరించుకోవడంలోనే మన కాలం వ్యర్థమవుతున్నది."

"ఆర్యా! మరి ఈ స్థితినుండి బయటపడడానికి మార్గమేది?"

"మార్గమా, మార్గముంది! బుద్ధభగవానుడు ప్రబోధించిన మహాయానమే తగిన మార్గం! మానవుడు తన సుఖంకోసం, తన నిర్వాణంకోసం పాటుపడ కూడదు. అతడి జీవితమూ, సర్వస్వమూ బహుజన హితంకోసమై యుండాలి. తోటి మానవుడు ఒక్కడయినా దుఃఖంలో బంధనలో ఉన్నాడంటే, ఇక మనం ముక్తిని వాంఛించరాదు. స్వర్గం అనవసరం అలాంటప్పుడు! బాధల్లో వున్నవాళ్ళకు దుఃఖితు లకూ, దీనులకూ సేవచేయడం మానవుల విధి. అందువల్లే బుద్ధభగవానుడు తన మతాన్ని గురించి చెబుతూ "యహిపశ్యత్" అన్నాడు. అంటే ఈ మతంయొక్క గుణం, లక్షణం—ఈ ప్రపంచంలోనే పరీక్షింపబడాలి. మరోప్రపంచం (స్వర్గం అలాంటి కాల్పనిక ప్రపంచం)లో కాదు. ఈ ప్రపంచంలోని మానవులందరూ దుఃఖంలో వున్నారు. రాజులు తమ రాణివాసాల్లోని ఉంపుడుగత్తెల సంఖ్యను పెంచారు. ఆ సంఖ్య లక్షలవరకూ పెరిగింది. తమ సౌఖ్యంకోసం, తమ రాణి వాసాల రక్షణకోసం రాజులు ప్రజలను దోచుకుంటున్నారు. "దీన్నే దిగ్విజయం!" అంటున్నారు.

"ఐతే, ఆర్యా! రాజరికాన్ని మీరు ఒప్పుకోరా?"

"తథాగతుడు రాజరికాన్ని ఆమోదించినట్టయితే, తన తరువాత ఏ నిరంకుశ మతాధిపతినో మన నెత్తిన కూర్చోబెట్టేవాడు. కాని, బుద్ధుడు తనకు స్థానాపన్నంగా సంఘాన్నిమాత్రం సూచించాడు."

"కాని, ఆర్యా! మన గణతంత్రాలకు (గణతంత్ర దేశాలకు) దూరంగావున్న కొంతమంది భిక్షువులకు, ఉపాసకులకు, రాజు లేకుండా రాచకార్యాలు చక్కపరుచ వచ్చనే విషయం తెలియనే తెలియదు!"

"అదే బ్రాహ్మణులు చేసిన కుతంత్రం! రాజుతోపాటు కలిసి, ప్రజల్ని దోచుకోపడానికి "రాజులేకపోతే జరగదు!" అన్న భావాన్ని వ్యాపింపచేశారు. మన బౌద్ధ భిక్షువులుకూడా ఆ భావనకు వూతాన్నిచ్చి, ఆ దోపిడిలో భాగాన్ని కొట్టేయ డానికి అలవాటు పడ్డారు. కొంతమంది రాజులు తాము బౌద్ధ మతానుయాయులమని చెప్పుకొంటున్నారు. కాని వాళ్ళకు బౌద్ధమతం మీదకంటే బ్రాహ్మణుల మీదనే ఎక్కువ భక్తి."

"గో బ్రాహ్మణుల భక్తులు!"

"బ్రాహ్మణ భక్తుడయినవాడు తప్పకుండా భక్తుడౌతాడు!" అంటూ ఆర్య అసంగ ఒకమాటు నవ్వారు. శ్రోతలుకూడా నవ్వారు. కాని, వెంటనే ఆర్య అసంగ ముఖం గంభీరం అయింది. ఇలా అన్నారు. "ఇది నవ్వవలసిన విషయం కాదు. ఏడవవలసిన విషయం! సర్వసామాన్య ప్రజలకు తరతరాలవరకూ జరిగే ఈ అన్యాయానికి మనం ఏ మాత్రమూ నవ్వకూడదు. మానవుణ్ణి మూఢనమ్మకా లలో బంధించి, కొంతమంది సుఖసౌఖ్యాలను పొందవచ్చు. కాని, ఈ స్థితి మానవ చరిత్రకే ఓ పెద్ద కళంకం! యవనులూ, శకులూ-మనదేశానికి వచ్చిన మొదటి రోజుల్లో ఈ బ్రాహ్మణులు వాళ్ళని ఏమనేవారో తెలుసా?"

"ఏమనేవారు ఆర్యా?"

"మ్లేచ్ఛులనేవారు. బౌద్ధమతానుయాయులు తమ గురువైన బుద్ధుని మాట లనూ, ఉపదేశాలనూ ఆచరణలో పెట్టారు. ఈ అన్యదేశీయులపట్ల ప్రేమను, గౌర వాన్ని ప్రదర్శించసాగారు. దాంతో విదేశీయులైన శకులు, యవనులు బౌద్ధమతాను యాయులు కాసాగారు. ఈ దేశంలో శాశ్వతనివాసాల్ని ఏర్పరచుకోసాగారు. బుద్ధుని పాదధూళి సోకిన ప్రతి ప్రదేశము మహాక్షేత్రమయింది. మహాస్థవిర నాగ సేనుడి శిష్యుడు యువరాజు మిళిందుడు పెద్ద పెద్ద విహారాలను కట్టించాడు. శక రాజయిన కనిష్కుడు బౌద్ధమతం కోసం యెంత వ్యయంచేశాడో తెల్సుకోవాలంటే తక్షశిలా, పురుషపురాల్లోని విహారాలను చూస్తేచాలు. చివరకు బ్రాహ్మణులు ఈ విదేశీయులను మ్లేచ్ఛులనడంలో తాము పడ్డ పొరపాటును తెల్సుకొన్నారు. దాన దక్షిణలమీద మోజు ఎక్కువయింది. కొత్త కొత్త శ్లోకాలను రచించారు.యవనులు, శకులు మొదలయిన విదేశీయులందరినీ ఆర్యక్షత్రియు లనేవారు."

"మరి ఇప్పుడు ఉజ్జయినీ పాలకులయిన క్షత్రపులు శక-మ్లేచ్ఛులు కారు. శక-క్షత్రియులయ్యారు!"

"ఆఁ, బౌద్ధమతానుయాయులు రాజుల సాయంతో బౌద్ధమతాన్ని పైకి తెద్దా మనుకున్నారు. ఈ అవకాశాన్ని బ్రాహ్మణులు చక్కగా వినియోగించుకున్నారు. మనం బౌద్ధమతస్థులం. సర్వమానవ సమానత్వాన్ని బోధిస్తున్నాము. కాని, యెవరి కైనా ఉచ్చవర్ణాన్ని (కులాన్ని) ప్రసాదించగల అధికారం బ్రాహ్మణుల చేతుల్లో వుంది. కనుకనే రాజులూ, సామంతులూ బ్రాహ్మణుల చేతుల్లోకి పోయారు. ఇక

మీదటనైనా, బౌద్ధమతానుయాయుల బహుజన హితంకోసం బౌద్ధమతాన్ని స్వీకరిస్తే ఫరవాలేదు. అలా కాకపోయిందా? ఇక నీ మతం ప్రపంచంలో నామశేషమవక తప్పదు!"

తండ్రిగారితోపాటు నేనూ రోజూ ఆర్య అసంగవద్దకు వెళ్తూండేవాడిని. వారి మాటలనూ, ఉపదేశాలనూ శ్రద్ధగా వినేవాడిని. కాని, పైన నేను వ్రాసినవాటిల్లో నా బాల్య స్మృతి ఎంతవరకూ సాయపడ్డదో, పెద్దవాణ్నయ్యాక, ఆర్య అసంగయొక్క ఉత్తమ గ్రంథాలను చదివాక ఏర్పడ్డ జ్ఞానం ఎంతవరకూ సాయపడిందో చెప్పలేను. ఈ యాత్రవలన ఒక లాభంమాత్రం స్పష్టంగా జరిగింది. నాలో జిజ్ఞాస రేగింది. ఆర్య అసంగ యొక్క భావాలనూ, బుద్ధుని ఉపదేశాలనూ ఇంకా ఇంకా తెల్సుకోవాలనే ఆసక్తి కలిగింది. నాన్నగారు కూడా నన్ను సదా ప్రోత్సాహపరుస్తూ వుండేవారు. ఒకమాటు నాన్నగారితో ఆర్య అసంగ ఇలా అన్నారు : "వసుబంధు తూర్పు దేశాల్లో వున్నారు. వారి వద్దకే పిల్లవాణ్ని పంపించు!"

ఆర్య అసంగ చెప్పిన ఒకే ఒక వాక్యం నా హృదయంలో శాశ్వతమైన వాసాన్ని ఏర్పరచుకొన్నది. సాధారణమైన వాక్యాలు కాలక్రమంలో మలినమై తమ స్థానాన్ని గోల్పోతాయి. కాని, ఈ వాక్యం మాత్రం కాలం గడిచినకొలదీ మరీ ఉజ్జ్వలమయిన తన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తున్నది. ఒకసారి నన్ను దగ్గరకు పిల్చి ఆర్య అసంగ ఇలా అన్నారు: "నీ అనుభవానికీ, జ్ఞానానికీ సరిపడని (వ్యతిరేకమైన) మాటలు ఎవరు చెప్పినా ఒప్పుకోకు! విశ్వసించబోకు!"

అప్పుడు ద్రాక్ష పండింది. గాంధార దేశపు ద్రాక్షలు చూడడానికి ఎంత బాగుంటాయో తినడానికికూడా అంతే రుచిగా వుంటాయి. నేను ఒకటి రెండుసార్లు పాటలీపుత్రంలో వుండగా గాంధార ద్రాక్షపండ్లను తిన్నాను. కాని, ద్రాక్షలతల క్రింద నిలబడి పండిన ద్రాక్ష గుత్తులను కోసుకొని తింటూవుంటే కలిగే ఆనందం, ఎప్పుడో ఆరునెల్ల క్రితం కోసి సగం ఎండిపోయి లభించిన ద్రాక్షల్లోవుంటుందా? గాంధారదేశపు ఎర్రని ఉదుంబర మేడిపండ్లను కూడా పాటలీపుత్రంలో వుండగానే తిన్నాను. ఇంకా అనేక రకాలైన ఆ దేశపు పండ్లను ఇదివరలో తిని వున్నాను. ఆ పండ్ల తాలూకు వృక్షజాతులన్నింటినీ ప్రథమంగా ఈ యాత్రలో చూశాను. యౌధేయభూమికంటే గాంధార భూమి గొప్పదని నే ననను కాని, గాంధారదేశంలోని నిర్మలమైన జలాలు, రసపూరితమైన ఫలాలు-చాలా మధురంగా ఉన్నాయని ఒప్పుకోక తప్పదు! పురుష పురంలోకి పోయాక మరికొన్ని కొత్త విషయాలుకూడా తెల్సాయి. నా దృష్టికోణం మరికొంత విస్తృతమైంది. పురుషపురంలోని వీధుల్లో తిరుగుతూ, అక్కడ కనుపించే వివిధ దేశాల స్త్రీ పురుషులను, వారి రంగు భేదాలను, ముఖముద్రలను వేషధారణను పరికిస్తూ వుండేవాడిని. నే నొకరోజున పండు నారింజరంగు (ఎర్రని) ముఖవర్ణంకల కొంతమంది స్త్రీ పురుషులను చూశాను. నా దృష్టిని వాళ్ళు బాగా ఆకర్షించారు. వాళ్ళు నా దృష్టిని ఆకర్షించడానికి కారణం

ఒక్క ముఖవర్ణమేకాదు–స్త్రీల ముఖాల్లాగానే ఆ పురుషుల ముఖాలుకూడా నున్నగా వున్నాయి. మీసాలూ, గడ్డాలు లేవు! కండ్లదగ్గిర ఒక తెలుపూ, నలుపూ కల్సినరేఖ వుంది. మెడ ఎముకలు బాగా పుఓకి పైకి కన్పిస్తున్నాయి. వట్టి చర్మాలనుమాత్రమే ధరించారు. ఆ చర్మాలనైనా, వెంట్రుకలుగల పైభాగాలను రోపలికి వేసుకొని, లోపలి భాగాన్ని పైకి వచ్చేట్టుగా ధరించారు. టోపీగా వుపయోగించిన చర్మాన్ని మాత్రం సవ్యంగా వెంట్రుకలు పైకి వుండేట్టు ధరించారు. వాళ్ళు హూణులనీ, అరవై యోజనాల దూరంనుండి బేరం అమ్ముకోడానికి వచ్చారనీ తరువాత తెలిసింది. పురుషపురంలో పారశీకులు చాలమంది వున్నారు. దేవపుత్రశాహీ అప్పుడు పురుష పురంలో లేడు. పారశీక ప్రభువు దర్బారుకు పోయాడు. అందువలన అతడిని చూడలేకపోయాము.

పురుషపురంనుండి వెనక్కు తిరిగి మేమంతా తక్షశిలకు చేరుకున్నాము. మరికొన్నాళ్ళకు ఆగ్రోదకాకు చేరాము.

# అధ్యయనం

వర్షఋతువుకు ముందే పాటలీపుత్రం చేరుకున్నాను. మా గాంధార యాత్రను గురించి అజ్జుక తనకు ముందుగా మా ఈ (గాంధార) యాత్రను గురించి తెలియ పరచనందుకు చాలా విచారించింది. ముందుగా తెలిసి వున్నట్లయితే, ధర్మరాజికనూ, పాత్రధాతువును (బుద్ధుని భిక్షాపాత్రను) పూజించడానికి సామగ్రిని పంపేదాన్ని అన్నది. నాన్నగారు తక్షశిలలో దీపదానం కొరకు పది దీనార్ల అక్షయనిధిని దానం చేశారనీ, ఆ పుణ్యస్మృతిలో రాతిఫలకం మీద తన పేరునూ, నా పేరునూ చెక్కించారనీ అజ్జుకకు చెప్పాను. అజ్జుక చాలా సంతోషించింది. అప్పట్లో ఆర్య వసుబంధు వర్షావాసం కొరకు అశోకారామానికి వచ్చివున్నాడు. నేను పరమానంద భరితుణ్ణయి నాన్నగారికీ, ఆర్య అసంగకూ జరిగిన సంభాషణలను, చర్చలను గురించి చెప్పాను. ఆర్య వసుబంధు వద్ద చదివించవల్సినదని ప్రార్థించాను. అజ్జుక చాలాసార్లు ఆచార్య వసుబంధు యొక్క దర్శనాన్ని చేసుకొన్నది. వారి ఉప దేశాలనుకూడా విన్నది. ప్రగాఢమైన వారి పాండిత్యం, స్నిగ్ధమైన వారి వ్యక్తి త్వం, అజ్జుకను బాగా ఆకర్షించాయి. ఒక రోజున పరమ భట్టారకుడితో అజ్జుక ఆచార్య వసుబంధుని గురించి కొన్ని ప్రాశంసా వాక్యాలను పలికింది. అప్పుడు పరమ భట్టారకులు వ్యంగ్యంగా "నీ వెటూ వసుబంధుకు శిష్యురాలి వయ్యావు. ఇక అందర్నీ శిష్యుల్ని చేయాలని చూస్తున్నావు" అన్నాడు. అయినప్పటికీ, పరమ భట్టారకుడికి మనస్సులో వసుబంధును గురించి చాలా గౌరవభావం వుండేది. భట్టారకుని ఆస్థానకవులు, పండితులు కొంతమంది వసుబంధును మహా తార్కికుడు అనీ, సర్వశాస్త్ర నిష్ణాతుడనీ ప్రశంసించారు. హరిషేణుడు—వసు బంధును మహాకవి అని పొగిడారు. భట్టారకుడు స్వయంగా వసుబంధు వద్దకు వెళ్ళి పాటలీపుత్రంలో వుండవల్సిందని ప్రార్థించాడు.

నా చదువును గురించి అజ్జుక ఆరోజు ఏ సమాధానమూ ఈయలేదు. ఆ రోజంతా నా చదువును గురించే ఆలోచిస్తూ గడిపింది. తండ్రికి ఒక్కడినే కొడు కును. తనకు ఒక్కడినే తమ్ముణ్ని. ఆచార్య వసుబంధు యొక్క ప్రభావంలో నే నెక్కడ పడతానో అని అజ్జుక భయం. వారి ప్రభావంలో బౌద్ధభిక్షువు నౌతా నేమోనని ఆమె అనుమానం. కాని నాకు వసుబంధులాంటి గురువు మరి దొరకదని

అజ్జుకకు కూడా తెల్సు. రెండవరోజు వుదయం అజ్జుక నాకు ఉదయపు ఆహారాన్ని తినిపిస్తున్నది. ఆచార్య వసుబంధు దగ్గిర విద్యాభ్యాసాన్ని గురించి ఎలాటి నిర్ణయాన్ని వినిపిస్తుందోనని నా గుండెలు దడదడా కొట్టు కుంటున్నాయి. అజ్జుకే విషయాన్ని ప్రస్తావించింది.

"నాయనా జయా! నువ్వు ఆచార్యులవద్ద విద్యాధ్యయనం చేయాలను కుంటు న్నావా?" అనడిగింది.

నేను నా బుగ్గలను అక్క భుజాలకు రాస్తూ "నువ్వు అనుజ్ఞయిస్తే తప్ప కుండా చదువుకొంటాను. నాన్నగారు కూడా ఆచార్య వసుబంధు వద్ద విద్యా ధ్యయనం చేయవానికి అనుమతించారు!" అన్నాను.

"అవున్నాయనా! అలాటి గురువు దొరకడం దుర్లభం! నిన్నూ నీ మేనల్లుడు చంద్రగుప్తుణ్ణీ వారి దగ్గిర చదివిద్దా మనుకొంటున్నాను. మీ ఇద్దరికీ విద్యాదానం చేయవల్సిందని వారిని ప్రార్థిస్తాను. బహుశః వారు అంగీకరించ వచ్చునని నా అభిప్రాయం."

అజ్జుక ఆదేరోజు ఆచార్యుల వారి వద్దకు వెళ్ళింది. ఈ విషయాన్ని ప్రస్తా వించింది. ఒకచోట కట్టుబడి వుండడం ఆచార్యులవారికి ఇష్టంలేదు. అయినా మా విద్యాధ్యయనానికి, మార్గదర్శకు లవడానికి అంగీకరించారు. వారితో అజ్జుక కూడా ఇలా అన్నది: "భన్తే మీరు ఒకేచోట కట్టుబడి వుండాలని నేను కోరడంలేదు. మీ ఇష్టం వచ్చినచోట వుండండి. ఇక్కడ అశోకారామంలో వున్నాసరే, లేక అయోధ్యలో కాలకా రామంలో వున్నాసరే. అక్కడకాక వైశాలి రాజగృహం—ఎక్కడైనా వుండండి. వీళ్ళిద్దర్నీ మీ శిష్యులుగా వెంట వుంచుకోండి. మీతో వుండి వీళ్ళు కొంతలోకొంత అయినా బౌద్ధమతానికి సహాయకు లౌతారని నా ఆశ!"

ఆషాడపౌర్ణమి వచ్చింది. అద్రేరోజున నేనూ, చంద్రగుప్తుడూ ఆచార్యుల వారివద్ద విద్యాధ్యయనం ప్రారంభించాము. త్వరలోనే మేము మా వయస్సుకు మించిన చదువు చదివాము. మా చదువంతా మాగధీ ప్రాకృతంలో జరిగేది. ఎక్కువగా గద్యం, పద్యం, గణితం, సులేఖ—మొదలైన విషయాలను అభ్యసిస్తూ వుండేవారము. మా సంస్కృతజ్ఞానం అత్యల్పం. కొద్ది గొప్ప మాట్లాడడానికి వచ్చుగాని, పుస్తక పఠనం పూర్తిగా అసంభవం అయ్యేది. ఆచార్య వసుబంధు యెన్నో రోజులవరకూ మా పూర్వజ్ఞానాన్నీ, అభిరుచినీ పరీక్షిస్తూ గడిపారు.

మా విద్యాభ్యాసం చాలా మనోరంజకమైన పద్ధతిలో ప్రారంభమైంది. మా కొరకు ఆచార్య వసుబంధు "సప్త కుమారికా" మొదలైన కథల నెన్నింటినో వ్రాశారు. ఆ కథలను చదువుతూవుంటే మా కేమాత్రం కష్టం అనిపించేది కాదు. మేము కథలను క్రొత్త తాళపత్ర గ్రంథాలను, నూతనమైన సిరా వ్రాతలో చదివే వారము. ఆ కథల మధ్యలో అక్కడక్కడా రమ్యమైన గద్య పద్యాత్మకమైన వర్ణనలు వుండేవి. మొదట ఆ కథలు ఏ ప్రాచీన గ్రంథంనుండి గ్రహింపబడి

నాయో అనుకున్నాము. కాని కొద్దిరోజులు గడిచాక ఆ కథలను ఆచార్య వసుబంధుగారి నూతన కృతులనీ, అవి మా కోసమే రచింపబడినాయని తెల్సింది. క్రొత్త క్రొత్త కథలంటే అజ్జుకకు మాకంటే కూడా చాలా ఇష్టం! ఆ కథల్లో ఒక్క కథాభాగమే కాకుండా, ఉత్తమమైన ఉపదేశాలుకూడా వుండేవి. భాషకూడా సులలితంగా వుండేవి. అజ్జుక వ్రాయసగాండను పిలిపించేది. ఈ కథలకు ప్రతిలిపుల్ని తీయించేది. ఆ లిపులను తనకు పరచితులైన చాలామంది సామంతుల భార్యలకు ధనికులైన వైశ్యుల భార్యలకు పంపుతూవుండేది. అజ్జుక వద్దకు కథలను పంపించవలసింపన్న ప్రార్థనా పత్రాలు అశేషంగా వస్తూవుండేవి. చదువు ప్రారంభించిన ఒకటి రెండు సంవత్సరాల్లోనే వసుబంధు కీర్తి అంతఃపురాలన్నింటిలోనూ వ్యాపించింది. అతి కఠినమైన శుష్కమైన తార్కికపాండిత్యానికిఆచార్యులది పెట్టింది పేరు. అలాటి వారి లేఖినినుండి ఇంత సరసమైన సరళమైన కథాసాహిత్యం ప్రభవిస్తుందని ఎవరనుకొంటారు?

భాష సరళంగా వుండడంవల్ల అర్థం చేసుకోవడానికి మేమే మంత బాధపడేవారం కాము. ఎక్కడయినా మరీ గొట్టుగావున్న వ్యాకరణ నియమాలనుమాత్రం, ఆచార్య వసుబంధు అతి మనోరంజకమైన పద్ధతిలో వివరించి చెబుతూ వుండేవారు. నేను అప్పుడప్పుడు సంస్కృత శబ్దాలకు మాగధీ శబ్దాలకు వున్న దగ్గిర సంబంధాలను పోల్చుకుంటూ వుండేవాడిని. ఒక్కోమాటు ఆ రెండు భాషలకూ వున్న బాంధవ్యాన్ని స్వయంగా గమనించడానికి ప్రయత్నించేవాడిని. నేను పడే ప్రయాసను ఆచార్యులవారు గమనిస్తూ వుండేవారు. ఒకరోజున తాళపత్ర గ్రంథంలో వ్రాసిన కొన్ని కథలను నాచేతికి యిస్తూ "ఇవి చదువు! ఈ కథలు ఆరువందల సంవత్సరాల క్రితమే మాగధీ భాషలో వున్నాయి!"అన్నారు.

మొదట ఆ మాగధిని చూచి చాలా ఆశ్చర్యపడిపోయాను. "ఇదేం మాగధిరా?" అనుకొన్నా. కాని, రెండు మూడు కథలు చదివేసరికి ఆ భాష సులువుగా అర్థమవసాగింది. మరీ అర్థంకానిచోట ఆచార్యులవారి సహాయాన్ని పొందేవాణ్ణి. ఆ భాషను గురించి కొన్నాళ్ళు తీవ్రంగా ఆలోచించాను.

ఒకరోజున ఆచార్యులవారితో ఇలా అన్నాను. "భన్తే (భిక్షూ) ఈ భాష మన వర్తమాన మాగధికి, సంస్కృతానికి—రెండింటికీ దగ్గరలో వున్న దేమిటి?"

ఆచార్యులవారు నవ్వి "సరీగా చెప్పావు నాయనా! ఇది వర్తమాన మాగధీ భాషకు, సంస్కృతానికి–మధ్య భాష!" అన్నారు.

"భన్తే ప్రజలిలా క్రొత్తక్రొత్త భాషలను ఎందుకు ఏర్పరచుకొంటారు? సంస్కృతం వుంది. మన వర్తమాన మాగధివుంది. ఇక నీ మూడవ భాషను సృష్టించవలసిన అవసరం?"

"క్రొత్తభాషను ఎవడో ఒక మనిషి, ఒకచోట కూర్చుని సృష్టిస్తాడనుకొంటున్నావు. ఒకడుగానీ పదిమందిగానీ భాషల్ని సృష్టించలేరు. కొన్ని తరాలూ, తమ జీవిత క్రమంలో భాషల్ని సృష్టించుకొంటూ వెళ్ళిపోతాయి. నీవు రెండువందల సంవత్సరాల క్రితానికి పోయి ఏ యౌధేయ స్త్రీ నయినా పలుకరించావా, ఆమె భాష నీవూ నీ తల్లీ మాట్లాడే భాషలకు చాలా విరుద్ధంగానూ, వ్యత్యాసంగానూ ఉంటుంది."

"అయితే ఆర్యా! భాషలు పరివర్తన చెందుతుంటాయంటారా?"

"నాయనా! ప్రపంచంలో వుండే ఏ వస్తువూ పరివర్తన చెందకుండా వుండ లేదు. నేనూ ఒకప్పుడు చిన్ని కుర్రవాడిగా వుండేవాణ్ణి. తరువాత నీలాగా యౌవ నాంగణంలోకి అడుగుపెట్టాను. శరీరం దృఢమైంది. నూనూగు మీసాలొచ్చాయి. భుజాలు బలిష్టమైనాయి. తరువాత చీకట్లో పొంచివున్న దొంగలా, వృద్ధాప్యం క్రమంగా యింటిని (నన్ను) స్వాధీనం చేసుకొన్నది. ఇప్పుడు నా ఆకారాన్ని చూస్తున్నావు కదా? నోట్లో పండ్లులేవు. మాడుమీద నాలుగు వెంట్రుకలు మాత్రమే మిగిలాయి. కండ్లకాంతి మందగించింది. ఎక్కువసేపు చదవలేను. ఇక నడుములు వంగడానికి సిద్ధంగా వున్నాయి. చూశావా? బాల్యంనుడి వృద్ధాప్యం వరకూ ఎంత పరివర్తన జరిగిందో?"

"ఆర్యా! అసలు వృద్ధాప్యమే లేకపోతే ఎంత బావుంటుంది?"

"అంటే నీ అభిప్రాయం? నీవు ఎల్లకాలం శిశువుగానో, కుర్రవాడిగానో, యువకుడిగానో ఉండాలనుకొంటున్నావా?"

"శిశుజీవితం చాలా పరతంత్రంలో గడుస్తుంది. కుర్రతనం కూడా అంత వాంఛింపదగింది కాదు!"

"ఐతే, నీవు సదా యువకుడిగా వుండాలని కోరుకుంటున్నావన్నమాట?"

"ఔను!"

"మరి యువకుడిగానే పుట్టాలను కొంటున్నావా?"

నేను కొంచెం ఆలోచనలో పడ్డాను. ఆచార్యుల వారిలా అన్నారు: "యువకుడిగా పుట్టేవారికి, తల్లి అవసరం వుండదు. అసలు యువకుడి శరీరాన్ని తల్లి తన గర్భంలో ఎలా భరించగలదు?"

"అంటే ఇక నప్పుడు ఎవరికీ తల్లి వుండదంటారు?"

"ఔను. ఇక ఎవ్వరూ తల్లిప్రేమను అనుభవించలేరు. తండ్రి వాత్సల్యం కూడా ఇక ఎవ్వరికి లభించదు. అన్నల స్నేహం, చెల్లెళ్ళ మమత, రక్తబంధువుల సౌహార్దత—ఇక ఎవ్వరికీ లభించవు."

"ఐతే ఆర్యా! ప్రపంచం చాలా నీరసంగా, మమతా రహితంగా వుంటుందనుకొంటాను!"

"అవును చాలా నీరసంగా వుంటుంది. స్నేహం, మమతా, ప్రేమ–ఇవేవీ వుండవు! తల్లిదండ్రుల్లో పుత్రుల్ని కనాలనే కోర్కె అంతరించిపోతుంది. అత్యంత ప్రాచీన కాలంలో మనం ఎలా పుద్భవించామో, అలాగే వుంటాము. ప్రపంచ విలయమో, ప్రళయమో సంభవించి అంతా ధ్వంసం అయ్యేవరకూ అలాగే మేకుల్లా వుండిపోతాము! ఈ విశ్వంలో ఏ ఒక వస్తువో స్థిరమై మిగిలినవన్నీ జంగమావస్థను పొందుతాయనుకోవడం కూడా పొరపాటు! యౌవనం స్థిరమైనప్పుడు, దృశ్యమాన ప్రపంచంలోని ప్రతివస్తువుకూడా తన సహజ పరివర్తనను విడనాడి, అచంచలమై, స్థిరమైపోతుంది!"

"ప్రతి వస్తువూ స్థిరమౌతుందా? అచంచలమౌతుందా?"

"ఔను! పరివర్తన లేకపోవడమనేది ఒక్క యౌవనం వరకే వుండదు. ఈ రోజున పరివర్తన విశ్వనియమం. మరి అప్పుడు ఆ అపరివర్తన విశ్వనియమం అవుతుంది! ఎల్లకాలం వసంతరుతువో, గ్రీష్మమో. లేక వర్షరుతువో వుంటుంది."

"ఐతే, ఆర్యా! జీవితంలో అసలు క్రొత్తదనమే లేకుండా పోతుందేమో?"

"అంతేకాదు. సౌందర్యంకూడా వుండదు. క్రొత్తదనానికి మరొక పేరు సౌందర్యం! క్రొత్తదనం మనస్సుని ఆకర్షిస్తుంది. హేమంతం తరువాత వసంతం వస్తుంది. చెట్లకు క్రొత్త ఆకులూ, పూలూ కనిపిస్తాయి. గాలి కమ్మని వాసనలను వెదజల్లుతుంది.... ఆ స్థితిలో ఇవన్నీ మృగ్యమౌతాయి!"

"కానీ ఒక లాభం వుంది. పరివర్తన లేకపోతే మనం చనిపోవడం కూడా వుండదుగా! ఆర్యా!"

"మృత్యువుకు భయపడుతున్నావా."

"నాకు మృత్యువంటే భయంలేదు. కానీ, మన ప్రియమిత్రులూ–బంధువులూ—మృత్యువాత పడ్డప్పుడు కలిగే ఆత్మవేదనను ఆలోచించండి?"

"ఔను, మృత్యువు చాలా అప్రియమయిందని నేనూ ఒప్పుకొంటాను. కానీ, మృత్యువు లేకపోతే క్రొత్తదనం కూడా వుండదు. నీవు చనిపోయిన వాళ్ళను గురించి ఎందుకు విచారించడం? మన మధ్యన ఉద్భవిస్తున్న క్రొత్త జీవితాలను స్ఫురణకు తెచ్చుకో! చిన్ని, చిన్ని – క్రొత్త క్రొత్త కాళ్ళూ–చేతులూ, ఊహలూ, మసలాగానే వాళ్ళు ఈ ప్రపంచంలో వదిలిపోయే అతి నూతనమైన కృతులు. ఎంత అద్భుతం.... ఆనందం! మృత్యువు లేకపోతే పుట్టుక కూడా వుండదు నాయనా!"

"మీరు చెప్పింది నిజమే అయినప్పటికీ, నాకు మృత్యువు ప్రియమైనదిగా కనిపించలేదు, ఆర్యా!"

"ఆ విషయాన్ని నేనూ చెబుతూనే వున్నానుకదా? మృత్యువు ప్రియమైనది ఎటూకాదు. కానీ, అదొక నవజీవనానికి, సందేశ వాహకమై వస్తున్నదన్న విషయాన్ని మరువరాదు! నది, తన ఉద్గమ స్థానంలో చాలా చిన్నదిగా, మలిన

మైనదిగా వుంటుంది. కాని, ముందుకు పోయినకొలది ధార విస్తృతమౌతుంది. స్వచ్ఛతవస్తుంది. వేగంకూడా హెచ్చుతుంది. మరి ఆ నదిని ఉద్గమ స్థానంలోనే ఆపివేసినట్లయితే, ధార క్షీణమై మలినమై-ఎండిపోవడమే జరుగుతుంది!"

"ప్రవాహం వల్లనే నదియొక్క వేగం, శుద్ధత హెచ్చుతాయని ఒప్పు కొంటాను."

"ఈ గతిశీలతవల్లనే, ఈ పరివర్తనవల్లనే ప్రపంచం ఇంత అందముగా, మనోహరంగా కనుపిస్తోంది. ఆకలిలేని మానవుడికి ఏ వంటకమూ రుచించదు. అలాగే, పరివర్తన లేకపోతే ఈ విశ్వమే అనాకర్షణీయం అవుతుంది. ఈ మహా విశ్వం యొక్క అతి ప్రధానమైన నియమం పరివర్తన. పరివర్తన ప్రతి క్షణం అణువణువులోనూ, నీలోనూ నాలోనూ కూడా జరుగుతూనే వుంది. సంస్కృతం కంటే మాగధీభాష తక్కువ మధురంగా వుందా?"

"అలాటి దేమీలేదు. ఆర్యా! నావరకూ నాకు సంస్కృతం కంటే మాగధీ భాషే ఎక్కువ సరసంగానూ, మధురంగానూ వుంది! ముఖ్యంగా భాసుడు, సౌమిల్లుడూ రచించిన కవిత్వాలు అతి మధురంగా వుంటాయి."

"అందువల్లనే పరివర్తన అందరూ అనుకున్నంత చెడ్డదేమీ కాదు. పైగా ఆ నియమాన్ని మార్చడం, లేక ఆపడం ఎవ్వరి వశమూకాదు. కనుక నవ వసంతాన్ని, కోయిల కూతలను, తుమ్మెద పాటలనూ—ఎంత ఆసక్తిగా ఇష్టంగా ఆహ్వానిస్తామో, అంతే ఇష్టంగా సహజంగా ప్రతి నూతనమైన పరివర్తననూ ఆహ్వానించాలి. పరివర్తనలో మానవుల వికాసం, అభివృద్ధి, అభ్యుదయం— దాగివున్నాయి! పరివర్తన ఆగిపోయిననాడు ఏ వికాసాన్నీ మనం చూడలేము!"

ఆచార్యులవారు ఇలా నాకు భాషల పరివర్తనను గురించి చెబుతూ వున్నప్పుడు బుద్ధుడు కూడా ఇదే సిద్ధాంతాన్ని ప్రపంచానికి చాటాలను కున్నాడన్న విషయం నాకు తెలియదు. ఈ ప్రపంచం క్షణక్షణానికి మార్పు చెందుతూ వుంటుం దన్న విషయం నాకిప్పుడు స్పష్టం కాసాగింది. నేను అశోకుడి ఆస్థాన మండపాన్ని చూశాను. ఇప్పటి ఆస్థాన మండపాలకు, అతడి ఆస్థాన మండపానికి చాలా వ్యత్యాసం వుంది. నేను మహాబోధి వజ్రాసనరోని [బోధగయ] పాషాణవేష్టని కూడా చూశాను. దానిమీద చెక్కబడివున్న స్త్రీ పురుషుల ప్రతిమలను చూశాను. అప్పటి స్త్రీల అలంకరణ ఇప్పటి స్త్రీల అలంకరణకు పూర్తి భిన్నంగా వుండేది. కుండలాలు, హారాలు అన్నిటిలోనూ కొంత పరివర్తనా, వ్యత్యాసమూ కని పిస్తుంది. కంకణాలూ, నూపురాలు అప్పటికింకా ప్రచారంలోకి రాలేదనుకుంటాను. వాటిస్థానంరో కాళ్ళకూ, చేతులకూ వత్తుగా గాజులను వేసుకొనేవారు. వస్త్రాలు కూడా మరొకరకంగా వుండేవి. తలగుడ్డలు కూడా అదోలా చుట్టుకొనేవారు. ఆ రోజుల్లో స్త్రీలుకూడా తలగుడ్డ చుట్టుకొనేవారు.

ఆచార్య వసుబంధు అశ్వఘోషుని మహాకావ్యాలను కొన్నింటిని చాలా యిష్టంగా చదివించారు. "బుద్ధచరిత", "సౌందరనంద" చాలా ఆనందంతో, ఆస క్తితో చదివేవారము. నా గొంతు చాలా మధురంగా వుంటుందని ప్రతీతి. పరమ భట్టారకులు వీణావాదనంలో సిద్ధహస్తులు. కనుకనే ప్రతివారం, పదిరోజులకు ఒక మాటు అంతఃపురంలో సంగీత మహోత్సవాలను జరుపుతూండేవారు. నేనూ ఆ ఉత్సవాలలో పాల్గొనాలని తహతహలాడుతూ వుండేవాడిని. వీణావాద్యంలో నేనూ ప్రవేశాన్ని కల్పించుకోవాలని ఆరాటపడుతూ వుండేవాణ్ణి. నాకు పదమూడవ ఏట జరిగిన ఒకవిషయం బాగా జ్ఞాపకం.ఒకరోజునస్వయంగా వీణ వాయిస్తూ అతి మధుర మైన గీతాన్నొకదాన్ని ఆలాపించాను. గీతం చాలా బాగుందని అంతఃపురంలో గుసగుసలు బయలుదేరాయి. ఈ గుసగుసలు ఎక్కడ పరమ భట్టారకుని చెవిని పడ తాయోనని చాలా భయపడ్డాను. వారి చెవినిపడితే, ఒకదాని తరువాత ఒకటిగా పాటల్ని వినిపించమని బలవంతం చేస్తారు. ఇక నేను వసుబంధు వద్దకు జ్ఞానో పార్జనకు వెళ్ళడానికి అవకాశమే లభించదు. ఆ తరువాత చంద్రుడు మరి ఒకరిద్దరు ఆత్మీయుల దగ్గరకాక, ఇతర్లవద్ద ఎన్నడూ పాటపాడి ఎరుగను. కాని, నేను పాటలీపుత్రంలోని ఒక సంగీతాచార్యుని వద్దకుపోయి ఆ విద్యతో నాకువున్న పరిచ యాన్ని పెంపొందించుకోవడం మాత్రం మానలేదు.

ఎప్పుడైనా ప్రాచీనాధునాతన శిల్పఖండాలను చూడడం జరిగితే వాటిమీద నాలో ఓ స్వాభావికమైన ఆకర్షణ, అభిరుచి కలుగుతూ వుండేవి. చిత్రకళలో ఉప యోగించే మనోహరమైన రంగులుకూడా నన్ను బాగా ఆకర్షించేవి. అజ్ఞాక పరిచా రిక చతురిక చిత్రకళలో ఉత్తమమైన ప్రవేశం కలది. ఆమె చిత్రాలను చిత్రిస్తూ వుంటే నేను చూస్తూ వుండేవాణ్ని. మొదట వస్త్రాన్ని పరిచేది. దానికి ఒకరక మైన మృదులేపనాన్ని పూసేది. నీడలో ఆర్చి, తరువాత తేలికైన రంగుల్లో సన్నని రేఖద్వారా శరీరపు వివిధ అవయవాలను చిత్రించేది. ఆ మీదట ఎన్నో రోజులు ఆ రేఖలకు తగిన రంగుల్ని నింపుతూవుండేది. నేనంటే చతురికకు ఎంతో యిష్టం. పరమ భట్టారికకు (భట్టారకుని భార్య) తమ్ముణ్ని అవడమేకాక, నాలోని సహజత్వాన్ని, సరళత్వాన్ని చూసికూడా చతురిక నావైపు ఆకర్షింపబడ్డది! శ్వేత వస్త్రంమీద, మనోహరంగా ఉద్భవించే స్వేతారుణిమ నేత్రద్వయాన్ని చూస్తూ, విస్మి తుణ్ణవు తుండేవాణ్ని. మొదట సూక్ష్మమైన ఎర్రనిరేఖ, కన్ను సొట్టలయొక్క హెచ్చుతగ్గులు, తరువాత అర్ధనిమీలిత నేత్రద్వయం-కనురెప్పలు, కనుపాపలు, క్రమంగా సన్నని రక్తప్రస్రవములైన ఎర్రని రక్తతంతువులు; చివరకు మనోహర మైన శ్వేతవర్ణం-మొత్తంమీద చూస్తూవుండగానే విస్ఫారితమైన సుందరనేత్రాలు నా కండ్లముందు సృష్టించబడేవి. చిత్రాల్ని చిత్రించేప్పుడు చతురిక చాలా తన్మ యతను పొందేది. ప్రపంచాన్నే మరచి, చిత్రరచనలో లీనం అయ్యేది. నా బస చాలా ప్రశాంతంగా వుండేది. ప్రమదావనంలోగానీ, క్రీడా పర్వతంమీదగానీ——

మరెక్కడగాని, అంతటి ప్రశాంతత లభించడం దుర్లభం. అందువలన చతురిక నా బసలో తన చిత్ర రచనను కొనసాగించేది. పైగా నా ఉనికి వలన తోటి సఖీజనం యెవ్వరూ రావడానికి సాహసించరు. ఈ విధంగాకూడా చతురిక యొక్క ఏకాంతతకు భద్రత లభించేది. చతురిక యొక్క చిత్రరచనను చూస్తున్న కొలదీ నాకూ చిత్రరచన చేయాలన్న ఆసక్తి కలగసాగింది. కాని, చిత్ర రచనలో చతురికకు లభించినటువంటి సమగ్రత నాకు లభించలేదు. అయినప్పటికీ, కనీసం చతురికకు చూపించడానికైనా కొన్ని బొమ్మల్ని గీద్దామనుకొన్నాను. అదే ఉద్దేశంతో కొంతమంది శిల్పులను కూడా కలుసుకొన్నాను. ప్రవీణులైన తక్షులు కొంత మంది చందనకాష్ఠంమీద అతి సుందరమైన బొమ్మల్ని చెక్కడం చూశాను. మరి కొంతమంది దంతం పనివారిని చూశాను. వారి వారి కళాఖండాలనుండి ప్రోత్సాహాన్ని పొందాను. ఈ మూడు విధాలైన శిల్పపద్ధతుల్లో ఏదో ఒకదాంట్లో ప్రావీణ్యతను పొంది యేదో ఒక ఉత్తమ కృతిని నిర్మించి, చతురికను చకితను చేయాలని నా వూహ. రహస్యంగా ప్రస్తర శిల్పుల (రాతిమీద బొమ్మల్ని చెక్కేవారు) దగ్గరకు పోసాగాను. వసుబంధు దగ్గిర జ్ఞానోపార్జన చేయడమే నా ప్రధాన లక్ష్యం. కానీ ఆచార్య వసుబంధువద్ద అధ్యయనానికి పోను మిగిలిన సమయాన్ని చంద్రుడి మాదిరి ఆటపాటల్లో గడపక,శిల్పకళను అభ్యసించడంకొరకు వినియోగించసాగాను. వెనుకటిలా మా మైత్రిని తిరిగి కొనసాగించడానికి చంద్రుడు ఎన్నోవిధాల ప్రయత్నించాడు. అయినప్పటికీ యేవో కొన్నిప్రత్యేకమైన సమయాల్లోగాని నేనతణ్ని కలుసుకోవడం జరిగేదికాదు. మొదట చెక్కమీద, తరువాత దంతంమీద, చివరకు రాతిమీద శిల్పకళను అభ్యసించడం ప్రారంభించాను. ఎందుకూ పనికిరాని శిలాఖండాలు నా వ్రేళ్ళనుండి ఆకారాన్ని పొంది, అనుకున్నవిధంగా సుందరరూపాల్లో అవతరించడం జరిగినప్పుడు నా ఆనందానికి మితిలేకపోయేది. కొంత గర్వంకూడా అనుభూతికి వచ్చేది. ఇలా నాలుగైదు సంవత్సరాలు గడిచాయి. ప్రతిరోజూ సాయంకాలం కొన్నిఘడియలు ఎవ్వరికీ కనిపించకుండా అదృశ్యుణ్ణవుతుండేవాణ్ణి. నేను బాగా శిల్పకళను అభ్యసించాను. అప్పుడొక యవన శిల్పాచార్యుణ్ణి గురించిన వివరము తెల్సినది. అతడు మానవ ఆకారాలను యథాతథంగా రాతిలో మలచగలడుట. మధుర శిల్పకారుల శిల్పకళ చాలా గొప్పదని ఒప్పుకోక తప్పదు. వస్త్రాల మడతలు ఇతర సూక్ష్మాతి సూక్ష్మమైన వివరాలను మధుర శిల్పులు తమ కృతుల్లో చూపగలరు. కాని, వారి శిల్పకళ సహజమైనదికాక, కాల్పనికమైనదై వుంటుంది. యథార్థ మానవుని సహజమైన ఆకారాన్ని వారు రాతిలో పొందుపరచలేదు.నే నొక రోజున యవన శిల్పాచార్యుడి వద్దకు పోయాను. అప్పుడు మధుర శిల్పాచార్యుడు కూడా నావెంట వున్నాడు. అప్పుడు అక్కడ అసంపూర్ణంగా చెక్కబడిన పరమ భట్టారకుని ప్రతిమ నొకదాన్ని చూశాను. కాని, ఆ పాలరాతి విగ్రహంలో కండ్లూ, ముక్కూ, వెంట్రుకలు—అతి సహజంగా చెక్కబడినాయి. ఆ అసంపూర్ణ విగ్ర

హంలో భట్టారకుని పోలికల సారూప్యాన్ని చూచి చకితుణ్ణయ్యాను. ఆ విద్య నాకు వస్తే ఎంత బాగుండును. చతురికను చకితను చేయవచ్చు కదా? అనుకున్నాను. ఆ యవన శిల్పాచార్యునియొద్ద శిష్యుడిగాజేరాను.నేను చెక్కిన బొమ్మలనూ వయసునూ ఉత్సాహాన్నీ చూచి ఆ యవనాచార్యుడు తేలికగా నన్ను తన శిష్యవర్గంలో చేర్చుకున్నాడు. నేను నా నిజమైన పరిచయాన్ని వారికి ఈయలేదు. ఇందువలన, కొన్ని నెలల వరకూ, నా ఇతర విద్యాభ్యాసాలకు కొంత అభ్యంతరం కలిగింది. ఐతే, ఆచార్య వసుబంధువద్ద అధ్యయనాన్ని మాత్రం మానలేదు. వారి అధ్యయనానికి పోను మిగిలిన సమయాన్ని ఈ శిల్పకళ నేర్చుకోవడానికి ఖర్చుపెట్టేవాడిని! యవనాచార్యులు మొదటగా సజీవమైన ఆకారాలకు ప్రతిరూపాలను నిర్మించడం నేర్పారు. ముందు తడిమట్టితో ఈ నిర్మాణ పద్ధతిని అభ్యసించాలి! ఇది చాలా కష్టమైన పని. ముఖాకృతిలోని అతి సూక్ష్మమైన వ్యత్యాసాలనుకూడా మట్టిలో సృష్టించవలసి రావడంవలన–ఒక్కోచోట మట్టిని తీయవలసి వస్తుంది. మరొకచోట మట్టిని చేర్చవలసి వస్తుంది! ఇంతకంటే పోగరతో రాతిమీద ఆకారాన్ని చెక్కడమే నా వరకూ నాకు బహుతేలిక అనిపించింది. నేను మొదటగా ఒక్క అడుక్కునేవాని విగ్రహాన్ని నిర్మించాను. దాన్నిచూసి ఆచార్యులవారు "సాధు సాధు" అన్నారు. నేను పరమానందభరితుణ్ణయ్యాను. చతురిక నా ఆవాసానికి వచ్చి గంటల తరబడి నిమీలితయై విరహిణి చిత్రాన్నొకదానిని చిత్రిస్తున్నది. ఆ సమయంలో నేను గవాక్షానికి అవతలగా కనుపించకుండా వుండి, చతురికయొక్క ఆకారాన్ని మట్టితో ఆవిర్భవింపచేయసాగాను. కొన్ని రోజుల అనంతరం నా ఆవాసంలోకి చతురిక యొక్క పాలరాతి విగ్రహం వచ్చింది. చతురికను ఒకేసారి ఆశ్చర్యపరచాలని నా ఉద్దేశ్యం. కొద్ది రోజుల వరకూ ఆ విగ్రహాన్ని అలాగే గుడ్డకప్పి వుంచాను. చతురికను చకితను చేయడం ఎలాగా అనీ కొద్దిరోజులు ఆలోచించాను. చివరకు, గూని కుభరకుడు జ్ఞప్తికి వచ్చాడు. ఆరోజు వెన్నెల రాత్రి. కుభరకుడు క్రీడా పర్వతం వైపు చూస్తూ కూర్చున్నాడు. "ఏం? ఇంతవరకూ అప్సరస రాలేదా?" అన్నాను నేను.

"కుభరకుడిమీద నేను కొంచెం అధికంగానే సానుభూతిని ప్రదర్శిస్తూ వుండేవాడిని. అందువలన నేనంటే అంతగా భయపడేవాడుకాదు. నా పై ప్రశ్నకు సమాధానంగా ఒక పెద్ద నిశ్వాసను విడిచి యథామౌనాన్ని స్వీకరించాడు. నేనిలా అన్నాను: "కుభరకా! మన ఇద్దరి అదృష్టం ఒకేలా వుంది! నీవు ప్రేమించిన స్త్రీ ఆకాశంలో విలీనమైంది! నేను ప్రేమించిన స్త్రీ పాషాణ ప్రతిమ అయింది!"

కుభరకుడు నన్ను ఏవేవో ప్రశ్నలు వేశాడు. నేను మౌనంగా అతడిని నా ఆవాసంలోకి తీసుకుపోయాను. పాలరాతి ప్రతిమను చూపుతూ— "ఈమెకూడా ఒకప్పుడు అప్సరసే! నన్ను ఎంతగానో ప్రేమించింది. ఇలా మారిపోయింది. ఇప్పుడీ పాషాణ ప్రతిమతో ప్రేమకు స్థానమెక్కడ?" అన్నాను.

"ఐతే, నాలాగానే మీకుకూడా రాత్రిళ్ళు నిద్ర రాదనుకుంటాను?" అన్నాడు కుభరకుడు.

"నిద్ర ఎక్కడ వస్తుంది కుభరకా! ఒకే ఒక ఆశమీద ప్రాణాలను నిలుపుకున్నాను. ఆ ఆశకూడా లేకపోయినట్లయితే ఏనాడో ఆత్మహత్య చేసుకునేవాణ్ణి. ఈ పాషాణి తిరిగి అప్సరసకావడానికి ఒక మార్గం వుంది. ఎవరైన సుందర యువతి తన చిత్ర రచనకు ఉపయోగించే తూలికతో ఈ పాషాణ ప్రతిమను స్పృశిస్తే, ఈ ప్రతిమ తిరిగి జీవాన్ని పొంది, అప్సరస అవుతుంది. లేకపోతే నిన్నా క్రీడా పర్వతం ఎలా బాధిస్తున్నదో, అలాగే నన్నీ పాషాణ ప్రతిమకూడా అహర్నిశలూ వేధిస్తూ వుంటుంది!" అంటూ ఉండగానే నా గొంతు రుద్ధమైంది. కుభరకుడు నాకు ధైర్యాన్ని యిస్తూ "విచారించకండి! ఫరవాలేదు. పరమభట్టారిక యొక్క సఖీజనంలో చాలామంది చిత్రకారిణులు వున్నారు" అన్నాడు.

"ఐతే, అందరికీ చూపించి పరిహాసాల పాలుకావడం నాకు ఇష్టంలేదు!" అన్నాను.

"భర్తృదారకా! నాకు మీ బాధ అర్థమౌతుంది. నేనూ అనుభవిస్తున్నాను గదా!"

"కుభరకా! ఈ విషయాన్ని ఎవ్వరికీ తెలియనీయకూడదు. నేను ఆవాసంలో లేని సమయంచూచి, ఒక మంచి అందమైన తరుణిని తీసుకొనివచ్చి ఈ ప్రతిమను స్పృశింపచేయి. నీవు చేసిన ఈ మహోపకారాన్ని ఎన్నటికీ మర్చిపోను!"

రెండవ రోజు ఉదయాన నేను చాటున వుండి చూసిన దృశ్యం—చతురిక పాషాణ ప్రతిమను పరిశీలనగా చూస్తూవుంది. కుభరకుడు ఆమె చేతికి తూలికను ఇచ్చి స్పృశించమని బలవంతం చేస్తున్నాడు. అదే సమయంలో నేను కుభరకుడి కంటబడ్డాను. "భర్తృదారకా! చతురిక స్పృశించడంలేదు. నీవైనా చెప్పు!" అన్నాడు కుభరకుడు నన్ను ఉద్దేశించి.

నాలుగు కల్ల బొల్లి మాటల్ని చెప్పి కుభరకుణ్ణి అవతలకు పంపించివేశాను. ఇకనక్కడ నేనూ, చతురిక మాత్రమే వున్నాము. చతురిక నన్నేమో అడగాలనుకొన్నది. ఆమె అడగడానికిముందే నేనిలా చెప్పాను: "యవన శిల్పి ఒకడు ఈ విగ్రహాన్ని తమ దేశాన్నుండి తీసుకువచ్చాడు. చాలా ప్రయత్నించి బలవంత పెట్టిన మీదట వెయ్యి దీనార్లకు దీన్ని నాకు అమ్మాడు."

చాలా రోజులవరకు చతురిక ఆ పాషాణ ప్రతిమను నిజంగా వెయ్యి దీనార్లకు కొన్నాననుకొన్నది. కానీ, ఆమె స్నేహితురాండ్రు పోలికల్ని గుర్తుపట్టారు. ఇకనప్పుడు చతురిక అసలు రహస్యం ఏమిటని అడిగింది. నేనిలా చెప్పాను: "ఈ కళమీద నాలో నీవు అభిరుచిని కల్పించావు. అందుకు కృతజ్ఞతగా ఈ నీ రూపాన్ని ....కానీ, ఈ రహస్యాన్ని ఎవరికీ చెప్పకు!"

"నీ విగ్రహాన్ని ఎవ రుచెక్కారని నా స్నేహితురాండ్రు అడిగితే ఏం చెప్పను?"

"ఇలా చెప్పు! 'ఒకనాటి సాయంకాలం నేను గంగాతీరంలో కూర్చుని క్రొత్త చిత్రాన్నొకదాన్ని గురించి తన్మయంగా ఆలోచిస్తున్నాను. అప్పుడే నా ఆకారాన్ని ఎవరో స్వీకరించారు' అను!"

"మరి ఆ యవన శిల్పాచార్యుడి దగ్గిరకు వెళ్ళి ఎవరైనా అడిగితేనో, అప్పుడు రహస్యం బయటపడదా?"

"అతడు పాటలీపుత్రాన్ని వదలి వెళ్ళిపోయాడు!"

నాకు సంగీతము, శిల్పము అంటే ప్రతేకమైన అభిమానమూ అభిరుచీ పున్నాయి. అయినా వాటికోసం యెక్కువ సమయాన్ని ఖర్చుచేసేవాణ్ణి కాదు. నా ఎక్కువ సమయాన్ని ఆచార్య వసుబంధు వద్దనే గడిపేవాణ్ణి. ఆచార్య వసు బంధు అజ్జుకతో నా అధ్యయనాన్ని గురించి చాలా ప్రశంసాత్మకంగా చెప్పారు. అజ్జుక చాలా సంతోషించి, అదే విషయాన్ని లేఖ ద్వారా మా నాన్నగారికి తెలియ చేసింది. నాన్నగారు నన్ను చూడాలన్న తమ అభిలాషను వ్యక్తపరిచారు.

# రా జ కు లం

ఇప్పుడు చంద్రుడికీ, నాకు పదిహేనేళ్ళ ప్రాయం వచ్చింది. అతడు సాహిత్యాన్ని చాలా ఆసక్తిగా చదివేవాడు; కాని, ఇతర లలిత కళలు శిల్పం, సంగీతం మొదలైన వాటిమీద నా అంత ఆసక్తి అతడికి లేదు. ఒక్క అభినయంలో మాత్రం చంద్రుడికి కొంత అభిరుచి వుండేది. ఆచార్య వసుబంధు మాచేత అశ్వఘోషుని "సారిపుత్ర ప్రకరణం," "రాష్ట్రపాల-పరిపుచ్ఛ" మొదలైన నాటకాలను చదివించారు. ఆ నాటకాలను చదివిన తరువాతనే చంద్రుడిలోని అభినయంమీది అభిరుచి తీవ్రమైంది. "రాష్ట్రపాల-పరిపుచ్ఛ" నాటకాన్ని అభినయించాలని నిర్ణయించుకున్నాడు. నెలల తరబడి పరదాలు, ఇతర పరికరాలూ తయారయ్యాయి. చివరకు పాత్రల నిర్ణయం దగ్గిర సమస్య ఉద్భవించింది.

"పోనీ, రాష్ట్రపాల పాత్రని నువ్వే ధరించు !" అన్నాను చంద్రుణ్ణి వుద్దేశించి.

"మరి నాయికాపాత్రో?" చంద్రు డడిగాడు.

"చతురిక బాగుంటుందనుకుంటాను."

"కాని, చతురిక నాయిక పాత్ర ధరిస్తే, నేను వైరాగ్యాన్ని చక్కగా అభినయించ లేక పోతాను!"

చాలా రోజులపాటు అభ్యాసం జరిగింది. ఒకరోజున యువరాజు చంద్రగుప్తుడి రాజ్యప్రాసాదంలో నాటకాభినయం జరిగింది. యువరాజు భట్టారక రామగుప్తుడు కూడా వచ్చాడు. అజ్జుకను ఆహ్వానించలేదు. అందుకు ఒక ప్రధానమైన కారణంకూడా వుంది. చంద్రగుప్తుడు మూలగ్రంథంలో తన అభిరుచిని అనుసరించి చాలా మార్పులు చేశాడు. నాటకాన్ని అత్యధికంగా శృంగార రస ప్రధాన మైనదిగా చేశాడు. అందువల్లే అజ్జుకను ఆహ్వానించలేదు. రాష్ట్రపాలుడి పాత్రను నేను ధరించాను! చంద్రగుప్తుడు రాష్ట్రపాలుడి తండ్రిగా అభినయించాడు. నాయిక పాత్రను చతురిక ధరించింది. ఇతర పాత్రలను మరి కొంతమంది యువతీ యువకులు ధరించారు. మహాశ్రేష్ఠి కుమారుడు రాష్ట్రపాలుడు అనేక సంవత్సరాల తరువాత భిక్షువువేషంలో భిక్షను అడుక్కొంటూ తన ఇంటిముందుకే వచ్చాడు. తల్లి కుమారుణ్ణి కాషాయవస్త్రాల్లో చూసి మండిపడి ఇలా అన్నది: "ఈ శ్రమణులే [బౌద్ధ భిక్షువులే-తల్లి రాష్ట్రపాలుని గుర్తుపట్టలేదు. మామూలు భిక్షువు అనుకొన్నది] నా

కుమారుడి మతి చెడగొట్టారు. మీరు మహాక్రూరులు!" ఇకనక్కడ భిక్ష దొరుకుతుందన్న ఆశ ఎక్కడిది? రాష్ట్రపాలుడు తనసహజ ప్రసన్నవదనంతో ముందుకు నడవబోయాడు. ఇంతలో ఇంటిదాసి రాత్రి వండిన చద్ది పదార్థాలనుబయటపారేయడానికి వచ్చింది. భిక్షువు రూపంలో వున్న రాష్ట్రపాలుడు "భగినీ! వృధాగా పారేయడం దేనికి? నా పాత్రలో పడేయి!" అన్నాడు. దాసి రాష్ట్రపాలుడి గొంతును పోల్చుకొని తండ్రికి చెబుతుంది. తండ్రి వచ్చి చూస్తాడు. కొడుకును గుర్తుపట్టి ఇంటికి రమ్మంటాడు. ఈ మొత్తం ఘటనలను నేను చక్కగా అభినయించగలను. ఎక్కడ రసభంగం అవుతుందోననిచాలా జాగ్రత్తగా అభినయించాను కూడాను! కాని, చంద్రగుప్తుడు ఈ వేషాన్ని, ఈ పాత్రను—నాకంటే కూడా చక్కగా అభినయించగలడు. చివరి దృశ్యం అభినయించడం చంద్రుడికీ, నాకూ అసాధ్యమే అనిపించింది. మరుసటి రోజున రాష్ట్రపాలుణ్ణి తన ఇంటికి భిక్షకు ఆహ్వానించాడు తండ్రి. రాష్ట్రపాలుని ముందు బంగారు పళ్ళాల్లో పదార్థాలు వుంచబడినాయి. తల్లి రత్నాభరణాలను కోడలిముందుపెట్టి ఇలా అన్నది: "అమ్మా! నీ భర్తను ఆనంద పరచడానికి ఈ సువర్ణ రత్నాభరణాలను, పట్టువస్త్రాలను ధరించు తల్లీ!" అన్నది. ఈ క్రొత్త అలంకరణతో చతురిక సౌందర్యం ద్విగుణితమైంది. చతురిక ఉచితంగా సిగ్గును అభినయిస్తూ రాష్ట్రపాలుని వద్దకు వచ్చి—"మీరు తపస్సు చేసేది స్వర్గంలో అప్సరసల సహచర్యం కోసమే కదా? వాళ్ళు నాకంటే అందంగా వుంటారా?" అన్నది.

రాష్ట్రపాలుడు పూర్తి వైరాగ్యాన్ని ప్రదర్శిస్తూ "నేను అప్సరసల కోసం తపస్సు చేయడంలేదు, సోదరీ!" అన్నాడు.

రాష్ట్రపాలుడి వేషంలో పై మాటల్ని అన్నప్పుడు నా గుండెలు ఒక్కమాటుగా గతుక్కుమన్నాయి. నేను చతురికను ప్రేమిస్తున్నాను. అందువల్లనే పై మాటల్ని అంటూ వుంటే నా గుండెలు తెలియని బాధతో ఆక్రందించాయి. కాని నా బాధనుగానీ, భావాన్నిగానీ చతురిక అర్థం చేసుకొన్నట్టుగాలేదు. ఆమె అంతఃపుర దాసి. భట్టారకుడు, భట్టారకుడి సమహోదాలోని పురుషుల ప్రేమ ఆమెకు సులభసాధ్యం! ఇక నా ప్రేమను గమనించవలసిన అవసరం ఏముంది? ఏదో ఒకలా నాటకం పూర్తయింది. నాటకం జరుగుతున్నంతసేపు ఎక్కడ పొరపాటుగా అభినయిస్తానోనని ప్రాణాలను అరచేతుల్లో పెట్టుకున్నాను. నాటకం ఉత్తమంగా అభినయింప బడిందని ప్రశంసల నందుకున్నాను. అయినా, చంద్రుడికి సంతోషంగా లేదు. ఇలా అన్నాడు: "జయా! ఈ కవుల్ని ఎలా నిందించాలో తోచకుండావుంది. ఒకవైపున సౌందర్యాన్ని సృష్టిస్తూ వుంటారు. మరొకవైపున అదే సౌందర్యాన్ని ఖండిస్తూ వుంటారు. ఖండించడమే పరమావధైతే, అసలా సౌందర్యాన్ని సృష్టించడం ఎందుకు?"

"నేనూ అదే అనడం చంద్రా! వైరాగ్యాన్ని గురించి చెప్పదల్చుకొన్నప్పుడు సౌందర్యాన్ని గురించిన ప్రస్తావన కూడా రాకూడదు?"

"నా ఉద్దేశం ఏమంటే జయా! కవులు ఇలా పేడా బెల్లం కలిపినట్లు వైరాగ్యాన్నీ, శృంగారాన్నీ కలిపి సృష్టించడం పరస్పర విరుద్ధమైన విషయం—అసలు ఇలా చేయడంలో కవుల కో ఆదర్శమంటూ ఏమీ ఉండివుండదని నా అభిప్రాయము. నిజానికి కవి శృంగారాన్నీ, విలాసాన్నే సృష్టించబోతాడు. కాని తానేదో ఆదర్శం ప్రబోధిస్తున్నవాడు కావడానికి ఈ వైరాగ్యాన్ని యిరికిస్తాడు."

"పోనీ, ఇలా ఎందుకు అనుకోకూడదు? ఈ శృంగారం లేకుండా అచ్చం వైరాగ్యాన్నే కావ్యమంతట్లోనూ చిత్రిస్తే, ఎక్కువమంది ప్రేక్షకులను ఆకర్షించదనే ఉద్దేశ్యంతో ఇలా చేస్తారేమో కవులు!"

ఈ "రాష్ట్రపాల-పరిపృచ్ఛ" నాటకం చంద్రుడికి అంతగా నచ్చలేదు. అతడు ఎక్కువగా ఆనందించ లేకపోయాడు కూడాను! ఈసారి అధిక శృంగార ప్రధానమైన నాటకాన్నొకదాన్ని అభినయించాలని నిశ్చయించాడు. ఆ నాటకంలో తనే నాయకుడి పాత్రను ధరించాలని కూడా నిర్ణయించుకొన్నాడు. భాస, సౌమిల్లుల నాటకాలు చాలా వున్నాయి. "చారుదత్త" నాటకం చంద్రగుప్తుడికి బాగా నచ్చింది. చారుదత్తుడి పాత్ర తను స్వయంగా తీసుకున్నాడు.

మాలో కుర్రతనం గతించింది. యౌవన ప్రథమపాదంలో అడుగుపెట్టాము. మేము నివసిస్తున్న రాజాంతఃపురంలో స్త్రీ సౌందర్యం ఎటుచూసినా కుప్పతిప్పలుగా కనిపిస్తూ ఉంటుంది. ఆ సౌందర్యాన్ని రాజకుమారులు నిరభ్యంతరంగా అనుభవించవచ్చును. తమ కోర్కెలను వివాహం జరిగేవరకూ చంపుకొన నవసరంలేదు. చంద్రగుప్తుడికి ఒక ప్రత్యేకమైన రాజప్రాసాదం వుంది. అందులో వందల సంఖ్యలో పరిచారిక లున్నారు. ఇక నిప్పుడు ఆచార్య వసుబంధుయొక్క నీరసమైన విద్యాధ్యయనం ఏం బాగుంటుం దతడికి? కనుకనే, అహర్నిశలూ ప్రమదల నును వెచ్చని కౌగిళ్ళలో హాయిగా సోలిపోతూ, వాలిపోతూ, వారి నోటినుండి వినిగానీ, వివిధ కావ్య, నాటకాల రసాన్ని ఆస్వాదించేవాడుకాదు! ఇప్పుడతడిని మదిరా, మదిరేక్షణలు క్షణం వీడడంలేదు. ఈ విషయంలో సముద్రగుప్తుడు చాలా భాగం కొడుక్కి మార్గదర్శకు డౌతున్నాడు. సముద్రగుప్తుడి అంతఃపురం సర్వదా సుందరీ మణులతో నిండివుండేది. ఒక్కొక్కప్పుడు చంద్రగుప్తుడు తన తండ్రిని గురించి యిలా అనేవాడు: "ఈ ముసలాడికి ఏమొచ్చిందో? ఇంత ముసలితనంలో వేల సంఖ్యలో అంతఃపురంలో దాసీలను వుంచుకొన్నాడు. అయినా చాలలేదుగావును. ఇంకా సుందర యువతులను అంతఃపురంలో కుక్కుతున్నాడు."

"పరమ భట్టారకులు ప్రాణ మున్నంతవరకూ ప్రేమను అనుభవిద్దామనే అభిప్రాయం కలవారు."

"వారి ఆ అభిప్రాయం పొరపాటేంకాదు. ఉత్తరజన్మలో తిరిగీ రాజు కాగల మనే నమ్మకం ఏమిటి? ఏ బీదయింట్లోనో పుడితే, లేక ఏ నీచయోనిలోనో జన్మిస్తే, ఇక నప్పుడు యీ ఆనందం యెక్కడ లభిస్తుంది? కనుక యిప్పుడే చేతనైనంత ఆనందాన్ని అనుభవించడం నయం— నేను కౌటిల్యుణ్ణి నా గురువుగా భావిస్తాను. వారి అభిప్రాయాలను స్వీకరిస్తాను."

"అంటే దేవతలూ, దేవుళ్ళమీది విశ్వాసము, పరలోకంమీది నమ్మకమూ— ఇవి తెలవారు మూర్ఖులంటావు?"

"అదెటూ నిజమే! ఇహజీవితమే సత్యం, పరజీవితం (పరలోక జీవనం) అసత్యం. అయినప్పటికీ అది పనికిరాదు. ఇహమే సత్యంకదా అని, మానవుడు తన కర్తవ్యాలను మర్చిపోవటం తగదు. తండ్రిగారిని చూస్తున్నావు కదా? వారికి రాచ కార్యాలను చూసే తీరికైనా లేదు. నాకు అలాంటిది నచ్చదు. భగవాన్ కౌటిల్యుడు కూడా ఈ స్థితిని ఒప్పుకోరు!"

"ఐతే నీ విప్పుడు భగవాన్ కౌటిల్యుడి అంతు తేల్చుకుంటున్నావన్న మాట?"

"మాకు భగవాన్ కౌటిల్యులే పథ ప్రదర్శకులు. వెనుక మౌర్య చంద్ర గుప్తుడిక్కూడా వీరే మార్గదర్శకులు!"

"మౌర్యచంద్రగుప్తుడిలా నీవు కూడా భగవాన్ కౌటిల్యుడి ఆదర్శమార్గంలో నడుస్తామను కొంటున్నావా? భగవాన్ కౌటిల్యుని (చాణక్యుని) ప్రధానమైనవాదం; దేవుడూ, దయ్యాలూ, పరలోకం— ఏమీలేవు. ఇహ జీవనమే శాశ్వతం. ఈ జీవితాన్ని గురించి ఆలోచించడమే ముఖ్యం!"

"కానీ, కౌటిల్యుని వాదంలో నాకు సమ్మతం కాని అంశం ఒకటుంది. భగవాన్ కౌటిల్యుడు కేవలం తనను గురించి మాత్రమే ఆలోచించడం ముఖ్యం అంటాడు. తన చుట్టూ ప్రపంచం విషయంలో మౌనాన్ని వహిస్తాడు!"

"కేవలం తనను గురించీ, తనవాళ్ళను గురించీ, ఔనా!"

"తనవాళ్ళను గురించిన చింత రాజులకు ఎటూ వుంటుంది. తండ్రి ఎప్పుడు చస్తాడా—అని అనుదినం ఎదురుచూస్తూ వుంటారు—వారి ఆశ నెరవేరి తండ్రి చచ్చాడే అనుకో, ఇక అన్నదమ్ములు గొంతులు కోసుకోవడం మొదలు పెడతారు!"

"రాజ్యలక్ష్మికి విధిగా బలివ్వాలి. అందరికంటే ఉత్తములని రుజువు పరచు కొన్నవారికే రాజ్యలక్ష్మి వశమౌతుంది!"

"ఐతే ప్రపంచానికి వాళ్ళు చేసే ఉపయోగం ఏమీ వుండదంటావు?"

"ఇదిగో, జయా! నీవు ఆచార్య వసుబంధువద్ద తర్క శాస్త్రాన్నంతా ఔపోసన పట్టాలనుకొంటున్నావు. కానీ ప్రపంచాన్ని శాసించగలిగింది తర్కం కాదు. కత్తి అన్న విషయం మర్చిపోవద్దు!"

"ఔనులే! నీవు కత్తిసాములో సాటిలేనివా డనిపించు కోవాలని చూస్తు న్నావు కదా?"

"ఔను తప్పకుండా సాటిలేనివా డనిపించుకొంటాను. చంద్రగుప్తుడన్న పేరుకు కళంకం తీసుకురాను!"

"కానీ, ఒక్కొక్కప్పుడు అనుమానం వేస్తుంటుంది. ప్రొద్దు క్రుంకకుండానే సుందరీమణుల వేడికౌగిలింతల్లో మునిగిపోతావు నీవు, అలాటి సమయాల్లో నీవు చంద్రగుప్తుడి పేరుకు కళంకం తేకుండా వుండగలవా అని సంశయం కలుగు తుంది!"

"సంశయం ఏ మాత్రమూ అవసరంలేదు. కళంకం ఎన్నటికీ తీసుకురాను. సురా, సుందరీ – ఈ రెండూ దృఢమైన బాహువుల్లో తీక్ష్ణమైన కరవాలాన్ని ధరించిన వారికే లభిస్తాయి. సురకూ, సుందరికీ కూడా ఒక సమయమంటూ వుంటుంది. ఇతర సమయాల్లో నేనలా వుండడం ఎన్నడైనా చూశావా?"

"కానీ, సోదరా! నీకు పదిహేనవ సంవత్సరం ఇంకా దాటలేదు. ఈ చిన్న వయస్సులోనే ఈ అతివ్యసనం శరీరానికి మంచిదికాదు. మనస్సుకూ మంచిది కాదు!"

"ఐతే, సోదరా! ఆచార్య వసుబంధువద్ద ఒట్టి తర్కమేకాదు, ఉపదేశ మీయడం కూడా నేర్చుకొంటున్నావన్నమాట?"

"నా మాటల్ని నవ్వులక్రింద త్రోసివేయకు. పాండురాజు, మరి అనేకమంది ఇతర రాజులూ అతి వ్యసనంవల్లా, భోగంవల్లా ప్రౌఢత్వంలోనే క్షయరోగపు వాతబడి, అకాల మృత్యువుకు గురి అయ్యారని నీవు వినలేదా?"

"యువతీ బృందం ఒక్క నా చుట్టూనే తిరుగుతున్న దనుకొంటున్నావా? అలా కాదు. రాజప్రాసాదంలో అసలు నిగ్రహానికి స్థానమేలేదు. ఇక్కడి వాతా వరణం ఎప్పుడూ విపరీతమైన కోర్కెలతోటీ తృష్ణలతోటీ నిండివుంటుంది.నీవరకూ నీ విషయం చెప్పు! యువతి బృందం నిన్ను ఏమంటున్నది? 'జయ యువకుడు అందగాడు, బలశాలి– కానీ, ఏ యువతితోటి మనసిచ్చి మాట్లాడడు!' అంటున్నారు. ఇది సిగ్గుపడవలసిన విషయం కదా? స్త్రీలు తనను నపుంసకు డనుకోవడాన్ని ఏ పురుషుడు సహించగలడు? ఐతే నీవు భిక్షువు కావాలనుకొంటున్నావా?"

"నేను యౌధేయుణ్ని కావాలను కొంటున్నాను. యౌధేయులకు అంతః పురాలుండవు. వేలకొలది స్త్రీలను బంధించే ఈ కారాగారాలు వుండవు?"

"అంతఃపురాన్ని కారాగారమని ఎలా అనగలవు? యువతులకు ఈ స్వార్గిక సౌఖ్యం మరెక్కడ దొరుకుతుంది? ఈ నందనవనం, ఈ కేళీ కుంజాలు, ఈ స్ఫటికాల్లాటి తెల్లని భవనాలు, ఈ సన్నని దుకూలాలు, సుగంధద్రవ్యాలూ, అంగ రాగాలూ– మరెక్కడ లభిస్తాయి? బందీజనానికి ఇవ్వన్నీ లభిస్తాయా? ఐతే నీవు ఇంద్రుడి అంతఃపురాన్ని కూడా కారాగారమనే అంటావేమో?"

"ఔను, ఇన్ని సౌఖ్యాలతోపాటు ఒక్కొక్క యువతికి ఒక్కొక్క పురుషుడు కూడా ఉన్నట్లయితే, ఈ అంతఃపురాల్ని తప్పకుండా ఇంద్రపురితో సమమంటాను! ఈ కారాగారాల్లో కర్పూరశ్వేత సుందరీమణుల హృదయాల్లో జ్వలించే అగ్ని నీకూ తెలియనిదికాదు, నాకూ తెలియనిదికాదు! ఈ బందీజనం, గత్యంతరం లేక, ఈ కారాగారాల్లో కుళ్ళుతున్నారు; పారిపోవడానికి మార్గంవుండి, ఆ తరువాత గౌరవమైన జీవితాన్ని గడపడానికి అవకాశాలేగనక వుంటే, ఈ కారాగారాలన్నీ ఒక్కరోజులో ఖాళీ అయిపోతాయి!"

"కాదు జయా! నీవు నాలాగానే ఇదే వాతావరణంలో పుట్టావు, పెరిగావు కానీ, నీవింత 'కఠినుడివి' ఎలా అయ్యావు? 'కఠినుడివ'న్న పదం నీ గురించి చతురిక వాడుతుంది. అదే మాట నేను అంటున్నాను? పాపం చతురిక నీ మీద ఎన్నో ఆశలు పెట్టుకొన్నది!"

"స్త్రీ అంటే నా కేమీ ఆకర్షణ లేకపోలేదు. కాని, మనమింకా పిల్లలమని నా వుద్దేశం! ఇప్పుడు స్త్రీ సాంగత్యం మనకు తగదు. మనముందు కొండలా జీవితం వుంది తొందరెందుకు?"

"కాని చతురికకు నీమీద ఎంతో ప్రేమ ఒకరకంగా నీ వామెను నిరుత్సాహ పరుస్తున్నావు?"

"అంతఃపుర పరిచారికలకు నిరుత్సాహ పడవల్సిన అవసరం ఏమీ వుండదనుకొంటాను!

"ఔన్లే అంతఃపురంలో ఎటూ డెబ్బయి ఏండ్లకు పైబడ్డ పరిచారకులు వున్నారు కదా? చతురిక నిరుత్సాహ పడకుండా వాళ్ళలో ఎవరినైనా ప్రేమించవచ్చుగదా? అనబోతావు!"

"అంతఃపురంలో, ఈ వృద్ధ పరిచారకులను వుంచడానికి కారణం, వీరివల్ల అంతఃపుర భద్రతకు ఏ విధమైన ప్రమాదమూ కలగకుండా వుంటుందని. కాని అది అంత సత్యంకాదు! అయినా నేను చతురిక విషయంలో, ఈ ముసలి పరిచారకుల్ని ఉద్దేశించి, మాట్లాడలేదు!"

"ఇక పోతే, వామనుల్ని ఉద్దేశించి, మరుగుజ్జువాళ్ళను ఉద్దేశించి మాట్లాడావా? ఛీ....ఛీ....ఏ సుందరైనా కనీసం వాళ్ళమీద ఉమ్మేయడానికయినా ఇష్టపడుతుందా?"

"పరిచారికలకు ఎక్కడా పురుషులు దొరక్కపోతే, వామనుల్నీ మరుగుజ్జు వాళ్ళనీ ఉమ్మేసేటంతటి తక్కువ దృష్టితో చూడరని, నే ననుకొంటున్నాను!"

"ఎక్కడా దొరక్కపోతే, నువ్వన్నమాట నిజమే! కాని, నీవూ ఈ అంతఃపురంలోనే వున్నావుగా? ఒకవేళ నీవు దొరక వచ్చునన్న ఆశ వాళ్ళలో వుండడం తప్పుకాదేమో?"

"తప్పుకాదు. అదీ సహజమే! నా ముందు నా భవిష్యత్ జీవితము, దాని తాలూకు ఆశయాలూ వున్నాయి!"

"అది సరేను జయా! మరి నీ భవిష్యత్ జీవితాన్ని గురించి ఏమైనా ఆలోచించావా?"

"ఎందుకాలోచించలేదు? ఆలోచించకపోతే, సమయాన్ని నీ లాగానే శృంగార విలాసాల్లో గడిపివేసేవాడిని కదా ? రాత్రిపూట దీపం ముందు కూర్చుని, తాళపత్ర గ్రంథాల్లో తలదూర్చవలసిన పనేముంది? ఇంకా నేను విద్యార్థి దశలోనే వున్నాను. జ్ఞానోపార్జన చేస్తున్నాను. శారీరకంగా, మానసికంగా బలాన్ని చేకూర్చుకొంటున్నాను!"

"బలాన్ని కూర్చుకొన్న తరువాత?"

"తరువాత ఏం చేయడం అనేదాన్ని గురించి స్పష్టమైన ఆలోచన ఏమీ ఇంతవరకూ రాలేదు. కాని, ఒకటి మాత్రం చెప్పగలను: భవిష్యత్తులో కొంత ఆదర్శయుతమైన జీవితాన్నే గడుపుతాను!"

"సరే బాబూ! ఇక విలాసాలకూ, వినోదాలకూ సమయమైంది. వెళుతున్నాను."

కొంతదూరంనుండి వస్తున్న స్త్రీ సమూహం ఒకటి కనుపించింది. వాళ్ళల్లో పెద్దసెట్టి (అగ్రశ్రేష్ఠి) గోపాలుడి కూతురు సానుమతి కూడా వుంది.

ఇక నేనిప్పుడు యౌవన దశకొచ్చాను. అప్పటివరకూ, నిరర్థకమూ, నిష్ప్రయోజనమూ అనిపించిన అనేక వస్తువులు చాలాప్రయోజనకారిగా కనుపించసాగాయి. అంతఃపురాలు కామశాస్త్రానికి పాఠశాల లనవచ్చును. పరిసరాల్ని విస్మరించి బ్రతకడం ఎటూ సంభవం కాదు. నాకూ విలాసమన్నా, శృంగారమన్నా అసక్తి ఆకర్షణలు వున్నాయి! కాని, అంతఃపురంలో నేను చూస్తున్న ఆకర్షణల్లో ఏదో చెప్పరాని వెగటూ, వెలితీ-కనిపిస్తూ వుండేవి! నా నివాసం ఒక పెద్ద భవనంలో. చంద్రగుప్తుడి భవనానికి ప్రక్కనే వుంది నా భవనం. అప్పుడప్పుడూ అజ్జుక ఏదయినా పనిమీద పంపితే పరిచారికలు నా భవనానికి వస్తూ వుండేవారు. కాని నావైపు నుండి ఏ విధమైన ప్రోత్సాహమూ లభించకపోవడం వలన త్వరలోనే వెళ్ళిపోతూండేవారు! చతురిక కూడా అప్పుడప్పుడు వస్తూవుండేది. ఆమెతో నేను ఎన్నడూ నీరసంగా వ్యవహరించలేదు. అయినా ఆమె నన్ను 'కఠినుడి' గానే భావిస్తూ వుండేది. నేనీ విషయాన్ని గూర్చి చతురికను అడిగాను కూడాను. కాని ఆమె యిచ్చిన సమాధానం నాకు అంతగా నచ్చలేదు. ఇలా అన్నది. "వెనుక నేను నా చిత్రాంకణంలో మైమరచి వున్నప్పుడు నీవు నర్మస్పర్శలతో నా శరీరాంగాలను పులకింప చేసేవాడివి. కాని, ఇప్పుడు ఒక చిరునవ్వు మాత్రమే నాకు లభిస్తున్నది. ఏమో, ఆ చిరునవ్వు గూడా ఎప్పుడు మాయమై పోతుందో?"

నే నామె భుజంమీద చేయివేసి "చతురికా! ఈ చిరునవ్వు ఎన్నటికీ మాయం కాదు. నర్మస్పర్శలతో నీ అంగాలను పులకింప చేయడానికి నేను ఇప్పుడూ సిద్ధమే! కాని నేను ప్రస్తుతం విద్యాధ్యయనం కొరకు ఎంత సమయాన్ని వ్యయ పరుస్తున్నానో నీకు తెలుసుగదా? మా ఆచార్యులవారు వృద్ధులు. ఎప్పుడు తనువు చాలిస్తారో తెలియదు. బహుళంగా వున్నవారి జ్ఞాన సంపత్తిలోనుండి కొంతయినా నేను ఆర్జించుకోవాలి. అందుకే ఇంత ప్రయాస పడుతున్నాను!" అన్నాను.

"మరి నీవు వెనకా అధ్యయనం చేస్తుండేవాడివికదా! అప్పుడున్న అవకాశం ఇప్పుడెందుకు లేకపోయింది? నీవు నేనంటే చాలా విరక్తిగా వుంటున్నావు" అన్నది చతురిక.

"విరక్తి, రక్తి అనేవీ నాకు తెలియవు! నీవు నాకంటే పెద్దదానవు. నీ మాటలకు సమాధానం నేను యీయలేను! ఒకటి మాత్రం నిజం. విద్య అనే ఈ మహా సముద్రాన్ని తరచిన కొలదీ దీని వైశాల్యం మరీ మరీ యెక్కువ అవుతున్నది."

చతురిక చాలా సేపటివరకూ మౌనంగా అన్యమనస్కయై నిలబడి వున్నది. "ఐతే, నాలో ఏ ఆకర్షణా నీకూ మిగల్లేదన్నమాట? 'నీవు ముసలిదానవై పోయావు. నన్ను ఆకర్షించలేవు!' అని స్పష్టంగా చెప్పరాదా? పాపం, పోగర తీసుకొని, అహర్నిశలు నా దగ్గర కూర్చుని, నా విగ్రహాన్ని చెక్కేప్పుడు—నేను వృద్ధురాలిగా కనిపించలేదు గావును?" అన్నది.

నేను చతురిక చేతులను నా చేతుల్లోకి తీసుకొని "సుందరీ! నీవు వృద్ధురాలివని గుడ్డివాడు గాని అనలేడు. నీలో యౌవనముంది, సౌందర్యముంది, ఇతర అనేక ఉత్తమ గుణాలు వున్నాయి! నేను నిన్ను ప్రేమించి, నిభాయించుకోగలిగితే తప్పక ఆనందపడతాను. కాని, అది సంభవం కాదని నాకు తెలుసు. నాకు యింకా రెక్కలు రాలేదు. అందువల్లె యీ అంతఃపురంలో ఉన్నాను. రెక్కలు రాగానే యెగిరిపోతాను. ఈ రాజాంతఃపురాల్లో జరిగే ప్రణయాభినయం నాకు రుచించదు. నీవే చెప్పు! నేను నీపట్ల ప్రణయాన్ని అభినయించి రెక్కలు రాగానే యెగిరిపోవడము నీకు యిష్టమేనా?" అన్నాను.

"నే నేమీ బాధపడను. నేనీ రాజాంతఃపురంలోనే పుట్టాను, ఇక్కడే పెరిగాను. నటనకు, వాస్తవానికీ వున్న వ్యత్యాసాలు మాకు తెలియవు!"

చతురిక అలాంటి సమాధానం యిస్తుందని నే ననుకోలేదు. చతురిక అంటే నాకో ప్రత్యేకమైన అభిమానం. మనస్సు చాలా బాధపడ్డది. కాని, ఆమె మనస్సు ఎక్కడ బాధ పడుతుందోనని, మనస్సులోని బాధను ముఖంలో కనబడ నీయలేదు. ముఖంలోకి లేని నవ్వును తెచ్చుకొంటూ "ఐతే, ఇప్పుడు మునుపు పోయింది మాత్రం ఏముంది? ఆచార్యుల వారివద్ద అభ్యసించవలసినదంతా త్వరత్వరగా అభ్యసిస్తాను!" అన్నాను.

"అప్పటికి ఎటూ రెక్కలు వస్తాయి. ఎగిరిపోతావు!"

"నీవు ఒక విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి చతురికా! ఈ అంతఃపురంలో ఎంతమంది పరిచారికలు లేరు. కాని, నేను నీ మీదనే అనురక్తుణ్నయివున్నాను. నేను ఇప్పట్లో ఈ పాటలీపుత్రాన్ని వదిలి వెళ్ళను. ఎందుకంత తొందర పడతావు?"

చతురిక తన ముఖాన్ని నా ముఖం దగ్గరకు తీసుకువచ్చి "పోనీ నీ నుండి ఒక ముద్దునైనా ఆశించవచ్చునా?" అన్నది.

నేను మౌనంగా తలవంచుకున్నాను.

చతురిక వెళ్ళిపోయింది. నా హృదయం సముద్రమథనంలోలా అల్లకల్లోల మవసాగింది. మౌనంగా ఒక ఆసనంమీద కూర్చున్నాను. నేను మౌనముద్రలో ఉండడం చూచి "ఎందుకు విచారంగా వున్నావు? ఆరోగ్యం బాగుందా!" అనడిగింది కులూప.

బలవంతాన నవ్వును తెచ్చుకుని "లేదమ్మా!" అన్నాను.

కులూపయొక్క సరళమైన స్వభావాన్ని చూచి నేను చాలా చిన్నతనం నుండి ఆమెను "అమ్మా!"అని పిలిచేవాణ్ని. పెద్దవాణ్నయి, ప్రత్యేకమైన భవనంలో ఉండడం ప్రారంభించాక అజ్జుకను అడిగి, కులూపను నా భవనంలోకి తెచ్చుకున్నాను. కులూప నా మాటను విశ్వసించలేదు. ఇకనప్పుడు సంభాషణను మార్చడానికి "ఏమమ్మా ! మీ దేశంలో కూడా యిలాంటి రాజాంతఃపురాలు వుంటాయా?" అనడిగాను.

గట్టిగా నిశ్వసించి "మా దేశంలో అసలు రాజనేవా డెవడూ లేడు!" అన్నది.

"ఐతే, యౌధేయ భూమిలోలా, అక్కడ కూడా గణతంత్ర వ్యవస్థ ఉన్నదా?"

"ఒకప్పుడు మా దేశంలో గణతంత్ర వ్యవస్థే వుండేది. తరువాత రాజు, రాచరికం వచ్చింది. ఇప్పుడా రాజుకూడా మా వాడుకాదు. మేము రోమన్ రాజులచే పాలింపబడుతున్నాము!"

గణతంత్రాన్ని గురించి వినేసరికి నాలోని ఉత్సుకత పెరిగింది. "గణతంత్రాన్ని గురించి నీకేమైనా తెలిసివుంటే చెప్పమ్మా?" అని అడిగాను.

"చాలారోజుల క్రితం—యెన్ని యుగాలు గడిచాయో తెలియదు—అలసందర్-అలక్సుందర్— తండ్రి మా గణ వ్యవస్థను విచ్ఛిన్నంచేసి రాజరికాన్ని స్థాపించాడుట!"

"అలసందర్, అంటే, అలక్సుందర్ ! (అలెగ్జాండరు) అతడేగా భారత దేశ సరిహద్దుల్ని కూడా దాటివచ్చాడని చెప్పుకుంటారు?"

"అవును అతడే! సూర్య ద స్తమించని మహాసామ్రాజ్య మతడిదని చెప్పు కొంటారు."

"అశోకుని తాత మౌర్యచంద్రగుప్తుడు అప్పటికింకా రాజ్యాధికారి కాలేదు. ఆ సమయంలో ఈ అలక్‌సుందర్ పురుషపురం, తక్షశిల మొదలయిన నగరాలను దాటి చాలా ముందుకు వచ్చాడని ఆచార్యులవారు చెబుతూవుండేవారు. కానీ, ఆ తరువాత అతడి సైనికులు భయపడిపోయారు. ఉదయాచలం మాట అటుంచి మధుర, పాటలీపుత్రాల వరకైనా అతడు రాలేకపోయాడుట. అతడు గొప్ప రాజు అనడంలో సందేహం ఏ మాత్రమూ లేదు. అతని తరువాత ఎంతోమంది యవన రాజులు భారతదేశం మీద రాజ్యం చేశారు కూడాను. ఐతే, ఆ అలక్‌సుందర్ వంశీయుల రాజ్యమైనా లేదా?"

"ప్రపంచంలో శాశ్వతంగా ఎవరు రాజ్యాన్ని చేశారు? అలక్‌సుందర్ తరువాత యెన్నో సంవత్సరాలపాటు రాజరిక పాలనక్రింద మా దేశం పాలింపబడ్డది. ఆ రాజులు—వారి చరిత్రలు—ఇవి నాకేమీ తెలియవు! మా భాషలో మా దేశచరిత్రకు సంబంధించిన గ్రంథాలు యెన్నోవున్నాయి. అయినా నాకిప్పుడేమీ జ్ఞాపకం లేవు."

"మీ గణ వ్యవస్థకు సంబంధించిన కథ ఏదయినా నీకు జ్ఞాపకం ఉందా అమ్మా?"

"ఎన్నటికీ మరపురాని కథ ఒకటి నాకు బాగా జ్ఞాపకం. మా యవన కవి ఒకతను ఈ కథను నాటకంగా వ్రాశాడుట. మా బంధువు ఒకతను దాన్ని నాకు చదివి వినిపించాడు. ఇప్పటికి ఎంతో మందికి చెప్పాను. అయినా నాకు తృప్తి కలుగదు."

"ఐతే, నాకు చెప్పలేదేమ్మా! పిశాచాలూ-రాక్షసులు వచ్చే కథలు ఎన్నో చెప్పావు కాని, ఈ కథ చెప్పలేదేమమ్మా?"

"ఇది స్త్రీలకు సంబంధించిన కథ. అందుకని దీన్ని ఎప్పుడూ స్త్రీలకే వినిపిస్తూ వుండేదాన్ని!"

"అభ్యంతరం లేకపోతే నాకూ వినిపించు అమ్మా!"

"అభ్యంతర మేముంది నాయనా! విను ఆ రోజుల్లో యవన గణ వ్యవస్థకు రాజధాని ఏథెన్స్ నగరం. ఇప్పటికికూడా ఏథెన్సు పెద్దనగరమే. ఆ నగర దేవత పేరు 'అథనా'. మా అమ్మాయి అక్కడే పుట్టింది. అందుకనే మా అమ్మాయి పేరు కూడా 'అథనా' అని పెట్టాము!"

"ఐతే మీరుకూడా దేవతల్ని పూజిస్తూ వుంటారన్నమాట."

"నా పుట్టుకకు చాలా వెనుకటి విషయం. ఇప్పుడైతే రోమనులు యవనులూ—అందరూ క్రైస్తవమతాన్ని స్వీకరించారు. కాని, అప్పటికింకా యవనులు క్రైస్తవ మతానుయాయులు కాలేదు. అది యవనజాతికి సువర్ణాక్షరాలతో లిఖింప

దగిన యుగం. అందువలననే ఇప్పటి యవనులు కూడా ఆ యుగాన్ని గురించి గర్వంగా, గౌరవంగా చెప్పుకొంటారు."

"మరా స్త్రీలకథ చెబుతానంటివే?"

"ఆఁ! ఏథెన్స్‌లో, ప్రతి ఇంట్లోనూ ఒక్కొక్క పెద్ద చొప్పున ఎన్నుకొని ఒక పెద్ద సభ ఏర్పడేది. ఆ సభ ద్వారానే రాజ్యాంగ విషయాలు పరిష్కరింప బడుతూ వుండేవి."

"అరె, మేము, యౌధేయులం కూడా సరిగా, అలాగే రాజ్యాంగ విషయా లను పరిష్కరించుకుంటాము."

"ఐతే, అలాటి గణతంత్ర వ్యవస్థ ఇప్పటికీ ఈ దేశంలో వుందా? నేను ఉన్నదనుకోలేదు. మన భట్టారిక (అజ్జుక) ఏ మహారాజు కూతురో అనుకొంటు న్నాను."

"మా తండ్రిగారు, మహారాజ పదవిలోనూ, మహాసేనాధిపతి పదవిలోకూడా వున్నారు. మా గణ వ్యవస్థలో మహారాజ, మహాసేనాధిపతి—అనేవి గొప్ప పద వులు. ఇక్కడ మహారాజ, మహాసేనాధిపతులకూ వాళ్ళకూ ఎలాటి సాపత్యమూ వుండదు."

"కనుకనే భట్టారిక స్వభావం ఇంత మృదువూ, కోమలమూను! నీవుకూడా అంతేను భర్తృదారక! చాలా కోమలమైన ఉత్తమమైన స్వభావం కలవాడివి!"

"అది సరేను. ఆ కథ ఏమిటో చెప్పమ్మా?"

"ఏథెన్స్ యొక్క రాజ్యాంగ విషయాలను గణసంస్థ పరిష్కరిస్తూ వుండేది. ఆ సంస్థలో అందరూ పురుషులే వుండేవారు. స్త్రీలు వుండేవారు కాదు. పురుషులు ఎప్పుడూ తమలో తాము పోట్లాడుకొనేవారు. బయటనుండి కూడా పోట్లాటలూ, యుద్ధాలాంటివి తెచ్చిపెట్టుకొనేవారు. అప్పుడు ఏథెన్స్‌లోని స్త్రీలందరూ ఒక ఆలోచన చేశారు. ఈ పురుషులు సరీగా రాజ్యపాలన చేయలేకపోతున్నారు. వీరిలో రాజ్యపాలనకు కావలసిన ఉత్తమ గుణాలేలేవు. సహృదయత, సానుభూతి పూర్తిగా నశించాయి.కనుక స్త్రీలు తప్పనిసరిగా రాజ్యాంగాన్ని వశపరచుకొని, పాలన కొనసా గించాలి. అంతవరకూ, ప్రస్తుతమున్న బాధలూ, అనర్థాలూ తప్పవు!—స్త్రీ లందరూ ఇలా ఆలోచించుతున్నారు. అన్ని ఇండ్లూ ఏకమైనాయి. పురుషులు ఎటూ రాత్రిళ్ళు చాలా సేపటివరకూ మద్యపాన సేవతో, నాట్యగాన విలాసాల్తో మేల్కొని వుంటారు కనుక త్వరగా నిద్రలేవరు. ఒకరోజు ఉదయం పురుషులు వళ్ళుమరచి నిద్రపోతున్నారు. స్త్రీలు మెల్లగా పురుషుల రాజ్యాంగ చిహ్నాలయిన దుస్తులను ధరించి, పురుష వేషాల్లో గణసభాసంస్థను వెళ్ళారు. గణసభాసంస్థయొక్క రక్షకులు పురుష వేషాల్లోవున్న స్త్రీలను నిజమయిన సభ్యులేనని అనుకొన్నారు. అందువల్ల అడ్డగించలేదు. స్త్రీలు సభదీర్చారు. అధ్యక్షుణ్ణి ఎన్నుకున్నారు. పురుషులు రాజ్యపాలనకు అనర్హులనీ, రాజ్యపాల నాధికారాన్ని స్త్రీలకు వప్పచెప్ప వలసినదనీ

శాసనంచేసి లేఖాబద్ధం చేశారు. సభాభవనంలోనూ, నగరంలోనూ నూతన వ్యవస్థను తెలియపరిచే ప్రకటన పత్రాలను తగిలించారు. తరువాత స్త్రీలు ఎవరి ఇండ్లకు వాళ్ళు వెళ్ళిపోయారు. అటు పురుషులు నిద్రలేచి తమ రాజకీయ దుస్తులకోసం వెతుక్కోసాగారు. సరే, ఎలాగో దుస్తులు దొరికాయి. వాటిని ధరించి సభాభవనానికి పోయేసరికి భవన రక్షకులు లోపలికి పోనీయకుండా అడ్డగించారు. సదస్యులు ప్రకటన పత్రాన్ని చదివి వినిపించారు. ప్రకటనలో ఒక్క పురుషులను అధికారం నుండి తొలగించడమే కాకుండా మొత్తం నగరానికి సంబంధించిన ఆస్తిపాస్తులన్నీ గణసంస్థ పరం చేయబడ్డాయని ఉద్ఘోషించబడ్డది. ఈ రోజునుండి ఈ ఏథెన్స్ నగరం ఒక పెద్ద కుటుంబం. ఈ నగరపు నాగరికు లందరూ తమకు చేతనైన పనిని చేస్తూవుంటారు. గణసంస్థ అందరి పోషణభారాన్నీ తాను భరిస్తుంది!" అని కూడా ప్రకటింపబడ్డది.

ఈ చిన్న కథను విని కొంత ఆలోచనలోపడ్డాను. గణ వ్యవస్థ నాకేమీ కొత్తదికాదు కాని మొత్తం గణానికి సంబంధించిన ఆస్తినంతటినీ ఉమ్మడి ఆస్తిగా భావించటమనేది చాలా క్రొత్త విషయం. మా యౌధేయుర్లో పొలాలకు అధికారి గణసంస్థ. పొలాలు ఉమ్మడి ఆస్తిగా పరిగణింపబడవు. వ్యవసాయంలో గాని, వ్యాపారంలో గాని ఎవరెవరి ఆదాయాలూ, లాభాలూ వారివారివిగా వుంటాయి. కనుక పై కథ నా హృదయంలో ఆలోచనలనే తీవ్ర వాయుతరంగాలను రేపింది. దీన్ని గురించి ఒక్కరోజులో ఏ నిర్ణయానికీ రాలేమని, ఆలోచించలేమనీ తెల్సుకొన్నాను. చతురిక ప్రవర్తనవల్ల నా హృదయంలో ఏర్పడ్డ విషాదం చాలావరకు తగ్గింది. కాని రాజాంతఃపురాన్ని గురించి నే నడిగిన ప్రశ్నకు సమాధానం రానే లేదు. మళ్ళీ అడిగాను: "ఈ కథ చాలా బాగుందమ్మా! మరి స్త్రీల గణతంత్రం కొన్నాళ్ళయినా సాగిందా?"

"ఆ విషయం నాకు తెలియదు. బహుశాః ఇతర కథల్లాగా ఇది కూడా ఒక కథేనేమో!"

"మరి రోమన్ రాజులకు కూడా అంతఃపురాలు వుంటాయా? అక్కడకూడా రాజులకు వేలసంఖ్యలో రాణులు [భార్యలు] వుంటారా?"

"అంతఃపురాలు వుంటాయి గాని ఏ రాజుకయినా ఒక్కతే భార్య వుంటుంది. రోమనుర్లోగానీ యవనుర్లోగానీ బహుపత్నీత్వం అసలు వుండదు. అక్కడ మహా రాజుదగ్గరనుండి సాధారణుడైన పురుషుడి వరకు ఒకే ఒక స్త్రీతో వివాహమాడ టానికి హక్కును కలిగి వుంటాడు. ఇక్కడ బహు భర్తృత్వాన్ని విని ఎంత ఆశ్చర్యపడతామో అక్కడ బహుపత్నిత్వాన్ని విని అంతే ఆశ్చర్యపడతారు."

"అది చాలా మంచి పద్ధతమ్మా! అలాగే వుండాలి.! ఇక్కడచూడు. ఈ అంతఃపురాలు వేలకొలది స్త్రీలకు బందీ గృహాలుగా తయారయ్యాయి!"

"అలాకాదు, అక్కడా రాజాంతఃపురాల్లో వేలకొలది స్త్రీలు ఉంటారు. కాని రాజు ఒకే ఒక్క స్త్రీని పెండ్లాడగలడు. మిగిలిన వాళ్ళందరూ పరిచారికలుగా వుంటారు!"

"అయినప్పటికీ ఇక్కడికంటే చాలా నయం. అక్కడి రాజులకు ఒక్కరి కంటే ఎక్కువమందిని వివాహమాడరాదని ఒక నియమం వుంది. వందలమంది స్త్రీలను పరిచారికలుగా వుంచుకొన్నారంటే అది వారి సిరి సంపదలమీద ఆధారపడి వుంటుంది. ఆస్తిని పోగొట్టాలంటే ఒకడి దగ్గిర విశేషంగా సంపద ప్రోగుపడడం, మరొకడివద్ద ఏమీ లేకపోవడం ఈ విషమ వ్యవస్థ నశించాలి! ఈ వ్యత్యాసం సమాజంలో వున్నన్నాళ్ళూ స్త్రీ పురుషులు పశువుల్లా అమ్మబడుతూనే వుంటారు. ఐతే, అమ్మా! మీ దేశంలో కూడా స్త్రీ పురుషుల్ని బజార్లలో అమ్ముతూ వుంటారా?"

"అవును భర్తృదారకా! అక్కడా బానిసల వ్యాపారం జరుగు తూంటుంది. బానిసల్ని మానవ శరీరధారులైన పశువులుగా అక్కడా భావిస్తుంటారు!"

"ఇక్కడిలాగానే చక్కని రాజాంతఃపురాలు కూడా అత్యధిక కాముకతతో నిండివుంటాయా? రాజూ, రాణి, పరిచారికులు—అందరూ ఎప్పుడుచూచినా కామ వ్యాపారంలో మునిగివుంటారా ?"

"ఒకేరాణి కావడంవలన రాజుయొక్క స్వపరివారం యిక్కడికంటే తక్కువగా వుంటుంది. మిగిలిన ఏ విషయంలోనూ ఇక్కడికీ అక్కడికీ ఏ విధమైన వ్యత్యాసమూ వుండదు."

"అమ్మా! నీవు మనసులో మరోలా అనుకోవుకదా? అక్కడి రాజాంతఃపుర స్త్రీలను గురించి కొన్ని విషయాలను నిన్ను అడుగుదామనుకొంటున్నాను."

"ఏమనుకొంటాను నాయనా! ఏమీ అనుకోను. రోమనుల రాజాంతః పురంలో గాని, పాటలీపుత్ర రాజాంతఃపురంలో గాని ఒకే ఒక విషయం నా అనుభవంలోకి వచ్చింది. వయస్సులో వున్నన్నాళ్ళూ తన ప్రభువుయొక్క కామ నిర్వహణకు సిద్ధంగా వుండడం, వయస్సుమళ్ళిన తరువాత దూతికావృత్తి. అంతే నాయనా! పురుషులవైపు నుండి స్త్రీలకు, స్త్రీలవైపు నుండి పురుషులకు వార్తలను చేరవేస్తూ జీవితాన్ని గడపడం. అలాటి వార్తలను చేరవేసే బాధ్యతను నీవు నాకు ఎన్నడూ కల్పించలేదు. కాని అంతఃపురంలోని ఎంతోమంది స్త్రీలు నీవంటే పడి చస్తున్నారని నాకు తెలుసు. ఒక్క పరిచారికలే కాదు, రాణులు కూడా నిన్ను కోరుతున్నారు! వాళ్ళు సిగ్గూ, బిడియమూ లేకుండా నాతో చెప్తారు. అసలు రాజాంతఃపురంలో సిగ్గూ, బిడియానికీ స్థానమే వుండదు!"

"ఏమన్నావు? రాణులు కూడానా? అజ్జుక సవతులు! వారందరినీ నేను అజ్జుకలాగానే అక్కచెల్లెండ్లగా భావిస్తున్నాగా ?"

"అంతఃపురంతో రక్త సంబంధీకుల వరకే బంధుత్వ సంబంధాలుంటాయి. రక్త సంబంధీకుడు గాని ఏ పురుషుణ్ణయినా పొందడాన్ని అంతఃపుర రాణులు తప్పుగా భావించరు. ఎలా భావించగలరు, మీరే చెప్పండి? యౌవనం వుంది. ఆరోగ్యవంతమైన, అందమైన శరీరం వుంది. ఇతర భోగాలన్నీ కూడా సులభ్యమేను! అంతఃపురంలో ప్రతినిత్యమూ రాత్రింబవళ్ళు వసంతోత్సవాలు జరుగుతుంటాయి. అంతఃపురంలో రెండువేలమందికి పైగా రాణులున్నారు. పరమ భటారకులు సమదృష్టితో వ్యవహరించి రోజూ ఒక్క రాణీ వద్దకు వెళ్ళినా, మూడుసంవత్సరాలకయినా ఒకరివంతు రాదు. ఇక నలాంటప్పుడు తమకు అందుబాటులో వున్న పురుషుణ్ణి వాంఛించక ఏం చేస్తారు?"

"నీవు నిజం చెప్పావమ్మా! పాపమా స్త్రీలను నిందించడం చాలా అన్యాయం! వాళ్ళుచేసిన మహాపరాధం, స్త్రీలై జన్మించడమే! పాపమా అభాగినులకు సౌందర్యం, యౌవనం—అన్నీ లభించాయి. అయినా ప్రయోజనమేమిటి? సుందరమైన ఈ బందీగృహాల్లో వాళ్ళు శాశ్వతంగా బందినులు అయ్యారు. ఆనాడు ఏథెన్స్‌లో పురుషుల అధికారాన్ని తల్లక్రిందులు చేయవలసిన అవసరం స్త్రీలకు కలిగిందన్నావు. అదెలావున్నా, ఈనాడు ఇక్కడ మాత్రం తప్పకుండా పురుషుల్ని అధికారచ్యుతుల్ని చేయవలసిన అవసరం స్త్రీలకెంతో వుంది!"

"కాని ఈ వ్యవస్థను మార్చడం సులభమా?"

"అదే ఆలోచించవల్సినది! కానీ, అమ్మా! కాలం అనంతమైనది. ఇవ్వాళ ఏది అసంభవం అయింది అనుకొంటామో అదే రేపు సంభవం కావచ్చు!"

"భర్తృదారక! మీరు అప్పుడప్పుడూ మీ వయస్సుకు మించిన మాటల్ని మాట్లాడుతూ వుంటారు!"

"అంటే? నాలాటి కుర్రవాడు యిలాటి పెద్ద పెద్ద విషయాలను మాట్లాడడం బాగుండదనేగా, అమ్మా నువ్వనడం?"

"నేను నిందాపూర్వకంగా అనడంలేదు. ప్రశంసాత్మకంగా అంటున్నాను. యౌవన మదంతో కన్నుగానని ఈ రాణులూ, పరిచారికలూ నిన్ను నిందించినప్పుడు నేనేం సమాధానం చెబుతూవుంటానో తెల్సా? 'మా భర్తృదారకుడు మీరనుకున్నటువంటి వాడు కాదు. వేలసంఖ్యలో ఎన్నదగినవాడు; ఓ కులటల్లారా! మీ కామానికి పరితృప్తిని మరెక్కడయినా పొందండి.'—అని. అయినా వినేవాళ్ళు కారు. ఒక్క చతురిక మాత్రం నన్నావిధంగా ఎన్నడూ కోరలేదు!"

"ఐతే, అమ్మా చతురికను పొగడడానికి వచ్చావా?"

"చతురికను గురించి నేను మరేమీ చెప్పడానికి రాలేదు. ఆమె యితరుల్లా నిన్నెన్నడూ ఆక్షేపణ చేయలేదు! అంతే! ఆఁ కఠినుడవని చతురికకూడా అంటూ వుంటుంది."

"కఠినత్వ మేముందమ్మా? నేనందరిమీదా ప్రేమ ప్రదర్శించడం ప్రారంభిస్తే అసలు నంజుకోవడానికయినా మిగుల్తానా? ఇవ్వాళ చతురిక నానుండి ఎటూ ఒక ముద్దు కొట్టేయనే కొట్టేసింది. బహుశః యిక నన్ను కఠినుడని అనదనుకుంటాను. ప్రేమ అంటే నాకు చాలా గౌరవము, విలువా కూడా వుంది. ప్రేమ అంటే ఏమిటో ఇప్పుడిప్పుడే అర్థం చేసుకొంటున్నాను. ప్రేమకు ఈ సమాజంలో ఎలాటి స్థానమూ లేదు. ఇక్కడి మానవత్వం పశుత్వానికి దాపుగా పోతున్నది."

"నిజం చెప్పావు నాయనా! రోమ్‌నగరంలో గానీ, ఏథెన్స్‌లోగానీ, పాటలీపుత్రంలో గానీ—యెక్కడయినా మాలాటి పరిచారికలను పశువుల్లాగానే చూడడం జరిగింది; జరుగుతున్నది! ప్రక్కనే కట్టివేయబడిన పశువులను ఏ మాత్రమూ లక్ష్య పెట్టకుండా మనం ఎలాగయితే మన కామతృష్ణను తీర్చుకుంటామో, అలాగే ఈ రాజులూ, చక్రవర్తులూ అతి నికృష్టమైన తమ కామతృష్ణను నిస్సంకోచంగా మా ఎదుట తీర్చుకుంటారు. తమను గురించి తోటి మానవులు ఏమనుకుంటారో అన్న సంకోచమేలేదు వీళ్ళకు!"

కులూప బహుశ నన్ను గురించి అత్యుత్తమ మానవత్వం గలవాడినిగా భావిస్తున్నదేమో! ఇలా అన్నాను: "నేను అత్యుత్తమ మానవుణ్ణేమీ కాదు. అత్యుత్తమ మానవుణ్ణి కావాలన్న కాంక్షకూడా నాకులేదు. కాని, నేను సాధారణ మానవుణ్ణి! సాధారణ మానవుడిగా వుండడమే నాకు యిష్టం! పశుత్వం సమీపానికి దిగజారడం నేనే విధంగానూ సహించను. మానవుల్లో ద్వంద్వతను చూస్తే నాకు చాలా అసహ్యం వేస్తుంది. అసలు రూపంవేరు. బయటికి ప్రకటింపబడే రూపం వేరు—ఈ స్థితిని నేను ఘోరంగా ద్వేషిస్తాను. నీవు చెబుతున్న ఈ అంతఃపుర రాణులే దేవాలయాల్లోకి ఇతర ధార్మిక ప్రదేశాలకు పోయినప్పుడు ఏ సీతమ్మవారి లాగానో, సావిత్రీదేవి లాగానో పాతివ్రత్యాన్ని అభినయిస్తూ వుంటారు. అందువల్ల ప్రయోజనము ఏముంది?"

"పరలోకమన్నా, నరకమన్నా వీళ్ళకు చాలా భయం. వాళ్ళుచేసే పాప కర్మలు వాళ్ళకు తెల్సు. ఆ పాపము—ఈ విధంగానైనా పోతుందేమోనని, ఇలా పూజలూ, వ్రతాలూ—పాతివ్రత్యపు అభినయాలూ చేస్తుంటారు!"

"నరకం, పరలోకం—ఈ భయాలవల్ల మనిషి సదాచారి అవుతాడా? భయం వలన మానవుడు సదాచారి కావడాన్ని నే నింతవరకూ చూడలేదు. కానీ, నీ అనుభవం నాకంటే గొప్పది. నీవు యవనులను, రోమనులను చూశావు. భారతదేశములో కూడా చాలా రోజులనుండి వుంటున్నావు. రాజులు, మహారాజులూ, చక్రవర్తులు, ధనిక శ్రేష్ఠులూ—వీరిలో ఎవరైనా భయంవలన సదాచారులు కావడం ఇంతవరకూ చూశావా?"

"నేను చూడలేదు భర్తృదారక! శ్రేష్ఠులూ—సార్థవాహులూ రాజులూ అంతఃపురాలూ—వీటి విషయం వదలిపెట్టు! పై వ్యక్తుల దగ్గర అసలు సదాచారం వుండ

డానికే వీలులేదు. ఇప్పుడు నేను చెప్పబోయేది పరలోకాన్ని గురించి, పాప-పుణ్యాలను గురించి పెద్దపెద్ద ఉపన్యాసాలను దంచుతుండే మత సంబంధమైన గుత్తదారుల విషయం. వీళ్ళు తమ విషయాన్ని చాలా ఉద్రిక్త స్థితిలో ఉపన్యసిస్తారు. నిండు సభల్లో సదాచారం పేర వలవలా కన్నీరు కారుస్తారు. కానీ వీళ్ళుచేసే దుష్కర్మలు ఏమని చెప్పను! సదాచారం వీళ్ళకు ఎంతదూరంలో వుంటుందో తెల్సా! నా కౌమారాన్ని ఇలాటి నీచుడైన ధర్మబోధకుడే చెరచాడు. మొదట అతడు నన్ను ప్రేమించాడు. గర్భం వచ్చేసరికి ఏథెన్స్‌కు పంపించాడు. అప్పటికి అతనికి మనశ్శాంతి కలగలేదు. తీర్థయాత్రలకనే వంకతో, ఈ దేశానికి తీసుకువచ్చి నా పీడ వదిలించుకున్నాడు!"

"ఇక్కడకూడా అంతేనమ్మా! మనం పెద్దలనీ, ధనికులనీ, సంపన్నులనీ— ఎవరినైతే పూజిస్తున్నామో వాళ్ళకు నరకమన్నా, పరలోకమన్నా ఏ మాత్రం భయముండదు. కథలు చదువుకున్నట్టుగా వుంటుంది! నాకీ ద్వంద్వత్వమంటే బొత్తిగా గిట్టదు. ధర్మమన్నా, సదాచారమన్నా, బాహ్యాంతరాల్లో ఒకే రకంగా వుండాలి. ప్రజలందరూ సహజంగా అనుసరించగలిగి వుండాలి!"

నేను అప్పుడప్పుడూ యవన దార్శనికుల్ని (తత్వవేత్తల్ని) గురించికూడా ఆచార్యులవారు చెబుతుండగా వింటూ వుండేవాడిని. భారతదేశానికివచ్చి ఇక్కడే స్థిరనివాసాలను ఏర్పరచుకున్న యవనుల్ని గురించికూడా ఆచార్యులవారు చెబుతూ వుండేవారు. "మిలింద ప్రశ్న" చదివేటప్పుడు ఆచార్య నాగసేనులవారిని అడిగితే, యవనరాజైన మిళిందుడు వేసిన ప్రశ్నలయొక్క స్వభావం తెలుస్తూవుండేది. శాకలా (స్యాల్‌కోట) మిళిందుడి (మినాందర్) రాజధానికూడా విన్నాను. కాని యవనులుకూడా పూర్వం గణతంత్రవాదులనీ, వారికీ దేవుళ్ళూ, దేవతలూ వున్నారని నాకు తెలియదు!

తరువాత అప్పుడప్పుడూ కులూపా నడిగి యవన దేశాన్ని గురించిన ఎన్నో విషయాలను తెలుసుకోసాగాను. నాలోని ఆసక్తిని గమనించి కులూపా కూడా యవన, రోమ్ దేశాలకు సంబంధించిన అనేక విషయాలను నిస్సంకోచంగా చెబుతూ వుండేది. కాని, యవన గణతంత్రాన్ని ధ్వంసంచేసిన రాజ్యతంత్రపు దుష్పరిణామం వలన, పరరాజుల వశమైన ఈనాటి యవన దేశాన్ని తలచుకొన్నప్పుడల్లా హృదయంలో ఏదో చెప్పరాని బాధ కలిగేది!

# నాన్నగారితో తుది కలయిక

నాన్నగారివద్దనుండి చాలా జాబులు వచ్చాయి. నన్ను చూడాలని వారెంతో ఆదుర్దాపడుతున్నారు. అజ్జుకను కూడా తీసుకురావల్సిందని పదేపదే తమ జాబుల్లో వ్రాశారు. హేమంతపు చివరిరోజులు. నేనూ, చంద్రుడూ, అజ్జుక – అగ్రోదకాకు బయలుదేరి వెళ్ళాము. అప్పటికి నాకు పదిహేడు సంవత్సరాల వయస్సే. అయినా వ్యాయామం వలన, సహజంగానే భారీ శరీరాలుగల వంశంలో జన్మించడంవలననో ఇరవై ఏండ్ల యువకుడిలా కనిపిస్తున్నాను. గడచిన రెండు సంవత్సరాల్లోనూ నాన్నగారు బాగా వృద్ధులయ్యారు. మానసికమైన బాధలు వారికి చాలా ఎక్కువయ్యాయి. యౌధేయ గణాన్ని గురించి ఎప్పుడూ చింతిస్తూ, ఆలోచిస్తూ వుండేవారు. పరమ భట్టారక సముద్రగుప్తుడు మా గణతంత్ర వ్యవస్థను మార్చడానికి ఏ మాత్రమూ ప్రయత్నం చేయలేదు. అసలు పరిపాలనలో జోక్యమే కలిగించుకొనలేదు. కాకపోతే కొద్దిగా పన్నును మాత్రం తీసుకొనేవాడు. ఆ పన్నురూపంలో తీసుకున్న ధనాన్నయినా కానుక రూపంలోనూ, ఇతర రూపాలలోనూ తిరిగి యౌధేయ గణానికే వప్పచెబుతూ వుండేవాడు. అయినప్పటికీ యౌధేయుల్లో గణతంత్రపు భావన దినదినమూ క్షీణిస్తూనే వున్నది. భూమిని ఇష్టమొచ్చినట్లు వ్యక్తిపరం చేసుకోవటానికి యెటూ వీలులేదు. కాకపోతే వ్యాపారంమీద బాగా డబ్బు సంపాయించడం నేర్చుకొన్నారు. యౌధేయులు వెనుకటిలా శస్త్ర విద్యను అభ్యసించడం మానేశారు. వెనుక శస్త్రవిద్య మీద చూపే అనురక్తి ఇప్పుడు దీనార్లను ప్రోగుచేసుకోవడంలో చూపుతున్నారు. రాజప్రాసాదాల్లో పెద్ద పెద్ద సుందర మహలుల్ని నిర్మించుకోడానికి తమ శక్తినీ, ధనాన్నీ, సమయాన్ని వ్యయపరుస్తున్నారు. యౌధేయులు మధురకు వచ్చినపుడు అక్కడ ఉపరిక మహారాజును (వైశ్రాయిని) కల్సుకొంటూ వుండేవారు. బంగారు పాత్రల్లో ఎర్రని ద్రాక్షసురను సేవించేవారు, విందుల్లో పాల్గొనేవారు. రత్నాభరణ భూషితులైన వేశ్యల నృత్యాలను చూసేవారు. అమాత్యుల ప్రాసాదాలను, అభూషణాలనూ చూస్తూ వుండేవారు. వీటన్నింటినీ తమ యౌధేయ భూమిలో అనుకరించాలనీ ప్రయత్నం చేసేవారు! ఈ అనుకరణ ప్రయత్నమంటే నాన్నగారికి చాలా భయం. అజ్జుక నాన్నగారి మనస్సుకు ఆనందం చేకూర్చాలని ఎంతో ప్రయత్నం చేసేది. చంద్రుడు తన సమయాన్నంతటినీ వేటాడంలోనూ, మేనత్తల్తో నృత్యగానాది వినోదాల్తోను గడిపేవాడు.

నా వదినెలు నన్ను కూడా నృత్యగానాది విలాసాల్లోకి లాగాలని చూసేవారు, కానీ నేనుమాత్రం నా సమయాన్నంతటినీ నాన్నగారిదగ్గరే గడిపేవాడిని. నాన్నగారికి యౌధేయ జాతియొక్క ప్రాచీన ఇతిహాసాన్ని గురించి వారి శౌర్యాన్ని గురించి వారి మత సాంప్రదాయాలను గురించి ప్రగాఢమైన జ్ఞానమూ, పరిచయమూ వున్నాయి. ఇప్పుడు నాకు వారి మాటలు అర్థంచేసుకొనే వయస్సు వచ్చింది. నాన్నగారు అర్థరాత్రివరకూ యౌధేయ జాతినిగురించి అనేక విషయాలను చెబుతూ వుండేవారు. నాకు కలిగే సమస్యలనూ, అనుమానాలనూ ప్రశ్నలద్వారా నివారించుకొనేవాడిని. ఒకరోజున "మనలను యౌధేయులనీ పిలుస్తారు. ఆగ్రేయులని పిలుస్తారు. ఇలా రెండుపేర్లు ఎందుకు వచ్చాయి" అనడిగాను.

"యౌధేయగణంలో కొన్ని ఉపగణాలు (శాఖలు) కూడా వున్నాయి. ఆగ్నేయ, రోహతకి, ఖాండిల్య మొదలైన శాఖలు లేక ఉపగణాలు వున్నాయి. ప్రతి గణానికి ప్రత్యేకంగా కార్షాపణాలు (ముద్రలు) వుండేవి. వీటికి గణ సంస్థలు కూడా విడివిడిగా వున్నాయి. ఈ ఉపగణాల్లో పరస్పరం యుద్ధాలూ, కొట్లాటలూ లాంటివేమీ సంభవించేవి కావు. కానీ మాకు పశ్చిమానా, తూర్పునా పెద్దపెద్ద రాజ్యతంత్రాలు (రాజ్యాలు) ఏర్పడ్డాయి. ఆ రాజులకు, సస్యశ్యామలములైన, పాడి పంటలతో నిండిన మా నగరాలను, గ్రామాలను వశంచేసుకోవలెనన్న ఆశ గలిగింది. బలవంతులైన ఆ రాజుల ముట్టడుల నుండి బలహీనములైన ఈ గణ శాఖలు తమను తాము రక్షించుకోలేని స్థితిలో వుండేవి. ఇకనప్పుడు బలహీనంగా వున్న ఈ చిన్న చిన్న గణాలన్నీ ఒక కూటమిగా తయారై ఒకే పెద్ద గణ రూపాన్ని పొందాయి. తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకోడానికి ఈ చిన్న గణాలకు ఒకదానిలో ఒకటి విలీనం కావడం తప్పని సరైన పనయింది. మేము యుద్ధంలో దుర్ధర్షులం కావడంవలన ఈ మొత్తపు సంయుక్త గణానికి యౌధేయ గణమని పేరు వచ్చింది. ఇది జరిగి యిప్పటికి దాదాపు నాలుగు వందల సంవత్సరాలవుతుంది. కానీ మాళవగణం మాలాగా గణతంత్రకూటమిని మేర్పరచుకోలేదు. ఒంటరిగానే పోరాడదలిచింది. కాని మహాచక్రవర్తులైన ఆ రాజులతో ఒంటరిగా తలపడి గెల వడం సంభవమా? మాళవ గణంలోని యువకులుకూడా మనలాగానే ఉత్సాహ వంతులు. వాళ్ళూ వీరులే, వారిలోనూ జన్మభూమిపట్ల అపారమైన మమతా, త్యాగ బుద్ధీ వున్నాయి. కానీ ఇన్ని వుండికూడా వాళ్ళు తమ అస్తిత్వాన్ని కాపాడుకోలేక పోయారు. వివశులై విధిగా తమ జన్మభూమిని విడిచి క్రొత్త జనావాసాల్ని ఏర్ప రచుకోడానికి పిల్లా-మేకలతో నూతన ప్రదేశాలకు వెళ్ళిపోయారు. మనకు పశ్చిమాన శతద్రునది వడ్డున ప్రస్తుతం యౌధేయుల ఆధీనంలో వున్న భూభాగం. ఒకప్పుడు మాళవ గణానిది!

"మరా భూమి మన చేతుల్లోకి ఎలా వచ్చింది?"

"తండ్రీ కొడుకులూ, అన్నదమ్ములూ, ఒకరినొకరు రాజ్యకాంక్షతో చంపు కునే చిన్న పరివారం లాంటిది కాదు గణసంస్థ. కనుకనే గణసంస్థనూ, వ్యవస్థనూ రాజులు అనుకున్నంత తేలికగా నాశనం చేయలేరు! మౌర్యులు పురుషపురానికి పైన వున్న భూభాగాన్ని చాలావరకు జయించారు. చాలాకొద్ది గణాలను మాత్రమే వారు నాశనం చేయడం జరిగింది. సముద్రగుప్తుడి లాగానే మౌర్య చంద్రగుప్తుడు కూడా తన ఆశయాన్ని గణసంస్థలకు స్పష్టపరిచారు. విదేశీయ శత్రువులను ఎదుర్కో వడానికి భారతదేశం మొత్తం ఒక్క త్రాటిననడవాలని అతడి ఆశయం. మౌర్యులు కేవలం తక్షశిలకు చుట్టుపట్లవున్న గణాలను మాత్రం నాశనం చేశారు. కానీ, మౌర్యుల అనంతరం వచ్చిన రాజవంశాలు, అనేక గణాలను అతినిర్దయంగా నాశనం చేశారు! గణసంస్థలకు అదొక పెద్దవిపత్సమయం. యవన దేశీయుడైన మిళిందుడు (మినాండర్), అతడి వంశీయులు ఎన్నో గణాలను రూపురేఖలు లేకుండా జేశారు. పశ్చిమమున వున్న గణాలు చాలా ప్రతాపవంతంగా పోరాడాయి. కొన్ని చేసేదిలేక తమ మాతృ భూమిని వదిలాయి. అలా మాతృభూమిని వదిలిన గణాలు కొన్ని మనలో వచ్చి కలిశాయి. జన్మభూమిని వదిలి దూరప్రాంతాలకు వలసపోయిన గణాలు యవనుల ప్రథమ ప్రహారాన్ని ఎటూ ఎదిరించాయి. అలా యవనుల్ని ఒకరకంగా కొంత బలహీనపరచి పరోక్షంగా మనకు కొంత చేయూత నిచ్చాయి. యవనుల ఆ మొట్టమొదటి దెబ్బ మనమీదే పడ్డట్లయితే, నిలదొక్కు కొనగలిగే వారమో, లేక మనమూ జన్మభూమినివదిలి వెళ్ళవల్సివచ్చేదో తెలియదు! కుషాణుల సమయంలో గణాలకు, మళ్ళీ కొంత ఆపదవచ్చింది! కానీ అప్పటికి కొన్ని గణాల సంయుక్త రూపమైన, బలిష్ఠమైన యౌధేయ గణం ఏర్పడ్డది. గణాలయొక్క ఈ విస్తృతమైన కలయిక తరువాత యౌధేయ గణంయొక్క శక్తి సామర్థ్యములు అపారంగా పెరిగిపోయాయి. రాజులు నల్లని కారుమేఘాల్లా విజృం భించేవారు. కానీ ప్రళయ ప్రభంజనంలాంటి యౌధేయ పరాక్రమం ముందు చెల్లా చెదరయ్యేవారు. తరాలు గడిచిన కొలది రాజవంశాల శక్తి నశిస్తూ వుండేది. ఇటు గణసంస్థలకు శక్తి పెరుగుతూ వుండేది. లోగడ గడించిన అనుభవం నుండి మన వాళ్ళు మరొక విషయంకూడా గ్రహించారు. మన గణసంస్థల పరిపాలనలో జోక్యం కలిగించుకోకుండా ఈ సంస్థల అస్తిత్వానికి దెబ్బలేకుండా వుండే పక్షంలో రాజుల్తో సహకరించడంగానీ, వారి నిబంధనల అనుమోదనంలోగాని—అట్టే నష్టమేమీ వుండదని తెల్సుకొన్నారు. కుషాణుల్తోకూడా మేమీలాంటి సంబంధాలనే పెట్టు కున్నాము. కుషాణులుకూడా మానుండి అధికంగా ఏమీ ఆశించలేదు. ఆశించి ప్రయోజనం వుండదని వారికి గట్టిగా తెల్సును. యౌధేయుల కత్తియొక్క ధాక వారికి విదితమే. పైగా కుణింద గణం, అర్జునాయన గణం, యౌధేయ గణం— ఈ మూడు గణాలు కలిసి ఒక సంయుక్త గణసంఘాన్ని ఏర్పరచుకున్నాయి కూడాను!"

విక్రమ శక

"మరీ సంఘంలో మాళవగణాన్ని ఎందుకు చేర్చుకొనలేదు? వాళ్ళూ పరాక్రమవంతులేగా?"

"వాళ్ళలో చాలామంది ధనిక పెద్దలు తయారయ్యారు. ఆ పెద్దలు తమ స్వార్థంకోసం మాళవ గణాన్ని ఈ గణ సమూహంలో చేరనీయలేదు. నీ వన్నట్లు మాళవులు నిజంగా పరాక్రమవంతులు, వీరులు. అందులో ఏమీ సందేహమూ లేదు. ఇప్పటికి 309 సంవత్సరాల క్రితం ఈ మాళవ వీరులే కుషాణుణ్ణి తరిమి కొట్టారు. ఆ ఘనవిజయానికి స్మారక చిహ్నంగానే మాళవ శకాన్ని (విక్రమ శకాన్ని) ప్రారంభించారు. రెండువందల సంవత్సరాలక్రితం మహాక్షత్రపుడైన రుద్రదామా యౌధేయులను ఓడించి తీరుతానని ప్రతిజ్ఞపట్టాడు. కానీ, అతడు యౌధేయులను ఏం ఓడించగలడు? యౌధేయుల చేతిలో తానే ఓడిపోయాడు. ఆఁ, ఉత్తరాపథంలో కుషాణుల్ని మాళవులు ఓడించినంతగా, యౌధేయులను రుద్రదామాను ఓడించలేకపోయారనేది నిర్వివాదాంశం! మాళవులు కూడా మాతో కల్సి ఈ గణ సంఘంలో తామూ సభ్యులైనట్లయితే, రుద్రదామాను తిరిగి ఎన్నటికీ తల ఎత్తకుండా నడుములు విరగ్గొట్టేవాళ్ళం! రుద్రదామా మాతో తలపడడంవల్ల ఒక్క మేలు మాత్రం తప్పకుండా జరిగింది. కుణిందులు, అర్జునాయనులూ, యౌధేయులూ కలసి ఒక సంయుక్తసంఘాన్ని ఏర్పరచుకున్నారు. ఇక నిప్పుడు సామాన్యులెవరూ ఈ సంఘంవైపు కన్నెత్తి చూడడానికికూడా సాహసించలేరు!"

"మన పూర్వీకులు మొదటగావచ్చి నివసించిన భూమంతా ఇప్పటికీ మన చేతుల్లోనే వుందా?"

"నా ఉద్దేశంలో; అప్పటికంటే అధికభూమి ఇప్పుడు మన ఆధీనంలో వుందనుకొంటాను! చుట్టుపక్కలవున్న రాజులు బలహీనులైనప్పుడు-వారి ఊషర ప్రదేశాలను కొన్నింటిని మనం దఖలుపరచుకొంటూ వచ్చాము!"

"మరి నాన్నగారూ! సముద్రగుప్తుడి మాతృకులమైన లిచ్ఛవి వంశీయులు మగధలో కుషాణుల శాసనాన్ని అంతం చేశారు. యాభై సంవత్సరాల క్రితం వరకు కూడా పాటలీపుత్రంలో కుషాణుల క్షత్రపుడు వుండేవాడుట. మన భూమి హిమాలయ చరణములనుండి ఖలతికా (కాలసి)వరకూ వ్యాపించివుంది కదా? అలాంటప్పుడు అసలు కుషాణులు మగధకు మన భూభాగాన్ని దాటి ఎలా రాగలిగారు?"

"నేను చెప్పానుగా? బలవంతుడైన శత్రువుతో మనకు నష్టంలేని విధంగా సహకరించడానికి, మనం ఎప్పుడూ సిద్ధంగానే వుంటాం! స్రుఘ్న (అంబాలా) లోనూ, మరికొంత ఉత్తరభాగంలోనూ వాళ్ళకు రానుపోను మార్గాన్ని వదిలాము. సముద్రగుప్తుడూ, లిచ్ఛవులు, కుషాణులను మధ్య దేశంనుండి తరమ లేకపోయారు. కానీ, ఆ పనిని యౌధేయులు చేయగలిగారు. రాజులవద్ద వుండే సైనికులకు ఆదర్శం రాజపరివారాన్ని గెలిపించడం. ఆ పరివారానికి అధికాధికంగా

సౌఖ్యాలను చేకూర్చడం! కాని, మన గణతంత్ర వ్యవస్థలోని యువకుల ఆదర్శం అలాటిది కాదు. గణం విజయాన్ని పొందితే ప్రతి యువకుడికి శాంతి, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం లభిస్తాయి! గణం అపజయాన్ని పొందితే, ప్రతి ఒక్క యువకుడూ అస్వతంత్రుడూ, పరతంత్రుడూ అవుతాడు! అందువల్లే మా యువకులు ప్రాణాలకు తెగించి పోరాడారు. కుషాణులను శతద్రునది ఆవలికి తరిమారు! మా ధాటకు తట్టుకోలేక కుషాణుల ప్రముఖమైన దేవపుత్ర శాహి పారసీక చక్రవర్తిని శరణువేడాడు. తన మకుటాన్ని అతడి పాదాల దగ్గర వుంచాడు. కుషాణులనూ, క్షత్రపుల్నీ మేము విదేశీయులుగా భావించడంలేదు. ఐదువందల సంవత్సరాల క్రితం వారి దేశానికి ప్రథమంగా వచ్చినప్పుడు విదేశీయులే కావచ్చు. కానీ, ఈ సుదీర్ఘమైన వ్యవధిలో ఈ దేశం వారికి మాతృదేశమైంది! అలాటి స్థితిలో దేవపుత్రశాహి పారసీకుల అండచేరడం, చాలా గర్హింపదగిన విషయం!"

యౌధేయులకు సంబంధించిన పూర్వచరిత్రను విన్నతరువాత యౌధేయ జాతియొక్క భవిష్యత్తును గురించిన నా అనుమానాలను నాన్నగారి ముందు వుంచాను.

"నీవు చెప్పినది నిజమే! రాజ్యతంత్రానికి, గణతంత్రానికి బొత్తిగా సరిపడదు. గణతంత్రం తన ప్రజల్లో ఆత్మవిశ్వాసాన్ని, గౌరవాన్ని పాదుకొల్పుతుంది. రాజ్యతంత్రం అలా చేయదు. తన ప్రజ లందరినీ గొర్రెలుగా మారుస్తుంది!" అన్నారు నాన్నగారు.

"ఇది చాలా అన్యాయం! మానవుల్ని, గొర్రెలుగా తయారుచేయడం, ప్రపంచానికి ఏ విధంగాను శుభదాయకంకాదు. ఇంత అన్యాయ పూర్ణమైన ఈ వ్యవస్థ ఎలా మనగలుగుతున్నది?"

"బలవంతులు బలహీనులను దాసుల్నిగా, బానిసల్నిగా చేసుకోవడం న్యాయమనీ, ధర్మమనీ ఎవరనగలరు? అందువల్లనే వారు యుద్ధాలను ప్రేమిస్తారు. కరవాలాల్ని అధికాధికంగా పోగుచేస్తారు!"

"అయితే ప్రపంచంలో అన్యాయమే గెలుస్తుందంటారు?"

"మానవులు బలహీనులై యుండడమే ఒక ఘోరమయిన అన్యాయం. అందువల్లే దేశాలు ఒకటొకటే దాస్యాంధకారంలో మునిగిపోతున్నాయి!"

"నాన్నగారూ! పూర్వం యవన దేశంలో కూడా మన దేశంలో లాగానే గణతంత్ర వ్యవస్థ వుండేదిటగా? అక్కడ కూడా మనలాగానే గణసంస్థ దేశ పరిపాలనా బాధ్యతను నిర్వహిస్తూ వుండేదిట. ఉత్తరాపథం వరకూ జయించిన అలకసుందర తండ్రి ఆ దేశంలోని గణతంత్రాన్ని నాశనంచేసి రాజ్యతంత్రాన్ని పాదుకొల్పాడుట. పాపం ఇప్పటికి కొన్ని వందల సంవత్సరాలనుండి రోమను రాజుల పాలనలో బానిసల్లా పాలింపబడుతున్నారట యవనులు! ఈ విషయాన్ని తల్చు

కొన్నిప్పుడు మన భవిష్యత్తును గురించే నాకు చాలా బాధగా వుంటుంది నాన్న గారూ!"

బాధపడవల్సిన పనిగాని, చింతించవల్సిన పనిగాని ఏమీలేదు. యౌధేయులు ఖడ్గధారులైనంతవరకూ తమ మాతృభూమికోసం ప్రాణాలను తృణప్రాయంగా విసర్జించుతారు. యౌధేయుల్లో ఐకమత్యం ఉన్నంతవరకూ చింతించవల్సిన పని ఏ మాత్రమూ లేదు. కాని, యౌధేయుల ఐకమత్యానికి విఘాతం ఏర్పడుతున్నది. అందుకు మాత్రం మనం విధిగా విచారపడాలి."

"ఐక్యతకు ఏం విఘాతం?"

"దీనార్లమీది మమకారం యౌధేయుల్లో వ్యత్యాసాన్ని కల్గిస్తోంది. నాలుగు దీనార్లను సంపాయించినవాడు మహారాజులా వస్త్రాభరణాల్ని ధరించి, తన ప్రక్కనున్న యౌధేయుణ్ని చిన్నచూపు చూడడం ప్రారంభించాడు. ప్రక్కన ఉన్న వాళ్ళు కూడా అతడంటే ఈర్ష్యా స్వభావాన్ని కలిగి ఉండసాగారు. ఈ ఇరవై ఏండ్ల సముద్రగుప్తుడి సంపర్కంవలనే యౌధేయుల్లో ఇంత వ్యత్యాసం కనబడితే, ఇకమీదట జరగబోయే ఐక్యతా విఘాతాలు ఎలా వుంటాయో వూహించవచ్చును!"

"నాన్నగారూ! రాజుల విలాసం రోజురోజుకూ పెరిగిపోతున్నది. విలాసాలకు దీనార్ల అవసరం ఎటూ వుంటుంది కాదా? దీనార్ల అవసరం పెరుగుతోంది! దీనార్లకోసం ప్రజల్నీ, సరిహద్దునవున్న ఇతర దేశాలను దోచుకోవడం ఎక్కువ అవుతోంది! ఈ పరిస్థితిలో యౌధేయ భూమిలాటి సస్యశ్యామలమైన భూమిమీద రాజుల "కన్ను" పడకుండా వుండడం అసంభవం! రామగుప్తుడు చాలా సరళమైన స్వభావం కలవాడు. బహుశః అతడు సముద్రగుప్తుడి ప్రస్తుతపు నీతిని (వ్యవస్థను) చెదరగొట్టక పోవచ్చును. కాని ఎక్కువ రోజులు అతడు పాటలీపుత్రపు సింహాసనం మీద నిలవగలడా?—అని నా అనుమానం!"

"అదేమిటి నాయనా, అలా అంటున్నావు?"

"అవున్నాన్నగారూ! చంద్రగుప్తుడు చాలా తెలివి కలవాడు! మహా ధూర్తుడు! అతడు తన ఆశయాలను ఎవ్వరికీ చెప్పడు. మౌర్య చంద్రగుప్తుడు, విష్ణుగుప్త చాణక్యుడు అతడికి ఆదర్శప్రాయులు!"

"ఇది తప్పక అనుమానించదగిన విషయం. చంద్రగుప్తుణ్ని ఆ దారినుండి మరల్చడం అసంభవం. అతడు గణతంత్ర వ్యవస్థకు సహకారి యెన్నటికీ కాడు. గణాలు యింకా పటిష్టమై, తమ బలాల్ని పెంచుకొంటే అతణ్ణి అడ్డుకోగలవు!"

"నేనూ అదే అనుకొంటున్నాను. మన గణాన్ని ఎలా పటిష్టం చేయడమా అని రాత్రింబవళ్ళు ఆలోచిస్తుంటాను. ఆచార్య వసుబంధు లిచ్ఛవి గణానికి సంబంధించిన అనేక విషయాలను చెప్పారు. బుద్ధ భగవానుడు లిచ్ఛవి గణాన్ని ఆధారంగా తీసుకొనే, భిక్షు సంఘాన్ని ఏర్పరిచారు. బుద్ధుడికి రాజతంత్రం కంటే, గణతంత్ర మంటేనే యెక్కువ యిష్టమూ, అభిమానమూనట! భగవానులు ఉచ్ఛ

వించిన శాక్యవంశీయులు కూడా గణతంత్రవాదులే నట? అది సరే, మిమ్మ ఒక్క విషయం అడగాలను కొంటున్నాను."

"భిక్షు సంఘపు నియమాలు చాలా వుంటాయట. అవి ఎక్కడా లిఖిత రూపంలో దొరకవట! నే నా నియమాలేమిటో తెల్సుకోవాలను కొంటున్నాను. బహుశా జీవితంలో నేను యెప్పుడైనా భిక్షువుని కావచ్చు."

నాన్నగారు కొద్దిగా వ్యాకులపడ్డారు. "వద్దు నాయనా! నీవు భిక్షువువు కావద్దు! నాకు నీ వొక్కడివే కుమారుడివి. నేను, యౌధేయ జాతికూడా నీ మీద ఎన్నో ఆశలు పెట్టుకొన్నాము!" అన్నారు.

"నేను నిర్వాణం కోసంగానీ, వైరాగ్యం కోసంగానీ భిక్షువును కాబోవడం లేదు. యౌధేయ జాతికి సేవ చేయడానికి అధికారికంగా యోగ్యతను సంపాయించ డానికే కొద్దికాలం భిక్షువు నవుతానేమో!"

"అలాటి ఆశయంతో నీవు భిక్షువు వయ్యేట్టయితే, ఎలాటి అభ్యంతరమూ వుండదు నాయనా!"

"బుద్ధుడు తన సంఘంలో వున్న భిక్షువు లందరికీ జాతి, మత, కుల, ధన-ఇత్యాది భేదాలను, వ్యత్యాసాలను విస్మరించి ఒకే స్థాయిలో వుండవలసిందని బోధించాడు. వారి బోధనంను అనుసరించే ఇప్పటికీ అశోకారామంలో-యవనులు, పారసీకులు, శకులు, మాగధులు, విదర్భులు, సింహళులు మొదలుగాగల దేశాల వారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర — మొదలుగాగల కులాలవారు ఏ విధమైన భేదభావమూ, పెద్దా చిన్నా అనే తారతమ్యమూ లేకుండా కలిసి మెలిసి వుంటున్నారు. మన గణాల్లో కూడా ఇలాంటి వ్యవస్థలు ఎందుకు తీసుకు రాకూడదు?"

"బౌద్ధ, జైన—ఈ రెండు మతాలవారికి సంఘమే అన్నిటికంటే ప్రధాన మైనది. ఈ రెండు మతాలవారు గుప్తులు సృష్టించిన, విష్ణువులాంటి వాడెవడో వున్నాడనీ, వాడే ఈ ప్రపంచానికంతకూ కర్త అనీ విశ్వసించరు! అందువలన మన గణతంత్రాలకు గుప్తుల విష్ణువాదం కంటే, జైన బౌద్ధుల సంఘవాదమే ఎక్కువగా ఉపయోగపడుతుంది. మన యౌధేయభూమిలో నివసిస్తున్న ఇతర జాతులవారికికూడా గణసంస్థలో సభ్యత్వాన్నిచ్చి పరిపాలనలో పాల్గొనడానికి అవకాశాన్నిస్తే, మన సైనికశక్తి తప్పక పెరుగుతుంది. సందేహంలేదు!"

"మరి అలాంటి అవకాశాన్ని ఇప్పించడానికి ఎందుకు ప్రయత్నం చేయ కూడదు?"

"ప్రస్తుత పరిస్థితుల్లో మన ప్రయత్నాలు ఫలించవు. మన గణసంస్థయొక్క సభ్యత్వం అనాదికాలం నుంచి రక్త సంబంధీకుల వరకే పరిమితమై వున్నది. వెనుకటినుండి వస్తున్న ఆచారాలను ఒక్కసారిగా త్రోసిరాజనడానికి వీలుండదు. అలా అనడంవలన ఎన్నో బాధలకు, ప్రమాదాలకు గురికావలసి వస్తుంది. పైగా

మన యౌధేయ ధనికులవద్ద దాస దాసీజనాలు వుంటారు. వీళ్ళ శిల్పుల్నికూడా ఒకరకంగా దాసులుగానే భావిస్తారు. ఇలాటి దాసులందరికీ స్వతంత్ర ప్రతిపత్తి లభించడం మన ధనికులకు బొత్తిగా యిష్టంలేని విషయం. అప్పుడీ ధనికులు ప్రజల్ని రెచ్చగొడతారు! తప్పుదారి పట్టిస్తారు. "వీళ్ళ విజాతీయులకు [యౌధేయులు కాని వాళ్ళకు] దేశాన్ని వప్పజెప్పాలని చూస్తున్నారు. మనదేశంలో యౌధేయులు కాని వారి సంఖ్యే యెక్కువ. ఇలాగనక దేశంలోని వారందరికీ పరిపాలనాధికారాన్ని ఇస్తే, దేశం యౌధేయులు కానివారి చేతుల్లోకి పోతుంది" అనే విధంగా చెప్పి స్వార్థపరులు యౌధేయుల్లో ద్వేషానలాన్ని ప్రజ్వలింపచేస్తారు. అనైక్యతను రేకెత్తిస్తారు. ఇప్పటి పరిస్థితి నీకు తెల్సిందికదా? ప్రస్తుత పరిస్థితుల్లో యౌధేయుల్లో అనైక్యత సంభవించడం ఏ విధంగానూ క్షేమంకాదు."

"యౌధేయుల వర్ణసంకర వ్యతిరేక భావన నిజంగా ఈ విషయంలో అడ్డంకిని కలిస్తుంది. కాని, యౌధేయులు ఇప్పటికంటే కూడా శక్తి సంపన్నులు కావాలి కదా!"

"ప్రస్తుతానికి మాత్రం ఈ పరివర్తన యౌధేయుల్ని బలహీనుల్ని, అనైక్యతా వాదుల్ని - చేయడానికి మాత్రమే ఉపయోగ పడుతుంది. భవిష్యత్తులో యెప్పుడైనా ఈ పరివర్తనకు తగిన పరిస్థితులు ఏర్పడితే అప్పుడు!"

ప్రపంచంలోని ఇతర గణసంఘాలను గురించి, భిక్షు సంఘాలను గురించి అధికాధికంగా తెల్సుకొనసాగాను. సాధ్యమైనంత జ్ఞానాన్ని ఆర్జించి మా గణ సంస్థను పటిష్టం చేసుకోవాలన్న వూహ నాలో బలవత్తరం కాసాగింది.

* * * *

ఈసారి అజ్జుక భద్రా, ఖాండిలా, వృధూదక, రోహతకీ – మొదలైన నగరాలను చూడడానికి పోయింది. పై నగరాల్లోవున్న బంధువుల్ని చూడాలని నాకు మొదట్నించి కోర్కెగా వుంది. ఇప్పుడిక అజ్జుకతోపాటు నేనూ పోవడం అనివార్యం! చంద్రుడికి ఇవేమీ పట్టవు. అతడి నృత్యగానాదులేమో, అతడేమో!

ఆగ్రోదకాలోని యౌధేయుల్లో లాగానే, ఇతర నగరాల్లోని యౌధేయుల్లో కూడా విలాస ప్రియత్వం చాలా పెరిగిపోయిన ప్రతిచోటా అజ్జుకకు, నాకూ ఘనమైన స్వాగతాన్ని ఇచ్చారు. రోహతకీలో మా పెత్తండ్రి కొడుకు అత్తవారు వున్నారు. సునంద వదినె అక్కడే వుంది. సునందకు నేనంటే ఎంతో ప్రేమ. నృత్యసమయాల్లో ఆగ్రోదకాలో నేను వుండడం జరిగితే వదినె తప్పక నాతో నృత్యంచేసేది. సునంద నన్ను గురించి అక్కడ సమాజంలో మహా పొగిడేసింది. తత్ఫలితంగా రోజూ ఎంతోమంది యువతుల్తో నాట్యం చేయవల్సి వస్తూవుండేది! అప్పుడప్పుడూ రాసలీలలు కూడా చేస్తూ వుండేవారము. రాసలీలల్లో పది పదహేను మంది యువతీ యువకులు వలయాకారంలో నృత్యంచేస్తూ వుంటారు. సునంద

చెల్లెలు నంద వయస్సులో నాకంటె కొంచెం పెద్దది. బలంగా, ఆరోగ్యంగా వుండేది. ఆమె నాట్యంలో నన్ను ఓడించలేక పోయింది. ఒక్కొక్కసారికి ఒక్కొక్క కడవ పాలు త్రాగడం యౌధేయ యువకులకు చిటికలు వేసిన మాత్రపు పని! కాని, పాటలీ పుత్రపు రాజప్రాసాదాల్లో పెరిగిన వాళ్ళకు ఈ విషయం పూర్తి అసంభవంగా కనిపించవచ్చును! కానీ, నేను యౌధేయ భూమిలోకి వచ్చినప్పుడు పూర్తి యౌధేయుణ్ణవడానికి ప్రయత్నించే వాడిని. ఒకరోజున అందరూ గూడుపుఠాణీ చేశారు. నన్ను వంట ఇంట్లో నుండి పాలకడవను బయటికి తీసుకురమ్మన్నారు. నేను ఇంట్లోకి పోయేసమయానికి నంద రివరివావచ్చి గడపలో దారికడ్డం నిలబడ్డది. ఆమె రెండు చేతులనూ చాపి మార్గాన్ని నిరోధిస్తూ "నన్ను అవతలికి నెట్టి అయినా పో? లేదా, కాళ్ళక్రిందగా దూరి అయినా పో!" అన్నది. చాలా సేపు బ్రతిమలాడి చెప్పాను. అలాటి షరతులు వద్దన్నాను. కాని నందకు తన బలంమీద చాలా అభిమానమూ, గర్వము! నేనూ బలంలో ఆమెకు ఏ విధంగానూ తీసిపోను. అయినా స్త్రీతో బలపరీక్ష అసభ్యం అనిపించింది. నంద ఇలా అన్నది: "నేను స్త్రీనని చాలా తక్కువ దృష్టితో చూస్తున్నావు కదా?"

"లేదు వదినే! నేను స్త్రీని ఎన్నడూ తక్కువ దృష్టితో చూడను!"

"నీ హృదయంలో స్త్రీకి స్థానంలేదన్న విషయం నాకు తెల్సు!"

నేను వీరాసనం వేసుక్కూర్చుని, చేతులు జోడించి "ఓ దేవీ, నిన్ను నా హృదయంలో ప్రతిష్ఠించుకోవడానికి నేను సదా సిద్ధంగా ఉన్నాను కాని, నీతో కుస్తీ పట్టడం మాత్రం నావల్లకాదు!" అన్నాను.

"నా దగ్గర నాటకాలాడకు, నీవు చాలా కఠినుడవని అక్క చెప్పింది!"

"సునంద వదినెకూడా నేను 'కఠినుడ'ననే అనుకొంటోందా? కాని, వదినా నీతో నేను ఎన్నడైనా కఠినంగా వ్యవహరించానా? నీతోనే కాదు, అసలే యువతితోనైనా కఠినంగా వ్యవహరించానా? నీవు ఎప్పుడు నృత్యానికి రమ్మంటే అప్పుడు రాలేదా? నీవు అర్ధరాత్రి వరకూ నృత్యంతో నన్ను విసిగించినా నేను 'కాద'న్నానా?"

"నీలో వున్న గర్వం నిన్నలా చేసింది. ఎవరితోటి ఓడడం నీకిష్టంలేదు!"

"నన్ను ఓడించాలని వుందా వదినే? నేనీ పర్యాయం ఓడానని ఒప్పుకొంటాను!"

"ఐతే, చెంపలు వేసుకో కాళ్ళక్రిందుగా దూరు!"

"చెంపలు వందసార్లు వేసుకోమన్నా వేసుకొంటాను. నీ రెండవ షరతున్నదే. అది నీకు అగౌరవ కారణం. నాకూ అగౌరవ కారణం!"

"ఇవ్వాళ గౌరవం, అగౌరవం విషయము వదిలిపెట్టు! నేను చెప్పిన దానికి ఒప్పుకొంటావా, ఒప్పుకో! లేదా వట్టిచేతులతో వెనక్కి తిరుగు. మిత్రుల హేళనలు అనుభవించు."

"అయితే నన్ను నీతో కుస్తీ పట్టమంటావు? కాని ఇది కుస్తీకి తగిన ప్రదేశం కాదు. నీ దుస్తులు కూడా కుస్తీకి తగిలేవు!"

"కుస్తీకి ఏ స్థానమయినా పనికి వస్తుంది. దుస్తులు మార్చుకోవడం విషయమా? నేను దుస్తులు మార్చుకోవడానికి వెడితే కాలికి బుద్ధి చెబుదామని నీ వుద్దేశం!"

"నేను కాలికి బుద్ధి చెబుతానా? నేను యౌధేయుణ్ణి........ యౌధేయుడి మాటమీద నీకు విశ్వాసం లేదా?"

"విశ్వాసం, గిశ్వాసం– ఇవేమీ నాకు తెలియదు!"

నేను చాలా సందిగ్ధంలో పడ్డాను. ప్రక్క గదుల్లో నుండి హేళనా స్వరంలో నవ్వులు వినవస్తున్నాయి. మధ్య మధ్య ఎవరెవరో తొంగి చూస్తున్నారు. చివరకు ఇలా అన్నాను. "ఐతే, వదినా! ఒకపని చేయి ఇద్దరం బరువు ఎత్తడంలో పోటీ పడదాం! ఎవరు ఎక్కువ బరువు ఎత్తితే వాళ్ళు గెలిచినట్టు! సరేనా?"

"ఊఁ, హూ! బరువులు గాడిదలు ఎత్తుతాయి."

"ఐతే! నా గుప్పెడను నీ ముందుంచుతాను విప్పు! విప్ప గలిగితే నీవు గెల్చినట్టే!"

"ఆఁ ఇది కొంచెం తెలివిగల పందెం!" నంద తయారయింది.

నేను గుప్పెడ బిగించి ఆమెముందు పెట్టాను. ఆమె అరుణ కపోలాలు, మరీ అరుణిమను దాల్చాయి. "అక్క చెప్పినమాట చాలా నిజం! నీవు స్త్రీలను అతి హీనదృష్టితో చూస్తావు. కుడి గుప్పెడ కాకుండా, ఎడమ గుప్పెడ ఇస్తున్నావు!" అన్నది నంద.

నేను ఎడమ గుప్పిడి తీసి కుడి గుప్పిడి ముందుకు జాపాను. నంద రెండు చేతులతోటి గుప్పిడి తెరవడానికి ప్రయత్నం చేయసాగింది. కాని గుప్పిడి తెరువ బడుతుందా? ఆమె ముఖాన స్వేద బిందువులు ముత్యాల్లా మెరిసాయి. తలవెంట్రుకలు రేగి చెంపలమీద ఆడుకోసాగాయి. నేనా వెంట్రుకలను ఒక చేత్తో మాటి మాటికి వెనక్కి నెడుతూ "భలే, భలే!" అంటూ ఆమెను ఉత్సాహపరచసాగాను. ఇంతలో మరికొంతమంది యువతీ యువకులు వినోదం చూడడానికి ప్రోగుపడ్డారు. నేనిలా అన్నాను: "నందా వదినె! వీళ్ళంతా మనని మూర్ఖుల్ని చేస్తున్నారు, నేనెటూ ఓటమిని ఒప్పుకోవడానికి సిద్ధం, నీ మొండి పట్టును వదిలేసెయ్యి!"

పాపం గుప్పిడి విప్పాలని ఎంతో ప్రయత్నం చేసింది. కాని, అది తెరువ బడలేదు. ఆమె చేతులకు చెమట పట్టింది. చేతులు పట్టుతప్పినప్పుడల్లా నంద ముఖం కోపంతో ఎర్రనయ్యేది. ఎంత బాధ అయినా ఓటమిని మాత్రం ఒప్పుకోవ డంలేదు. అదే సమయంలో సునంద వదినె వచ్చింది. నంద చెమటలో తడిసి వుండడం చూసి, చుట్టూ వున్న యువతీ యువకులను చూస్తూ, "నందా ఇదంతా వీళ్ళు చేసిన కుట్ర! జయ ఎప్పుడూ నీతోనే నృత్యం చేస్తూండడంవలన, మీ యిద్ద

రికి ఎలాగైనా పోటీపెట్టాలని ఆలోచించారు. మీ యిద్దరినీ మూర్ఖులను చేశారు. సరే, ఇప్పటికైనా జయ పూర్తి యౌధేయుడని విశ్వాసం కలిగింది కదా? పూలమాల తెచ్చి ఈయమంటావా? జయ మెడలో వేద్దువుకాని?" అన్నది.

పూలమాల విషయం వినేసరికి నంద సిగ్గుపడిపోయింది. లేచి నిలబడ్డది. నేనూ లేచి నిలబడ్డాను. నంద తలను నిమురుతూ "ఇక ఇప్పుడైనా పాలు తీసుకు వెళ్ళవచ్చునా?" అనడిగాను.

సునంద వదిన ఇలా అంది: "నీ విజయాన్ని ప్రకటిస్తున్నావా? మరిదీ!"

నేను మోకాటిమీద కూర్చుని అంజలి ఘటించి "లేదు వదినా! విజయం మీదే! నాకు పాలకడవ లభిస్తే చాలు!" అన్నాను.

"అలాకాదు. రోహతకీ యొక్క యౌధేయస్త్రీలు అబలలని నీ భావన అయివుంటుంది!" అన్నది సునంద.

"రోహతకీ స్త్రీలను అబల లనుకునేది ఇక్కడ స్త్రీల విషయం తెలియని వాడే. నేను ఎప్పుడో నీకు దాసుణ్ణయినాను!"

సునంద నవ్వుతూ "అబ్బ.... రాజప్రాసాదార్లో పెరిగావు! మీతో పేమ మాట్లాడగలమా? సరే మరిదీ, లేచి పాలు తీసుకుపో! ఇదిగో, సాయంకాలం రోహతకీ యువతులతోపాటు పాన గోష్ఠికి నీవూ సిద్ధం కావాలి!" అన్నది.

"తప్పకుండా, పానగోష్ఠంటే నే నెన్నడయినా ముఖం త్రిప్పానా, వదినా?"

"ముఖం త్రిప్పవు సరే, ఇవ్వాళ రోహతకీ యువతులు నిన్ను తేలికగా చషకాన్ని దింపనివ్వరు!"

"ఐతే, నా నెత్తికి ఇవ్వాళ భూతాన్నెత్తుతా రన్నమాట!"

"నీవు అత్తవారింటికి వచ్చావు జయా! ఇలాటి అవకాశం రోహతకీ యువతులకు ఎన్నాళ్ళకి లభిస్తుందో!"

పాలు త్రాగాము. సాయంత్రం నేను ఒక్కణ్నే యువతుల పానగోష్ఠికి హాజరయ్యాను. మధుపానం అధికం కాకుండా వుండటానికి చాలా జాగ్రత్తగా వున్నాను. కాని, నందా, ఆమెయొక్క స్నేహితురాండ్రు నన్ను బాగా త్రాగించడానికి బద్ధకంకణులై వున్నారు. నేను నా నిండు చషకాన్ని చేతిలోకి తీసుకొని ప్రక్కనవున్న యువతితో ఇలా అన్నాను! "సఖీ! నారీ అధరస్పర్శ తగలందే, ఈ మధువు మధురంగా వుండదు. నీ పెదాల స్పర్శతో ఈ మధువును పవిత్రం చేద్దూ!"

నా ప్రార్థనను ఎవ్వరూ కాదనలేదు. కొద్దిసేపట్లోనే చుట్టూవున్న యువతుల కండ్లు ఎరుపు తిరిగాయి. యువతులు ఇంకా ఇంకా త్రాగమని నన్ను బలవంతం చేయసాగారు. వాళ్ళ బలవంతాన్నుండి బయటపడటానికి పాట ప్రారంభించాను. సౌమిల్లుడి శృంగార గీతాన్నొకదాన్ని ఆలాపించాను. వాళ్ళూ కొన్ని పాటల్ని పాడారు. ప్రతి చషకాన్ని నేను పెదాలతో మాత్రం స్పృశించి పవిత్రం చేయ

డానికి వాళ్ళకు ఇచ్చేవాడిని! చివరకు బాగా నిషా యెక్కినవాడిలా నా స్వరాన్ని వికృతం చేశాను! పానగోష్టి సమాప్తమైంది. బయటికివచ్చి సహజస్వరంలో "సఖీ! ఇదిగో, నా నిషా దిగిపోయింది!" అన్నాను. మామూలు స్థితిలో ఒక గీతాన్ని ఆలాపించి వినిపించాను. అందరూ మత్తులో వున్నారు. అందరి కండ్లూ రక్తారుణిమ వర్ణములో మెరిసిపోతున్నాయి. పెదాలు వణుకుతున్నాయి. నా హేళనను అక్కడ అర్థం చేసుకొనగలిగింది ఎవరు?

# హిమాలయ యాత్ర

హిమాలయ పర్వతాలను దూరాన్నుండి చాలాసార్లు చూశాను. ఆచార్యుల వారు, హిమాలయ పర్వతశ్రేణులలోని నివాసులను గురించి, అక్కడి దేవదారు వృక్షాలను గురించి ఎంతో వర్ణనచేసి చెబుతుండేవారు. నేను చంద్రుణ్ణికూడా హిమాలయాన్ని చూడ్డానికి రమ్మన్నాను. అతడూ సిద్ధం అయ్యాడు. అజ్జుక మా ప్రయాణానికి అనుమతించింది. నాన్నగారైతే మరికొంచం ప్రోత్సహించారు. మేము ఇంద్రప్రస్థం వరకూ వెళ్ళాక అజ్జుకను నావమీద ఎక్కించి మేము గుర్రాల మీద వుత్తర దిశకు మళ్ళాము. స్రుఘ్న (అంబాలా)ను దాటి కొంచం ముందుకు పోయేవరకూ యమునకు పశ్చిమ తటాన పయనించాము. తరువాత వనప్రాంతం వచ్చింది. వనప్రాంతంలో మేమొక వ్యాపారపు గుంపును తోడు చేసుకొన్నాము. హిమాలయ పాదభూమిలో చాలాదూరం వరకూ వ్యాపించిన ఈ వనప్రదేశంలో, పులులూ, ఏనుగులూ-ఖడ్గమృగాల్లాంటి వన్యజంతువులు ఉంటాయి. చాలారోజులు అలా ప్రయాణంచేసి మేము సపాదలక్ష (శివాలింగ్) పర్వతశ్రేణులనుదాటి, హిమాలయ పాదాశ్రితమైన ఖలతికా (కాలసీ) నగరాన్ని చేరాము. అప్పట్లో ఖలతికా నగరం ప్రజాసమూహాలతో క్రిక్కిరిసి వుంది. పాంచాల, అంతర్వేది, యౌధేయ, స్రుఘ్న—మొదలైన ప్రాంతాలనుండే కాకుండా, ఇంకా దూరదేశాలనుండి కూడా సార్థవాహులు వివిధ వస్తు సముదాయాన్ని పట్టుకువచ్చి అమ్ముతున్నారు. గుర్రాలు, కంచరగాడిదలు, ఎద్దులు—కూడా అమ్ముడవుతున్నాయి. దుర్గమమైన పర్వతాల్లో నివసించే ప్రజలు మేకలమీదా, గొర్రెలమీదా వేసుకుని సామానులను తెచ్చారు. సాధారణంగా వీరు ఉన్ని దుస్తులను ధరిస్తుంటారు. వీరి వస్త్రాలంకరణ శకుల వస్త్రాలంకరణను పోలివుంటుంది. స్త్రీలుకూడా ఉన్ని వస్త్రాలనే ధరించారు. ఒక పెద్ద ఉన్ని గొంగళిని శరీరమంతా కప్పుకొంటారు. జారిపోకుండా ఇనుపచీలతో, కుడిభుజంమీద టాకు వేసుకొంటారు. ఆ పర్వత నివాసులకు స్నానం చేయడం తెలియదు. శరీరమూ, దుస్తులూ చాలా మురిగ్గా వుంటాయి. వాళ్ళ దగ్గరకువస్తే చెడ్డవాసన కొడుతూ వుంటుంది. వ్యాపారులు ఈ అమాయక ప్రజల్ని అనేక రకాలుగా మోసం చేస్తుంటారు. ఖలతికా పూర్వం యౌధేయుల పాలనలో వుండేది. ఆ రోజుల్లో యౌధేయులు వ్యాపారులమీద కఠినమైన నిబంధనలను విధించి, మోసాలు చేయకుండా చూచేవారు. తరువాత ఖలతికా నగరం దేవపుత్ర శాహి చేతుల్లోకి

పోయింది. అటుపిమ్మట సముద్రగుప్తుడి చేతుల్లోకి వచ్చింది. పై ఇద్దరి పరిపాలన రోనూ ఖలతికాలోని దొంగ వ్యాపారులు పెచ్చుపెరిగిపోయారు. పాప మా పర్వత ప్రజలకు లెక్కా, డొక్కా రాదు. దానికి తగినట్టుగానే కుషాణుడు (దేవపుత్రశాహి), గుప్తులు రకరకాలైన నాణెములను ప్రవేశపెట్టారు. ఇక పర్వత ప్రజల్ని దొంగ వ్యాపారులు మోసం చేయకుండా వుంటారా? పర్వత ప్రజల్ని మోసం చేయడానికి మరొక సున్నితమైన ఉపాయాన్ని ఆలోచించారు వ్యాపారులు! బాగా ఎర్రగావున్న ద్రాక్ష సారాయాన్ని పర్వత ప్రజలకు అందించేవారు. వాళ్ళకు పూర్తిగా నిషా ఎక్కిన తరువాత తమకు కావల్సిన ధరకు వస్తువుల్ని కొనేవారు, అమ్మేవారు వ్యాపారులు.

ఖలతికా యమునయొక్క దక్షిణ తటాన వుంది. ఇక్కడినుండే యమున కొండల్ని వదిలి మైదాన ప్రదేశానికి దిగింది. అందువల్లనే ఖలతికాను యమున యొక్క ముఖద్వారం అనికూడా అంటారు. యమునా తటానికి కొద్దిదూరంలో అశోకుని లేఖలు చెక్కిన స్థూపం ఒకటుంది. ప్రాచీనకాలంనుండి ఖలతికా ఒక మంచి వ్యాపార కేంద్రంగా ప్రసిద్ధి చెందింది. ఖలతికా నగరపు కుమారామాత్యుడు (జిల్లా అధికారి) యువరాజు చంద్రగుప్తుడికి, అతడి మామనైన నాకు ఘన స్వాగతాన్ని ఇచ్చాడు. యువరాజుగారి కొరకు ఒక చిన్న దర్బార్‌ను ఏర్పాటు చేశారు. అందరూ నేలకువంగి సాష్టాంగ నమస్కారాలు చేశారు. కానుకలను సమర్పించుకొన్నారు. కుమారామాత్యుడితో, హిమాలయ సందర్శనానికి సంబంధించిన కోర్కెను తెలియపరచాము. కుమారామాత్యుడిలా అన్నాడు : "హిమాలయ పర్వతంమీద నే నెక్కువ దూరంవరకూ పోలేదు. కాని, ఈ పర్వత ప్రజల్ని వెంటబెట్టుకొని వెళ్ళవచ్చు. వీళ్ళు చాలా విశ్వాసపాత్రులు. కల్లా–కపటం ఎరుగనివారు. కాని, మార్గం మాత్రం చాల కఠినంగా వుంటుంది. మేకదారిని వెళ్ళాలి అంటే కొండల మీద, ఇరుకు ప్రాంతాల్లో మేకలు నడవడానికి మాత్రమే తగినదార్లు కొన్ని వుంటాయి. వాటిమీద మనుష్యులు కూడా మేకల్లాగానే నడవాలి. క్రూరజంతువుల భయం ఏమాత్రంలేదు. నాలుగు నాళ్ళు ఆ దారిన నడిచారంటే ఈ గ్రీష్మతాపం పోయి శరదృతువులోని చల్లదనం హాయి గొల్పుతుంది. కాని, భట్టా! నాలుగు నాళ్ళ మార్గం వరకూ ఫరవాలేదు. ఆపైకి పోయారా, ఆహారపదార్థాలకు బాగా బాధపడతారు!"

"మరి కొండజాతులవాళ్ళు, ఏదో ఒకటి తినేగా బ్రతుకుతారు?" అనడిగాను.

"వాళ్ళ తిండా? మాంసము, అడవికూరలు ఏవో వండుకుతింటారు. ఔలు పిండికూడా వీళ్ళ ఆహారాల్లో ప్రధానమైంది. వీళ్ళకు ఉప్పుతోకూడా పనిలేదు!"

చంద్రగుప్తుడిలా అన్నాడు : "మాకూ ఆ ఆహారమే చాలు. మేము మాంసాన్ని నిప్పుమీద కాల్చుకు తింటాము. కాకపోతే ఉడకపెట్టుకు కూడా

తింటాము. ఉప్పు విషయం అంటావా? ఇక్కడినుండే పట్టుకుపోతాము! అంతగా ఏ వస్తువైనా కావల్సివస్తే దీనార్లు వుండనే వున్నాయి!"

"ఒక దీనారు క్కావల్సిన సరుకులు అక్కడెక్కడ దొరుకుతాయి? ఎక్కువగా పణాలనూ, పాదకాలనూ, మాషకాలనూ తీసుకువెళ్ళండి. అయినా వాటిని గురించి మీరేమీ యోచించకండి.... దారిలో తగిలే పర్వత గ్రామపెద్దలకు, సామంతులకు-తమ సేవకై సిద్ధంగా వుండమని లేఖలువ్రాసి పంపుతాను!"

"మనమిలా మహారాజుల్లా అట్టహాసంగా పోవడం బాగుండదని నా ఉద్దేశం. ఇలాంటి అట్టహాసంతో బయలుదేరితే మన వెనుక ఒక పెద్ద సిబ్బంది నడవవల్సి వస్తుంది. వీళ్ళందరికీ కావల్సిన సదుపాయాలను ఏర్పాటుచేయలేక గ్రామ ప్రజలు సతమతమౌతారు! ఎటూ గ్రామాలు తగుల్తూనే వుంటాయి కదా?"

కుమారామాత్యుడిలా అన్నాడు: "గ్రామాలు చాలా దూరంగా వుంటాయి. చాలా చిన్నవి కూడాను!"

"ఐతే. మాకో ఐదారుగురు సేవకుల నివ్వండి. పై గ్రామాలలోని గ్రామ పెద్దలకు, సామంతులకు లేఖలు వ్రాసి యివ్వండి. మీరు పంపించే సేవకులలో ఈ కొండదార్లు బాగా పరిచయం కల వాడొకడుండాలి!"

"దార్లు పరిచయమైన వాడొకడు దొరుకుతాడనుకోండి! అసలు మీరు ఏ దిశకు పోవాలనుకుంటున్నారు?"

"ఉత్సవ సంకేతం వైపు వెళ్ళాలనుకొంటున్నాం. హిమాలయాలలో అతి సుందరమైన దృశ్యాలను చూడడం మా ఆశయం!"

"ఇకమీదట మీకు తగిలే మొట్టమొదటి గ్రామంనుండి ఉత్సవ సంకేతం ప్రారంభమవుతుంది. పదినాళ్ళ దారివరకూ మొత్తం ఉత్సవ సంకేతమే! గ్రామాలు క్రింద వున్నట్టుగా పైన వుండవు. రోజల్లా నడిస్తే నాలుగైదు కొంపలుకల గ్రామం ఏదైనా తగుల్తుంది. సామంతుల గ్రామాలు మాత్రం కొంచెం పెద్దవిగా వుంటాయి!"

ఖలతికాలో మేము చూడదగిన వస్తువులుగానీ, ప్రదేశాలుగానీ అట్టేలేవు! ఎంతచూచినా ఆ కొండజాతి ప్రజల్ని, మురికి వస్త్రాలను, చిన్న చిన్న బరువుల్ని మోసే మేకల్ని, గొర్రెల్ని చూడాల్సిందే! త్వరలోనే విసిగిపోయాము. కుమారామాత్యుడు దారిచూపడానికి విజ్జకుడనే కొండజాతి యువకుణ్ణి తోడుచేశాడు. విజ్జకుడు కొండజాతివాడే అయినా కొన్ని సంవత్సరాలుగా అతడూ, అతడి సోదరీ కుమారామాత్యుడి కొలువులో వున్నారు. కనుక అతడికి మా ఆచార వ్యవహారాలు బాగుగా తెల్సును. అతడికి ముఖం కడుక్కునే అలవాటుకూడా వుంది. ప్రయాణాన్ని గురించి అతడు తన అభిప్రాయాన్ని ఇలా తెలియపరిచాడు! "గొర్రెలమీద, మేకల మీద సామాను తీసుకుపోవడం తేలిక. కాని, అవి చాలా నిదానంగా నడుస్తాయి.

వాటితోపాటు నడిస్తే మనం రోజు మొత్తంమీద ఒకయోజనంకంటే ఎక్కువదూరం నడువలేము!"

చివరకు ఐదుగురు మోతగాళ్ళను తీసుకు బయల్దేరా లనుకున్నాము. పైకి పోయిన కొలది చలి ఎక్కువ అవుతుందన్న విషయాన్ని విజ్జకుడు తెలియచేశాడు. అవసరమైన ఉష్ణవస్త్రాలను (ఉన్ని వస్త్రాలను) తీసుకున్నాము. తినుబండారాల్లోకి ఉప్పును కొంచం అధికంగా మూటకట్టుకున్నాము. ఈ విధంగా తగిన ఏర్పాట్లన్నీ చేసుకొని ఒకరోజున మేము ఏడుగురుము ఖలతికానుండి బయలుదేరాము. ఖలతికాకు రావడానికి మేము కొంత పర్వతారోహణ చెయ్యవలసి వచ్చింది. కాని, ఇప్పుడు మేము చేయవల్సిన పర్వతారోహణముందు, అది బొత్తిగా అగణ్యం! మూడు గంటలసేపు పర్వతారోహణ చేసిన తరువాత కాళ్ళు ఘోరంగా నొప్పులు పెట్ట సాగాయి. మే మిద్దరమూ బాగా వ్యాయామం చేసినవాళ్ళం! కఠినమైన వ్యాయామాభ్యాసం వలన ఉత్తమమైన శరీర పాటవాన్ని కలిగినవాళ్ళం. అయినా సాయంత్రానికి మొదటి గ్రామాన్ని చేరుకొనేసరికి మా శరీరావయవాలన్నీ నలగ్గొట్టినట్టు తీపులు పెట్టసాగాయి. ఆ ప్రథమ దివసాన్ని యెంత ప్రయత్నించినా రెండు యోజనాలకంటె (12 మై.) దూరం వెళ్ళలేకపోయాము. నాలుగడుగులు వేసి అలసిపోయేవారము. క్షణానికోమాటు విశ్రాంతికోసం ఆగవల్సివచ్చేది. పర్వతమంతట్లోనూ పచ్చనిచెట్లు మనోహరంగావుండి నయనానందాన్ని కలిగిస్తున్నాయి. చెట్లకు తీగెలూ—లతలూ పెనవేసుకొని వున్నాయి. రకరకాలైన పిట్టలు వివిధ స్వరాల్లో గానాలాపన చేస్తున్నాయి. గిలకోళ్ళు ఒకదానితో ఒకటి పోటీపడి అరుస్తున్నాయి. చల్లని నీటికొలనులు అక్కడక్కడా కనుపిస్తున్నాయి. విజ్జకుడు "దూరాన్నుండి నడిచివచ్చి వెంటనే నీళ్ళు త్రాగడం విషపానంతో సమానమని" భయపెట్టాడు. అందువలన, గొంతు ఎండుకుపోతున్నా, చల్లని నీటికొలనులను చూస్తూ కొంతసేపు కూర్చొనడం తప్పనిసరి అయింది! విజ్జకుడికి ఈ దార్లన్ని కొట్టినపిండి. ఉత్సవ సంకేతాన్నిదాటి, విశాలసరోవరం వరకూ చూశాడు. కనుక మేము నిశ్చింతగా వున్నాము. విజ్జకుడికి మేము ఎవరమో తెలియును. కాని పై గ్రామాల్లో కేవలము కుమారామాత్యుడి బంధువులమని తెలియపరచమని ఆజ్ఞ!

సాధారణంగా రెండు యోజనాల దూరాన్ని ఒక్కపూటలో నడవవచ్చును. కాని, మాకు ఒక రోజల్లా పట్టింది. సాయంత్రానికి విశ్రాంతిస్థలాన్ని చేరుకున్నాము. విజ్జకుడు నలుగురు మోతగాళ్ళను ముందు పంపించివేశాడు.

మొదటి గ్రామములో వంద యిండ్లు ఉంటాయి. నదీతటానికి కొంచెం పైగా పచ్చని సమతల ప్రదేశంలో కన్నులపండువుగా వుందా గ్రామం. అక్కడ గ్రామ పెద్దను రాజు అంటారు. అతడు మగధరాజుకు కొన్ని కానుకల్ని మాత్రం ఇస్తుంటాడు. ఆ గ్రామమేకాక పైన అయిదు యోజనాల వరకూ వున్న గ్రామాలన్నీ అతడి ఆధీనంలోనే వున్నాయి. మేము వస్తున్నామని రాజుకు ముందుగానే

కటుబడుపోయింది. అతడు తన గ్రామపు ప్రధాన ద్వారం వద్ద మా ఆగమనంకోసం వేచి ఉన్నాడు. అతడి దుస్తులు, ఇతర కొండజాతి ప్రజల దుస్తుల్లా లేవు. అతడి దుస్తులూ వస్త్రాలంకరణా శకుల్ని బోలివున్నా, మధ్యదేశపు (సంయుక్తప్రాంతం) ప్రభావం కూడా కొంత కనుపిస్తున్నది. అతడి నివాస స్థానము కొంచెం విశాలంగా వుంది. గోడలు చిన్న చిన్న రాళ్ళతో కట్టారు. పై కప్పు చెక్కతో నిర్మించ బడ్డది. క్రింద పరచుకోడానికి, ఇతర అలంకరణకు చెక్కను విస్తారంగా వాడారు. మమ్మల్ని రెండు మంచి శుభ్రమైన గదుల్లో విడిది దింపారు. గదుల్లోకి వెళ్ళగానే వేడినీళ్ళు పట్టుకవచ్చారు. అవి కాళ్ళు కడుక్కోడానికి! విజ్జకుడు కాళ్ళు కడిగాడు. బాగా అలసి ఉండడంవల్ల ఆహారం ఏమీ తీసుకోకుండానే విశ్రాంతి తీసుకున్నాము.

నేను పడుకున్నానేగాని, నిద్ర పట్టడంలేదు. కళ్ళు తెరచుకొనే మౌనంగా పడుకున్నాను. కొద్దిసేపట్లో ఒక చెక్క పాత్రలో తైలాన్ని తీసుకుని "షోడశి" (పదహారేళ్ళ వయసుకత్తె) ఒకామె గదిలో ప్రవేశించింది. ఆమె ముఖం, కాళ్ళూ, చేతులు శుభ్రంగా కడుక్కొన్నది. కేశాలను రెండు జడలుగా అలంకరించు కున్నది. వీపున రెండు జడలు ఒకదానితో ఒకటి ఆటలాడుకొంటున్నాయి. మొదటి చూపులోనే ఆమె నవయవ్వని అనీ, అతి సౌందర్యవతి అనీ తెల్సుకున్నాను. "షోడశి" తలవంచి, నమస్కరించి ప్రక్కన కూర్చుని నా కాళ్ళకు తైలాన్ని రాయసాగింది. "షోడశి" రావడం, కాళ్ళకు నూనెరాయడం, ఇవన్నీ ఒక్క క్షణంలో జరిగాయి. నా అభ్యంతరాన్నిగాని, ఇచ్ఛనుగానీ—తెలియపరిచే అవ కాశమే లభించలేదు. తీరా ఆ 'షోడశి' కాళ్ళకు నూనెరాచి మెల్లగా పిసుకుతుంటే మహా హాయిగావుండి, నే నే అభ్యంతరాన్నీ చెప్పలేకపోయాను. త్వరలోనే నిద్ర పోయాను. యెవరో నా కాళ్ళను మెల్లగా స్పృశించి నిద్రలేపారు. కండ్లు తెరి చాను. బాగా రాత్రి అయింది. ఎదురుగా చతుర్ముఖ దీపదానంలో వత్తులు వెలుగు తున్నాయి. నేను కండ్లు తెరవడం చూచి, విజ్జకుడు నమస్కరించి "భర్తృదారకా! భోజనం తయారయినది" అన్నాడు.

'షోడశి'ని గురించి అడుగుదామనుకున్నాను. కాని అప్పుడే నిద్రలేవడం వలన చాలా నిద్రమత్తుగా వుంది. మౌనంగా విజ్జకుడి వెంట నడిచాను. చంద్రుడు నాకంటే ముందే అక్కడికి వచ్చాడు. రాజు మా భోజనానికి కమ్మని గంధశాలి బియ్యాన్ని వండించాడు. రుచికరమైన వ్యంజనాలను తయారుచేయించాడు. ఆ రాజు తరచుగా కుమారామాత్యుడి దగ్గరకు పోతూవుంటాడు. అతడి పాకశాలను చక్కగా అనుకరించాడు. యెర్రని ద్రాక్షసారాయాన్ని కూడా తెప్పించాడు. చంద్రగుప్తుడు పూర్తిగా స్వస్థతను చెందాడు. నాకింకా అలసట తీరలేదు. నిద్ర మగతలోనే తింటూ మాట్లాడుతున్నాను. సగంరాత్రి గడిచిపోయింది. భోజనం అయ్యాక నేను లేచి నా గదిలోకి వచ్చాను. చంద్రగుప్తుడుకూడా నాతోపాటు నా గదిలోకి వచ్చాడు.

"ఏమిటి సంగతి?" అన్నాను.

"నా కసలు అలసటగానే లేదు. మరి నీకో?" అన్నాడు.

"నా కింకా కొంచం అలసటగానే వుంది!"

"ఐతే నీ వా అలసటకు 'చికిత్స' చేయలేదా?"

"నా కాళ్ళకు నూనె రాసిందామె! కొంచెం హాయిగా కూడా వుంది!"

"జయా! నీ వింకా 'అక్కడే' వున్నావు!"

"'అక్కడ' అంటే?"

"నువ్వొట్టి మూర్ఖుడివి. 'షోడశి' నా అలసటను చిటికలో తీసివేసింది."

"అదా విషయం! అయితే నీవు ఇక్కడ కూడా పాటలీపుత్రపు రాజాంతః పురంలో లాగానే జరిగిందంటావు?"

"అవును! మరి దీన్నే అదృష్టం అంటారు! నువ్వొట్టి దురదృష్టవంతుడివి జయా!"

"దురదృష్టవంతుణ్ణి, ఎందువల్లా?"

"షోడశితో ఏమైనా మాట్లాడావా?"

"ఆమె మృదువుగా పాదాలను రాస్తూంటే హాయిగా నిద్ర వచ్చింది. కళ్ళు నులుముకొంటూ లేచి భోజనానికి వచ్చాను. నాకు అంతవరకే తెల్సు!"

"అయితే నీకు బొత్తిగా తెలియదన్నమాట! 'షోడశి' మన సేవకోసం పంపించబడ్డది. ఇది ఉత్సవ సంకేతనం. ఇక్కడ ఇంటికి వచ్చిన అతిథి సేవకోసం పెండ్లి కాని పిల్లల్ని పంపుతుంటారు. యుక్తవయస్కులైన కన్యలు లేకపోతే ఇంట్లో వున్న ఎవరో ఒక యువతి అతిథి సేవకు నియోగింపబడడం ఇక్కడి ఆచారం!"

"నువ్వనేది నాకేమీ అర్థంకావడంలేదు!"

"క్రింద పెద్ద పెద్ద రాజాంతఃపురాల్లోనూ, రాజభవనాల్లోనూ కూడా ఈ ఆచారం వుంది. ఐతే, అక్కడ తమ కూతుళ్ళనూ, కోడళ్ళనూ పంపకుండా దాసీలనూ, పరిచారికలనూ పంపుతుంటారు!"

"ఇది నీకు ఎలా తెల్సింది?"

"నేను బాగానే అలసివున్నాను. అయినా 'షోడశి'ని అక్కడే వుండమని విజ్ఞకుడివద్దకు పోయాను. వీళ్ళిద్దరూ రాజు కూతుళ్ళట. ఇంకా పెండ్లిళ్ళు కాలేదుట. ఇలాటి కన్యలను అతిథులకు వప్పగించడం వుత్సవ సంకేతంలో ఆచారమని చెప్పాడు!"

"తరువాత?"

"తరువాత ఏముంది? 'షోడశి'ని స్పర్శించిన తరువాత. ఇంకా శరీరంలో అలసట వుంటుందా? ఆ 'షోడశి' ఎక్కడెక్కడైతే తాకిందో అక్కడి 'అలసట' చిటికెలమీద మాయమైంది!"

"నీవు చాలా...."

"నీవన్నంటావు! కాని, ఉత్సవ సంకేతంలో ఇలా అనుభవించే అధికారం అతిథికి వుంది!"

"అధికారం ఉండడాన్ని నేను తప్పనడంలేదు. కానీ, ఈ అధికారం ఉత్సవ సంకేత వాసులయిన అతిథులకు మాత్రమే వుంటే బాగుండేదని నా అభి ప్రాయం!"

"ఏం, ఈ అధికారం మనకే ఎందుకు లేక పోవాలి?"

"ఎందుకనా? ఈర్ష్య, ద్వేషం, కపటం—కుటిలం ఇలాంటివి మన హృద యాల్లో ఎక్కువగా వున్నాయి. ఈ కొండజాతి ప్రజలు చాలా సౌమ్యమైన స్వభావం కలవారు, మనము తినడమూ, నిద్రపోవడమూ ఎంత సహజమైనవిగా భావిస్తామో వాళ్ళు స్త్రీ సంసర్గాన్ని అంతే పవిత్రమైనదిగా, సహజమైనదిగా భావిస్తారు. వీళ్ళ ఈ శుద్ధ ఆచారాన్ని చూచినప్పుడు మనకు వేశ్యలు జ్ఞప్తికి వస్తారు. వీళ్ళనికూడా వేశ్యలక్రిందనే జమకడతాము. వేశ్యలు డబ్బుకు పాల్పడ తారు. ఇక్కడ అసలు డబ్బు సమస్య ఉండదు. ఈ ప్రాంత మంతట్లోనూ ఈ ఆచారం ఉండడంవల్ల యిక్కడివాళ్ళలో ఉపకార భావంగానీ, అనుచితంగా అను భవిస్తున్నామన్న భావంగానీ కలగవు. వీళ్ళ ఈ ఆచారాన్ని చూస్తూవుంటే నాకేవో పురాతనమైన కథలు జ్ఞప్తికి వస్తున్నాయి!"

"వాస్తవిక ప్రపంచాన్ని వదలి పురాతన కథల్లోకి పోతావెందుకు? బ్రహ్మ దేవుడు నిన్ను పురుషుడుగా పుట్టించాడంటే ఏమన్నా అర్థంవుందా?"

"వుంటుంది. మనుష్యుడిగా బ్రతకడానికి, ఆలోచించడానికి బ్రహ్మదేవుడు నన్ను సృష్టించాడు. పురాతన గ్రంథాలను చదవడం వలన ఒకే దేశంలోని మను ష్యులు వివిధ ఆచారాలను పాటిస్తూ వుంటారన్న విషయం తెలుస్తుంది. శాక్యుల ఉత్పత్తిని గురించి ఒక కథ ఇలా వుంది: "తండ్రి తన సంతానాన్ని కొంతమందిని అడవుల్లోకి పంపించాడుట. వాళ్ళు వర్ణసంకరం అవుతుందన్న భయంతో అన్నా— చెల్లెలు, అక్కా తమ్ముడు వివాహాలు చేసుకున్నారట! దేవకన్యలను గురించి కూడా (కుషాణ స్త్రీలు) ఒక కథ వుంది. వాళ్ళు స్థిరంగా ఎవ్వరినీ వివాహ మాడరుట! రోజుకు ఒకళ్ళ దగ్గిర వుంటారుట! ఇక్కడ కూడా అలాంటి ఆచారాన్నే చూస్తు న్నాము. వీళ్ళకీ ఆచారంలో డబ్బు కోసం శరీరాన్ని అమ్ముతున్న భావనగాని, వేశ్యావృత్తి చేస్తున్నామన్న భావనగాని కలుగదు. కాని మన సమాజం నుండి వచ్చిన వ్యక్తి ఈ ఆచారాన్ని అంత పవిత్రంగా చూడలేడు!"

"నీ చాతనయితే 'దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడ'న్న సామెతను చరితార్థం చేసేవాడివి. మాలాటివాళ్ళు కాళ్ళముందుకు వచ్చిన సౌఖ్యాన్ని అనుభ వించనీయకుండా చేసేవాడివి. సరే నేను వెళ్తున్నాను. ఇక నీవూ విశ్రాంతి తీసుకో."

చంద్రుడు వెళ్ళిపోయాడు. నేను పడుకొనే ఆలోచిస్తున్నాను. కొద్ది సేపటి తరువాత అడుగుల శబ్దం వినిపించింది. మళ్ళీ 'షోడశి' నా గదిరోకి వచ్చింది. ఇక నా కర్తవ్యాన్ని నిర్ణయించుకోవలసిన సమయం వచ్చింది. 'షోడశి' ఒకరకమైన సనాతన ధర్మాన్ని అనుసరిస్తున్నది. ఆ ధర్మంమీద ఆమెకు చాలా విశ్వాసం. ఇప్పుడు నేనా ధర్మానికి వ్యతిరేకంగా ఉపదేశాన్ని ఇస్తే ఆమె మనస్సులో సంశయాలకు తావీయడమే కాక మరొకటి జరుగుతుందా? ఆమె వచ్చి సరసన కూర్చున్నది. నేను కాళ్ళు చూపాను. ఆమె పాదాలను రాయసాగింది. నాకు ఆలోచించడానికి అవకాశం దొరికింది. కాని, ఒక నిశ్చయానికి రాలేకపోయాను. మండు టెండలో అలసిసొలసి వస్తున్న వ్యక్తికి చల్లని సుఖదఛాయ లభించినట్టుగా వుంది. ఆమె మౌనంగా కూర్చుని పాదాలను రాయసాగింది. ముందుచూచిన దానికంటె కూడా ఇప్పుడు అందంగా కనిపిస్తున్నది. అప్పుడప్పుడూ కనుచివర్లనుండి నన్ను చూస్తున్నది. నా హృదయం మూగగా ఆక్రందించసాగింది. 'షోడశి' యొక్క నర్మస్పర్శలకు శరీరం పులకించింది. ఎంత ఐనా నేను పురుషుణ్ణి, యువకుణ్ణి. చలించకుండా వుండటం సంభవమా? ఒక్కక్షణం 'షోడశి'ని అనుభవించడం వుచితమే ననిపించింది. దేశకాల పరిస్థితుల ననుసరించి సిద్ధాంతాలను మార్చుకోవా లనుకొన్నాను. కాని, మరుక్షణంలోనే నిండు హృదయంతో ఈ ఆచారాన్ని సమర్థించగలనా? అన్న ప్రశ్న వచ్చింది. సమర్ధించలేకపోతే ఇది నాకు ఘోరమైన పతన మౌతుంది?

ఎంతో సమయాన్ని ఇలాగే తర్కంతో గడిపాను. నాకు తెలియకుండానే నిద్రపట్టింది. తెల్లవారి కండ్లు తెరచిచూస్తే 'షోడశి' నా ప్రక్కన నిద్రిస్తున్నది. నేను చప్పున లేచి బయటికి వెళ్ళాను. కాలకృత్యాలను తీర్చుకొని వచ్చేసరికి సూర్యోదయ మయింది. చంద్రుడు వళ్ళు తెలియకుండా నిద్రిస్తున్నాడని విజ్ఞుని వల్ల తెల్సుకున్నాను. ఉదయపు ఆహారాన్ని అతడు తీసుకోనేలేదు. మధ్యాహ్న భోజన సమయానికి మెల్లగా లేచాడు.

"ఇంతకూ బయల్దేరేది ఏమైనా వుందా లేదా?"

"ఇంకా పూర్తిగా అలసట పోలేదు. ఇప్పుడే బయల్దేరడం ఇష్టం లేదు!"

"ఫరవాలేదు. ఇలాటి అతిథి సత్కారం వుత్సవ సంకేతంలో ఎక్కడైనా లభిస్తుంది. ఇంతకూ హిమాలయాన్ని చూడాల్నా వద్దా?"

"అవును. నీవు చెప్పినది బాగానే వుంది. తుమ్మెద ఒకే పుష్పంలోని మకరందాన్ని గ్రోలుతూ వుండరాదు. పద వెళ్దాం!"

మధ్యాహ్నం భోజనాల తరువాత మళ్ళీ బయలుదేరాము. వచ్చే మజిలీ రెండు యోజనాలకంటె ఎక్కువ దూరం లేదని విజ్ఞకుడు చెప్పాడు. పర్వతారోహణకు ఎటూ మేము సిద్ధమే! పైగా వ్యాయామానుభవం కలవాళ్ళం కనుక కాళ్ళ

నొప్పులు మొదలైన శారీరక బాధలు స్థిరంగా వుండవని తెలియును. మా మోత గాళ్ళు వీపులమీది బరువుల్తో తేలిగ్గా ఎగురుతూ వెళుతున్నారు. విజ్జకుడు కొద్దిపాటి ఆహారపదార్థాలతో మా వెంట నడుస్తున్నాడు. మిగిలిన మోతగాళ్ళందరినీ రాబోయే మజిలీకి ముందుగా వెళ్ళి చేరవల్సిందని పంపించాము. ఒకదాని తరువాత ఒకటిగా కొండల వరుసలను దాటుతున్నాము. ఒక పర్వతాన్నిదాటాక అంతకన్నా ఎత్తయింది, సుందరమైంది మరో పర్వతం తగుల్తోంది. అందమైన పర్వత దృశ్యాలతో నిండిన ప్రదేశాలను తిలకిస్తూ ముందుకు నడుస్తున్నాము. మనస్సు నిన్నటిలా వుదాసీనంగా లేదీరోజు. కొండదారి మరీ ఇరుగ్గా, ఇబ్బందిగా వుంది. నిలువునా పైకి ఎక్క వలసిన కొండలు, ఒక్కోచోట కాలు మోపడానికికూడా వీలుకానంత ఇరుకుదారి. "మేకదారి" నాలుగు అంగుళాల వెడల్పు వుంటుంది. ఒకవైపున కాలు మోపడానికి వీలులేని కొండరాళ్ళు, మరోవైపు వేల అడుగుల అగాధం. ఆ అగాధాలను చూస్తేనే గుండెలు ఝల్లుమన్నాయి! కాని ధైర్యం తెచ్చుకొని ముందుకు నడుస్తున్నాను. విజ్జకుడి సామాన్లలో ఒక వేణువును చూశాను. అతడిని ఒక రాగం ఆలపించ మన్నాను. అతడు వేణువుమీద ఒక రాగాన్ని ఆలాపించాడు. రాగం సహజంగానూ మధురంగానూ వుంది! నాకు నా వీణ జ్ఞాపకానికి వచ్చింది. వీణను తెచ్చుకొన్నా బాగుండుననుకొన్నాను. కాని, ఈ మేకదార్లలో వీణను పట్టుకు నడవడం చాలా ప్రమాదకరం. వేణువు ఈ ప్రదేశాలకు తగిన వాద్యం! విజ్జకుణ్ణడిగి వేణువును తీసుకొని ద్విపదరాగాన్ని ఆలాపించాను. విజ్జకుడు చాలా సంతోషించాడు. ఈ వాద్యసంబంధమైన సమానత్వం మా ఇద్దరిలోనూ అధికమైన పరిచయాన్ని కలిగించింది.

సాయంత్రానికి మరొక గ్రామానికి చేరుకొన్నాము. ఆ గ్రామంలో నాలు గిండ్లు మాత్రమే వున్నాయి. వాటిలోనే మమ్మల్నొకదాంట్లో వుంచారు. అక్కడ ప్రత్యేకమైన గదులు దొరకడం చాలాకష్టం. మాకు ఇచ్చిన ఇంటి క్రింది భాగంలో పశువులు కట్టేసివున్నాయి. కుమారామాత్యుడిచ్చిన లేఖను మోతగాళ్ళు వూరి పెద్దకు చూపించారు. గ్రామపెద్దకు చదువురాదు. రాజుగారిముహరును మాత్రం గుర్తుపట్టగలిగాడు. మోతగాళ్ళు మొదటే మహా పొగిడేశారు. మేము వెళ్ళినకాసేపటికి వేడినీళ్ళతో కాళ్ళు కడగడానికి యిద్దరు స్త్రీలు వచ్చారు. చంద్రుడికి వాళ్ళు ఏ మాత్రమూ నచ్చలేదు. వాళ్ళకు వయస్సూ ముదిరింది, అందమూలేదు. మురిగ్గా కూడా వున్నారు.

ఈరోజు మేము అంత అలసటగా లేము. గ్రామ పెద్ద మాకోసం 'సుర'ను తెచ్చి ఇచ్చాడు. గ్రామ పెద్దా నేనూ, చంద్రుడు–ముగ్గురం కల్సి కొద్దిగా సురను సేవించాము. ఆ యింట్లో అయిదారుగురు పురుషులు వున్నారు. ఇద్దరే స్త్రీలు. ఒక స్త్రీ ఇంటి కోడలు, గ్రామ పెద్దకు ఐదుగురు కొడుకులు, కూతుళ్ళు లేరు. వృత్సవ సంకేతంలో అన్నదమ్ములందరూ కలిసి ఒకే స్త్రీని పెండ్లాడతారని చెప్పాడు. ఆ

యింట్లో వున్న ఐదుగురు అన్నదమ్ములకు ఒక్కతే భార్య! నేను విజ్జకుణడిగి పుత్సవసంకేతాన్ని గురించి ఎన్నో విషయాలు తెల్సుకొన్నాను.

భోజనాలు అయ్యాయి. క్రింది గ్రామంలో లభించినంత రుచికరమైన భోజనం ఇక్కడ దొరకలేదు. కాని, నిప్పులమీద కాల్చిన మాంసము, ఉప్పువేసి నీళ్ళలో వండిన మాంసము-చాలా రుచికరంగా వున్నాయి. మొదట మాంసంతో కూడిన ఎముకల-సూప్‌ను ఇచ్చారు. ఆ సూప్ త్రాగడానికి చాలా బాగుంది. మాకో గదిని ఖాళీచేసి ఇచ్చారు. నిన్నటి తంతు ఈరోజుకూడా ప్రారంభం అవుతుందేమో అనుకుంటున్నాను. ఇంతలో శరీరంలో సూదులుపెట్టి పొడిచినట్లు బాధ ప్రారంభ మైంది. బాధ పెడుతున్నచోట రెండు మూడుసార్లు చేత్తో రుద్దుకొన్నాను. శరీర మంతా బొబ్బలెక్కి వున్నది. చంద్రుడితో ఇలా అన్నాను: "నిద్ర పట్టడం లేదా? బాధపడకు. ఇంటిపని అయ్యాక కాళ్ళు రాయడానికి ఎవరోఒకరు వస్తారులే!"

"కాళ్ళు రాయడం అలావుంచు. శరీరమంతా మంటపుడుతోంది!"

"పాపం. విరహతాపం కామోసు!"

"శరీరంలో సూదులు గుచ్చినట్టుగా వుంటున్నది. ఏమిటో కుడుతున్నాయి. ఇక్కడ పడుకోలేము..బయటికి వెళ్దాము పద!"

"ఇక మనం నల్లుల దేశానికి వచ్చాము. ముందు ముందు నల్లులు లేని ఇల్లంటూ వుండదు!" అని విజ్జకుడు అక్కడి పరిస్థితి తెలియ పరచాడు.

"ఏం చేయడం?" నేను చంద్రుణ్ణడిగాను.

"చేసేదేముంది. నల్లులకు భయపడి వెనక్కి వెళ్ళిపోదామంటావా?" అన్నాడు చంద్రుడు.

"అబ్బే....అలాటిదేమీ లేదు. రణక్షేత్రంనుండి పారిపోయినవాడికి ఇంట్లో కూడా స్థానంలేదు. మనం ఆరుబయట పడుకుందాం!" అన్నాను. విజ్జకుడు బయట ఒక అరుగును శుభ్రపరిచాడు. చంద్రుడు 'ఇకనివ్వాళ అతిథి సత్కారం అవసరం లేద'ని విజ్జకుడితో చెప్పాడు. మేము సుఖంగా నిద్రపోయాము.

మూడవరోజునుండి మా నడక బాగా తీవ్రమయింది. ఒక వారం గడిచే సరికి మేమూ కొండల్ని అవలీలగా దాటివేయగలిగాము. రోజుకు నాలుగు యోజ నాల దూరం ప్రయాణం చేయగలుగుతున్నాము. మేము ముందుకు పోతున్న కొలది చలి ఎక్కువ అవుతున్నది. ఐతే మా దగ్గరఉష్ణవస్త్రాలు చాలా వున్నాయి. ఒక వారం గడిచాక చంద్రుడికి కొండ జాతి ప్రజల ఎండుమాంసంకూడా రుచిగానే వుండసాగింది. తరువాత నల్లుల బాధకు కూడా ఉపాయాన్ని ఆలోచించాం. సాధారణంగా మనుష్య నివాసంలేని పాడుపడిన ఇల్లు ఏదైనా వుంటే దాంట్లో పడు కునేవారం. లేకపోతే మా పక్కలను ఆరుబయట పరిచేవాళ్ళం. వెనుకటిలా మజిలీని చేరుకోగానే అలసటతో పడిపోవల్సిన అవసరంకూడా అంతగాలేదు. సాధా రణంగా గ్రామాల్లో సాయంత్రం పూటల్లో స్త్రీ పురుషులు సురాపానంచేసి నాట్యం

చేస్తుంటారు. వారి నాట్య భంగిమలు మొదట మాకు రావు. కాని రెండు మూడు రోజుల్లో నేర్చుకుని మేమూ వారి సామూహిక నాట్యంలో పాల్గొనసాగాము. విజ్ఞకుడు వెదురుకర్రతో నాకో వేణువును తయారుచేసి ఇచ్చాడు. అక్కడివాళ్ళకు మన వైపు రాగాలు నచ్చవు. కొండజాతివారి పాటల్ని నాలుగింటిని నేర్చుకున్నాను. ఇక మేమూ ఆ కొండజాతి ప్రజల జీవితాల్తో కలిసిపోయి ఆనందించసాగాం!

ఒక్కోప్పుడు నిటారుగా పైకి ఎక్కవల్సివస్తుంది.మరొకప్పుడుసాపుగా క్రిందికి దిగిపోవల్సి వస్తుంది. ఒక్కోప్పుడు కొండపైన సమతల ప్రదేశంలో అక్కడక్కడా పశువులకాపర్ల గుడారాలు వున్నాయి. మేము అనేకమార్లు ఈ పశువులకాపర్ల గుడారాల్లోనే రాత్రిళ్ళను గడిపేశాం. అక్కడినుండి చూస్తే హిమాలయ శిఖరాలు మధ్యాహ్నసమయాల్లో తెల్లని వెండి కొండల్లాగానూ, సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాల్లో పచ్చగా బంగారు కొండల్లాగానూ కనిపిస్తున్నాయి. మేము ముందు పది పదిహేను రోజుల్లో తిరిగి వెళ్దామనుకొని బయలుదేరాము. కానీ, హిమాలయం మమ్మల్ని సూదంటురాయిలా ఆకర్షించింది. హిమాలయాన్ని ఇంకా దగ్గరగా దర్శించాలన్న కోర్కె మాలో కలిగింది.

ఈ యాత్రలో సంభవించిన రెండు సంఘటనలు నేను ఎన్నటికీ మర్చిపోలేను. ఒకమాటు దాహంతో గొంతు ఎండి ప్రాణావశిష్టులమైనాము. మరొకమాటు రమణీయమైన ప్రకృతి దృశ్యాలను చూచి ఆనందంతో మైమరచిపోయాము. హిమాలయంలోని నదులు చాలా చంచలమైనవి. కలకల నాదాలతో వేగంగా ప్రవహిస్తూ వుంటాయి. నీరు సాధారణంగా నురుగుతో నిండి పాలలా కనిపిస్తూ వుంటుంది. ఒకమాటు మేము ఒక నది దగ్గరకు చేరాం. నదిని దాటటానికి కర్రవంతెనగానీ లేక తాటివంతెనగానీ లేదు. నారతాడు మాత్రం ఒకటి అటు ఒక చెట్టుకూ ఇటు ఒక చెట్టుకూ కట్టేసివుంది. విజ్ఞకుడు, ఇతర మోతగాళ్ళు, తమ వీపులమీదవున్న బుట్టల్లోనుండి ఎనిమిది, పది అంగుళాల గుండ్రని కర్ర నొకదాన్ని బయటకుతీశారు. ఆ కర్రకు అడుగువైపున నారతాడు సగపటవరకు ఇమడగల ఛిద్రముంది. పైన మరొక చిన్న రంధ్రముంది. ఆ రంధ్రంలోనుండి మరొక సన్ననిత్రాడును లాగి రెండుకాళ్ళకు వుచ్చువేసుకొన్నారు. ఆ విధంగా చేతులతో పట్టుకోనవసరం లేకుండా కాళ్ళపట్టుమీద నిలబడి చేతులతో చేదుకొంటూ చరచరా ముందుకు పోయారు. వాళ్ళు అలా వెళ్ళడం చూస్తూవుంటే గుండెలు జలదరిస్తున్నాయి. చంద్రుడివంక చూసి, "ఏమిటి అభిప్రాయం?" అన్నాను.

"అభిప్రాయాని కేముంది? వాళ్ళు ఐదుగురూ వెళ్ళలా? అలానే మనమూ వెళదాం. మొదట భయంగానే వుంటుందనుకో!" అన్నాడు చంద్రుడు.

విజ్ఞకుడు మా కొరకు కూడా వుచ్చులను తయారుచేశాడు. తాడును చేదుకుంటూ ముందుకు పోవల్సిన విధానాన్ని చెప్పాడు. యెక్కువ సాహసవంతుణ్ణని

ఖించు కోవడానికి నేనే ముందు ఉచ్చులో కాళ్ళుపెట్టాను. ఒకే ఒక తోపుతో ఒడ్డును వదిలి ముందుకి వెళ్ళిపోయాను. ఇక నిప్పుడు కోలాహలంగా ప్రవహిస్తున్న నదీ జలానికి పది పదిహేను గజాలపైన గాలిలో వ్రేళ్ళాడుతున్నాను. క్రిందపడితే సంభ వించే స్థితిని వూహించడం కూడా అసంభవమే అవుతున్నది. క్షణాలు గడిచిన కొలది నాలో ధైర్యం గూడుకట్టుకోసాగింది. కొంతసేపటి తరువాత త్రాడుమీద అలా జరగడంలో కూడా ఒక రకమైన ఆనందమే కలగసాగింది. అటు ఒడ్డుకు పోయి దిగాక మొదటగా మాకు కలిగిన భయానికి మేమే నవ్వుకొన్నాం.

మరొక సంఘటన: మేము ప్రథమంగా దేవదారువనంలో ప్రవేశించినప్పటిది. దేవదారు ప్రపంచపు వృక్షజాతుల్లోనే అందమయినది. ప్రకృతి లక్ష్మికి జయ స్తంభంలాంటిది. తెల్లని పొడుగాటి వృక్షం. సూటిగా ముందుకు పొడుచుకొచ్చిన వేలకొలది శాఖలు! ఆ శాఖలయినా ఎలాటివి? క్రిందినుండి పైకి పోను పోను శాఖలు చిన్నవి అవుతాయి. చివరకు వృక్షపుకొస శిఖరంలా తయారవుతుంది. ఆ గాఢమైన, ఆకుపచ్చని ఆకుల్ని కలిగిన ఆ వృక్షజాలాలను శిశిరరుతువు ఎన్నడూ తన వశం లోకి తీసుకోలేదు. సదా ఆ చెట్లు పచ్చని ఆకుల్తో నిండివుంటాయి. క్రింది భూమి అనేక సంవత్సరాలుగా రాల్తున్న ఆకుల్తో మెత్తపడి మృదువుగా వుంటుంది. ఈ దేవదారు వనప్రాంతంలో వూళ్ళు ఎక్కడాలేవు. కాకపోతే అక్కడక్కడా పశువుల కాపర్ల గుడిసెలు మాత్రం వున్నాయి.

దేవదారు వనంలోనే నేను ప్రథమంగా చమరీ మృగాన్ని చూశాను. తెల్లని చమరీ మృగవాలాలను పాటలీపుత్రపు రాజదర్బారులో ఎప్పుడూ చూస్తూ వుండేవాణ్ణి. సాధారణంగా చమరీ మృగాలు నల్లగా వుంటాయి. వాటి వాలాలు కూడా నల్లగానే వుంటాయి. కానీ, కొన్ని మృగాలకు తెల్లని వాలాలు కూడా వుంటాయి. అలాంటి తెల్లని చమరీ వాలాలను రాజ్యలక్ష్మికి కానుకగా దర్బారులోకి తెచ్చిపెట్టు కొంటారు. ఆడ చమరీలు పాడిగేదెలంత వుంటాయి. వాటి దేహంలో భూమికానేంత నిడివిగల వెంట్రుకలుంటాయి. ఇవి పాలుకూడా ఇస్తాయి. పశువులకాపర్లు గేదెల్ని, ఆవుల్ని కాచినట్లు వీటిని కూడా కాస్తూవుంటారు. హిమాచ్ఛాదిత శిఖరాలను దగ్గర నుండి చూడాలన్న మా కోర్కెను విజ్జకుడి ద్వారా అక్కడి పశువుల కాపరికి తెలియచేశాము. ఎన్నిరోజుల్లో హిమక్షేత్రం చేర్తామో అడిగాము. పశువుల కాపరి "కఠినమైన దారిన—అడ్డదారిన—వెడితే రెండు రోజుల్లో హిమక్షేత్రాన్ని చేరగలరు. సుగమమైన దారిన వారం పడుతుంది. రెండునెల్లకు ముందు వచ్చివుంటే ఈ ప్రదే శంలో కూడా మంచును చూడగలిగేవారు!" అన్నాడు.

మేము అడ్డదారిన హిమక్షేత్రంలోకి బయలుదేరాం. మా వెంట ఇద్దరు పశు వుల కాపర్లను కూడా రమ్మన్నాం. రెండు ఆడచమరీ మృగాలను తీసికొని ఇద్దరు పశువుల కాపర్లు మావెంట బయలుదేరారు.

మే మిప్పుడు శరద్రు నదీతీరంలో వున్నాం. కానీ మేం నదికి చాలాదూరంలో వున్నాము నది తాలూకు కలవరం అయినా మాకు వినపడ్డంలేదు. హిమక్షేత్రాన్ని దాటి గంగానదీ తీరం గుండా దిగువకు పోవడానికి మార్గం వుందని పశువులకాపర్లు చెప్పారు. మా సాహసాన్నీ, ధైర్యాన్నీ చాటుకోడానికి అడ్డదారిన బయల్దేరామే గానీ, తరువాత చాలా పశ్చాత్తాపాన్ని పొందాం. ప్రతి నాలుగడుగులకు అలిసి కూర్చుండిపోయే వారము. గుండె గొంతుకలోకి వస్తున్నట్టుగా వుండేది. అలపడం వలన, రొప్పడంవలన శ్వాస ఆగినట్టయ్యేది. పదడుగులకు ఒకమాటు ఆగిపోయే వారము. మోతగాళ్ళు కూడా వెనుకటిలా చురుగ్గా నడవలేక పోతున్నారు. పశువుల కాపర్లు ఇలా చెప్పారు: "ఈ దారిలో ప్రమాదకరమైన విషమూలికలు, చెట్లు—చాలా వున్నాయి! అందువల్లే ఇలా ఆలుపు-అయాసం వస్తుంది!"

రెండవరోజున మేమిద్దరం చమరీ మృగాలమీద యెక్కి ప్రయాణంచేశాము. ఇకనప్పుడు యే విధమయిన ఆయాసమూ రాలేదు. చంద్రుడిలా అన్నాడు: "విషమూలికలు, చెట్లు వుండడం ఒఠ్ఠి అబద్ధం. నిజంగా వుంటే చమరీ మృగాల మీద ఎక్కిన తరువాత ఎందుకు అలుపురాదు?"

హిమక్షేత్రానికి కొన్నిమైళ్ళ ఇవతలనే దేవదారు వృక్షాలు సమాప్త మయ్యాయి. ఈ దేవదారు వృక్షాలు ఒక్కమాటుగా సమాప్తం కాలేదు. మొదట తమకంటే చిన్నవై, ఎక్కువ సుగంధాన్నియగల దేవదార్లకు అవకాశాన్నిచ్చాయి. ఈ చిన్ని దేవదార్లలో అక్కడక్కడా భూర్జవృక్షాలు కనిపించసాగాయి. ఈ భూర్జ వృక్షాల ఆకులు సన్నగా పొడుగ్గాలేవు. వెడల్పుగా వున్నాయి! ఈ భూర్జవృక్షాల రంగు తెల్లగా వుంటుంది. దూరాన్నుండి చూస్తే మంచుతో కల్సి కనిపించకుండా పోతుందీ వృక్షం! మేము చిన్ననాటినుండి భోజపత్రాలమీద రాస్తూనే వున్నాము. కానీ, వాటిని తమ నిజరూపంలో చూడడం ఇదే మొదలు. విజ్జకుడు మూరెడు పొడవు, జానెడు వెడల్పు, అంగుళం లావుగల భోజపత్రపు పొర నొకదాన్ని కోసి తెచ్చాడు. తరువాత దానినుండి చాలా సన్నని పొరలను తీశాడు. ఆ అంగుళం మందంకల పొరనుండి నలభై యాభై భూర్జ పత్రాలు తయారయ్యాయి. భూర్జపత్రాల్లోకి నీరు ఇంకదు. అందువల్లే ఇక్కడి పశువుల కాపర్లు వెదురుకప్పుల మీద భూర్జపత్రాల పొరల్ని కప్పుతారు. కాని ఈ పొరలు పగిలిపోతాయి. పాటలీపుత్రంలోనూ ఇంకా ఇతరచోట్లా భూర్జపత్రాలకంటే తాళపత్రాలనే వ్రాతపనికి ఎక్కువగా ఉపయోగిస్తూ వుంటారు. అందుక్కారణం, భూర్జపత్రంకంటే తాళపత్రంలో ఎక్కువ గట్టితనం ఉండడమే కావచ్చును.తాళపత్ర గ్రంథాలు 2, 21/2 అంగుళాల వెడల్పు మాత్రమే వుంటాయి. కాని భూర్జపత్ర గ్రంథాలు చాలా వెడల్పు వుంటాయి. అయితే, పుటల్ని తిరగవేయడంలో భూర్జపత్రాలు పగిలి పాడయిపోతాయి. తాళపత్రాలు ఏ విధంగానూ చెడిపోవు. అందువల్లనే ఎక్కువగా గ్రంథాలు తాళపత్రాలమీద వ్రాయడం జరిగివుండవచ్చు. కాని, సాధారణ నిత్య

వ్యవహారాలకు, లేఖలకు-ఉత్తరాపథంలోనూ, మధ్యదేశంలోనూ, భూర్జపత్రాలనే ఎక్కువగా వాడతారు. దక్షిణాపథమూ, సింహళమూ, హిమాలయ పర్వతాలకు చాలా దూరంలో వుండడం వలన, వారికి భూర్జపత్రాలు చాలా ప్రియము. దొరకవు. అందువల్ల ఆ ప్రాంతంలో భూర్జపత్రాల వాడకం చాలా తక్కువ. కొండజాతి ప్రజలు ఎండిన భూర్జపొదలను క్రింది ప్రాంతాల్లో అమ్మి అధికంగా ధనం సంపాయించుకొంటూ వుంటారు.

భోజవృక్షాల వనంలోనే కొద్దికొద్దిగా మంచు కనిపించసాగింది. తరువాత ముందుకు పోయినకొలది దూదిలాటి స్వచ్ఛమైన శ్వేతహిమము యెటుచూచినా విస్తరించి కనిపించసాగింది. మోతగాళ్ళు, పశువుల కాపర్లూ పచ్చని భూర్జ ఆకులను టోపీలక్రింద నెత్తిమీద పరచుకొని కళ్ళకు అడ్డుచేసుకొన్నారు. వాళ్ళను చూచి మేమూ అలాగే చేశాము. అలా చేయకపోతే, తెల్లని హిమరాశిని నిరంతరం చూస్తూ వుండడంవలన కండ్లు నొప్పులు పెడుతాయట! ఒకటి రెండు రోజులు కనులు కనుపించకుండా కూడా పోతాయట! చంద్రుడు విమర్శించాడు "ఇది కూడా విషమూలికలు, వృక్షాల్లాంటి విషయమే!" అన్నాడు. కాని అతడూ పచ్చని ఆకుల్ని కండ్లకు అడ్డం పెట్టుకోవడంచూసి "మరి నువ్వెందు కలా అడ్డం పెట్టుకొన్నావు?" అనడిగాను. "ఒకవేళ నిజమే అయితే రెండురోజులు అంధత్వంలో గడపాలికదా? ఆ బాధ యెవ్వరనుభవించగలరు?" అన్నాడు. పూర్తిగా పర్వత శిఖరానికి చేరాక మేమిద్దరం చమరీ మృగాలమీదినుండి దిగాం. అంత యెత్తునుండి చుట్టూవున్న ప్రకృతిని ఒకమాటు కలియచూశాం. ఉత్తరదిశగా హిమాలయ పర్వతశ్రేణులు కనిపించాయి. తూర్పునుండి పశ్చిమానికి వ్యాపించిన శ్వేత హిమశ్రేణులను చూచినప్పుడు మా ఆనందానికి మేరలేకపోయింది. మిగిలిన మూడు దిశల్లోనూ పచ్చని పర్వత శ్రేణులు కనుపిస్తున్నాయి. ఒకటి రెండు మంచుముక్కల్ని తీసి నోట్లో వేసుకొన్నాము కాని, అక్కడ మంచుముక్కల్ని తినడం అతి సాహసోపేతమైన విషయం. సరీగా అదేసమయంలో పాటలీపుత్రంలో వడగాల్పులు వీస్తూ వుంటాయి. ప్రజలు చల్లదనంకోసం ప్రాకులాడుతూ వుంటారు. గాలిచాలక పంకాలు విసురుకొంటూ వుంటారు. కాని ఇక్కడ మేము అరచేతి మందపు ఉన్ని దుస్తులతో శరీరాన్ని ఆపాదమస్తకమూ కప్పేసుకొన్నాము. చర్మపు మేజోళ్ళు, పాదరక్షలు ధరించాము. అయినా, వణికిపోతున్నాము. చల్లని మంచుగాలి ఏ అవయవానికి సోకినా వెంటనే ఆ అవయవము మొద్దుబారిపోతున్నది. "ఇంకా నయం—గాలిలేదు. గాలివుంటే కఠినమైన కొరడా దెబ్బల్లా శరీరానికి తగిలేవి, గాలి వీవెనలు!" అన్నాడు విజ్జకుడు. నేను ఆలోచనలో పడ్డాను. పాటలీపుత్రంకంటె, ఖలతికాకంటే ఇక్కడ ఇంత ఎక్కువ చల్లదనం వుండడానికి కారణం ఏమిటి? ఒకే భూమిమీద ఒక ప్రాంతంలో ఉగ్రగ్రీష్మం తన ప్రచండ అగ్ని జ్వాలల్ని విరజిమ్మడానికి కారణం ఏమిటి? మరొకచోట ప్రళయ శిశిరం తన

మృత్యుముఖాన్ని చూపడానికి కారణం ఏమిటి? క్రిందికి దిగేప్పుడు మరో నూతనమైన అనుభవం కలిగింది. క్రిందికి దిగినకొలది వేడి హెచ్చసాగింది. అంటే ఎత్తుకు పోయినకొలది చల్లదనం యెక్కువ అవుతుందన్నమాట? మరా విధంగా ఆలోచిస్తే సూర్యుడి దగ్గర మరీ చల్లగాలి ఉండాలికదా? ఇంక అతడు ప్రపంచానికి వేడిమిని ఎలా ఇవ్వగలుగుతున్నాడు? ఇలాటివే అనేక ఆలోచనలతో బుర్ర నిండిపోయింది.

ఇకనిప్పుడు మేము పర్వతపు రెండవవైపుకు దిగుతున్నాము. క్రిందికి దిగేటప్పుడు వాహనాల అవసరం అంతగా వుండదు. విషమూలికల ప్రభావం కూడా ఏమీ వుండదు. చంద్రుడిలా అన్నాడు: "పైకి ఎక్కడానికి బాగా శ్రమపడాలి. గాలికూడా యెక్కువ అవసరం అవుతుంది. బహుశ, పైన గాలి తక్కువ అనుకుంటాను. అందువల్లే అలా అలిసిపోయాము!" విజ్ఞకుడు అందుకున్నాడు—"ఇవ్వాళ మన అదృష్టం. గాలి వీచడం ప్రారంభించినదా, మనుషుల్ని కూడా ఎగరగొట్టుకు పోతుంది!" అయినప్పటికీ మారో విషమూలికలను గురించిన అనుమానం పోలేదు.

ఇప్పుడు మేము హిమక్షేత్రపు చివర కొచ్చేశాం. వెనక్కు తిరిగి సూర్యకాంతిలో మెరిసిపోతున్న హిమరాశిని ఒకమాటు కనులారా చూశాం. క్రిందికి దిగుతున్నాము. మార్గం చాలా ఇరుగ్గా ఒక్కోచోట చాలా క్లిష్టంగా వుంది. ఒక్కొప్పుడు కేవలం మేకల-గొర్రెల గిట్టల గుర్తులుతప్ప మరేమీ కనుపించడంలేదు. ఒకచోట వేటగాడు ఒక కస్తూరిమృగాన్ని వేటాడాడు. నాభిలో యింకా కస్తూరి వాసనలను వెదజల్లుతున్న తోలుసంచి వుంది. కస్తూరిమృగం శరీరమూ, మాంసమూ లేడిని పోలివున్నాయి. కాని, కస్తూరిమృగం శరీరంమీద రెండు రకాలైన వెంట్రుకలున్నాయి. ఒకరకం దేవదారుపత్రాల్లా బిరుసుగా సూదుల్లా గుచ్చుకొనేవి. రెండవరకం చిన్ని చిన్ని మృదువయిన పట్టులాంటి వెంట్రుకలు. ఆ వెంట్రుకలను చూసినప్పుడు గాంధార దేశపు పసుపుపచ్చని కంబళ్ళు జ్ఞాపకానికి వచ్చాయి. అంత సన్నని, మృదువయిన మెరిసిపోయే ఉన్ని, గొర్రెలది కాజాలదు మరి....

ఆనాటి రాత్రి మేము దేవదారు వనంలో పశువులకాపర్ల గుడారంలో గడిపాము. అదే రాత్రి మొదటిసారి కస్తూరిమృగపు మాంసాన్ని తిన్నారి. ఇక్కడి నుండే మా వెంట వచ్చిన పశులకాపర్లను వెనక్కి పంపించాం. వెళ్ళేటప్పుడు వాళ్ళకు మూడేసి దీనార్ల నిచ్చాం. వాళ్ళు చాలా సంతోషపడి తమ చమరీ మృగాలతో వెనక్కి వెళ్ళిపోయారు.

మేము గంగా తీరాన్ననుసరించి క్రిందికి వెళ్ళిపోవాలి. మేకదార్లు తప్పితే మరో మార్గంలేదు. మా మోతగాళ్ళల్లో ఒకడు భూర్జ పత్రాలకోసం ఇటువస్తూండేవాడు కనుక అతడికి ఈ దార్లు సుపరిచితం !

కొద్దిరోజుల నిరంతరప్రయాణం తరువాత మేము వేడి ప్రదేశానికి వచ్చాము. హిమాలయపు జ్ఞాపకాల స్మృతి అడుక్కిపోయాయి. అక్కడినుండి కొన్ని దుర్గమమైన పర్వతాలను దాటితే ఖలతికా వెళ్ళవచ్చునని విజ్జకుడు చెప్పాడు. అక్కడి నుండి ఖనగల్ మార్గం చాలా సుగమమైనది. మేము ఖనగల్ మార్గాన్ని అనుసరించాము. ఖనగల్ వరకూ వచ్చేసరికి గంగానది తనపితృభూమిని పూర్తిగావదిలి మైదానానికి వచ్చేసింది. అయినా ఇంకా గంగాజలంలో వెనుకటిచల్లదనం వుంది. ఖనగల్ అధికారి యువరాజు చంద్రగుప్తుడికీ, నాకూ ఘనమైన స్వాగతాన్ని యిచ్చాడు. రుచ్యమైన భోజనాలతో మమ్మల్ని ఆనందపరిచాడు. భోజనాల తరువాత అరుణ వర్ణపు ద్రాక్షసారాయిని స్వర్ణతోరాయిర్లో తెచ్చిపెట్టారు పరిచారికలు. చంద్రుడు సన్ననిమూతి, వెడల్పయిన పొట్టా కల సురాయిని చేతుర్లోకి తీసుకొని, నిమురుతూ త్రాగసాగాడు. ఇదిచూచి ఒక పరిచారిక నవ్వింది. చంద్రుడిలా అన్నాడు : "సుందరీ! ఎన్ని రోజుల తరువాత ఎర్రని ఈ ద్రాక్షసారాయపు దర్శన భాగ్యం కలిగిందో తెలుసా? "జౌ"ల నుండి తీసిన "మేయర్ సురా"ని త్రాగి త్రాగి ప్రాణం విసిగిపోయింది!"

"ఐతే నీకు ఈ హిమాలయ యాత్ర యేమీ బాగు లేదంటావు!" అనడిగాను.

"బాగా ! జయా ! నా యీ యాత్రకు కారణమైన నీకు నేను సదా కృతజ్ఞుణ్ణయి వుంటాను. మొదట బయలుదేరేప్పుడు నీ బలవంతం వల్లనే బయర్దేరాను. కాని, హిమాలయ సౌందర్యం శాశ్వతంగా నన్ను తనకు భక్తుణ్ణి చేసుకొన్నది."

ఖనగల్ నుండి కొంతదూరం గుర్రాలమీద వెళ్ళాం. అక్కడినుండి నావ మీద ఎక్కాం. ఖలతికారోని కుమారామాత్యునికి ఒక లేఖను వ్రాసియిస్తూ, విజ్జకుడికి కొంత బహుమానాన్నిచ్చి వెనక్కి పంపాం. కన్యాకుబ్జంలో మళ్ళీ నావను మారాం. వర్షాకాలం సమాప్తం కాబోయే సమయానికి, అంటే మూడునెల్ల తరువాత పాటలీపుత్రం చేరాం.

# పాటలీపుత్రంలో తుది ఏడు

ఆచార్యులవారు వర్షావాసం కొరకు అయోధ్యకు వెళ్ళారు. కానీ, ప్రవారణ (ఆశ్వయుజ పౌర్ణమి) తరువాత అశోకారామానికి తిరిగివస్తారు. కొన్ని నెలలుగా నేను పుస్తకాన్ని ముట్టుకోలేదు. అయినా, నాన్నగారివద్దా, హిమాలయ సందర్శనంలోనూ గడిచిన రోజులు వృథా అయినవనుకోను. నాలో ఈ ఐదారు నెలల కాలంలోనూ చాలా మార్పు వచ్చింది. నాకు నేనే యెంతో మారిపోయినట్లు కనిపించసాగాను. ఆరునెల్లక్రితం, పాటలీపుత్రం నుండి బయలుదేరినప్పుడు నేనొక కుర్రవాడిగానే వున్నాను. కానీ ఈ హిమాలయ యాత్ర చేశాక నేనే యువకుణ్ణయినట్టూ, తరుణుణ్ణయినట్టు భావిస్తూండేవాడిని. చాలారోజులవరకూ అజ్జుక హిమాలయ యాత్ర విశేషాలనుగురించి అడుగుతూ వుండేది. మేము ఉత్సవసంకేతంలో చూచిన విషయాలన్నీ అజ్జుకకు తెలియచేయలేకపోయాను. కాని, ఉత్సవసంకేతవాసులుకూడ బౌద్ధమతస్థులేననీ, అక్కడక్కడా బౌద్ధభిక్షువులు కనిపించారని చెప్పాను. ఇది విని అజ్జుక ఇలా అన్నది: "ఐతే సంఘాన్ని నేనొక విషయంలో అభ్యర్థిస్తాను. ఉత్సవ సంకేతంలో ఒక విహారాన్ని కట్టించి, ఒక నూరుమంది భిక్షువుల్ని వుంచమంటాను. వాళ్ళు ఉత్సవ సంకేతపు ప్రజల్లో బౌద్ధ మతాన్ని ప్రచారం చేస్తుంటారు!"

తరువాత అజ్జుక తన నిశ్చయానికి కార్యరూపాన్ని ఇచ్చింది. ఉత్సవ సంకేతంలో విహార నిర్మాణం కొరకు వేల సంఖ్యలో దీనార్లను ఖర్చుచేసింది. ఒక సుగతాలయాన్ని (ప్రార్థనామందిరం), ఒక భిక్షు ఆవాసాన్ని కట్టించింది. వీటిని నిర్మించడానికి మధురనుండి, పాటలీపుత్రం నుండి ఎంతోమంది శిల్పులను ఉత్సవ సంకేతానికి పంపింది. కానీ, బౌద్ధమతానుయాయులైన ఈ శిల్పులూ, భిక్షులూ ఉత్సవసంకేతపు ఆకర్షణీయమైన ఆచారాలకు లొంగకుండా వుండగలరా అనేది సంశయించవల్సిన విషయం!

కార్తీకపౌర్ణమి నాటికి ఆచార్యులవారు తిరిగి అశోకారామానికి వచ్చారు. మళ్ళీ నా చదువు యథావిధిగా ప్రారంభమైంది. రెండు–రెండున్నర సంవత్సరాల పాటు నా చదువు నిరాఘాటంగా సాగిపోయింది. తరువాత జీవితంలో మరెన్నడూ ఇంత ఉత్సాహంగా, ఆసక్తిగా చదువు సాగలేదని చెప్పవచ్చును. వెనకకూడా

ఆచార్యుల వారివద్ద కొన్ని పుస్తకాలను చదివాను. కానీ, వారి యొక్క సువిస్తృత మైన తాత్విక జ్ఞానాన్ని ఇప్పుడే అర్థం చేసుకోగలుగుతున్నాను. ఆచార్యులవారు కూడా నన్ను తగిన పాత్రగా యెంచి మనసుంచి చదివించసాగారు. ఒకరోజున ఆచార్యులవారు యవనదేశపు తత్వవేత్తలను గురించి చెబుతున్నారు. ఇలా అడిగాను: "ఐతే యవనుల్లోకూడా తత్వవేత్తలు ఉన్నారంటారు!"

"లేకేం? హెరాక్లిటసు, డెమోక్రటసు, సోక్రటీసు, ప్లాటో, అరిస్టాటిల్ ఇలాగ ఎంతోమంది తత్వవేత్తలు ఉన్నారు!"

"వీళ్ళు మన దేశంరోని బౌద్ధ వైదిక మతాల తత్వవేత్తలకంటె కూడా గొప్పవారా?"

"ఒక్కమాటలో వీళ్ళు "గొప్ప" వాళ్ళు "కొద్ది" వాళ్ళు అని నిర్ణయించి చెప్పడం కష్టం. అనేక విషయాల్లో యవనతత్వవేత్తలు మన తత్వవేత్తలకంటే నిశ్చయంగా గొప్పవారనవచ్చును. అసలు మనవాళ్ళు ఇప్పుడిప్పుడే తమ సిద్ధాంతాలను గ్రంథస్థం చేయసాగారు. ఇదీ యవన తత్వవేత్తలు మనదేశానికి వచ్చాకనే!"

"ఐతే యవనతత్వవేత్తలకు మనం చాలా రుణపడి ఉన్నామంటారు?"

"అందులో సందేహంలేదు! కానీ, ఇప్పటి బ్రాహ్మణులు ఈ విషయాన్ని ఒప్పుకోవడం లేదు!"

"ఒప్పుకోక పోవచ్చును. అయినా వీళ్ళు యవనుల నుండి చాలా విషయాలు నేర్చుకొన్నారు కదా!"

"తప్పకుండాను! మూడు వందల సంవత్సరాల క్రితం సాకేత నగరంలో, సువర్ణాక్షి అనే బ్రాహ్మణి గర్భాన భదంత అశ్వఘోషుడనే మహాకవి జన్మించాడు. కనిష్కుని యొక్క సేనాపతి తన జన్మభూమియైన గాంధారదేశం వెళుతూ మగధ నుండి తనతోపాటు మహావిద్వాంసు నొకణ్ణి గాంధారదేశం తీసుకువెళ్తానన్నాడు. భదంత అశ్వఘోషుడు ఆ గౌరవానికి అర్హుడైనాడు. మొదటగా ఈ దేశాన్నుండి యవనదేశానికి వెళ్ళిన మహాపండితుడు అశ్వఘోషుడే! ఇతడు యవనుల తత్వ జ్ఞానాన్ని చక్కగా ఆర్జించాడు. యవన తాత్వికులు చెప్పిన అనేక విషయాలను స్వీకరించాడు."

"అశ్వఘోషుడు ఎక్కువగా ఒప్పుకున్న తత్వవేత్తలు ఎవరు ?"

"ఇందాక నేను చెప్పిన వారందరూ ఇతడి అభిమానులే! భారతదేశంలో బుద్ధుడు ఎలాంటి సిద్ధాంతాన్ని ప్రచారంచేశాడో అలాంటి సిద్ధాంతాన్నే హెరాక్లిటసు యవనదేశంలో ప్రచారం చేశాడు. ఇతడి సిద్ధాంతం, ప్రపంచంలో యే వస్తువూ స్థిరంగా వుండదు. ప్రతిదీ పరివర్తన చెందుతూ వుంటుంది. పరివర్తన యీ ప్రపంచ నియమం. మనం రెండుమార్లు ఒకే ప్రవాహంలో దిగి మొదటిమారు స్పర్శించిన నీటి బిందువులనే రెండవమారు కూడా స్పర్శించగలగడం అసంభవం"

డెమోక్రటసు ప్రవాహపు పరివర్తననైతే ఒప్పుకొన్నాడుగానీ, నీటి బిందువు స్థిరంగా వుంటుందంటాడు!"

"బిందువంటే?"

"బిందువును ఉపమానంగా చెప్పాడు. ప్రవాహమేకాదు, ఇటుక, రాయి, సున్నం, మణి, ముత్యం–ఇవన్నీ నిత్యం పరివర్తన చెందుతూన్న మాట సత్యమే నంటాడు డెమోక్రటసు. కానీ ఈ సమస్త వస్తు సముదాయానికి మూలమైన సూక్ష్మాతి సూక్ష్మమైన పరమాణువు లున్నాయే అవిమాత్రం నిత్యమైనవంటాడు!"

"ఐతే, ఇతడు ఈ మహావిశ్వంలో పరివర్తనా, అపరివర్తనా, ఈ రెండు స్థితులూ ఉన్నాయంటాడు!"

"కానీ, ప్లాటో ఒక పెద్ద మహలుతో పోల్చదగిన ఈ మహావిశ్వానికి పరమాణు రూపాలయిన యిటుకలే ప్రాథమికాలని ఒప్పుకోడు. ఈ మహా కట్టడపు మూలంలో పరమాణు రూపాలయిన యిటుకలు ఉన్నాయి. కానీ, వాటి మూలంలో కూడా విజ్ఞానం చైతన్యరూపంలో వుందంటాడు!"

"ఐతే, విజ్ఞానం శాశ్వతమైన దంటాడు ప్లాటో?"

"మా అగ్రజులైన ఆర్య అసంగ ప్లాటో చెప్పిన పై సిద్ధాంతాన్ని ఒప్పుకొంటారు. ఈ విశ్వానికి మూలం విజ్ఞానమనే చైతన్యమేనంటారు. దానితోపాటే బుద్ధుడు చెప్పిన "సర్వం అనిత్యం" సిద్ధాంతాన్నికూడా ఒప్పుకుంటారు !"

"అంటే ఈ మహావిశ్వపు హృదయాంత రాళంలో విజ్ఞానమనే జీవన స్రోతస్సు సదా ప్రవహిస్తూ వుంటుందంటాడు."

"ఆ విజ్ఞానపు మహా సందర్శనాన్నే ఈ విశ్వంలోని అణువణువులోనూ మనం చూడగలుగుతున్నా మంటాడు ఆర్య అసంగ! అశ్వఘోషుడు పరమాణువుల్ని ఒప్పుకున్నాడుగాని, విజ్ఞానమే సత్య మనేవాడు. ఈ నిత్య సత్య విజ్ఞాన సిద్ధాంతాన్నే మరికొంచెం విపులంగా ఆర్య అసంగ ప్రచారం చేస్తున్నారు."

"మరి సోక్రటీసు, అరిస్టాటిల్లో?"

"సోక్రటీసు తన సిద్ధాంతాన్ని గ్రంథరూపంలో యెక్కడా ప్రకటించలేదు. శిష్యుడయిన ప్లాటో అతని సిద్ధాంతాన్ని తన గ్రంథంలో వ్రాశాడు. మన తథాగతుడూ కూడా ఏమీ గ్రంథాన్ని వ్రాయలేదు. శతాబ్దాల తరబడి అతడి ఉపదేశాలను ప్రజలు కంఠస్థం చేస్తూ వచ్చారు."

"ఐతే బుద్ధుడి ఉపదేశాలు ఇప్పుడు గ్రంథరూపంలో లభిస్తున్నాయి కదా? దీర్ఘ – ఆగమ మధ్యమ సంయుక్త ఆగమ – ఈ గ్రంథాలు అతడు వ్రాసినవి కావా?"

"బుద్ధుడసలు గ్రంథాన్నే వ్రాయలేదు!"

"ఐతే ఆ తరువాత వాళ్ళు కూడా ఎన్నో విషయాలను తాము వ్రాసి బుద్ధుడి పేరుమీద ఈ గ్రంథాల్లో ప్రకటించి వుండవచ్చు!"

"అందుకు సందేహంలేదు. ఇప్పటికీ వినయపిటకాన్ని ముఖతః బోధిస్తు న్నారు!"

"బుద్ధుడి సమయంలో ఇవి వ్రాయబడ లేదంటారు?"

"ఆ రోజుల్లో గ్రంథాలు చాలా తక్కువగా వ్రాసేవారు. అంతేకాక బుద్ధ భగవానునికి సూటిగా తన తత్వాన్ని ప్రచారం చేసుకోవడం ఇష్టం. ఆ ఆదర్శం తోనే తథాగతుడు యౌధేయ భూమినుండి అంగభూమి వరకూ నలభైనాలుగు సంవత్సరాలపాటు అవిశ్రాంతిగా తిరిగి తన మతాన్ని, తత్వాన్ని ప్రచారం చేశాడు. ఈ దీర్ఘకాలంలో ప్రజల ప్రశ్నలకు సమాధానాల్ని, సందేహాలకు నివారణలనూ ఇస్తూ గడిపాడు. నలభైనాలుగు సంవత్సరాలపాటు జరిగిన ఈ సమస్త విషయాల్ని ఎలా వ్రాయగలడు?"

"వారి జీవితమే ఒక గ్రంథం అంటారు."

"వారి నలభై నాలుగు సంవత్సరాల జీవితమే "పిటకా"ల రూపంలో చూస్తున్నాము."

"ఐతే, ఈ పిటకాలు శతాబ్దాల తరబడి అలిఖితంగానే వున్నాయిగా?"

"అందువల్లె ఈ పిటకాల్లో వున్నవన్నీ బుద్ధుడే చెప్పాడంటానికీ వీలులేదు. అలాగని బుద్ధుడు చెప్పిన ఉపదేశాలను తెల్సుకోవడానికి ఈ పిటకాలు కాక వేరే ఆధారమూలేదు!"

"అప్పటి భాషకూడా వేరుగా వుండి వుండవచ్చు!"

"అశోకుడి శిలా లేఖలలోని భాషను నీవు చదివావు కదా? అది ఇప్పటికి ఐదు వందల సంవత్సరాల క్రితపు భాష. బుద్ధుడి కాలం అప్పటికి ఇంకా రెండు వందల యాభై సంవత్సరాల వెనుక. కనుక బుద్ధభగవానుని కాలపు భాష అశోకుని కాలపు భాషకంటె కూడా మార్పుగా వుంటుంది!"

"కానీ భన్తే! ఈ రోజు మనకు లభించుతున్న పిటకాలలో భాష కొద్ది మార్పులు మినహా సంస్కృతంలాగానే వుండెందుకని?"

"అవును సర్వాస్తివాదులయొక్క పిటకాల భాష సంస్కృతమే! అదే కాకుండా ఇంకా అనేక బౌద్ధ నికాయాల [సాంప్రదాయాల] పిటకాలు కూడా సంస్కృతంలోనే వున్నాయి. కాని, సింహళదేశపు బౌద్ధ పిటకాలు మాత్రం ప్రాచీన కోసల [పాళీ] భాషలో వున్నాయి!"

"ఐతే బుద్ధుడు ఉపదేశం ఇచ్చిన భాషలోనే వాళ్ళు పిటకాలను భద్రపరచు కొన్నారు."

"బుద్ధభగవానుడి భాషను వాళ్ళుకూడా పూర్తిగా కాపాడారని అంటానికి వీలులేదు. అక్కడా పిటకాలు వందల సంవత్సరాలపాటు ముఖతః అభ్యసించబడి

నాయి! కాకపోతే, మనదేశంలోని పిటకాలకంటే సింహళదేశంలోని పిటకాలు బుద్ధుని భాషకు దగ్గరగా వుంటాయి!"

"ఐతే, సోక్రటీసు ఉపదేశాలనుకూడా ఇలాగే ప్రోగుచేసి సంగ్రహ పరిచారంటారు?"

"సోక్రటీసు విషయం నీకు తెల్సునా? అప్పటి ప్రభుత్వం అతనికి విషపానపు దండన విధించింది."

"అప్పుడు ఎవరో అక్కడి రాజు?"

"ఏథెన్స్ నగరంలో అప్పటికింకా రాచరికం రాలేదు. మరొక యాభై సంవత్సరాలకుగానీ రాచరికం స్థిరపడలేదు."

"ఐతే, గణతంత్రమే సోక్రటీసును చంపిందంటారు?"

"అది గణతంత్రం చేసిన పనికాదు. గణతంత్రంలోని ధనికస్వాములు చేశా రాపని."

"నిజంగా కూడాను! గణతంత్రంలో ధనికుల ప్రభావం పెరగడం అవాంఛనీయం. అందువలన చాలా చెడు వస్తుంది."

"సోక్రటీసు ఏథెన్స్ నగరంలో - దేవతల పేర వ్యాపించివున్న అనేకమైన కథలనూ, విశ్వాసాలనూ ఖండించాడు! ప్రజలను తార్కికుల్ని బుద్ధివాదుల్ని చెయ్యాలని చూశాడు. అందుకే, గణతంత్రంలో తమ ధనంద్వారా ప్రభావాన్ని పెంచుకొన్న ధనికులకు సోక్రటీసు కంటకుడయ్యాడు. ప్రజ లిలా బుద్ధివాదులైతే, తమ వునికికే ప్రమాదమని తెల్సుకొన్నారు. అతనికి విషపానంతో మృత్యుదండన విధించారు! ఏథెన్స్‌లో ధనిక - బీదలయొక్క వ్యత్యాసాల శాశ్వతత్వాన్ని దేవతల పేర్లతో ధృవపరుస్తూండేవారు."

"అంటే, ప్రజలకు దేవతలమీద విశ్వాసం సన్నగిల్లితే, రైతులూ, కూలీలు, బీదశిల్పులూ తాము కడుపులు మాడ్చుకొని, రాజులకు, అమాత్యులకు, పురోహితులకు సర్వసౌఖ్యాలనూ చేకూర్చరనీ, వారి ప్రభుతనూ, సుందర భవనాలనూ నేలమట్టం చేస్తారని భయం వేసింది గావును!"

"కానీ, సోక్రటీసుమీద మరోరకంగా నేరారోపణ చేశారు. ఉన్న యథార్థాన్ని చెప్పడానికి వాళ్ళకు ధైర్యం చాలదు. వాళ్ళ ఆరోపణ ఇది: సోక్రటీసు మన దేవతలను నిందించాడు. అతడు విధర్మి, యువకుల్ని విధర్ములుగా చేస్తున్నాడు—అన్నారు!"

"తరువాత విషాన్నిచ్చారా త్రాగమని?"

"సోక్రటీసు చాలా సంతోషంగా, ఈశ్వరుడిలా ఆ గరళాన్ని పానం చేశాడు."

"కానీ, ఈ అన్యాయానికి ప్రతీకారం చెయ్యకపోవడం చాలా సిగ్గుచేటైన విషయం."

"ప్రతీకారం ఇకనుండి చెయ్యాలి."

"ఇకనుండీనా? కాని, సోక్రటీసుకు విషపాన శిక్ష విధించినవాళ్ళు ఏనాడో గతించారుగా? ప్రతీకారము ఎవరికి చేస్తాం?"

"నీ వనుకోవడం, ఏథెన్స్ గణసంస్థరోని ఏ కొద్దిమంది వ్యక్తులో సోక్రటీసును చంపారు కనుక వాళ్ళమీదనే పగ తీర్చుకోవాలని! కానీ, సోక్రటీసు లాగానే ఇప్పుడూ ఎప్పుడైనా మనదేశంలో చెబితే, బహుశః ఇతడికీ అలాటి శిక్షే పడుతుందనుకుంటాను. ఈ దేవుళ్ళూ దేవతలూ—అంతా కల్పితం! దేవుళ్ళ పేరు చెప్పి, భయాన్ని చూపి,ప్రజల శ్రమఫలితాన్ని దోచుకోవడం ఘోరమైన అన్యాయం. ఇలాటి అన్యాయాలకు నిలయమైన ఈ రాచరికాన్ని ఎత్తివేసి, దీని స్థానంలో గణతంత్ర వ్యవస్థను నెలకొల్పాలి. ఆ గణతంత్ర వ్యవస్థలో ధనికులూ—బీదలూ అనే వ్యత్యాసం వుండదు. అందరూ తమ యోగ్యతను అనుసరించి శ్రమ చేస్తారు. అవసరాన్ననుసరించి తిండి గుడ్డా యితర జీవితావసర వస్తువుల్ని తీసుకొంటూ వుంటారు!—అని చెప్పినట్లయితే...."

"సోక్రటీసు ఇలానే చెప్పాడా?"

"సోక్రటీసు తను స్వయంగా ఏ గ్రంథాన్నీ వ్రాయలేదని చెప్పానుగదా! కాని ప్లేటో 'గణం' అనే పేరుతో ఒక గ్రంథాన్ని వ్రాశాడు. ఆ గ్రంథంలో తన గురువుగారివిగా పై భావాలను ఉదహరించాడు!"

"గణసంస్థలో ఉద్భవిస్తున్న లోపాలు సోక్రటీసుకు తెలుసును. ఇప్పుడు యౌధేయ గణంలోని దోషాలను నేనూ చూస్తున్నాను. సోక్రటీసులాగా నేను గూడా ఆగ్రోదకా గణసంస్థలోని దోషాలను దూరం చేయడానికి ప్రయత్నించినట్లయి తే సోక్రటీసుకు పట్టినగతే నాకూ పడుతుంది, ఇక్కడకూడా!"

"డబ్బు అంత పాపిష్టిది. డబ్బు సంపాయించడానికి మనిషి ఎంత నీచానికైనా, ఎంత అన్యాయానికైనా దిగజారుతాడు. రైతుల, కూలీల, శిల్పుల—శ్రమ ఫలితాన్ని దోచుకోవడం గణసంస్థకూడా ఉచితమేనని భావించింది. ఇక రాచరిక విషయం చెప్పనే అవసరం లేదనుకో. అందుకనే సోక్రటీసు ఇలా అన్నాడు: గణ సంస్థ సభ్యులకు వ్యక్తిగతమైన ఆస్తిపాస్తులు వుండరాదు! చివరకు భార్య అయినా వుండరాదు."

"భార్యకూడా వుండరాదా?—అంటే ఏమిటి భన్తే? ప్రభుత్వ కార్యకలాపాలను భిక్షువులకు-సన్యాసులకు వప్పచెప్పమంటాడా?"

"అబ్బే, అలా భిక్షువులకుగాని, సన్యాసులకుగానీ ఒప్పచెప్ప మనడు. గణ సంస్థ సభ్యులు ప్రత్యేకం స్త్రీలను కలిగి వుండడానికి అతడు వ్యతిరేకి! ఇలా అంటాడు: ప్రత్యేకం తనకొక స్త్రీ అంటూవుంటే, ఇల్లూ, వాకిలీ, కొడుకులూ, కూతుళ్ళూ, అన్నీ విడిగా ఏర్పడతాయి. తండ్రి విధిగా పక్షపాత బుద్ధిని వహిస్తాడు. తన అధికారాన్ని దుర్వినియోగం చేస్తాడు. అందువల్లే అతడు గణసంస్థ

సభ్యులు తమ అవసరాలన్నిటినీ ఉమ్మడిగానే తీర్చుకోవాలని అంటాడు. ఇల్లూ, వాకిలీ, భార్యా అన్నీ ఉమ్మడే!"

"ఉత్సవసంకేతంలో అక్కడక్కడా ఉమ్మడిగా భార్యలను అనుభవించే ఆచారం చూశాను. సోక్రటీసు ఇదే విషయాన్ని ఆలోచించాడు గావును!"

"ఉత్సవసంకేతపు ప్రజలు చాలా వెనుకబడి వున్నారు. అందువల్లే వాళ్ళలో ఇంకా ఆ ఆచారం నిలిచివుంది. వాళ్ళకూ మనలాగా నాగరికులవడానికి, ధనోపార్జనకూ మార్గాలు లభించినట్లయితే, ఎన్నడో ఎగిరిపోయేదీ ఆచారం!"

"సోక్రటీసు ఈ ప్రపంచాన్ని బాగుచేయాలనుకున్నాడు. స్వార్థపరుల కది కంటకమైంది. అతణ్ని ఈ ప్రపంచంలోనే లేకుండా చేశారు."

"అవునుమరి, పరలోకాన్ని, ఉత్తర జన్మనూ బాగుపరచుకోవడానికి ప్రయత్నిస్తే ఈ రాజులూ, మహారాజులూ, భట్టారకులూ, రాజపురోహితులూ దీనార్లవర్షం కురిపించి నిన్ను అభినందిస్తారు. కానీ, ఈ జన్మనూ, ఈ లోకాన్నీ బాగుపరచుకోవడానికి ప్రయత్నించావా, సోక్రటీసుకు పట్టిన గతే నీకూ పడుతుంది!"

"కానీ, భన్తే! దానమనీ, పుణ్యమనీ, పరలోకం కోసరమనీ, లక్షల సంఖ్యలో దీనార్లను ఖర్చు చేస్తున్నారు కదా? వీటినే ఈ లోకాన్ని బాగుపరచడానికి ఎందుకు ఖర్చుపెట్టరు?"

"లక్షల దీనార్లతో జరిగే ప్రయోజనం ఏమీ వుండదు. పరమ భట్టారకుని క్రింద మూడు కోట్లమంది ప్రజలు వున్నారనుకో! మూడు కోట్ల దీనార్లను పంచితే ఒక్కొక్కడికి ఒక్కొక్క దీనారు వస్తుంది. ఆ ఒక్క దీనారుతో ప్రజలకు జరిగే ప్రయోజనం ఏముంటుంది? పైగా మూడుకోట్ల దీనార్లను ప్రజల్లో పంచడానికి భట్టారకుడు ఎన్ని సౌఖ్యాలనూ, హోదాలనూ మర్చిపోవల్సివస్తుందో తెలుసా? మరకత మాణిక్యాలు పొదిగిన సింహాసనాన్ని వదిలి సాధారణుడిలా చాపమీద కూర్చోవల్సి వస్తుంది. అంతఃపుర సౌఖ్యాలకు స్వస్తి చెప్పవల్సివస్తుంది. వందల సంఖ్యలో వున్న వంటవాళ్ళను వాళ్ళు వండే అపురూపమైన వంటకాలనూ విస్మరించవలసి వస్తుంది. అన్నిచేసి మూడుకోట్ల దీనార్లను పంచినా, ఏమంత ఫలితముండదు. ఇలాకాకుండా రెండువందల తొంభైతొమ్మిది లక్షల దీనార్లను తమకోసం ఖర్చుపెట్టుకొని, ఒక లక్ష దీనార్లతో దేవాలయాలనూ, విహారాలనూ కట్టిస్తే, యజ్ఞాలుచేస్తే, బ్రాహ్మణులకు దానమిస్తే-అందరూ పరమ భట్టారకుల్ని స్తుతిస్తారు. జయజయకారాలు పలుకుతారు. హరిషేణుడిలాంటి పండిత కవులు సుదీర్ఘాలయిన స్తుతి వాక్యాలనువ్రాసి, రాతి స్తంభాలమీద చెక్కిస్తారు!"

"పరమ భట్టారకులు ధర్మరాజని ప్రసిద్ధి చెందుతారు!"

"ఇప్పుడర్థమైంది కదా? పరలోకాన్ని బాగుచేసుకోవడం తేలికో, ఈ లోకాన్ని బాగుచేసుకోవడం తేలికో!"

"అవును. భట్టారకునివద్ద దానం పొందిన బౌద్ధ భిక్షువులూ, బ్రాహ్మణులూ అతడు పుణ్యాత్ముడని, పూర్వజన్మ సుకృతాలవల్ల రాజైపుట్టి రాజభోగాన్ని అనుభవిస్తున్నాడనీ చెబుతారు. నిరంతరమూ కష్టించి, కడుపుకు చాలక బాధపడే ప్రజను సంతృప్తిపరచడానికి, మీ పూర్వజన్మ కర్మలవల్ల ఇలా బాధలనుభవిస్తున్నారని, చెబుతారు! ఎంత బాగుంది? కర్రా విరగదు, పామూ చచ్చిపోతుంది!"

ఆచార్యులవారు చిన్నగా నవ్వారు. "నాయనా జయా! నా మాటల్ని నీవు చక్కగా అర్థం చేసుకోగలవు. గాంధారంనుండి వచ్చేప్పుడు నే నిదే ఆశించాను. ఏదో ఒక రాజకులంలో ఒక రాజకుమారుడికి, నా భావాలన్నిటినీ బోధిస్తే, అతడు తన శక్తి నుపయోగించి ఈ ప్రపంచాన్ని మారుస్తాడని నా ఆశ! ఈ ప్రయత్నం నాకంటే ఆరు శతాబ్దాలముందు అరిస్టాటిల్ చేసి ఓడిపోయాడు. అయినా నేనీ ప్రయత్నంతోనే వున్నానంటే, తప్పుల్నే మళ్ళీ మళ్ళీ చేయడం మానవప్రకృతి అనవల్సివస్తుంది" అన్నారు.

"అరిస్టాటిల్ ఏం చేశాడండి?"

"అరిస్టాటిల్‌కు ప్లాటో శిష్యుడు. తన కండ్లముందే తన గురువును చంపివేయడం ప్లాటో చూశాడు. ఆ పగను తీర్చుకోవాలనుకొన్నాడు!"

"అంటే హత్యకు బదులు హత్య చేద్దామనుకున్నాడా?"

"హత్యకు బదులు హత్య—మూర్ఖుడు చేసేపని! ఒక విషయం చెప్పాను జ్ఞాపకం వుందా? నీవు, ఈనాడు, ఇక్కడ ఈ ప్రపంచాన్ని కొంచెం బాగుపరచాలని ప్రయత్నించావో, నీకూ సోక్రటీసుకు పట్టిన గతి పడుతుంది. అదే ఈ పరమభట్టారకుడి రాజ్యంలో జరిగేదీను. ఇతడు అంత సుఖమైన చావుకూడా చావనివ్వడు. శరీరాన్ని ముక్కలుగా కోసి కాకులకూ, గ్రద్దలకూ వేస్తాడు!"

"నిజమేను."

"ప్లాటో ధనంవలన మానవ సమాజంలో సంభవించిన వ్యత్యాసాలను గమనించాడు. ధనంవలన ప్రభుత లభించడాన్ని కూడా చూశాడు. అంతేకాకుండా ధనికుడు ప్రభువయ్యాక, ధనాన్ని దోచుకోవడానికి మరీ మార్గాలేర్పడడం, ఎవడైనా ఆ దోపిడీకి అభ్యంతరాన్ని చెబితే తలలు ఎగిరిపోవడం చూశాడు. వీటన్నింటికీ మూలం సంపదలో 'నీ—నా' అనే వ్యత్యాసముండరాదు. అలా సంపదను ఉమ్మడి చేయడానికి 'నీ—నా' అనే వ్యత్యాసాన్ని నశింపచేయడానికి అతడు జీవితమంతా ప్రయత్నించాడు. ఈ ఆదర్శంతోనే 'గణతంత్రం' అనే గ్రంథాన్ని వ్రాశాడు. గణసంస్థ సభ్యుల్లో కొంతమంది బీదలూ, సామాన్యులుకూడా వున్నారు. సోక్రటీసు మృత్యువుకు అలాంటివారందరూ పశ్చాత్తాపపడ్డారు. అందువలననే ప్లేటోకి విషం త్రాగించలేకపోయారు. అరిస్టాటిల్, సోక్రటీసు, ప్లాటోల ఆదర్శాలను కార్యరూపంలో పెట్టాలనుకొన్నాడు. ఎవడయినా ఉత్తముడైన రాజకుమారు

తథాగతుని ఆదర్శ విఫలత

డికి తమ ఆదర్శాలను నూరిపోస్తే అతడు తేలికగా యూనాన్ చక్రవర్తయిన ఫిలిప్ కుమారుడు ఆ అలక్ సుందర్ (అలెగ్జాండర్)కు గురువయ్యాడు. కానీ, అలక్ సుందర్ ప్రపంచాన్ని ఏం బాగుచేశాడు? రక్తపుటేరుల్లో ముంచాడు!"

"గణతంత్రపు ప్రజనుండి కొంత ఆశించినా ఆశించవచ్చు. కానీ, రాజ కుమారుడినుంచి ఏం ఆశించగలం? రాజుల రాజాంతఃపురాల స్వార్థపర, జఘన్య జీవితాన్ని గురించి ఏమీ ఎరుగనివారే, రాజకుమారులనుండి ఇలాటి ఆశయాలను సాధించగలమనే కలలు కనగలరు!"

"నిజమే! నాలాగానే అరిస్టాటిల్‌కు కూడా రాజుల జీవితాలు, రాజాంతఃపుర జీవితాలు పరిచయం లేకపోవచ్చును!"

"భన్తే! నా ఉద్దేశ్యంలో 'హత్యకు బదులు హత్య చాలా తేలిక? మొత్తం వ్యవస్థనే మార్చిపారేయడం ఒక వ్యక్తికి పూర్తిగా అసంభవమైన విషయం! ప్రజ లందరూ కలసి చేసినా ఒక తరంలో సాధించడం సంభవంకాదు!"

"అయినా మనం వ్యవస్థను మార్చడానికే ప్రయత్నించాలి. 'అదే ఉచితం!"

"ప్రజలందరి సౌఖ్యం కొరకు, 'బహుజన హితాయ' అంటారు?"

"అవును 'బహుజన హితాయ' 'బహుజన సుఖాయ!' తథాగతుడు తన ప్రథమ శిష్యుడికి ఏమని బోధించాడో! తెలుసునా? 'చరథ భిక్ఖవే చారికం బహు జన హితాయ బహుజన సుఖాయ!' అని బోధించాడు!"

"కానీ, తథాగతుడు తన ఆదర్శాన్ని ఎందుకు చేరుకోలేకపోయాడు? ఎందుకు అసఫలుడయ్యాడు?"

"అతడు అసఫలుడు కావడానికిగల కారణాలు అన్నీ నాకు తెలియవు కాని, తథాగతుడు కనీసం భిక్షు సంఘంవరకైనా 'నీ—నా' అనే భేదంలేకుండా చేద్దామను కున్నాడు. అందుకు అవసరమైన నియమాలను కొన్నింటిని ఏర్పరిచాడు. ఆ నియ మాలు ఇప్పటికీ వినయపిటకంలో వున్నాయి. కానీ,విచారకరమైన విషయం బుద్ధుడు నిర్వాణాన్ని చెంది ఒక శతాబ్దమైనా గడవకముందే భిక్షు సంఘంలోకి ఈ 'నీ—నా' అనే భావం జొరపడ్డది. తథాగతుడు సాధారణమైన వస్తువులు తప్ప — (శరీరం పైనున్న వస్త్రాలు, సూది, మంగలికత్తి, భిక్షాపాత్ర) మిగిలినవన్నీ సంఘపరమేననీ, భిక్షువులు ఎలాంటి ఆస్తిపాస్తులకూ అధికారులు కారనీ చెప్పాడు. కాని ఇప్పుడో? భిక్షువులు, సువర్ణాన్నీ, దీనార్లనూ దాచుకొని పంచుకొంటున్నారు కూడాను. మరి చుట్టూవున్న ప్రపంచం 'నీ—నా' అనే భావంతో నిండి వున్నప్పుడు ఒక్క భిక్షు సంఘం మాత్రమే శుద్ధంగా ఎలా వుండగలదు?"

"ఇప్పుడు భిక్షువుల్లోకూడా ధనికులూ, బీదలూ వుంటున్నారు!"

"భిక్షు సంఘాన్నుండి తథాగతుడు దేన్నయితే, ఆశించాడో అది జరగలేదు!"

"ఐతే భన్తే! ఈ ప్రపంచానికిక తరుణోపాయం లేదా?"

"నిరాశపడడం ప్రాణికి లక్షణం కాదు. అసఫలతలు కలిగాయంటే వాటి నుండి గుణపాఠం నేర్చుకోవాలి! ఈ పనికి ఇంకా సమయమూ, సమాధానాలుకూడా అవసరమౌతాయని అసఫలత తెలియచేస్తోంది!"

గడచిన రెండేళ్ళనుండి విద్యాధ్యయనంలో నేనొక్కణ్ణేకాకుండా ఆచార్యుల వారుకూడా ఎక్కువ శ్రద్ధను కనపరుస్తున్నారు. ఆచార్యులవారు, సంభాషణల్లో హృ ద యా ం త రా ళ ం లో ని భావాలనన్నింటినీ నాకు వె లి కి క క్కే వారు. అలా తమ భావాలనన్నింటినీ చె ప్పే య డ ం వ ల న వారికి ఒకేవిధంగా బరువు తగ్గినట్టయ్యేది. వారి సమయం అధికభాగం నాకోసరమే ఖర్చు పెట్టేవారు. ఎన్నోసార్లు నన్ను తీసుకొని రాజగృహానికి వెళ్తూవుండేవారు. ఒక మాటు రాజగృహంలో 'గృద్ధకూటం' యొక్క ఒక పెద్ద శిలాఖండంమీద ఆచార్యులవారు నిలబడి వున్నారు. వారి కండ్లు ఆశా-నిరాశ-కరుణ-వేదన మొదలైన మృదుభావ సమ్మేళనంలో మెరిసిపోతున్నాయి. వారు తన కుడిచేతిని ముందుకుచాచి, ఎదురుగా ఐదు పర్వతాల మధ్యవున్న ఖాళీ భూవలయాన్ని చూపుతూ "నాయనా! ఈ ప్రదేశంలో ఒకప్పుడు ఒక మహానగరం కళకళ్ళాడుతూ వుండేది. అందమైన వీధుల్తో, సుందరమైన మహలులతో కన్నుల పండువుగా వుండేది. అతి సుందరమైన రాజప్రాసాదాల్లో, కోకిలలను లజ్జింపచేసే మధురమైన కంఠంగల స్త్రీలు కమ్మగా పాడుతుండేవారు. ఇటు, ఈ దక్షిణపు కొసన బింబిసారుని మహల్ వుండేది. వాటి చిహ్నాలైనా ఇప్పుడున్నాయా?"

"లేవు ఆచార్యా! మధుర గాయినుల కోకిల స్వరాల స్థానంలో ఇప్పుడు ప్రొద్దుక్రుంకి నప్పటినుండి వికృతమైన నక్కల అరుపులు మాత్రం వినిపిస్తుంటాయి."

"బింబిసారుణ్ణి అతడి కొడుకు అజాతశత్రుడు కారాగారంలో బంధించాడు. పాపం బింబిసారుడు కారాగారంలోనే కృశించి, కృశించి చనిపోయాడు. ఎందుకో తెలుసా? రాజ్యంకోసం, ఐశ్వర్యం కోసం, భోగేచ్ఛ నిరాటంకంగా కొనసాగడం కోసరం-అతడి ఈ రాజ్యకాంక్షనూ, భోగేచ్ఛనూ పరలోకంగానీ, ఉత్తర జన్మగానీ ఏవీ ఆపలేకపోయాయి!"

"నిజమే ఆచార్యా! ధనికులకూ, మహారాజుకూ పునర్జన్మగానీ, పరలోకం గానీ ఏవీ అభ్యంతరాలుకావు. బౌద్ధులు కూడా ఈ పరలోక వాదాన్ని పునర్జన్మ వాదాన్ని అంగీకరిస్తారు. కానీ పరలోకం, పునర్జన్మ, బహుజనహితం ఈ మూడూ ఒకేచోట వుండటం బొత్తిగా పొసగదని నా అభిప్రాయం."

"ఐతే, జయా! నీకు పరలోకం మీద విశ్వాసం లేదా ?"

"పరలోకమనేది విశ్వాసానికి అతీతమైన విషయంగా భావిస్తున్నాను!"

"అలా చెప్పకు. సరిగా నీ అభిప్రాయాన్ని చెప్పు! సంకోచించకు!"

జన్మ - పునర్జన్మ

"భన్తే! పరలోకాన్ని గురించి ఒక్క క్షణం వృధాచేయడం కూడా నాకు ఇష్టం లేదు. అవివేకులూ, మూర్ఖులు, పిచ్చివారు మాత్రమే అలా చేయగలరని నా అభిప్రాయం!"

"చాలా కఠినమైన పదాలను ప్రయోగిస్తున్నావు జయా!"

"ఈ పరలోక వాదం ఒఠి మోసమండి. పరలోకమనే ఈ అసత్యం భావన ప్రచారంలో జీవితాన్ని నరకప్రాయం చేశారు. ఈ వాదం నూటికి తొంభైతొమ్మిది మందిని గొర్రెలుగానూ, మిగిలిన ఒకడినీ వాళ్ళ రక్తాన్ని, పీల్చే తోడేలుగానూ చేసింది. ఆచార్యా! కేవలం ఒక రూపంలో మాత్రం పరలోకాన్ని ఒప్పు కోగలను?"

"ఏమిటా రూపం?" అంటూ ఆచార్యులవారు చిన్నగా నవ్వారు!

"తండ్రియొక్క పరలోకం కొడుకు, తండ్రియొక్క పునర్జన్మం కొడుకు! తండ్రి మానసిక, శారీరక సౌష్ఠవాన్ని ప్రతిబింబింపచేసే ఒక చిన్న 'అంశా'న్ని తల్లి గర్భంలో వదుల్తాడు. తల్లి తన 'అంశా'న్ని కూడా కలిపి, తొమ్మిది నెలలూ మోసి ఈ భూమ్మీద పడేస్తుంది. ముందుతరాన్ని నిర్మించడానికి ముందు తరాన్ని నిర్మించే ఈ పుత్రుడే తండ్రి యొక్క పునర్జన్మ. తండ్రి యొక్క పరలోకం! ఇలాటి పునర్జన్మనూ, పరలోకాన్ని – తప్పకుండా ఒప్పుకొంటాను!"

"ఔను. నీవు చెప్పిన పరలోకంలో మనం చనిపోయాక మరో లోకంకోసరం ఎదురు చూడాలనే బాధ వుండదు."

"అవును, భన్తే! ఇలాటి పరలోకాన్ని విశ్వసించడం వలన ఎవరినీ మోసం చేయవల్సిన అవసరం వుండదు. పైగా ఈ లోకాన్ని బాగుపరచుకోవడానికి పూర్తి అవకాశమూ, అవసరమూ లభిస్తాయి!"

"నాయనా జయా! నీ భావాలు చాలా వున్నతంగా, వుత్తమంగా వున్నాయి! నేను నా అభిధర్మకోశంలో ఈ బ్రాహ్మణుల ఆత్మ వాదాన్ని ఆత్మనిత్యమైంది, సనాతకమైనదనే వాదాన్ని-తీవ్రంగా ఖండించాను. బ్రాహ్మణుల ఈ ఆత్మ శాశ్వత మైనదనే వాదం ఘోరమైన స్వార్థానికీ, పిరికితనానికీ మరురూపమని వ్రాశాను! ఇలాంటి తుచ్ఛమైన స్వార్దానికీ పిరికితనానికీ దాసులైన వారికి, ముక్తిగాని లేక నిర్వాణంగాని ఎలా లభిస్తాయి-అన్నాను!"

"మీరు నిజం చెప్పారు ఆచార్యా! తను శాశ్వతంగా బ్రతికి వుండాలనే స్వార్థము, చనిపోతున్నందు వలన కలిగేభయమూ—వీటి నివారణ కొరతకు మృత్యు తరువాత కూడా ఆత్మ వుంటుందన్న నీచమైన కల్పనను కల్పించారు. ఈ నీచ కల్పన ప్రసాదమే పరలోకమూ, పునర్జన్మాను. ఈ కల్పనే లేకపోతే నూటికి తొంభై తొమ్మిదిగా వున్న ప్రజలు, అష్ట కష్టాలూపడి పండించి, తాము కడుపు మాడ్చుకొని శ్రమ ఫలితాన్ని మరొకరికి ఈయరు. కొంతమంది స్వార్థపరులు, అన్నార్తులూ,

వస్త్ర హీనులూ అయిన ప్రజల రక్తమాంసాలను పిండి, అందమైన ప్రాసాదాలను నిర్మించుకోలేదు!"

"ఓహ....సాధు....సాధు, బాగా చెప్పావు జయా! బౌద్ధమతాన్ని గురించి నేను చాలా వ్రాశాను. నిర్వాణాన్నీ పరలోక వాదాన్నీ అనేకమైన తర్కాలతో సమర్థించాను. కానీసమర్థంపు చాలాబలహీనంగానూ,నీరసంగావుందని నాకే అనిపించింది. అసలు బుద్ధభగవానుడు శాశ్వతమైనది-ఆత్మ అనేపదార్థం ఒకటుందని ఒప్పుకోలేదు కదా! ఇక నలాంటప్పుడు నిర్వాణానికి అర్థం ఏముంటుంది? దీపం ఆరిపోవడాన్ని 'దీపనిర్వాణం' అంటాము. ఈ నిర్వాణానికి కూడా అలా ఆరిపోవడమనే అర్థమైతే, ఇక ఆరిపోయిం తర్వాత (మృత్యువు తరువాత) ఏదో వుందని ఈ ప్రాకులాడడం దేనికి. నిర్వాణానికి ముందు ఇహ జీవితాన్ని గురించి ప్రాకులాడినా కొంత అర్థం వుంటుంది.

"మన పునర్జన్మ మన శరీరంలోనే వుంది. బాల్యంలో ఉన్నట్లే యౌవనంలో మనముండడంలేదు. అంటే ప్రతిక్షణమూ మన శరీరమూ మనస్సూ – కొంత నశిస్తున్నాయి. కొంత నూతనంగా పుట్టుకొస్తున్నాయి. ప్రపంచంలోని ఇతర వస్తు సముదాయం లాగానే మానవుడి మనస్సూ, శరీరం కూడా క్షణక్షణమూ పరివర్తన చెందుతున్నాయి. అంటే ఈ క్షణంలో మనలో జీవించి వున్న మనస్సూ, శరీరమూ ఇహలోక మనుకోవచ్చు! మరుసటి క్షణం, రెండవ క్షణం, మూడవ క్షణం రాబోయే మనస్సూ – శరీరాలు– పరలోక మనుకోవచ్చు....మానవుడికి జీవిత ప్రవాహంలో అనంతకాలంవరకూ కలిగే సంతానాలుకూడా ఒకరికి మరొకరు పరలోకం, తమకు తమ పుత్రుడు, అతడికి అతడి పుత్రుడు."

"జయా! నీవు చెప్పే ఈ పరలోక వాదం శ్రమణులూ – (బౌద్ధ భిక్షువులు) బ్రాహ్మణులూ చెప్పే పరలోకవాదం కంటే చాలా బాగుంది. ఈ పరలోకవాదం బహుజన హితానికి అనుకూలంగా వుంది. వాళ్ళు చెప్పేది ఒకరకం ప్రజలకు తప్పకుండా అనుకూలిస్తుంది. నూటికి 99 మందిగా వున్న బీదప్రజల కష్టార్జితాన్ని దోచుకొని కులుకుతూ సౌఖ్యాలను అనుభవించే దొంగలకు; వాళ్ళు చెప్పే పరలోకవాదం అనుకూలిస్తుంది!"

"ఊరక అనుకూలించడమే కాదు! మృత్యు దండనకు అర్హులైన ఇలాటి దొంగలకు సింహాసనాన్ని ఇస్తోంది. హాయిగా ఛత్ర చామరముల వీవనలను పొందడానికి అవకాశాన్ని ఇస్తోంది. శ్రమణులూ, బ్రాహ్మణులూ కల్పించిన ఈ పరలోక వాదం బహుజన హితానికి ఎన్నడూ పాటుపడలేదు. నే నీ పరలోకవాదాన్ని ఒప్పుకోలేను ఆచార్యా."

"ఐతే, చివరకు నీవు ఇదే నిశ్చయానికి వచ్చావా?"

"అవును భన్తే – నా చదువు, నా అనుభవం చివరకు నన్నీ నిశ్చయానికి తీసుకొని వచ్చాయి. తథాగతుని యొక్క అనిత్యవాదాన్ని, క్షణికవాదాన్ని – ఈ

విశ్వంలో ప్రతి ఒక్కటీ పరివర్తన చెందుతూ వుంటుంది అనే వాదాన్ని— పరమ సత్యాలుగా నేను ఒప్పుకుంటాను. ఈ జగత్తు ప్రతిక్షణం మారిపోతూ వుంటుంది. మారిపోవడమే నియమంగా గలిగిన ఈ జగత్తుకు ఎవడో ఒక – కర్త గాని లేక ఈశ్వరుడుగాని – ఆధారం ఉండాలనుకోవడం, ఉన్నాడనుకోవడం అవివేకం! పృథ్వీశ్వరులను (రాజులను) నిరంకుశలను చేయడానికి జగదీశ్వరులను (భగవంతుణ్ణి) కల్పించడం జరిగింది. ఈ జగదీశ్వరుల కల్పనలో రాజులు చాలా ముఖ్య పాత్ర వహించారు.

"నాయనా, జయా! మొట్టమొదటి మానవ సంతానానికి, నీ పరలోకవాదమే నచ్చినట్లయితే, ఈ ప్రపంచం ఎలా వుండేదంటావు?"

"చాలా బాగుండే దనుకొంటాను. ఈ రోజుల్లో ఈ రాజగృహంలోని కోటీశ్వరులైన ధనిక శ్రేష్ఠుల సంతానం ఇప్పుడు గుర్తుపట్టడానికి కూడా వీలులేకుండా పోయింది. అంటే సాధారణులైన నూటికి తొంభై తొమ్మిది మంది ప్రజల్లో కల్సిపోయారన్నమాట. అజాత శత్రువు తన తండ్రినిగానీ, తల్లి వంశాన్నిగానీ దేన్నీ లెక్కపెట్టలేదు. కేవలం తన స్వార్థాన్ని మాత్రం చూచుకొన్నాడు. ఇప్పుడతని సంతానం తొంభై తొమ్మిది మందిలో కల్సిపోయింది. నా ఉద్దేశ్యంలో తొంభై తొమ్మిదిమంది రక్తాన్ని పీల్చే ఈ జలగలు ఉన్నంత వరకూ ఈ ప్రపంచం బాగుండదు. నరకప్రాయంగానే వుంటుంది!"

* * * * *

"నే నిప్పుడు ఇరవై ఏండ్ల వాడినయ్యాను. ఆచార్య వసుబంధుగారు గాంధార దేశం వెళ్ళడానికి సిద్ధమైనారు. నా శుశ్రూషా, అజ్జుక యొక్క స్నేహవాత్సల్యాలూ లభించకపోయినట్లయితే, ఆచార్యులవారు ఎన్నడో వెళ్ళిపోయేవారు. గంభీరమైన వారి జ్ఞానసింధువును అవగాహన చేసుకోవడము నా వల్లకాలేదు. అయినా వారిలా అన్నారు. "జయా! నీవు నా అతియోగ్య శిష్యుల్లో ముఖ్యుడివి."

ఇక నిప్పుడు నాకు కూడా రాచరికపు జీవితం ముఖం మొత్తింది. ఆ రాజప్రాసాదాలను విడిచి విస్తృతమైన ప్రపంచంలోకి వచ్చిపడాలని తహతహలాడుతున్నాను. సింహళంలో తదాగతుని ఉపదేశాలు శుద్ధమైన రూపంలో దొరుకుతాయని ఆచార్యులవారు చెప్పారు. పరమభట్టారకుని ఆజ్ఞానుసారం సింహళ భిక్షువుల కొరకు వజ్రాసనం (బుద్ధగయ)లో విహారం ఒకటి కట్టబడింది. అక్కడి సింహళ భిక్షువులను నాలుగైదు సార్లు కల్సుకొన్నాను. వారివలన ప్రాచీన సింహళభాషలోని కొన్ని సూత్రాలను సంపాయించాను. అయినా తృప్తి కలగలేదు. సింహళదేశం వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాను.

"సింహళం వెళ్ళడం ఎలాగ?" అన్నది పెద్ద సమస్య అయింది ! నేను కావాలనుకొంటే పదివేల దీనార్లు లభ్యమవడం ఏమంత కష్టంకాదు. కాని దీనార్ల సాయంతో యాత్ర సాగించడం నాకు యిష్టంలేదు! నేను సమ్మతిస్తే అజ్జుక నాతో

కొంతమంది దూతలను సింహళం వరకూ పంపుతుంది. ఆ విధంగా సుఖంగా యాత్ర సాగింపవచ్చును. అయినా రాజసంబంధాన్నుండి ఏ విధమైన లాభాన్ని పొందడంగాని నాకు సమ్మతంగాదు. నేను విద్యాధ్యయనం చేశాను. యువకుణ్ణి అయినా ప్రభువుల కృపాదృష్టి లేకపోతే విద్యలకు సార్థకతే ఉండదు. నేను స్వేచ్ఛగా బౌద్ధ భిక్షువు రూపంలో యాత్ర చేయదలిచాను. భిక్షాటన వృత్తి కూడా నాకు అంతగా ఇష్టంలేదు. ఒకప్పుడు నేను శిల్పకళను అభ్యసించాను. ఆ కళలో ప్రావీణ్యత సంపాయించాను. వీణావాదంలో కూడా అభినివేశం వుంది. ఈ రెండు కళల సాయంతో యాత్ర చేయవచ్చు ననుకున్నాను. ఈ ఉద్దేశంతోనే పాటలీ పుత్రంలో వున్న చివరి సంవత్సరం ఈ రెండు విద్యలకూ బాగా మెరుగుపెట్టు కొన్నాను. ఇన్నివిధాల సిద్ధమైకూడా అజ్జుక దగ్గర వీడ్కోలు తీసుకోవటం చాలా కష్టం అనిపించింది. గత సంవత్సరం తండ్రి గతించారు. అప్పటినుండి అజ్జుక నన్ను మరీ ప్రేమగా చూడసాగింది. ఒక్కొక్కరోజు నేను తన వద్దకు పోకపోతే, ఆమె స్వయంగా నా వద్దకు వచ్చేది. చంద్రుడు ఇప్పుడు బాగా స్వతంత్రుడైనాడు. తనొక ప్రత్యేకమైన వలయాన్ని ఏర్పరుచుకున్నాడు. అందులోనుండి బయటికే రాడు. ఒకరోజున అజ్జుక నేను భవిష్యత్తులో ఏం చెయ్యపోతున్నానో తెలుసుకో గోరింది. ఇలా అన్నాను: "ఇప్పటివరకూ చదవాలనే వుద్దేశంలోనే వున్నాను!"

"జయా! ఆచార్యులవారు నీ విద్యాధ్యయనాన్ని చాలా ప్రశంసిస్తున్నారు!"

"వారికి నామీద అపారమయిన దయ, అందువల్లే ఇలా అంటారు! వారు విద్యాసముద్రులు. నేను తెల్సుకోవల్సినవి వారిలో ఎన్నో విషయాలున్నాయి. కానీ, ఇక వారిక్కడ ఉండనంటున్నారు. నేను ఇంకాకూడా కొన్నాళ్ళు విద్యాధ్యయనం చేయాలనుకొంటున్నా!"

అజ్జుకకు మనశ్శాంతి కలిగించడానికి నేను అప్పుడప్పుడూ పాటలీపుత్రంలో వున్న ఇతర పండితుల దగ్గరకు వెళ్తొండేవాడిని. నేనిలా ఇతర పండితులవద్దకు వెళ్ళి విద్యావిషయకమైన సంబంధాలను పెట్టుకోడం వలన, నేనిక పాటలీపుత్రం లోనే స్థిరంగా ఉండిపోతానన్న విశ్వాసమూ, శాంతీ కలుగుతాయి అజ్జుకకు! కానీ, అజ్జుకకు నా ప్రవర్తన వలన బాధ కలుగుతూనే వుండేది. "నేను ఎప్పుడూ ఏకాంత చింతనలో మునిగి వుండేవాడిని. తరుణులయిన స్త్రీ జనంతో చంద్రుడిలా అరమరికలు లేకుండా ప్రణయ కలాపాలు జరిపేవాడిని కాదు. ఇంతమాత్రానికే అజ్జుక నా భవిష్యత్ జీవితాన్ని గురించి కలవరపడేది. రాజాంతఃపురాల్లో తరుణీ విముఖుడైన పురుష డుండటం చాలా ఆశ్చర్యకరమైన విషయం. అనుమానింప దగిన విషయం కూడాను. నేను బైరాగి నయిపోతానన్న భయాన్నుండి మరల్చ డానికి ఒకరిద్దరు తరుణీమణుల్తో ప్రణయం సాగించాను కూడాను.

దక్షిణాపథంలోని అనేకమంది రాజకుమారులు, అమాత్యులు పాటలీ పుత్రంలో వుంటున్నారు. దక్షిణదేశపు ప్రత్యేకతల్ని గురించి అప్పుడప్పుడూ వారి నడిగి తెలుసుకొంటూ వుండేవాణ్ణి.

# నౌకా - భంగం

ఒకరోజున ఆచార్యులవారు సృఘ్నకు వెళ్ళే పడవను ఎక్కారు. వారికి వీడ్కోలు ఇవ్వడానికి చాలామంది పడవవరకూ వచ్చారు. నేను వారితో కొంత దూరం ప్రయాణం చేశాను. గంగా–సరయూ సంగమం వరకూ వెళ్ళి వారివద్ద సెలవు పుచ్చుకొని వెనక్కు తిరిగాను. వారికి అంతిమపర్యాయం నమస్కారం పెడుతున్నప్పుడు కన్నీటిని ఆపుకోలేకపోయాను. ఆచార్యులవారు చిరునవ్వు నవ్వుతూ, "వత్సా జయా! మానవుల్లో ఒకరిమీద ఒకరు స్నేహ–వాత్సల్యాలూ, ప్రేమలూ కలిగి వుండడమనేది హర్షించదగిన విషయం. స్నేహమూ, ప్రేమా మానవుణ్ణి ఉత్తమశీలుడినిగా చేస్తాయి. అతడి హృదయంలోని కాఠిన్యాన్నీ కల్మషాన్నీ కడిగివేస్తాయి. త్యాగం, స్వార్థరాహిత్యం—మొదలయిన ఉదాత్త ప్రవృత్తులను కలిగిస్తాయి. అయినా, ఒకటి మాత్రం మర్చిపోకూడదు నాయనా! నిత్యం పరివర్తన చెందే ఈ ప్రపంచంలో క్షణకాలపు అతిథులం మనం. వియోగ దుఃఖం తప్పనిసరిగా అనుభవింపవలసి వస్తుంది. నాదేముంది నాయనా? వృద్ధుణ్ణయి పోయాను. ఈ ఆకు ఇక కొద్ది రోజుల్లో రాలిపోతుంది. కనుక భౌతిక శరీరాల వినియోగం కొరకు చింతించకూడదు! బ్రతికినన్నాళ్ళూ నేను నీవైపు ఆశాదృక్కుల్ని బరపుతూనే వుంటాను. చనిపోయిన తరువాతకూడా నా ఆత్మ నీకు స్ఫూర్తిని ప్రసాదిస్తూనే వుంటుంది!"

ఆచార్యుల వారికి చివరిసారిగా నమస్కారం పెట్టి నేను నా నావలోకి వచ్చి కూర్చున్నాను. మనస్సులోని విషాదాన్ని మర్చిపోవడానికి నేనూ నావికులతోపాటు నావను నడుపుతూ అవీ ఇవీ మాట్లాడుతున్నాను.

ఇక నేను దక్షిణదేశ యాత్రకు సిద్ధమైనాను. అజ్జుకవద్ద వీడ్కోలు పుచ్చుకోవడం ఒక పెద్ద సమస్యగా పరిణమించింది. అజ్జుకకు నా మీద అపారమయిన ప్రేమ వుంటుందని వేరే చెప్పనవసరంలేదు. అజ్జుక మరీ అబలకాదు. ధైర్యమూ విచక్షణ, జ్ఞానమూ అన్నీవున్నాయి. అయినా నా దక్షిణదేశ యాత్రను గురించి ఆమెకు చెప్పడానికి నేను చాలా బాధపడ్డాను. ఆ క్షణాన ఆమె నాకంటేకూడా బాధ పడ్డది. కన్నీటిని ఏ విధంగానూ ఆపుకొనలేకపోయింది. పెద్ద పెద్ద కండ్లు కన్నీటితో నిండాయి. చంపల మీదుగా కన్నీరు ధార కట్టింది. నాకేమో చెప్పాలని

పెదాలను కదిల్చింది. కానీ, చెప్పలేకపోయింది. నేనిలా అని ఆ నాటికి అక్కడి నుండి వెళ్ళిపోయాను. "అక్కా! నా ఆదర్శాన్ననుసరించి నేను దక్షిణదేశం వెళ్ళకతప్పదు. నీతో ఏదో ఒక వంక చెప్పికూడా నేను వెళ్ళగలను. కానీ నిన్నలా మోసంచేసి వెళ్ళటం నాకు ఇష్టంలేదు. సహజంగా నీవు అనుజ్ఞను ఇచ్చే వరకూ వేచివుందామని నిశ్చయించుకొన్నాను!"

ఆ నాటినుండి అజ్జుక ప్రతిరోజూ ఒక్కసారైనా నా నివాస స్థానానికి వచ్చిపోసాగింది. రోజూ రుచికరమైన పదార్థాలను తాను స్వయంగా వడ్డించి తినిపించేది. అజ్జుకను బాధపెట్టడమవుతోందన్న ఉద్దేశంతోనే నేనే ఆమె మహలుకు వెళ్ళసాగాను. తిరిగి నా యాత్రా విషయాన్ని ప్రస్తావించడానికి సాహసించలేకపోయాను. ఒకరోజున అజ్జుకే ఇలా అన్నది: "జయా! నేనందే నీకు చాలా ప్రేమ!"

"అవును. నీవు ఒట్టి అక్కవేకాదు, అమ్మవు కూడాను. అందుకే అంత ప్రేమ!"

"కాని, జయా! నేను పాటలీపుత్రపు రాజప్రాసాదంలో కాకుండా అగ్రోదకాలో పుట్టేనన్న విషయాన్ని మరిచేపోయాను. యౌధేయ స్త్రీ భర్తను యుద్ధ భూమికి చిరునవ్వుతో పంపుతుంది. కన్నీళ్ళు పెట్టుకోదు. తమ్ముడూ, జయా! నీ మీద చాలా బాధ్యతలు వున్నాయి. నీలాటి సోదరుడుకల అక్కా, నీలాటి పుత్రుడు గల తల్లీ నిజంగా గర్వపడతగ్గవారు."

ఒకరోజున అజ్జుక పాటలీపుత్రంనుండి వెళ్ళటానికి నాకు అనుమతినిచ్చింది. నేను సింహళ దేశాన్ని దర్శించడానికి బయలుదేరాను. ఐతే నేరుగా సింహళం వెళ్ళడం నా అభిమతం కాదు. దక్షిణాపథంలోని దేశాలను చూసుకుంటూ సింహళం వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. నేను పాటలీపుత్రంలో వుండగానే దక్షిణదేశాలకు సంబంధించిన కొన్ని విషయాలు తెలిశాయి. స్రుహ్యాను దాటాక అనేకమయిన క్రొత్త జనపదాలు, భాషలూ తగుల్తాయనీ, ఆ భాషల్ని అర్థం చేసుకోవడం చాలా కష్టమని తెలిసింది. ఐతే, అక్కడి రాజాంతఃపురార్లోనూ, బ్రాహ్మణ కుటుంబార్లోనూ మాగధీ భాష మాట్లాడతారని తెలిసింది. నేను వెళ్ళడానికి రెండుమార్గాలు వున్నాయి. ఒకటి: గంగానదిలో నావమీద కొంతవరకూ, కొంతదూరం కాలినడకనా ప్రయాణంచేసి 'తామ్రలిప్తి' చేరడం. రెండవది: అరణ్యమార్గం! అరణ్యమార్గం చాలా కష్టసాధ్యంగా వుంటుంది. అదృష్టవశాత్తు సింహవర్మ లాటి మిత్రుడు దొరికాడు. అతడుకూడా నా లాగానే యాత్రార్థియై బయలుదేరాడు. చిత్రాంకనంలోనే కాకుండా ఖడ్గవిద్యలో కూడా అతడే గొప్పనేర్పరి. మేమిద్దరమూ అరణ్యమార్గాన ప్రయాణించడానికే నిశ్చయించుకున్నాము. మొదట గయక్షేత్రాన్ని దర్శించాము. అక్కడినుండి కళింగదేశపు మార్గాన్ననుసరించాం. మార్గమధ్యంలో మేము ఒక్కొక్కప్పుడు పాంథశాలల్లో ఆగేవారము. మరొకప్పుడు ఏదైనా గ్రామంలో

ఆగుతూ వుండేవారము. పరమభట్టారకులు ఇచ్చిన పరిచయపత్రం నాదగ్గిరవుంది. ఐనా సాధారణమైన పరిస్థితుల్లో దాన్ని నేను ఉపయోగించుకోదలచలేదు. దారితో మాకు చాలామంది వ్యాపారులు కలిశారు. కానీ, వ్యాపారులతో కలసి ప్రయాణించడం మాకు నచ్చలేదు. అరణ్యమార్గం వరకూ సామానులను మోయడానికి కూలివాళ్ళను తీసుకపోయాం. అక్కడినుండి అతి ముఖ్యమయిన సామానులు కొన్నింటిని మాత్రం మేమే మోసుకొని వెళ్ళిపోయాం. కూలీలను వెనక్కి పంపించేశాం. స్రుహ్యను దాటాక ఇంతచలి వుండదనీ, ఉన్నివస్త్రాలను ధరించవల్సిన అవసరం కూడా వుండదనీ సింహవర్మ చెప్పాడు. మేము సాధారణ యాత్రికుల వేషంలో బయలుదేరాం. బాగా మొద్దుగావున్న ఉన్ని దుప్పట్లను రెండింటిని తీసుకొన్నాం. చెరి ఒక కరవాలమూ ఎటూ వున్నాయి. అడవిలో వేటాడేందుకు చెరొక ధనస్సును, కొన్ని అంబుల్ని తీసుకొన్నాం.

మేము అడవిలో చాలా రోజులు ప్రయాణించాం. మా వెంట ఒక ఇరవై మందితో కూడిన చిన్న వ్యాపారస్థుల గుంపువుంది. ఒకనాటి మధ్యాహ్న సమయం, అందరమూ ఒక చెట్టుక్రింద విశ్రాంతి తీసుకుంటున్నాము. ఇంతలో మరొక పాతికమందికల వ్యాపారుల గుంపొకటి మా దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చింది. ఆ గుంపులోని ప్రతివ్యక్తి రక్తసిక్తమైన కరవాలాల్తో, రక్తంతో తడిసిన వస్త్రాలతో, దెబ్బలతో భీకరస్థితిలో వున్నారు. వాళ్ళు ఇలా చెప్పారు: "మాది వందమంది వ్యాపారుల గుంపు. ఇరవై బండ్ల నిండా దక్షిణాపథంలోని అనేక బహుమూల్యమైన సామాన్లను వేసుకొని బయల్దేరాము. ఇక్కడికి ఒక యోజనం దూరంలో రాత్రి విశ్రమించాము. తెల్లవారగానే శబరులు మమ్మల్ని చుట్టుముట్టారు. చాలాసేపు ధైర్యంగా పోరాడాము. మా గుంపులోని ముప్పై నలభై మందిదాకా హతులయ్యారు. చాలామంది దెబ్బలు తిన్నారు. శబరులబలం ఎక్కువగా వుండడాన్ని గమనించి మిగిలినవాళ్ళం అడవిలో దాక్కున్నాము. శబరులు మా బండ్లను దోచేశారు. ఎంతోమందిని బందీలుగా పట్టుకుపోయారు. యింకా కొంతమంది అడవిలో దాక్కున్నారు. మా గుంపుకు నాయకులైన కృష్ణదాసుగారు యెక్కడున్నారో? యెలా వున్నారో?"

మేము వాళ్ళు చెప్పిన విషయాన్ని శ్రద్ధగా విన్నాము. మేమూ అదే దారిన వెళ్ళాలి. యోజన దూరంలో శబరులు ఉన్నారని తెలిసింది. మరి ఇక నిప్పుడు ముందుకు సాగడమా? వెనక్కి వెళ్ళడమా? మా జట్టులో వున్న వాళ్ళందరూ ముందుకు సాగడానికి సంకోచిస్తున్నారు. అప్పుడు నేనూ, సింహవర్మా యిలా అన్నాము: "ఇప్పుడు వెనక్కి పోవడం కూడా ఏమంత క్షేమకరంకాదు. శబరులు ఒకరినుండి ఒకరికి వార్తలను చాలా త్వరగా అందచేసుకొంటారు. కనుక ముందుకు పోవడం ఎంత ప్రమాదభరితమో, వెనక్కు పోవడం కూడా అంతే! ఇప్పుడు మనము నలభై యాభై మందిదాకా వున్నాము. పైగా, ఇంకా అడవిలో దాగుకుని

వున్నవాళ్ళు కూడా కలుస్తారు. అన్నిటికంటే ముఖ్యమైన విషయం; శబరులు కొంత సామగ్రిని ఎటూ దొంగిలించుకొన్నారు కనుక, ఇప్పుడే మళ్ళీ ముట్టడికి సిద్ధపడరు!"

కొంత తర్క వితర్కం జరిగాక, అందరూ మా మాటల్ని ఆమోదించారు. ముందుకు సాగాము. క్రమంగా అడవిలో చిక్కుపడిన వాళ్ళుకూడా వచ్చి చేరారు. వందమందితో కూడిన మంచి జట్టుగా తయారయ్యాము. మా అందరి దగ్గరా కరవాలాలు వున్నాయి. కొంతమందివద్ద బాణాలూ, అంబులూకూడా వున్నాయి. అందరమూ చాలా ధైర్యంగా ముందుకు నడుస్తున్నాము. ఉదయం యుద్ధం జరిగినచోటికి చేరుకునేసరికి ఇంకొక్క జాముపొద్దు మాత్రం వుంది. అక్కడ కేవలమూ ఇద్దరు మనుష్యులు మాత్రం ప్రాణాలతో వున్నారు. పాతికకు పైన శవాలున్నాయి. వాటి దహన సంస్కారాలకు మేము ఎలాటి ఏర్పాట్లు చేయలేకపోయాము. అక్కడ పొగా, మంటలూ కనిపించడంవలన అనవసరంగా శబరులను పిలిచినట్లవుతుంది. ఒక్క బండి మాత్రం సురక్షితంగా వుంది. మిగిలిన బండ్లన్నింటినీ శబరులు దోచుకున్నారు. దెబ్బలుతిన్న ప్రాణావశిష్టులు దాహంతో అలమటించి పోతున్నారు. దగ్గరలోవున్న కాలువ నీటితో వారి దాహాన్ని తీర్చాను. తరువాత కృష్ణదాసుకూడా దెబ్బలుతిని పడి వున్నాడని తెల్సింది. అక్కడవున్న వాళ్ళవలన కొన్నివిషయాలు తెల్సాయి. కృష్ణదాసు చాలా ధైర్యంగా పోరాడాడట. శబరులు బల్లెంతో కాళ్ళల్లో పొడవడం వలన పడిపోయాడట. శబరులు యాభైమంది కంటే ఎక్కువ లేరుట. కృష్ణదాసును తమవెంట తీసుకొని వెళ్ళారు. అకస్మాత్తుగా ముట్టడించడంవల్ల కంగారుపడి స్థిరంగా పోట్లాడ లేకపోయారట. దెబ్బలు తిన్నవాళ్ళకు కట్లుకట్టి బండిలో ఎక్కించాము. ముందుకు బయల్దేరాము. నేను సింహవర్మ నుద్దేశించి ఇలా అన్నాను: "మిత్రమా! కృష్ణదాసు వాళ్ళతో బాగా పోట్లాడాడు. ఆ కోపంవల్ల వాళ్ళు అతణ్ణి బాగా హింసిస్తారు. మనం త్వరగావెళ్ళి అతణ్ణి రక్షించాలి. వాళ్ళవెంట బండి ఒకటి వెళ్ళింది. కనుక మార్గాన్ని తెల్సుకోవడం అంతకష్టంకాదు. మనం ఈ బండి దగ్గిర ఐదారుగురు మనుషుల్ని కాపలావుంచి, మిగిలిన వాళ్ళందరమూ వెళ్ళి పోదాము!"

సింహవర్మకు నా అభిప్రాయం నచ్చింది. కొంతమంది వెనకా ముందాడారు. అప్పుడు మేమిలా అన్నాము: "సాహసము, ధైర్యమూ వున్నవాళ్ళు మాతోరండి, లేనివాళ్ళు వెనకబండితోపాటు నిదానంగా రండి!" మేమిలా నిష్కర్షగా చెప్పడం కొంతమందికి నచ్చలేదు. కానీ ఒక్కొక్కరే మా జట్టులోకి, శబరులతో పోరాడి ప్రాణాలర్పించడానికి రాసాగారు. కొద్దిసేపట్లో అందరూ ముందుకు వచ్చారు. ఆఖరుకు బండితో నడిచేవాళ్ళే లేకపోయారు. అందరూ యుద్ధానికి సన్నద్ధులయ్యారు. చివరకు కొంతమందిని బలవంతాన బండి కాపలాకు నియమించవల్సి వచ్చింది. ఇక ప్రొద్దుకుంకు తుందనగా వాళ్ళు ప్రధాన మార్గాన్ని విడిచిన ప్రదేశా

నికి చేరాము. బండిగుర్తులు అక్కడ ప్రధాన మార్గాన్ని విడిచి అడ్డదారికి తిరిగాయి. అక్కడొక చెట్టుకు ఎర్రని గుడ్డపీలక నొకదాన్ని—వెనుక బండితోపాటు వస్తున్న మా సహచరుల గుర్తుకొరకు—కట్టి మేమూ అడ్డదారికి మళ్ళాము. అడ్డదారిన మే.మలాగే కొంత దూరము నడిచాము. బహుదూరంనుండి సన్నని వెలుగూ, మంటలూ కనుపించాయి. మరికొంత ముందుకు పోయాక శబ్దాలుకూడా వినిపించ సాగాయి. మా జట్టులోని వారందరికీ అక్కడే ఆగిపొమ్మని చెప్పి, నేనొక్కడినే ముందుకు నడిచాను. మెల్లగా కాలిశబ్దం కాకుండా, చుట్టు దిరిగి, వాళ్ళున్న దగ్గరకు చేరుకున్నాను. ఆకురాలుకాలం ఇంకా రాలేదప్పటికి. లేకపోతే అడుగుల శబ్దాన్ని ఆపడం అసంభవం అయ్యేది! చెట్ల సందునుండి చూశాను. బండ్లను వలయా కారంగా పెట్టారు. పశువులన్నీ ఆ వలయం లోపల కట్టివేయ బడివున్నాయి. ఒక చోట మొద్దులుకొన్ని భగభగ మండుతున్నాయి. ఆ మంట చుట్టూ ఒక ముప్పై మందిదాకా శబరులు కూర్చుని వున్నారు, ప్రొద్దుక్రుంకే సమయమది. మరి కొద్ది సేపు గడిస్తే నల్లని శరీరచ్ఛాయగల శబరుల్ని చీకట్లో గుర్తుపట్టడమే కష్టం! వాళ్ళ శరీరాలమీద పలుచని గోచీమాత్రం వుంది. తలల్లో పక్షుల రంగు రంగుల ఈకలను తురుముకున్నారు. వాళ్ళు మాకంటె కొంచెం పొట్టిగా వున్నారు. కానీ వారి శరీర పాటవానికీ అంగసౌష్టవానికీ నేను చాలా ఈర్ష్య పడ్డాను! సన్నని నడుములమీద విశాలమైన ఛాతీ! బలిష్టమైన భుజాలు, కండలు తిరిగిన శరీరం....వారి శక్తి—సమర్థత లను చాటుతున్నాయి. నేను కృష్ణదాసు కొరకు నాలుగువైపులా చూస్తున్నాను.. ఒక బండిమీద ఏదో మూట కనుపించింది. దెబ్బలుతిని స్పృహతప్పి పడివున్న కృష్ణదాసునుకూడా ఎక్కడో ఈ బండ్లలోనే మూటకట్టి పడవేసి ఉంటారని నా మనస్సు చెప్పసాగింది. నేనలాగే నిశ్శబ్దంగా వెనక్కు మళ్ళాను. విషయా న్నంతా రహస్యంగా మా జట్టుతో చెప్పాను. చివరకు ఒక నిశ్చయానికి వచ్చాము. ఒక ముప్పై మందిని తీసుకొని సింహవర్మ వెనుకనుండి ముట్టడించడానికి కుడివైపు అడవిలోకి వెళ్ళాడు! మిగిలిన వాళ్ళతో నేను ఎడమవైపు అడవిలోకి పోయాను. ఆక్రమణ సమయంలో చేసుకోవాల్సిన సంకేతాల్ని నిర్ణయించుకొన్నాము. ప్రొద్దు క్రుంకకముందే ఆక్రమణ జరిగిపోవాలని తొందర పడుతున్నాము. మేమందరమూ, నలుముఖాలకు చెదిరిపోయి, చెట్లచాటున దాక్కుని బండ్లదగ్గరకు చేరాము. శబరులు కూడా తగు జాగ్రత్తతోనే యుద్ధానికి సిద్ధంగా ఉన్నారు. మేము ఒక్కసారిగా బ్రహ్మాండమయిన అరుపుల్తో, కేకల్తో శబరులమీద విరుచుకు పడ్డాము. మేము వెనుకా ముందూ రెండువైపుల నుండి ఒకేసారు ఆక్రమణ చేశాము. శబరులు బాణా లను ఎక్కువగా ఉపయోగించలేదు. ఉపయోగించినట్లయితే మాకు చాలా నష్టం జరిగేది. శబరులు బల్లేలనూ, బాణాలనూ మా అంత పొరవగా ఉపయోగించలేదు. మేము తెగించి యుద్ధంచేశాము. త్వరలోనే చాలామంది శబరులు హతులయ్యారు. మిగిలినవారు అడవిలోకి పారిపోయారు. మేము బండ్లన్నీ వెతికాము. ఒక్క

బండిలో కృష్ణదాసు తాళ్ళతో కట్టివేయబడి ప్రాణావశిష్టుడై పడివున్నాడు. అతడి గొంతు ఎండిపోయింది, చే సంజ్ఞతో మంచినీరు కావాలని తెలియచేశాడు. నీరు తాగాక కృష్ణదాసు "బండ్లలోని అమూల్యమైన వస్తువు లెన్నిటినో తీసుకొని శబరులు తమ పల్లెకు పోయారని" చెప్పాడు. మేము చాలా త్వరగా అక్కడి నుండి వెళ్ళిపోవాలి, లేకపోతే శబరులు అధిక సంఖ్యతోవచ్చి పడతారు!

మేము బండ్లను కట్టుకొన్నాము. త్వరత్వరగా గుడ్డపీలికలను కట్టిన అడ్డవారి దగ్గిరకు చేరుకొన్నాము. అప్పటికే బండివెనుక వస్తూన్న మా సహచరులు అక్కడికివచ్చి వున్నారు. కృష్ణదాసుకు పెద్ద సమస్య ఎదురైంది. ధైర్యం చేసి ముందుకు-మగధకు పోవడమా? లేక వెనక్కి -దేశం - వెళ్ళిపోవడమా? దీర్ఘంగా యోచించిన మీదట ఇలా అన్నాడు: "అమూల్యమైన వణ్యవస్తువులన్నీ దొంగిలింప బడ్డాయి, చాలామంది యోధులుకూడా నశించారు. ఇక నిప్పుడు వెనక్కి తిరగడమే మంచిది!" చివరకు కృష్ణదాసు వెనక్కి తిరిగి తమ దేశానికి వెళ్ళ డానికే నిశ్చయించు కొన్నాడు.

ఆ అడవిలో ఒక్క శబరులదే కాదు భయం. భయంకరమైన క్రూర జంతు పులుకూడా వున్నాయి. అలాటి స్థితిలో రాత్రి సమయాన ప్రయాణించడం అతి సాహసమే అవుతుంది. కాని, శబరుల పట్టుదల మాకు తెలియనిదికాదు! దెబ్బతిన్న శబరులు మౌనంగా ఎన్నటికీ వుండరు. తప్పక అధిక బలంతో వచ్చి పడతారు.

ప్రయాణం సాగించాము. జట్టు నాయకుడు ముందు బండిలో కూర్చు న్నాడు. మేమంతా అతణ్ణనుసరించాము. ఆరోజు రాత్రంతా మేము ప్రయాణం చేస్తూనే వున్నాము. మర్నాడు ఉదయానికి ఒక జలాశయాన్ని చేరుకొన్నాము. అక్కడొక పెద్ద వృక్షం క్రింద అరుగు ఒకటి వుంది. ఆ అరుగుమీద పసుపు కుంకంతో నిండి, పిచ్చిగా చెక్కిన విగ్రహం ఒకటుంది. దాన్ని "చండిక-నివాసం" అంటారు. అక్కడి పూజారి నల్లగా దయ్యంలా వుంటాడు. తను బ్రాహ్మణుడనే చెప్పుకొంటాడు. కానీ, అతడి నల్లని శరీరం, ఎర్రని కండ్లూ అతడు బ్రాహ్మణ వంశీకుడు కాదని సాక్ష్యమిస్తున్నాయి. మధ్యవయస్కురాలైన పరివ్రాజిక ఒకామె కూడా అక్కడ వుంది. ఆమె ఎర్రగావుంది. యౌవనంలో చాలా అందగత్తె అయి వుంటుందని ఆమెని చూడగానే అనిపిస్తుంది. కాషాయ వస్త్రాలను కట్టుకుంది. మెడలో రుద్రాక్షమాలవుంది. మాటల్లో-చేతల్లో చాలా తెలివి తేటల్ని కనబరుస్తోంది. ఆమె చిరునవ్వు నవ్వుతూ మమ్మల్ని ఆహ్వానించింది. రెండురోజుల క్రితం కృష్ణ దాసు ఇక్కడ విశ్రాంతి తీసుకున్నాడు. అప్పుడీ పరివ్రాజికను శకున మడిగాట్ట. ఆమె "అంతా బాగానేవుంది. కానీ మార్గంలో కొంచెం ఆటంకం సంభవించవచ్చు" అన్నదిట. ఇప్పుడు శరీరమంతా దెబ్బల్తో విరగగొట్టబడిన కృష్ణదాసును చూసేసరికి సహానుభూతినీ, విచారాన్నీ ప్రకటించింది. కృష్ణదాసు ఇలా అన్నాడు: "మీరు చెప్పినట్టు ప్రమాదకరమైన ఆటంకమే సంభవించింది. కానీ, తమ దయవల్ల నేను

బతికాను!" పరివ్రాజిక అతడి దెబ్బలను చూసింది. బొగ్గూ మరి ఇతర పదార్థాలేవో వేసి నూరి మందుచేసి దెబ్బలకు కట్టుకట్టింది. ఇకమీదట ఫరవాలేదని జోస్యంకూడా చెప్పింది.

మేము బాగా అలసిపోయాము. పైగా ఆకలి దారుణంగా వేధిస్తోంది.అందరం వంట చేసుకోవడంలో నిమగ్నులమైనాము. శబరుల విషయంలో పూజారినడిగి కొంత తెలుసుకొన్నాము. "ఇక్కడా శబరుల భయం వుందన్నాడతను. నాకీ పూజారికూడా శబరులతో కలిసి దొంగతనాలుచేయిస్తుంటాడని అనుమానం తగిలింది. లేకపోతే ఈ ఇతడి తపస్సు ఏమిటి? పూజారితనం ఎందుకు?

సింహవర్మ ఇలా అన్నాడు "తపస్సా పీడిబొందా? ఈ పరివ్రాజికకు పురుషుడు కావాలి. నల్లని పూజారికి మాత్రం ఇంతకంటె మంచి స్త్రీ ఎక్కడ దొరుకుతుంది?....అంతే....!" పరివ్రాజికకు కనిపించే వయస్సు దాటింది. గర్వం దాలుస్తానన్న భయంలేదు....పూజారి ఏ కొంచెంసేపు బయటికిపోయినా, శబరులకు మా విషయాన్ని సూచించడానికి వెళ్ళాడేమోనని అనుమానంగా వుండేది. ఎంత త్వరగా ఆ ప్రదేశాన్ని విడిస్తే అంత మంచిదనుకున్నాము.

భోజనా నంతరం కొంతసేపు విశ్రాంతి తీసుకొన్నాము. కృష్ణదాసు చండికకూ, పరివ్రాజికకూ కానుకల్ని సమర్పించుకొన్నాడు. మధ్యాహ్నం తరువాత అక్కడినుండి వెళ్ళిపోయాము. నాలుగు నాళ్ళనుకున్న అరణ్యమార్గాన్ని దాటటానికి పూర్తిగా పదిరోజులు పట్టింది. ఈ పదిరోజుల్లోనూ కేవలము, ఒక్కసారి మాత్రం ఏనుగుల గుంపు ఒకటి మా మీదికి దాడిచేసింది. విశేషంగా నష్టం ఏమీ కలుగలేదు. రాత్రి సమయాల్లో మా చుట్టూ మంటల్ని వేసుకొనేవారము. మంటల దగ్గరకు వన్యమృగాలు రావని మా విశ్వాసం!

మేము సుహ్యదేశంలోని మొట్టమొదట నగరాన్ని చేరాము. అప్పటికి కృష్ణదాసు దెబ్బలు చాలావరకు నయమయ్యాయి. కానీ మనిషికి ఇంకా తగినంత బలం రాలేదు. ఆ పట్టణంలో కృష్ణదాసు బంధువు ఒకడున్నాడు. మమ్మల్ని అతడి వద్దకు తీసుకుపోయి మహోయిదిగా పొగిడేశాడు కృష్ణదాసు. మే మతనికి ఒకరకంగా శరీర రక్షకుల మయ్యాము. నన్ను మొత్తం జట్టుకే నాయకుణ్ణి చేశాడు. కృష్ణదాసు మమ్మల్నికూడా తమతోపాటు తమ నగరానికి రమ్మన్నాడు కాని ఆ నగరం పెడగా వుండడంవల్ల వెళ్ళడానికి మేము అంగీకరించలేదు. సుహ్య, ఉత్కళ, కళింగ రాజ్యాల్లో ఎంతోమంది సార్థవాహు లతనికి తెలుసును. కొన్ని పరిచయ పత్రాలను వ్రాసి ఇచ్చాడు. దాదాపు పదివరకూ పరిచయ పత్రాలను వ్రాశాక ఇక వ్రాయవద్దని బతిమలాడాము. తాటి ఆకుల్లో వ్రాసిన ఆ పత్రాలను తాళ్ళగుచ్చి కట్టకట్టారు. తరువాత తడిమట్టితో ముద్రలు వేశారు.

దాదాపు ఒక నెలరోజులవరకు నాగరిక జీవితంతో ఎలాటి సంబంధమూ లేకుండా పోయింది. భోజనం-స్నానంలాటి వాటిక్కూడా చాలా బాధపడ్డాము!

శబరుల ఆక్రమణ తరువాత ఎక్కడా విశ్రాంతి తీసుకోకుండా మా ప్రయాణాన్ని సాగించాము. కొన్ని బండ్లనూ, వాహనాలనూ కూడా మధ్యలో వదలివేశాము. పాటలీపుత్ర నాగరికత జీవితానికి సరిపోయే అనేక వస్తువులు సుహ్యా నగరంలో సార్థవాహుని (వ్యాపారి) ఇంట్లో లభించాయి. అసలు దక్షిణ ప్రాంతం ఎప్పుడూ పాటలీపుత్రాన్ని అనుకరిస్తూనే వుంది. పరమభట్టారకుని దిగ్విజయం తరువాత ఈ ప్రదేశాల్లో పై అనుకరణ ప్రవృత్తి మరీ ఎక్కువయింది. సార్థవాహుడు మాకు అనేక విధాల సౌకర్యాలను కలిగించాడు. నిత్యం అభ్యంగన స్నానం చేసేవారం. రుచికరమైన భోజనాన్ని ఆరగించేవారం. అయినా ప్రయాణపు బడలిక తీరిమామూలు మనుషుల మవడానికి ఒక వారం పట్టింది. నగరంలో వినోదానికి అనేక మార్గా లున్నాయి. కానీ, మాకు నృత్యగీతాది వినోదాలే బాగా నచ్చేవి. కొంచెం ప్రశాంత మైన జీవితం దొరకడంతో సింహవర్మ తన తూలికను బయటికి తీశాడు. ప్రథమ చిత్రాన్ని గీశాడు. పాటలీపుత్రపు ప్రఖ్యాత చిత్రకారుని కీర్తి అచిరకాలంలోనే నగరమంతట్లోనూ వ్యాపించింది. నగరంలోని ధనికులైన సార్థవాహులూ, శ్రేష్ఠులూ అతడి చిత్రకళను వేయి విధాల కీర్తించసాగారు. అతడి సమయమంతా చిత్రకళలో గడిచిపోసాగింది. మా క్రొత్త సార్థవాహుని కూతురు తన చిత్రాన్ని గీయవలసిం దని దాసి ద్వారా ఎన్నోసార్లు సింహవర్మకు కబుర్లు పంపింది. సింహవర్మ భార తీయ చిత్రకళలో గొప్ప ప్రవీణుడు. అతి సుందరమైన కాల్పనిక చిత్రాలను గీయగలడు. కాని, సజీవ ప్రతిమను ఎదుటపెట్టుకొని అవే పోలికలు చిత్రంలోకి నింపగలగడం అతడివలన కానిపని. పోనీ, ఆమె ప్రార్థనను తిరస్కరిద్దామా అంటే, అదీ కానిపనే! చాలరోజులు ప్రయత్నించాడు. కృతకృత్యుడు కాలేక పోయాడు. చివరకు నేనొక పటలాన్ని తయారుచేసికొని ఆమె గవాక్షంలో కూర్చుని వుండగా రహస్యంగా చిత్రాన్ని గీయడం ప్రారంభించాను. నాలుగు రోజుల్లో చిత్రాన్ని పూర్తిచేసి సింహవర్మ కిచ్చాను. అప్పటికతనూ ఒక చిత్రాన్ని పూర్తి చేశాడు. అయితే, అది సార్థవాహుని కన్యది కాదు. ఒకానొక కల్పిత సుందరిది. చిత్రాన్నిస్తూ సింహవర్మతో ఇలా అన్నాను: "ఈ చిత్రాన్ని ఆమెకు ఇచ్చివేయి. ఒక షరతువుంది. మీరు వేసిందనే చెప్పుకోవాలి?"

"కాని, మిత్రమా, ఇది నీవుకదా తయారుచేసింది?"

"కానీ, మనిద్దరం ఇక్కడ చిత్రకారులుగా ప్రసిద్ధిపొందడం కూడదు. నేను కత్తిసాములో నిపుణుణ్ణయిన యోధుడిగా ప్రసిద్ధి పొందుతాను. నీవు కళాకారు డివికా!"

సింహవర్మ శ్రేష్ఠికన్య చిత్రాన్ని గీస్తున్న రోజుల్లో ఆమె చాలా ఆసక్తిగా, తన్మయంగా అతడి ముఖంలోకి చూస్తుంది. అలాటి సమయాల్లో ఎప్పుడైనా నేను వెళ్ళడం జరిగితే వెంటనే చూపుల్ని దింపేసుకొనేది. సింహవర్మ రెండు చిత్రాలనూ శ్రేష్ఠికన్య ముందుంచి"ఇది నీ కల్పిత చిత్రం. ఇది వాస్తవ చిత్రం!"అన్నాడు. ఆమె

చాలా కృతజ్ఞతను ప్రదర్శించింది. కాని సింహవర్మ "ఇక మేమీ పట్టణంనుండి వెళ్ళిపోతున్నామని" చెప్పగానే ఆమె కండ్లు అశ్రుపూరితాలయినాయి. ముఖాన్ని క్రిందికి దింపేసుకొంది. "ఇంత త్వరగా వెళ్ళవల్సిన పనేముంది? మరికొన్నాళ్ళు ఈ పట్నంలో వుండండి" అని మాత్రం అన్నది.

సింహవర్మ నాకు అన్ని విషయాలనూ చెప్పేశాడు. మేము చాలా సందిగ్ధంలో పడ్డాము. ఉండడమా? వెళ్ళడమా? అయితే సింహవర్మకూడా అంత త్వరగా ఆ పట్టణాన్ని విడిచిపెట్టాలన్న వుద్దేశ్యం లేదు. అలాగని నా అభిప్రాయానికి విరుద్ధంగా వుండనూలేదు. చివరకు మరి కొన్నాళ్ళు అదేపట్టణంలో వుండడానికి నిశ్చయించుకొన్నాము. ఐతే, సార్థవాహుని యింట్లో వుండడం మా అభిమతంకాదు. ఎక్కువరోజులు ఆ పట్టణంలో వుండటమే జరిగితే స్వతంత్రంగా మా కళా వ్యాసంగంతో జీవితాన్ని గడపాలని మా ఉద్దేశ్యం. సార్థవాహుడు తమ యింట్లోనే వుండమని బలవంతం చేశాడు. కాని మేము మా ఉద్దేశాన్ని తెలియచేశాము. ఊరి వెలుపల ఒక సుందరమైన ఉద్యానవనంలో మా నివాసాన్ని ఏర్పాటు చేశారు.

ఉద్యానవనం చాలా అందమైన ప్రదేశంలో వుంది. తోటమాలి రకరకాలైన పూల మొక్కలను వేశా డందులో. వసంతాగమన సమయం. వనంలో ఒక చిన్న అందమైన సౌధం వుంది. సౌధానికి కొద్దిదూరంలో కలకల ప్రవహించే నదివుంది. సింహవర్మ అహర్నిశలూ చిత్రరచనలో మునిగివుండేవాడు. నేను "ఏ వృత్తిని స్వీకరించడమా?" అని ఆలోచించాను. శిల్పాలు చెక్కడాన్ని ప్రారంభిద్దామనుకున్నాను. కాని, ఇద్దరమూ కొంత తేడాలో ఒకే వృత్తిని స్వీకరించినట్లవుతుంది. "పోనీ, ఇద్దరమూ చిత్రరచనే చేద్దాము. అన్నిటినీ నేనే చిత్రించినట్లు చెబుదాము" అన్నాడు సింహవర్మ. నాకూ అదీ నచ్చలేదు. విద్యాధ్యాపకులుగానో, ఖడ్గ విద్యా ప్రవీణులుగానో పరిచయం కావడంకూడా నా కంతగా నచ్చలేదు. వాటి వలన మా చర్చ రాజమహలువరకూ పోతుంది. అదిమాకు ఇష్టంలేదు. ఇకపోతే దీర్ఘంగా ఆలోచించి సంగీతార్యుణ్ణి కావడానికి నిశ్చయించుకున్నాను. వీణా, ఇతర వాయిద్యాలు కొన్నిటిని కొన్నాను. ఒకటి రెండు సంగీత గోష్ఠుల్లో పాల్గొన్నాను. అక్కడి నుండి ప్రతిగోష్ఠిలోనూ పాల్గొన వలసినదన్న ఆహ్వానాలు రాసాగాయి. పరమభట్టారకులు సంగీత ప్రియులు కావడం వలన దేశంలోని అనేక ప్రాంతాల ప్రజల్లో సంగీత ప్రేమ కలిగింది. పాటలీపుత్రపు ప్రజల విషయం వేరే చెప్పనే అవసరంలేదు. సముద్రగుప్తుడు వీణా సహితంగా తన చిత్రాన్ని దీనార్లమీదగూడా ముద్రించాడు. ఇతర ప్రాంతాల ప్రజల్లో పాటలీపుత్రంలో బహుప్రచలితమైన రాగాలమీదా, స్వరాలమీదా మోజు ఎక్కువయింది. అప్పట్లో యువతులకు సంగీత నృత్యగానాది శిక్షణ అనివార్యమని భావింపబడుతుండేది. కొద్దిరోజుల్లోనే నేను కొంతమంది యువతులకు సంగీతం-నృత్యం నేర్పడానికి వెళ్ళి రాసాగాను.

సార్థవాహుని కూతురుకీ, సింహవర్మకూ మధ్య నడుస్తున్న ప్రణయం దిన దిన ప్రవర్థమానంగా పెరిగి రాసాగింది. వసంతఋతువు. పుష్పచాయల్లో తుమ్మెద నాదాలు వినబడుతున్నాయి. దిశలు సువాసనతో నిండుతున్నాయి. ప్రతిచోటా వసంతోత్సవాలు జరుగుతున్నాయి. సార్థవాహుని కూతురు నిత్యం ఉద్యానవనానికి వచ్చి పోతూండేది. ఒకరోజున సింహవర్మ తన ప్రేయసితో ఇలా అన్నాడు "ఇక మనం ఏదో ఒక నిర్ణయానికి రావడం అవసర మనుకుంటాను?"

"ఇంకా నిర్ణయానికి రావడంలోనే వుందా?" అన్నది సార్థవాహుని కూతురు.

"మన మిద్దరం ఏనాడో నిర్ణయానికి వచ్చామనుకో........కానీ, మన నిర్ణయాన్ని మీ పెద్దలుకూడా అంగీకరించాలి కదా?"

"అంగీకరించకపోతే, ఏమౌతుంది?"

"ముందుగానే వారి అభిప్రాయాన్ని తెలుసుకొని వుండాల్సింది మనం!"

"అలా చేయలేదుకదా?" ఆమె గొంతు కంపించింది.

సింహవర్మ ప్రేయసి కురులను దువ్వుతూ, "భయపడవలసిన పనేమీలేదు. ఏదో ఒక మార్గాన్ని వెతుకుదాం!" అన్నాడు.

కాని, ఏదో ఒక మార్గాన్ని వెతకవలసిన అవసరంకూడా ఏమంతలేదు. సార్థవాహునికి మాకూ రోజురోజుకీ పరిచయం పెరుగుతోంది. మేమిద్దరమూ ఉత్తమ కులశీలాలుకల యువకుల మవడంవలన గౌరవమూ అభిమానమూ కనబరుస్తున్నాడు. మేమూ పట్టణాన్నుండి ఎప్పుడు బయలుదేరపోయినా ఏదో వంక చెప్పి ఆపేవాడు.

ఒక రోజున మళ్ళీ నేను "మేము వెళ్ళివస్తా"మన్నాను. సార్థవాహుడు "కళింగపట్టణమే కదా మీరు వెళ్ళేది? ఎన్నో రోజులనుండి కళింగపట్టణములోని జైన విగ్రహాన్ని (జిన) చూద్దామను కొంటున్నాను. మేమూ వస్తాము, అందరం కలిసివెదదా" మన్నాడు.

"కాని, మేము దుర్గమమైన అరణ్య మార్గాన పోవాలను కొంటున్నాము."

"ఇక్కడినుండి తామ్రలిప్తికి పోవడానికి ఎటూ దుర్గమమైన అరణ్యాన్ని దాటాలి. ఈ అడవిలోనూ పులులూ, ఏనుగులూ, ఇతర వన్యమృగాలూ అన్నీ వుంటాయి. మీకు అరణ్య మార్గపు ఆనందమూ లభిస్తుంది. సముద్రయానపు సౌఖ్యమూ లభిస్తుంది!"

అప్పటికే నేను మౌనంగా వుండిపోయాను. మర్నాడు సింహవర్మ ఇలా అన్నాడు: "సార్థవాహుడు జైన ప్రతిమను చూడడానికి సపరివారంగా కళింగ పట్టణానికి ప్రయాణమైనాడు!"

* * * * *

ప్రయాణం చాలా నిర్విఘ్నంగా సాగిపోతున్నది. మేము నిశ్చింతగా నిద్ర పోతున్నాము. రాత్రి సమయం. నల్లని ఆకాశంలో మల్లెపూవుల్లా నక్షత్రాలు తెల్లగా మెరిసిపోతున్నాయి. చల్లని సముద్రపు గాలి హాయిని, స్ఫూర్తినీ ఇస్తోంది. ఓడ

సముద్ర గర్భాన్ని జీల్చుకొంటూ నిశితవేగంతో ముందుకు పోతోంది. నావికులందరూ నిద్రపోతున్నారు. కొంతమంది నావికులు మాత్రం మేల్కొని ఓడను నడుపుతున్నారు. ప్రయాణీకులందరూ గాఢనిద్రలోమునిగివున్నారు. ఆ అర్ధరాత్రి పెనుచీకటిలో ఒక పెద్ద కుదుపుతో ఓడ తల్లక్రిందులైనంత పనయింది. ప్రయాణీకులూ,నావికులూ-అందరూ ఒక ప్రక్కకు దొర్లిపోయారు. కంగారుగా నిద్ర మేల్కొన్నాను. బ్రహ్మాండమైన తుఫాను సముద్రాన్ని అల్లకల్లోలం చేస్తున్నది. తాడిచెట్టంత అలలు ఓడను బద్దలు కొడుతున్నాయి. ప్రజలు భయభ్రాంతులయ్యారు. అటూ ఇటూ పరుగెత్తుతున్నారు. ఓడన వున్న తాళ్ళన్నీ గాలి దెబ్బకు తెగిపోయాయి. చుక్కాని నిరుపయోగమైంది. ఓడ వ్యతిరేక దిశకు పోసాగింది. నావికులు గందరగోళంగా అరుస్తున్నారు. ప్రయాణీకులకు ధైర్యాన్నియడానికి ప్రయత్నిస్తున్నారు. కానీ స్వయంగా వాళ్ళకే ధైర్యం చాలకుండా వుంది. ఓడ కుదుపుకు, నీటి దెబ్బకూ తట్టుకోలేక ప్రజలు పిచ్చి వాళ్ళలాగా అరుస్తున్నారు. కొన్ని గజాల్లోనే పెద్ద బండ ఒకటివుండా లనీ, పడవ దాన్ని ఢీ కొనడానికి పోతున్నదనీ ఎవ్వరూ తెలుసుకొనలేదు. నేను ఓడ పై భాగంలో పడుకొనివున్నాను. ఒక పెద్ద శబ్దంతోపాటు ఓడ దేన్నో వెళ్ళి ఢీకొన్నట్టుగా గట్టిగా కుదిపింది. నేను ఆటబొమ్మలా ఎగిరివెళ్ళి సముద్రంలో పడ్డాను. మరుక్షణంలో నేను నీటిలో ఈదుతున్నాను.నేను ఎక్కడున్నాననే విషయం బొత్తిగా తెలియదు. కొద్దిసేపు ప్రజల కేకలూ, ఏడుపులూ, గోలగా వినబడ్డాయి. తరువాత అంతా నిశ్శబ్దం! నేను కొంతసేపు అలాగే దిజ్మూఢుణ్ణయి ఈదాను. కానీ ఎక్కడున్నానో, ఏ దిశకు పోతున్నానో అనేది తెలియకుండా ఈదడం అనవసరం. ఒకవేళ నడి సముద్రంలో వున్నానేమో. ఒడ్డుగానీ, ద్వీపంగానీ దగ్గర్లేవేమో! ఇక నలాంటప్పుడు ఈ ఈదడం వలన ప్రయోజనం? కానీ, అంత త్వరగా పరాజయాన్ని స్వీకరించే ప్రయత్నం చేయకుండా వూరుకోవడం ఘోరమైన పిరికితనమనిపించింది. "మానవుడు అన్ని విధాలా ప్రయత్నం చేయాలి.అన్నివైపుల నుండి మార్గం బంద్ అయినప్పుడు మాత్రమే పరాజయాన్ని స్వీకరించాలి" అని నా అభిప్రాయం కనుక ఇంకా యీదుతూనే వున్నాను. కొంత సమయం గడిచింది. ఇలా అనుకొన్నాను; "దిక్కుతెలియని స్థితిలో ఈదుకుపోవడం ఏమి బుద్ధిమంతుతనం? ఇప్పుడు ఖర్చుచేస్తున్న ఈ శక్తిని మరొకప్పటి కోసరం సురక్షితం చేసుకొనవచ్చును గదా? ఆకాశంలో ఉత్తర దిశగావున్న ధృవ నక్షత్రం ప్రక్కన సప్తరుషి మండలంలోని నాలుగు నక్షత్రాలు, సముద్ర గర్భంలో మునిగిపోయాయి. మిగిలిన మూడు నక్షత్రాలూ మునిగేవరకూ వేచివుంటే తెల్లవారుతుంది."

అప్పటికి తుఫాను పూర్తిగా తగ్గిపోయింది. అలల ఉధృతం తగ్గింది. సముద్రం ఒక ప్రశాంతమైన సరోవరంలాగా వున్నది. నేను యీదడంమాని వెలికిలా నీటిమీద పడుకున్నాను. కొన్ని క్షణాల తర్వాత నా కాళ్ళకు ఏదో గట్టి వస్తువు తగిలింది. చీకట్లో వివరం తెలియలేదు గానీ, ఒక పెద్ద చెక్క మొద్దు అయి

వుంటుం దనుకున్నాను. కాళ్ళు బారలు జాపుకొని హాయిగా పడుకొనవచ్చును దాని మీద! ఇలా ఆలోచించసాగాను! "ఇక్కడికి తీరం చాలా దూరంలో వుండినట్లయితే, ఈ చెక్క-మొద్దువల్ల మాత్రం ప్రయోజనం ఏమిటి? కాకపోతే, ఆకలిదప్పులతో నున్న నన్ను మరికొన్నాళ్ళు బ్రతికించడానికి ఈ మొద్దు ఉపయోగపడవచ్చును. తీరం వందలమైళ్ళ దూరాన ఉంటే ఈ మొద్దు ఏం రక్షించగలదు?" కండ్లు మూతలుపడ్డాయి. నిద్రవచ్చినట్లయింది. కలలో యిలా కనుపించింది; సంవత్సరాల తరబడి నేనలాగే ఆ చెక్క మొద్దుమీద పడివున్నాను. క్రమేణా శరీరంలోని శక్తి నశించసాగింది. శరీరమంతా చచ్చుపడిపోయింది. హృదయ స్పందన కూడా ఆగిపోయింది. శవాన్ని కాకులూ, గద్దలూ పొడుచుకు తినసాగాయి—బాగా నిద్రపట్టింది. దుర్భరమైన ఈ పీడకల కాక మరొకటి జ్ఞాపకంలేదు. కొంతసేపటికి మెళకువవచ్చింది. కానీ కండ్లు తెరవడానికి యిష్టం కలగలేదు. ఇంకా తెల్లవారి వుండదేమో! తెల్లవారినా దిగంతవ్యాప్తమైన జలరాశి మినహా మరేం కనుపిస్తుంది గనుక? కానీ ఉషఃకాంతి కనురెప్పల గుండా లోపలకు ప్రవేశిస్తోంది. కనులు తెరిచాను. ఆకాశం నిర్మలంగా ఉంది. నక్షత్రాలు మాయమయ్యాయి. నేను లేచి కూర్చున్నాను. తూర్పు దిశనుండి వస్తున్న బంగారుతీగల్లాంటి సూర్యకిరణాలు సముద్ర తరంగాల మీదుగా అనంత విశ్వంలోకి వ్యాపిస్తున్నాయి. పశ్చిమాన నల్లని తాడిచెట్ల సమూహాలు కనుపించాయి. నాలో యిచ్ఛా, స్ఫూర్తీ జాగృతమైనాయి. మొద్దుమీద నిలబడి నాలుగువైపులా చూశాను. పశ్చిమాన అనతిదూరంలో తీరం కనిపిస్తోంది. సముద్రం అతి ప్రశాంతంగా వుంది. ఎక్కడా ప్రాణిసంచలనంలేదు. "ఇంతమందిని బలితీసుకొని కూడా యెంత శాంతంగా వుందీ సముద్రం." అనుకొన్నాను.

నేను నీళ్ళల్లోకి దిగాను. ఒక చేత్తో మొద్దును పుచ్చుకొన్నాను. రెండవ చేత్తోనూ, కాళ్ళతోనూ ఈదుకుంటూ ఒడ్డుకు పోసాగాను.

తీరంలోని ఇసుకమీద నిటారుగా నిలబడి చూశాను. నా పొడుగాటి వెంట్రుకల్లోని నీటిని పిండుకొన్నాను. అప్పుడు శరీరంమీద కేవలం, ఒక కంచుకమూ, దోవతిమాత్ర మున్నాయి. నడుముని చూసుకొన్నాను. ఈ నూరు దీనార్ల మూట అలాగే నడుముకు కట్టివుంది. ఫరవా లేదనిపించింది. ఇక నిప్పుడు నా సహయాత్రికులను గురించి ఆలోచించసాగాను. తీరంవెంట దక్షిణానికి వెళ్ళడమా? ఉత్తరానికి వెళ్ళడమా? అనే విషయాన్ని నిర్ణయించుకోలేకుండా ఉన్నాను. చివరకు ఉత్తరదిశగా బయలుదేరాను. ఒక క్రోసుదూరం పోయానో లేదో అక్కడొక చెక్క-మొద్దు కనిపించింది. అది తప్పకుండా ఓడదే అయి వుంటుంది. ఐతే అది మా ఓడదా ? మరొక ఓడదా ? అన్నవిషయం సంశయాత్మకం ! అయినా నాలో యేదో ఆశ గట్టిగా పనిచేయసాగింది. అదే దిశగా నేను మరికొంతదూరం ప్రయాణం చేశాను. ఓడలోనుండి కొట్టుకొని

ఇంకా అనేకమైన వస్తువులు కనిపించాయి. ఒక శవంకూడా కనిపించింది. కంపించే హృదయంతో దగ్గరకువెళ్ళి చూశాను. అది మా మిత్రుడు సార్థవాహునిది. పాపం సార్థవాహుడు స్థూలకాయుడు. ఈదడం అతనివలన బొత్తిగాకాదు. అందువల్లే త్వరగా మృత్యువాత పడ్డాడు. ఇప్పుడు నీరు త్రాగడంవల్ల పొట్ట బాగా ఉబికింది కూడాను. సార్థవాహుడు చనిపోయినందుకు విచారం కలిగింది. కానీ, దాంతోపాటే బహుశః సింహవర్మ బ్రతికి ఉన్నాడేమోననే సన్నని ఆశకూడా నాలో పనిచేయ సాగింది. ముందుకుపోయిన కొలది పగిలిపోయిన ఓడయొక్క భాగాలెన్నో కని పించాయి. ఐదారు శవాలుకూడా కనిపించాయి. వాటిలో సార్థవాహుని భార్యశవాన్ని మాత్రం గుర్తించాను. కొంతసేపు నడిచాను.తీరానికిదూరంగా తాళవృక్ష సమూహాలు కనిపిస్తున్నాయి. వాటివద్దకు వెళ్ళాను. అక్కడ గ్రామమేమీ కనుపించలేదు. తాడి చెట్లు ఎక్కడం నేర్చుకొన నందుకు చాలా విచారించాను. తుమ్మా, నాగజెముడూ మొదలైన ముండ్లజాతిచెట్లు చాలా ఉన్నాయి. అలాటి ప్రదేశాల్లో పాదరక్షల్లేకుండా నడవడం కష్టం. మళ్ళీ తీరానికి వచ్చి ఇసుకలో నడవసాగాను. ఒకచోట ఒక పెద్ద మర్రిచెట్టు కనిపించింది. మర్రిచెట్టు ఎక్కి చూద్దామనే ఉద్దేశ్యంతో, దగ్గరికి వెళ్ళాను. మర్రిచెట్టుకు అటుగా తాటిఆకుల్తో కట్టుకున్న చిన్ని చిన్ని పూరిగుడిసెలు కని పించాయి. గుడిసెల దగ్గిరకు వెళ్ళాను! కుక్కలు మొరగసాగాయి.

ఇంతసేపట్లోనూ నా వస్త్రాలు బాగా ఎండిపోయాయి. అయినా ఆకారం బాగా దయనీయంగా ఉంది. నన్ను చూచిన ప్రతివారు నేను ఘోరవిపత్తునుండి బయటపడ్డానని సులువుగా తెలుసుకోగలరు. కుక్కల అరుపులు విని ఇద్దరు ముగ్గురు స్త్రీలు పరుగెత్తుకు వచ్చారు. కుక్కలను అదిలించారు. వాళ్ళు తమలో తామేదో మాట్లాడుకుంటున్నారు. కానీ, వాళ్ళ మాటల్లోని ఒక్క శబ్దంకూడా నాకు తెలియడం లేదు. మరే ద్వీపానికైనా వెళ్ళానేమో అనుకొన్నాను. కానీ, ఒక నిశ్చితమయిన మార్గంలో, తీర సమీపంలోనే ఓడను నడిపారు నావికులు. మరలాటప్పుడు మరొక ద్వీపానికి వెళ్ళడం యెలా సంభవం? నేరేడుపండు లాటి నల్లని శరీరాలు వాళ్ళవి. నడుములకు క్రింద నీలిరంగు అడ్డగుడ్డను మాత్రం ధరించారు. నడుములకుపైన ఎలాటి వస్త్రమూలేదు. తల వెంట్రుకల్ని కొప్పు చుట్టుకున్నారు. మెడల్లో గవ్వల్తో, పూసల్తో గుచ్చిన హారాలున్నాయి. చేతులకు గాజులున్నాయి. చెవులకూడా అలాంటివే ఆభరణాలేవో ధరించారు. ఆ ఆభరణాల మోతకు చెవులు సాగి భుజాల్ని తాకుతున్నాయి. నాకు చిన్నతనంలో కులూపా ఎన్నో విచిత్రమయిన ద్వీపాల్ని గురించి కథలు చెప్పింది. ఒక కథలో సముద్ర మధ్యలో భగ్నమయిన ఓడలోని యాత్రికులు యెలాగో తీరాన్ని చేరుతారు. ఐదువందలమంది రాక్షస స్త్రీలు వచ్చి, వారిని బంధితుల్ని చేసి పట్టుకుపోతారు. ఇదీ అలాటి ద్వీపమేనేమో? అయితే, ఇక్కడ ముగ్గురు స్త్రీలు మాత్రమే ఉన్నారు!

వారు నన్ను రమ్మన్నట్టు చేత్తో సంజ్ఞ చేశారు. మానవులు పరస్పరమూ భావ వినిమయం జరుపుకోవడానికి, శబ్దరూపమైన భాషే అవసరం లేదనీ, సంజ్ఞ లయినా సరిపోతాయనీ అప్పుడనుకొన్నాను.నేను ముందుకు నడుస్తూ, సముద్రంవైపు చేయిచూపి, ఆ చేయిని నా గుండెలమీద పెట్టుకొన్నాను. వారు సంజ్ఞలను గమనించకుండా ముందుకు నడిచారు. నేనూ వారి ననుసరించాను. గుడిసెలు చాలా చిన్నవి. వలయాకారంలో వున్నాయి. గోడలకు బదులు తాటిఆకుల దళ్ళు కట్టుకున్నారు. నన్నొక గుడిసెముందుకు తీసుకుపోయి సంజ్ఞద్వారా రోపలకు వెళ్ళమన్నారు. నేను రోమాంచితుడనయ్యాను. రాక్షసులు వుంటారన్న విశ్వాసం నాకు లేదు. కానీ రాక్షసులకంటె క్రూరులైన మానవులున్నారని నాకు తెలుసు. వాళ్ళ సంజ్ఞననుసరించి ఆ గుడిసెల్లోకి వెడితే, సముద్రం నుండి ఇంత కష్టపడి రక్షించుకొన్న ప్రాణాన్ని వీళ్ళచేతుల్లో విడవవలసి వస్తుంది. నేను వాకిట్లో మొండికి పడ్డాను. వాళ్ళు చేత్తో నోటివైపు సంజ్ఞచేసి చూపించారు. ఆహారానికి సంబంధించిన సంజ్ఞ ప్రపంచమంతట్లోనూ ఒకటే! నేను అప్పటికీ మౌనంగా వున్నాను. ఆ స్త్రీలు తమలోతాము కొద్దిక్షణాలు మాట్లాడుకొన్నారు. తరువాత ఇద్దరుస్త్రీలు ప్రక్కనవున్న గుడిసెల్లోకి వెళ్ళారు. ఒక్క షోడశ వర్షీయ శ్యామాంగి మాత్రం అక్కడవుంది. ఆ శ్యామాంగి శరీరావయవాలు అచ్చుపోసినట్టుగా వున్నాయి. వస్త్ర రహితమైన స్తనాలు శ్రీఫలాలను సిగ్గుపర్చేట్టున్నాయి. విశాలమైన కండ్లల్లోకి స్వచ్ఛత మోహజనకంగా వుండి పులూపాచెప్పినట్టు ఈ శ్యామాంగిరో రాక్షస లక్షణాలు ఏమీ కనుపించలేదు. ఇలాంటి తరుణి చేతిలో బందీకావడంకూడా ఒకరకంగా గర్వించదగిన విషయమే అనుకున్నాను. తలవంచుకొని గుడిసెలోకి పోయాను. నా కండ్లను నేను నమ్మలేక పోయాను. అక్కడ తాటిచాపమీద సింహవర్మ అతని ప్రేయసీ వళ్ళు తెలియకుండా నిద్రపోతున్నారు. నేను వారికి దగ్గర్లో క్రింద కూర్చున్నాను. శ్యామాంగి కూడా కొద్ది దూరంలో క్రింద కూర్చున్నది. కొద్దిసేపట్లో మిగిలిన ఇద్దరు స్త్రీలుకూడా వచ్చారు. ఒక మట్టి పాత్రరో బియ్యపు జావను, మరొక మట్టి పాత్రలో మంచినీటిని తెచ్చి ముందుపెట్టారు.

ఆకలి బాగా వేస్తోంది. జావను త్రాగాను. ఉప్పగా వుంది. చేపలకూర నంజుతూ, జావను త్రాగి, మంచినీటిని కడుపునిండా త్రాగాను. ఇద్దరు స్త్రీలు మట్టి పాత్రలను పట్టుకు పోయారు. వెళ్తూ శ్యామాంగితో ఏదో చెప్పిపోయారు.

నే నిప్పుడన్ని విధాలా ప్రశాంతంగా వున్నాను. నా మిత్రుడూ, అతని ప్రేయసీ బ్రతికారు. నా ఎదుటనే వున్నారు. ఆకలి దప్పులు తీరాయి. ఇక నిప్పుడల్లా, వారు మేల్కొవడం కోసరం ఎదురు చూస్తూ కల్పాంతాల వరకూ కూర్చోమన్నా కూర్చుంటాను! నాకు మరొక పనిలేదు. మరొక విషయాన్ని గూర్చి ఆలోచించవలసిన అవసరం కూడా లేదు. నా దృష్టి శ్యామాంగిమీదకు పోయింది. ఏమి మాట్లాడాలన్నా ఒకరి భాష ఒకరికి అర్థంకాదు! క్షణకాలం ఆమె ముఖంమీద

చూపు లుంచాను. తరువాత సంకోచంవల్ల చూపుల్ని మరల్చుకొన్నాను. కానీ, శ్యామాంగి మాత్రం నిస్సంకోచంగా నా ముఖంలోకి చూస్తోంది. ఆమె తన చేతిని ఆకాశంలోకి త్రిప్పుతూ ఏమో సంజ్ఞచేసి నవ్వింది. క్రమేణా నాలోని సంకోచం కూడా పోతోంది. శ్యామాంగి నా వంటిమీదవున్న వస్త్రాన్నితాకి చూడసాగింది. నేను కూడా ఆమె ధరించిన-గోగునారతో నేసిన కటిక వస్త్రాన్ని స్పృశించిచూశాను. వారి భాషలోని కొన్ని శబ్దాలను కూడా వుచ్చరించాను. కానీ, శ్యామాంగి యొక్క పవిత్రమైన, సంకోచరహితమైన శుభదృష్టినీ, అవ్యాజమైన చిరునవ్వునూ అను కరించడం నావల్ల కాకపోయింది.

మే మలాగే మౌనంగా ఒకరిని ఒకరం చూస్తూ, ఒకరిని మరొకరం అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ చాలా సేపు గడిపేశాము. ఈలోపున సింహవర్మ అవులించాడు. కండ్లు తెరిచాడు. లేచి నిలబడి గుడిసెను నాలుగువైపులా కలయ చూశాడు. నన్ను ఆలింగనపాశంలో బంధించాడు. అలా ఎంతసేపో మేమిద్దరం ఆలింగనంలో బంధితులమై గడిపాము. మొదటగా నేనే మాట్లాడాను. "మిత్రమా, సింహవర్మా! ఇది మనకు రెండవ జన్మయేనా?"

"అవును! ఇదెంత గొప్ప జన్మమో? పుట్టడమే యువకులుగా పుట్టాము. పుట్టిన వెంటనే ప్రాణమిత్రులం కల్సుకొన్నాము!"

మా చేష్టల్ని, ఆవేశాల్ని శ్యామాంగి స్మితవదనయై విప్పారిన నేత్రాల్తో చూస్తూంది. మా మాటల సవ్వడికి సార్థవాహుని కూతురు వాసంతి కూడా లేచింది. పమిట లేకుండడం చూచుకొని సిగ్గుపడి, కాటీని వంటినిండా కప్పుకోచూసింది. నేనిలా అన్నాను: "వసంత వదినా! ఇంతవరకూ నేర్చుకొన్న నాగరికతను మర్చిపో! అదంతా ఆ సముద్రపు నీలి జలాలలోనే కడుగబడ్డది. ఇక ఇప్పటి నుండి మరొక కొత్త నాగరికతను నేర్చుకో! ఇదిగో! ఈ శ్యామాంగిని చూసి నేర్చుకో!"

నా మాటల్ని విని వసంత వదిన నవ్వింది. అయినా పమిట సరిచేసుకో వటం మానలేదు. నేను సార్థవాహుని మృత్యువార్తని అప్పట్లో చెప్పడం కూడదనుకొన్నాను. చెప్పలేదు.

అప్పుడే మే మెన్నో సమస్యల్ని పరిష్కరించుకోవాలి. అన్నిటి కంటే ముందు మేము ఎక్కడున్నామో తెలుసుకోవాలి. కానీ ఎలా తెలుసుకోవడం? మా మాట వాళ్ళకు తెలియదు! వాళ్ళ మాట మాకు తెలియదు!

నేనిలా అడిగాను: "మిత్రమా! ఏమైనా తిన్నావా?"

"తినలేదు. కానీ, ఇప్పుడు ఆకలిగా వుంది!"

మే మలా మాట్లాడుకుంటుండగానే మట్టిపాత్రల్లో జావ,కూర తెచ్చి పెట్టారు. నేను వాసంతివైపు అభిముఖుడనై "సిగ్గుపడకు వదినా! మన వంటి మీద ఈ మాత్ర మైనా గుడ్డలు వున్నాయి. అందుకు సంతోషించు! తల్లి గర్భంలోనుండి వచ్చినట్లు

నగ్నంగా, సముద్ర గర్భంనుండి రావల్సినవారం! ఇక అన్నీ నీకీ శ్యామాంగి చెబుతుందిలే!"

వాసంతి నవ్వింది. శ్యామాంగి పెదాలు లాస్యం చేశాయి!

నే నిలా అన్నాను: "మిత్రమా! మొదట అన్ని విషయాల్ని విస్మరించి ఈ ఆహారాన్ని పుచ్చుకొనండి. ఈ ఆహారంలో లవణము, మత్స్యాలూ, బియ్యపునూకా కాక మరో పదార్థమేమీ కలవలేదు. కానీ పరమభట్టారకుని పాకశాలల్లో కూడా పదార్థాలింత రుచ్యంగా వుండవని ఘంటాపదంగా చెప్పగలను!"

మట్టిపాత్ర (మూకుడు) సింహవర్మ ముందుంది. వాసంతికూడా దగ్గర్లోనే వుంది. అయినా తినడంలేదు. అప్పుడు నేనిలా అన్నాను: "వదినా! సింహవర్మ నాకంటే ఏడేళ్ళు పెద్ద కనుక, నీవు నాకు వదినవే అవుతావు. ఒకవేళ నేనేమైనా పొరపాటుగా మాట్లాడినా, వదినెలు మరదుల్ని క్షమించినట్లుగానే నీవూ నన్ను క్షమించాలి. ఇక నీ పరమభట్టారిక వాసంతి వదినె ముందు దాసుడైన ఈ మరది నివేదించుకోనున్న విన్నపమేమనగా, తమరు నాకు వదినె కాకముందే, మా అన్నగారైన సింహవర్మకు పట్టమహిషి అయ్యారన్న విషయం మన ముగ్గురికీ తెలిసిందే. ఈ శ్యామాంగీ మిగిలిన స్త్రీలూ అలాగే అనుకుంటున్నారు. ఒకే పాత్రలో తినడానికి ఎందుకీ సంశయం? ఈ ప్రదేశంలో మరో పాత్ర దొరకడం అసంభవం. కనుక నా మాట విని చేయి ముందుకు చాపండి! తీసుకు తినండి!"

సింహవర్మ వాసంతి చేతిని పట్టుకొని ముందుకు లాగాడు. వాసంతి మొదటి ముద్దను నోట్లో పెట్టుకుంటూ మెడవంచి నా ముఖంలోకి చూసింది. ఆ చూపులు సమ్మోహనంగా వున్నాయి. "భేష్! వదినా! అలాటి చూపుల్నే ఈ దాసుడిమీద అప్పుడప్పుడూ విసుర్తూవుండు. లక్ష్మణుడు ఒక్క పధ్నాలుగేండ్లు వనంలో అన్నా వదినెలకు సేవచేశాడు. ఈ దాసుడు జీవితమంతా సేవచేస్తాడు!"

"జయా! నీ విలాగే మాట్లాడుతున్నావంటే, తరువాత చాలా బాధ పడతావు. మీ వదినెప్పుడూ ఇలాగే మూగిలాగా వుంటుందను కుంటున్నావేమో! మాట్లాడ సాగిందా, ఇక నీకు మాటలే పెగలవు!" అన్నాడు సింహవర్మ.

సింహవర్మ మాటలు నిజమన్నట్లు వాసంతి తల పంకించింది.

# ఆదిమవాసుల్లో...!

భోజనం అయ్యాక సింహవర్మ తనకీ కథను వినిపించాడు. ఒక భయంకర మైన శబ్దంతో పర్వతాన్ని ఢీకొనగానే వాసంతి భయభీత అయింది. సింహవర్మ ఆమె చేతులను తన చేతుల్లోకి తీసుకున్నాడు. భయంతో వణుకుతున్న ఆమె నడుం చుట్టూ తన చేతులను పెనవేశాడు. అప్పుడు వాళ్ళిద్దరూ దగ్గిరగా పడుకొని వున్నారు. చీకట్లో మనుష్యులు ఒకళ్ళకొకళ్ళు కనబడడంలేదు. వాసంతీ సింహ వర్మలు తమకేదో ఘోరమైన విపత్తు సంభవించిందని తెల్సుకొన్నారు. ఒకరికొకరు దగ్గరగా జరిగి గాఢాలింగనంలో బంధితులయ్యారు. ఇదంతా ఒక్క క్షణంలో జరి గింది. మరుక్షణంలోనే ఇద్దరూ గాఢ ప్రేమపాశ బద్ధులై సముద్రంలో మునిగారు. వారిద్దరికి ఈత బాగా వచ్చు. లేకపోతే అదే క్షణాన ఇహ జీవనయాత్రను ముగించి వుండేవారు.

సింహవర్మ ఇలా చెప్పాడు. "నీటిలో పడిన మరుక్షణంలోనే విపరీతమైన స్ఫూర్తిస్థైర్యాలు కలిగాయి. చప్పున వాసంతీ నేనూ విడివడ్డాం. నేను నా వివేకాన్నీ శక్తిని వినియోగించి ఈదసాగాను. నాకు కొంచెందూరంలో వున్న వాసంతిని దగ్గి రకు తీసుకొని నడుముల్ని కావిటేసుకోమన్నాను. అదే స్థితిలో ఎంతో సేపు ఈదాను. ఇకనప్పుడు అలసట ప్రారంభమైంది. నిరాశకూడా కలగసాగింది. వెల్ల కిలా తిరిగి శవాసనం వేశాను. వాసంతినికూడా అలాగే శవాసనం వేయమన్నాను. దుర్ఘటన తరువాత అతిభీకరమైన ప్రశాంతత సముద్రాన్ని ఆవహించింది. ఆ మృత్యుశాంతిలో ఒకరి ఉఛ్వాసనిశ్వాసాల్ని మరొకరు వినగలుగుతున్నాము. అప్ప టికి చాలా సేపటినుండి ఈదుతూండడంవలన మా శరీరాలు పూర్తిగా జర్ఝరిత మయ్యాయి."

వదినె మౌనంగా వుండడాన్ని చూసి ఇలా అన్నాను: "చూశావా వదినా! కేవలమూ తన ప్రతాపంవల్లనే మృత్యుముఖంనుండి బయటపడ్డట్లు మాట్లాడు తున్నాడు!"

వాసంతి వదిన నవ్వుతూ ప్రథమంగా మాట్లాడింది. "పురుషుల ప్రకృతే అంత!" అన్నది.

"కానీ, వదినా! స్త్రీ పురుషుడికి అవసరమైన స్వేచ్ఛనిచ్చింది. అందువల్లే పురుషుడి లాంటి ప్రకృతిని అలవరచుకొన్నాడు!" అన్నాను.

సింహవర్మ ఇలా అన్నాడు: "నీవు చెప్పిన పై మాటను నేను ఒప్పుకోను! సరే, అది తరువాత. మొదట మా బాధను విను! వాసంతి అలా నాకు దగ్గిరగా నా శరీరాన్ని స్పర్శిస్తూ వుండడంవలన జీవిత సంగ్రామంలో అధిక ఉత్సాహంతో పాల్గొనే శక్తి నాకు కలిగింది. మధ్య మధ్య అలసటను తీర్చుకొంటూ తెల్లవారే వరకూ ఈదాము. ఇక సూర్యోదయ మవుతుండగా నా కాళ్ళకు భూమి తగిలింది. నిలువులోతు నీళ్ళల్లో లేచి నిలబడ్డాను. మీ వదినను నా భుజాలమీద కూర్చో మన్నాను!"

"ఓ....హో....సోదరా! అయితే నువ్వొక భీముడివయ్యా వన్నమాట— అహ. ఉపమానం పేలవంగా వుంది. సప్తసముద్రాలు కల్సికూడా మోకాటినిదాటని కుంభకర్ణుడి వయ్యావన్నమాట....అయితే మా వదినె!" అన్నాను.

వదినె మధ్యలో అందుకొంది "అదికాదు మరి....!" మధ్యలోనే ఆపింది.

"ఆపకు వదినే, నేను మరిదినే! ఊఁ చెప్పు!"

"సరే, మరిదీ! మేము వడ్డుకైతే వచ్చాం. కానీ అక్కడ బాగా లోతుగా వుంది. కాళ్ళ క్రింద మోపేసరికి ముక్కుర్లోకి నీరు పోసాగింది!" అన్నది వదినె.

"అందువలన వదినెగారు ఈ కుంభకర్ణుడి భుజాన ఆశ్రయించారు" అన్నాను.

"ఛా ఛా అలా జరగలేదు. నేను చేయిపుచ్చుకుని ఈదుతానన్నాను. కానీ మీ అన్నగారే బలవంతానా భుజానికెక్కించుకొన్నారు!"

"అయితే, సోదరా, భట్టారకా! నీవు బలవంతానా భీముడివో, కుంభకర్ణుడివో అవుదామనుకున్నావన్నమాట? అప్పుడే నేనే వున్నట్లయితే ఈ భీముడు మా వదినెని, ఎలా సముద్రంనుండి బయటికి తెచ్చాడో చూసేవాణ్ణి. కానీ, ఆ స్థితిలో మిమ్మల్ని భీముడికి పోల్చడం తగదు. బాగుండదు కూడాను. వరహావతారానికి పోలిస్తే సరిపోతుంది. మరి ఆదిదేవుడైన విష్ణుమూర్తి సముద్రంనుండి భూదేవిని ఉద్ధరించడానికి వరహావతారమేగా దాల్చింది?"

"అవును మరిదీ! మీ అన్నగారు మహా వరహావతారాన్ని దాల్చడానికి మహా తొందరపడ్డార్లే!" అందరం ఫక్కున నవ్వాము.

"అన్నగారు అలా మిమ్మల్ని సముద్రంనుండి బయటికి తీసుకొని వచ్చేప్పుడు మీకెలా వుంది వదినగారూ?" అడిగాను.

"నేను తూర్పు దిశను రక్తరంజితం చేస్తున్న ఉషఃకాంతిని, నూతన ప్రభాతాన్ని చూస్తున్నాను!"

"అంటే నూతన జీవితాన్ని అవలోకిస్తున్నారన్నమాట?"

సింహవర్మ ఇలా అంటూ తన మాటను పూర్తిచేశాడు. "మేము తీరానికి వచ్చి నిలబడేసరికి తూర్పున ఎర్రని కాంతి పుంజాలు విరజిమ్ముకొంటున్నాయి.

మేము బాగా అలసిపోయాం. కనుకనే ఈ తాళవృక్ష సమూహాల్ని చూసికూడా, తరువాత ఆలోచించవచ్చని వూరుకున్నాం. కొంతసేపు అక్కడే విశ్రాంతి తీసుకున్నాం. ఇంతలో కొంతమంది పల్లెకార్లు వలలు తీసుకొని అక్కడికి వచ్చారు. వాళ్ళల్లో ఒకడు మమ్మల్నిక్కడికి తీసుకువచ్చి దిగవిడిచాడు!"

"మరి నేను వచ్చేసరికి మీరీ తాటిచాపమీద గాఢనిద్రాముద్రితులైవున్నారు!" అన్నాను.

"మరిక నీ కథ చెప్పు మరిదీ, నీవెలా యిక్కడికి వచ్చావు ?" అన్నది వదినె.

"నీ మాటలు ఎంత మధురంగా వున్నాయి వదినే! నేను కూడా మీతోపాటే జంటగా సముద్రంలో దూకినట్టయితే ఎంత బాగుండేదో! అప్పుడీ అన్నగారు భీముడి పాత్రను ఆరించవలసిన అవసర ముండేది కాదు. ధర్మరాజు పాత్రని ధరించి దూరంగా వుండి చూస్తూవుంటే సరిపోయేది. నా కథ మీకు పూర్తి వ్యతిరేకం....మీ రీ గుడిసెలో నిద్రపోయారు. నేను క్షీరసాగరంలో శేషతల్పంపై...." అన్నాను.

వాసంతి కండ్లూ, పెదాలూకూడా నవ్వాయి.

"అంటే నీకేదో చెక్కమొద్దు దొరికిందన్నమాట....ఈదనవసరం లేకుండా హాయిగా దానిమీద పడుకొని వడ్డుచేరావు!" అన్నాడు సింహవర్మ.

"నన్ను మరీ అంత పురుషార్థహీనుడిగా చిత్రించకు!" అన్నాను.

"మీ వదినె దృష్టిలో తగ్గిపోతావని భయమా? యెందుకు తగ్గుతావులే. నన్నేమో భీముణ్ణి చేశావు. నీవు విష్ణుమూర్తి వయ్యావు. ఔనా? కాకపోతే పురుషార్థాన్ని మరచి, నిర్జీవమైన చెక్కమొద్దులకూ, సముద్ర తరంగాలకూ జీవితాన్ని వప్పగించి, చేష్టారహితుణ్నయ్యానని ఎందుకు వప్పుకోవు ?" అన్నాడు సింహవర్మ.

"సోదరా ! వదినెముందు నన్ను మరీ అంత తీసివేయకు!"

"మీ వదనె అంత తెలివితక్కువది కాదులే మరదీ! నీ వారోజు శబరుల్తో పోరాడినప్పుడు చూపిన పరాక్రమం, మా నాయన చెప్పగా విన్నాలే!" అంది వదినె.

"కానీ, వదినే! ఆ పరాక్రమంలో సగపాలు సోదరుడి శక్తి సామర్థ్యాలు కూడా కలిశాయి!" అన్నాను.

"మీ అన్నయ్యను నేను పరాక్రమ హీనుడని అనడంలేదు. నీవు ఒట్టి 'శేషశాయి'వి మాత్రమేకాదని నే నంటున్నాను!"

"వదినె మరదులు బాగా దొరికారు. అతడి మెత్తని మాటలకు మోసపోయి, అతడి పక్షాన్ని స్వీకరిస్తే తరువాత పశ్చాత్తాప పడతావు, అన్నాడు సింహవర్మ!

"లేదు సోదరా! వదినె చెప్పినమాట నిజం! నేనూ పరాక్రమాన్ని చూపే వాణ్నే కానీ, దిశ తెలియకుండా ఈదుకుపోవడంవల్ల ప్రమాదం కూడా సంభవించ వచ్చు! నేను ఈదడం సముద్రగర్భం పైనైతే, బ్రతకడం అసంభవమే అవుతుంది. మృత్యువును నియంత్రించే సాహసం కంటే – చేష్టా రాహిత్యమే తాత్కాలికంగా మేలేమో? నీవు నిజంగా సాహసమే చేశావు. అదృష్టవశాన నీ సాహసం సఫలీకృతమైంది!" అన్నాను.

"ఐతే, మరిదీ! నీవు అదృష్టంమీద భారం వేయలేదా?"

"నా కథ ఇది, చెక్కమొద్దుమీద హాయిగా "శేషశాయి"లా పడుకొన్నాను. గాఢమైన నిద్రపట్టింది. కండ్లు తెరిచేసరికి తీరానికి చేరువలో వున్నాను. ఒడ్డుకు వచ్చి ఉత్తరదిశగా నడిచాను. పగిలిపోయిన ఓడ తాలూకు వస్తువులెన్నో కనుపించాయి. శవాలుకూడా చాలా కనుపించాయి. చివరకు ఈ మర్రిచెట్టు నెక్కి నాలుగు వైపులా చూద్దామనుకొంటుండగా కుక్కలు అరిచాయి. ఈ శ్యామాంగీ, ఈమె సహచరులూవచ్చి, కుక్కలను అదిలించి, నన్ను రోపలకు తీసుకువచ్చారు. లోపల మీరు గాఢనిద్రలో వున్నారు!"

నే నిప్పుడు సార్థవాహుని, అతని భార్య యొక్క మృత్యువుని గురించి చెప్పలేదు. ఈ కఠోర సత్యాన్ని వినిపించడానికి ముందుగా ఎంతో భూమికను తయారు చేసుకోవలసి వచ్చింది. అప్పటికీ ఈ వార్తను విని వదినె చాలా దుఃఖించింది. నెలల తరబడి అన్యమనస్కయై గడిపింది.

* * * *

మేము ఎక్కడున్నామో తెల్సుకొందామని చాలా ప్రయత్నం చేశాం. కానీ, భాష తెలియని కారణంగా వాళ్ళనేన అడగలేకపోతున్నాం. ఆ రోజు సాయంత్రం వేటకు వెళ్ళినవారు పొలాలకు వెళ్ళినవారు స్త్రీ-పురుషులందరూ తిరిగి వచ్చారు. నిశ్శబ్దంగా, జనరహితంగా వున్న గుడిసెలన్నీ కలకలలాడుతూ కనుల పండువుగా తయారయ్యాయి. ఆ పల్లె పెద్ద మమ్మల్ని తమగుడిసె దగ్గరకు పిలిపించాడు. చాలామంది స్త్రీ పురుషులు అక్కడే గుమికూడి వున్నారు. ఒకరి మాట ఒకరికి తెలియకపోవడం వలన మాతోటి ఎవరూ ఏమీ మాట్లాడలేదు. కానీ, బియ్యపు మేయర్ని (సారాయి) బాగా త్రాగించారు. మట్టి కుండల్లో మేయ రుంది. ప్రతి వాళ్ళముందూ ఒక్కొక్క తాటియాకుల దొన్నె! శ్యామాంగి వదినెను పదిమంది స్త్రీలమధ్య కూర్చోపెట్టి మేయరు త్రాగించటానికి ప్రయత్నిస్తోంది. వాసంతి వదినె కూడా తెలివికలదే! తన స్థితిని అర్థం చేసుకొంది. ఎన్ని నెలలపాటు ఈ అర్థ నగ్న స్త్రీలతో గడపాల్నో తెలియదు. కలుపుగోలుతనంగా వ్యవహరించింది. పాన గోష్ఠి తరువాత నిప్పుల్లో కాల్చిన మాంసం తెచ్చారు. చాలా ఇష్టంగా తిన్నాము. చీకటిపడ్డ తరువాత, నృత్య గాన వాయిద్యాలు ప్రారంభమయినాయి. స్త్రీ పురుషులు కలిసి నృత్యం చేయసాగారు. వాళ్ళ నృత్యం సాదాగానే వున్నా నేను నేర్చుకో

వడానికి కొన్నాళ్ళు పట్టింది. శ్యామాంగి నాకు గురువై వారి నృత్యంలోని అన్ని భంగిమలను నేర్పింది. వేణువు నూదడం నాకు మొదటే వచ్చును. మొదటి సారిగా అందరితో కలిసి నాట్యం చేసిన రోజును ఎన్నాళ్ళికీ మరచిపోలేను. నాట్యమూ, వేణువూ - నాకూ ఆ శ్యామలవర్ణులకూ మధ్య తాదాత్మ్యభావాన్ని కలిగించాయి.

మూడవ రోజునే అందరు పురుషులలాగే నేనూ మొలకు త్రాడు కట్టుకొని గోచీ పెట్టుకున్నాను. కంచుకాన్ని అడ్డగుడ్డనూ మూట గట్టుకొని నేరుగా వదినె వద్దకు పోయాను. నన్ను చూడగానే వదినె కండ్లల్లో ఆశ్చర్య పరిహాస భావనలు గోచరించాయి. గుడ్డలమూటను వదినె ముందుంచాను. దీనార్లమూటను చేతికి ఇస్తూ, "వదినె! నన్నిలాటి వేషంలో చూడడంవలన నీకు ఆశ్చర్యం కలగవచ్చు, కానీ, మొదట ఈ దీనార్ల సంచిని ఎక్కడైనా దాచిపెట్టు. ఒకప్పటికి అక్కరకు వస్తాయి. నీవు నీ కాసులపేరును మొన్ననే తీసి దాచావుకదా? మంచిపని చేశావు!" అన్నాను.

ఇసుకమీదకు రాగానే వదినెను నగలుతీసి ఇవ్వమన్నాడు. విలువయిన నగలన్నీ ఓడతోపాటు నాగలోకానికి చేరాయి. ప్రస్తుతం వంటిమీద వున్నవాటిని తీసి ఇవ్వడానికి వదినె సంశయిస్తూంది. "నగలు ప్రాణాపాయాన్ని కూడా తేవచ్చు" అన్నాను. వదినె అయిష్టంగానే నగలను తీసి ఇచ్చింది.

"సరే, నగలను వదిలించుకొన్నాం. ఇంకా కూడా చాలా వాటిని వదిలించుకోవాలి!" అన్నాను.

"ఇంకా వేటిని మరిదీ ?"

"నన్ను చూడు! నే నెలా పూర్వపు నాగరికతల్ని వదిలేసి స్వచ్ఛందంగా తయారయ్యానో"

"భలే.... భలే.... బాగా చెప్పావు జయా? ఊ........ భట్టారికా! ఇకనేం? ఈ విషయంలో కూడా పరిది పక్షం వహించు!" అన్నాడు సింహవర్మ.

"మరిది చెప్పే మాటలేవీ వ్యర్థమౌతాయని నే ననుకోను. మనం అర్థం చేసుకోవడం ఆలశ్యం కావచ్చు! మరిదిచెప్పే ప్రతిమాటా ఏదో ఒక గంభీరమైన అర్థానికి-ఆశయానికి దారితీస్తుంది !"

"భలే! వదినా మరుదులు శుక్ర-బృహస్పతులయ్యారు. ఇక నీ అకించనుడికూ్కడా ఏదో ఒక పదవినిచ్చి కృతార్థుణ్ణి చెయ్యండి!"

"నా మాటలను నీవు పరిహాసం క్రింద కొట్టివేయకు సోదరా! మనమిక్కడ ఇంకా ఎన్నాళ్ళుండాల్నో తెలియదు. చుట్టుపట్ల ప్రదేశాల్ని గురించి పూర్తి వివరం సేకరించుకొనకుండానే ఈ ప్రదేశాల్ని మనం విడువరాదు. ఐతే, వదినె క్షేమాన్ని నీవు కోరడంలేదా ?" అన్నాను.

"నా కేమవసరం? వదిన క్షేమాన్నాలోచించ వలసింది మరిది. అందుకనే కవులు వదినా మరుదుల పాటర్తో సాహిత్యాన్ని నింపేశారు!"

"చూశావా వదినె! సోదరుడు చాలాదూరం ఆరోచించాడు. మనం భవిష్యత్తురో ఎన్నడైనా నాగరిక ప్రపంచంరోకి పోతే నీవు సహజమైన నాగరిక వేషంలో వెళ్ళగలగాలని నేను వాంఛిస్తున్నాను. సోదరుడు ఇక్కడి శ్యామాంగి మల్లె అర్థ నగ్నస్థితిలో నిన్ను నాగరిక ప్రపంచంరోకి తీసుకుపోవాలని చూస్తున్నాడు. ఏది ఉచితమో ఉత్తమమో ఆరోచించుకోవలసిన బాధ్యత నీది!" అన్నాను.

"నీవు చాలా ధూర్తుడవోయ్. జయా!"

"సరే నేను ధూర్తుడనో, మా సోదరుడు ధూర్తుడో, ఇప్పుడే నిరూపిస్తానుగా? నీవే చెప్పు వదినా! నేనీ కంచుకాన్నీ, శాటీరాన్నీ రోజూ ధరిస్తే ఎన్నాళ్ళొస్తాయంటావు?"

"మహావస్తే ఆరునెల్లు!" వదినె ముఖం గంభీరతను దాల్చింది.

"మరి సోదరా! మన మిక్కణ్నుండి నాగరిక ప్రపంచంరోకి ఎన్నాళ్ళకు వెళ్ళగలమని మీ వూహ? కొంచెం చెప్పండి చూద్దాం!" అన్నాను.

"అలాటి జోస్యాలు నీకే తెలుస్తాయి! నువ్వే చెప్పు!"

"నాకు జ్యోతిష్యం ఏమీ తెలియదు. కానీ, ఆరునెల్లకో లేక సంవత్సరానికో మన మిక్కడి నుండి మన నాగరిక ప్రపంచానికి వెళ్ళగలమని నే ననుకోవడంలేదు. బహుశః రెండు సంవత్సరాలుకూడా పట్టవచ్చు! ఇప్పుడే వీటిని పాడుచేసుకుంటే, మరప్పు డే వస్త్రాలతో వదినెగార్ని నాగరిక ప్రపంచంరోకి తీసుకుపోతారు!" అన్నాను.

సింహవర్మ ఇకనేమీ మాట్లాడలేదు. వదినె దేన్నో ఆరోచిస్తోంది. మళ్ళీ నేనిలా అన్నాను. "వదినా నేను నిన్ను ఈనాటి నుండే నారతో నేసిన అడ్డపంచను (లుంగీని) కట్టుకోమనడంలేదు. శ్యామాంగిలా అర్థనగ్నవు కమ్మనడంలేదు. కానీ ఇక్కడి జీవితాని కిప్పటినుండే అలవాటుపడ్డం మంచిది. స్నానం చేసేప్పుడూ మరి ఇతర సమయాల్లోనూ క్రమేణా అడ్డపంచను అలవాటు చేసుకోవడం మంచిది!"

"మరిదీ! నీవు చెప్పేది నిజమే!....కానీ...."

"కాని లేదు. రెండు కానీల్లేవు! వందల సంవత్సరాల నుండి వస్తూన్న ఆచారాల అజీర్తి ఒక్కరోజులో నయంకాదు. కానీ, ఒకే ఒక నెల రోజుల్లో ఈ పరిసరానికి ఆచారాలకూ అలవాటు పడిపోవచ్చు! వదినెగారూ! మీరు ఒక నెలరోజుల్లో ఇక్కడి పరిస్థితులకు తగ్గట్టుగా తయారు కావచ్చు....!" అన్నాను.

"మరి మీ సోదరుడు భట్టారకుని మాటో?"

"సోదరుణ్ణి రేపే మార్చేస్తాను."

"నీ ఆత్మవిశ్వాసం చాలా గొప్పది జయా!"

"అవును సోదరా! మనమిక్కడ ఏ చిత్రకారుడిగానో, సంగీతజ్ఞుడిగానో బ్రతకలేము. ఈ నూతనుల దయాధర్మం మీద ఎక్కువరోజులు బ్రతకడం కూడా దుర్భరంగానే వుంటుంది. మిత్రత్వం కానీ, ఆతిథ్యం కాని నాలుగురోజులు. ఆపైన బాగుండదు. కనుక వాళ్ళలాగానే కష్టపడి కూటిని సంపాయించుకోవాలి. ఎద్దులూ, ఆవులూ లేవుకదా! వ్యవసాయమైనా ఎలాచేయడం అనుకుంటున్నావేమో? పలుగూ, పార తీసుకోవడం, నరాల సత్తువ (శక్తి) చూపించడం. నాలుగురోజులు బాధగా వుంటుంది. చేతులు బొబ్బలెక్కుతాయి. తరువాత అదే అలవాటవుతుంది. ఇక్కడ అవలంబించ తగిన మరొక వృత్తి 'చేపలు పట్టడం' దీన్ని మనం వాళ్ళ దగ్గిరే నేర్చుకోవచ్చు."

సింహవర్మ నా రెండు చేతులనూ తన చేతుల్లోకి తీసుకొన్నాడు. పులకాంకితుడై, వాసంతివైపు చూస్తూ "చూశావా! మా తమ్ముణ్ణి నీ దగ్గిర నేను పొగడడం అత్యుక్తికాదు. నా పొగడ్తకి మించిన అర్హతలే వున్నాయి నా తమ్ముడిలో!" అన్నాడు.

"ఏమో, నాకు తెలియనట్టూ, నేను ఒప్పుకోనట్టూ! మరిదియొక్క సామర్ధ్యాలకు నేను మీకంటే కూడా గర్వపడతాను!"

"మరిదిని చూసి అంత గర్వపడే దానివి—ఊ—మరిది చెప్పినట్లే తయారుకా?"

"నాకు మీరేమీ ఉపదేశాలు చేయ నవసరంలేదు. రేపటి నుండే ఆ శ్యామాంగితోపాటు వెళ్ళి పనిపాటలు నేర్చుకొంటాను. అంతగా ఇతర పనులేవీ చాతకాక పోయినా, అన్నం వండగలను, నీరు తీసుకురాగలను!"

"మరి వస్త్రధారణను గురించి నీ అభిప్రాయం ఏమిటి?"

"మరిది చెప్పిన మాటలు చాలా యదార్థం! నేను త్వరలో వస్త్రధారణ విషయంలోకూడా ఈ అర్ధనగ్నాంగుల్ని అనుసరిస్తాను. మరి మీ విషయం ఏమిటి కళాప్రియా?" అన్నది వదినె.

"మీ కళాప్రియుడు చాలా రోజులుగా తమ్ముడి అడుగుజాడల్లో నడుస్తూ వచ్చాడు. ఈరోజు సూర్యాస్తమయం తరువాత మేమిద్దరం ఒకే వేషంలో తమకు దర్శన మిచ్చుకుంటాము!"

ఆ పల్లెలో మేము ఒక సంవత్సరంపాటు వున్నాము. ఇప్పుడిక ఆ పల్లీయులకూ మాకు ఎలాటి భేదమూలేదు. కేవలం మా శరీరపు గౌరవర్ణం మాత్రం మమ్మల్ని వారినుండి వేరు పరుస్తుంది. వస్త్ర భూషణాల్లోవూ, పని పాటల్లోనూ— అన్ని విషయాల్లోనూ వారితో కలిసిపోయాము. పాన గోష్ఠుల్లో మేము ఎంతో వుత్సాహంగా పాల్గొనేవాళ్ళం. నర్తనశాలల్లో, నే నందరికంటే నిపుణుణ్ణయిన నర్తకుణ్నని ప్రసిద్ధిపొందాను. వదినె రోగులకూ, బాధాదష్టులకూ ఎంతో సహనమూ ఓర్పూ గలిగి సేవచేసేది. ఆ విధంగా ఆమె అందరికీ తల్లో నాలుకయింది!

మా సంస్కారమూ, జ్ఞానమూ అక్కడి ప్రజల అంతస్తుకు తగినదే అయినట్లయితే ఎంతో సుఖమయమైన జీవితం గడిపి వుండేవాళ్ళం. కానీ,మాకు రోజూ మా నాగరిక ప్రపంచం జ్ఞాపకమొస్తూండేది. సాయం సమయాల్లో కొన్ని ఘడియలపాటు సముద్రంవంక చూస్తూ కూర్చునేవారం. ఈ సముద్రంలో గుప్తమైన పర్వతాలు వున్నాయనీ, ఏ నావికుడైనా, ఏ పడవైనా ఒక యోజన దూరాన్నిదాటి లోపలకు పోతే సర్వనాశనం జరుగుతుందనీ మాకు తెలియదుకదా? కట్టెలకొరకు చాలా దూరం వెళ్ళేవారం. పర్వత శిఖరాలెక్కి నలువైపులా చూసేవాళ్ళం! ఎక్కడా ఆశారేఖలు కనుపించేవికావు. ఆ పల్లీయులకు మేము చాలా సహకారులుగా వుంటున్నాము. సింహవర్మా, వాసంతీ పతీ పత్నీ అయ్యారు, కనుక వాళ్ళకు విడిగా ఒక గుడిసెను యిచ్చారు. నేను అవివాహితుణ్ణి కావడంవల్ల వుమ్మడి పాకలో వుంటున్నా. ఆ పల్లెలోని ఆచారాన్ననుసరించి వివాహం కాని స్త్రీ పురుష లందరూ ఒక పెద్ద సావడిలో వుంటారు. పగలంతా పనిచేస్తాము, సాయంకాలం ఆటపాటలుంటాయి. నే నా పల్లెటి పాటల్ని కొన్నింటిని నేర్చుకున్నానని చెప్పనవసరం లేదనుకుంటాను. రాత్రిపూట పెండ్లికాని స్త్రీ పురుష లందరూ ఆ చావడిలోనే పడుకొనేవారము. యువకు లందరూ ఒక వరసన పడుకొనేవారు. యువతు లందరూ ఒక వరసన పడుకొనేవారు. ఏడు ఎనిమిది సంవత్సరాల నుండి, ఇరవై పాతిక సంవత్సరాల వరకూ వయస్సు కలిగిన అవివాహితులైన స్త్రీ పురుషులందరికీ, ఉమ్మడి శయనా గారమది. వారిలో ఒకళ్ళ నొకళ్ళు కలుసుకొనడానికి ఎలాటి అభ్యంతరాలుగానీ, ఆటంకాలుగానీ వుండవు! చావడిలోపల వున్నప్పుడు సాధారణంగా యువకులూ, యువతులూ అందరూ నగ్నంగానే వుండేవారు. ఈ చావడిని అప్పుడప్పుడూ పాటలీపుత్రపు అంతఃపురార్తో పోల్చుకుంటూ వుండేవాణ్ణి! ఎంత వ్యత్యాసం! పాటలీపుత్రపు అంతఃపురంలోని స్త్రీ పురుషులందరికీ అతి బీభత్సంగా కాముక వ్యాపారాన్ని నడపడం ఒక్కటే పని! మరి ఇక్కడ అంత బీభత్సకరమైన భావాలు ఎవరికీలేవు. ఇక్కడ కూడా యువకులకూ, యువతులకూ మధ్య ప్రగాఢమైన ఆకర్షణవుంది. సర్వభక్షి అయిన బీభత్స కాముక ప్రవృత్తి మాత్రంలేదు. ఎందువల్ల ఇంత వ్యత్యాసం వుంది? మొదటి విషయం, ఇక్కడి అవివాహితులు రాజాంతఃపురాల్లోని అవివాహిత లంత పరతంత్రలుకారు. ఎవరినైనా ప్రేమించడం, నిరాకరించడం వారి వ్యక్తిగతాభిప్రాయాల మీదా, ఇష్టాయిష్టాల మీదా ఆధారపడివుంటుంది. యువకులు బలవంతాన యువతుల్ని తమవశం చేసుకోడానికి ప్రయత్నించలేరు.యువతులకు ఆశల్ని కల్పించి ప్రేమింపచేసుకోడానికి భవనాలుగానీ,దాసదాసీలుగానీ వాహన వస్త్రాలుగానీ ఏమీలేవు. యువతి పురుషుణ్ణి తిండిలేకా, బ్రతకలేకా ప్రేమించదు. అక్కడి స్త్రీ పురుషుడికంటే అధికంగా శ్రమించగలదు. యువతీ యువకులు ఒకరి నొకరు ఆరోగ్యం, సౌందర్యం, కార్యనిపుణత, ఆటపాటల్లో చతురత—వీటి ఆధారంగా ప్రేమించు

కొంటారు. నృత్యం స్వాస్థ్య రక్షణకు ఒక ఆనందకరమైన, సహజమైన సాధనం; ఆరోగ్యాన్నిచ్చే వ్యాయామం మొదలైన ప్రక్రియల్లో మనిషి త్వరగా విసిగి పోతాడు కాని, ఈ నృత్యగానాది కలాపాల్లో మనిషి యెంతకీ అలసిపోడు. అందమైన, ఆరోగ్యకరమైన స్త్రీల సహచర్యం, మధురమైన గానాలూ మనిషిని ప్రోత్సాహితుని చేస్తుంటాయి. సన్నని నడుమూ, వెడల్పాటి వక్షం, వృషభ స్కంధాల్లాంటి భుజాలు లేని పురుషుల్ని నే నా పల్లెల్లో చూడలేదంటే అతిశయోక్తికాదేమో! పురుషుల శరీరాలమీద సోమరితనం వలన కలిగిన కొవ్వూ, నునుపూ కనిపించవు. దృఢమైన కండలు కనుపిస్తుంటాయి. అక్కడి స్త్రీలుకూడా గుండ్రంగా, నునుపుగా పిండి బొమ్మల్లా గుండరు. బలంగా, దృఢంగా యవన కళాకారులు చెక్కిన కళాఖండాలులా వుంటారు.

పల్లెలో అవివాహితుల చావడికి నేను నాయకుణ్ణి. ఊరంతటికీ ఒక నాట్యశాల వుంది. మా చావడిలో కూడా ప్రత్యేకమైన నాట్యశాలవుంది. పెద్ద నాట్యశాలల్లో నృత్యగానాదులు జరగనప్పుడు మా ప్రత్యేకమైన నాట్యశాలల్లో అవివాహితులం నృత్యోత్సవాలు జరుపుకొనేవారం. నృత్యాలతో అలసి, విసిగిపోయినప్పుడు వినోదకరమైన కథలతో ప్రొద్దుపుచ్చుకునేవారము. కులూపా చెప్పిన కథల్ని చెబుతూండే వాణ్ని! విజ్ఞానాత్మకమైన కథల్ని చెపితే వాళ్ళేమాత్రమూ అనురక్తిని కనపర్చక నిద్రపోయేవారు. రాక్షసులకూ, మంత్రతంత్రాలకూ సంబంధించిన కథల్ని చెబుతూ వుంటే చాలా ఇష్టంగా వినేవారు. అక్కడి వయస్కులకు శృంగారవీర రసోత్పాదకమైన కథలు బాగా నచ్చుతాయి. పిల్లలకు దయ్యాలకూ, భూతాలకూ సంబంధించిన కథలన్నా—సాహసోపేతమైన కథలన్నా చాలా ఇష్టం!

అక్కడి పిల్లలకు తరుణులకూ కూడా బహుమానాలను, డబ్బునూ గురించి చెప్పడం చాలా కష్టం. వాళ్ళకు నాణాల్లేవు. వెండి బంగారాలు కూడా లేవు. కనుక బహుమతులుగా ధనాన్ని ఇచ్చి పుచ్చుకోవడాలు వారికి తెలియవు. శ్యామాంగికి ఇంకా వివాహం కాలేదు. కనుక అవివాహితుల చావడిలోనే వుంటుండేది. నాకు అక్కడి ఆచారాలనూ, భాషనూ నేర్పడానికి శ్రద్ధను కనబరచింది. చాలా పరిశ్రమను చేసింది. ఒకరోజున తనకు మహోపకారాన్ని చేసిన యువకుణ్ని తిరస్కరించిన ఒకానొక యువతి కథను చెప్పాను.

శ్యామాంగి ఇలా అంది: "అలాటి స్త్రీ నిజంగా పాషాణ హృదయయై వుంటుంది!"

నేనిలా అన్నాను: "ఎవరి హృదయంలో ఏముందో చెప్పలేము. కొంతమంది నిజంగానే పాషాణలాంటి హృదయాన్ని కలిగివుంటారు!"

వదినె తనుకూడా అచ్చం శ్యామాంగిలా తయారైంది. వదినె శ్యామాంగి ఇద్దరూ మహా సౌందర్యవతులు. వదినె పాలరాతితో చెక్కిన యవన కళాఖండంలా వుంటుంది. శ్యామాంగి నల్లరాయితో చెక్కిన యవన కళాఖండంలాగు వుంటుంది.

ఒకరోజున మేము దగ్గర్లోవున్న కొండమీదకు కట్టెలు కొట్టడానికి పోయాం. మాకు నెలల్ని గుర్తించడానికి ఎట్టి సాధనాలూ లేవు. ఐనా చంద్రుణ్నినుసరించే తారకల చల్లన మాసాల్ని, ఋతువుల్ని గమనించవచ్చు. అది వసంత ఋతువనుకొంటాను. చెట్లూ, చేమలూ రకరకాలుగా వికసించిన పుష్పచయాలతో కనులపండువుగా వున్నాయి. కట్టెలుకొట్టుకోవడం అయింది. ప్రాకృతికమైన ఆనందాన్ని అనుభవించడానికి విశ్రాంతి తీసుకొన్నాము. సింహవర్మకు ఏమో యోచన తట్టింది. వెళ్ళి పూవుల్ని ఏరుకు వచ్చాడు. వాసంతికి అభిముఖుడయి "భట్టారిక (మహారాణి) నిన్ను పూవుల్తో అలంకరిస్తాను!" అన్నాడు.

"వదినె! నాగరిక ప్రపంచంలో సులభ్యమైన కృత్రిమ పూవులతోనే నీవంత అందంగా వుండేదానివి. ఇక ఈ సహజమైన పూమాలల్ని అలంకరిస్తే ఎంత బాగుంటావో?" అన్నాను.

"ఐతే, నన్ను వన్యకుసుమాల్తో అలంకరిస్తారన్నమాట" వదినె నవ్వుతూ అన్నది.

"అవును నా వనలక్ష్మి!" అన్నాడు సింహవర్మ.

"ఆహా! ఈ వనలక్ష్మి అతిమోహనంగా అలంకరింపబడితే, ఆ మూర్తిని తుచ్ఛ పాషాణ ఖండాల్లో మలచాలని మనసవుతోంది" అన్నాను.

"విగ్రహాన్నా? జయా అప్పుడప్పుడూ నాకు నా తూలిక జ్ఞాపకానికివస్తోంది. చిత్రరచనను అసలు మర్చిపోతానేమోనని భయంగా వుంది!" అన్నాడు సింహవర్మ.

"శిల్ప రచనను ఎక్కడ మర్చిపోతానో సన్న భయం నాకూ వుంది. కానీ నే నిక్కడ రెండు మూడు ఇనుప పోగరులను తయారు చేసుకొన్నాను. ఇక్కడ రాళ్ళు ఎటూ దొరుకుతాయి, తిరిగి అభ్యాసాన్ని ప్రారంభిస్తాను!"

"ఐతే ప్రారంభించు!" వదినె అంది.

"కానీ....!" సంశయాన్ని వెలిబుచ్చాను.

"కానీ ఏమిటి?" అన్నాడు సింహవర్మ.

"వదినెగారి ఆజ్ఞ లభిస్తే....!"

"సుహ్యనగరంలో చిత్రాన్ని చిత్రీకరించినప్పుడు వదినెగారి ఆజ్ఞను మహా తీసుకొన్నట్లు?"

"అప్పుడు వదినె లేదుగా?"

వదినె మధ్యలోనే అందుకొంది. "మీరు మాట్లాడేది ఏ చిత్రం విషయం?"

"అవే........సుహ్యనగరంలో రెండు చిత్రాలను తయారుచేసి ఒకటి వాస్తవికమైందనీ మరొకటి కాల్పనికమైందనీ చెప్పలేదూ?"

"ఆఁ"

"వాటిలో వాస్తవికమైంది నీ మరిది తయారు చేసిన చిత్రం? కాల్పనికమైంది నేను తయారు చేసిన చిత్రం!" అన్నాడు సింహవర్మ.

"ఓ! అదా సంగతి! పాపం. రెండింటికి చిత్రకారులు మీరే అయ్యారు? ఔనా?"

"ఔను! నీ మరిది బలవంతంవల్ల అలా కావలసి వచ్చింది!" అన్నాడు సింహవర్మ.

"ఊ, అలాగా! ఐతే, మరిది! ఇప్పుడు నీకిక దేన్నిగురించి అజ్ఞ కావాలి?"

"ఈ వనలక్ష్మిని రాతిమీద మలచడానికి ఆజ్ఞ కావాలి!"

"నాకో అభ్యంతరం వుంది సోదరా!" అన్నాడు సింహవర్మ.

"ఏమిటి, సోదరా! ఆ అభ్యంతరం?" అడిగాను.

"అదే....నీ పాటికి నీవు శిల్పాన్ని తయారుచేస్తావు. ఈ పల్లీయులవద్దకు పోయి, మా వదినె ఏ చెట్టునో, మొక్కనో ముట్టుకొన్నది. అందువల్ల ఇలా శిల అయిపోయిందంటావు. పాప మీ పల్లీయులు నమ్ముతారు!"

వదినె మధ్యలోనే అందుకుంది "ఎలా నమ్ముతారు? నేను ప్రాణాల్తో కనుపిస్తూనే వున్నాగా?" అంది.

"ఆ వదినె కాదు. ఆమె పాషాణ ప్రతిమ అయింది. ఈమె మరొకామె! అంటారు" అన్నాడు సింహవర్మ.

"అయినా నీకేం నష్టముండదుగా!" అన్నది వదినె.

"నాకేమీ నష్టముండదు, కానీ, నీకు మాత్రం చాలా నష్టముంటుంది. నిన్నిదే ఆకారంతో తమ్ముడు శిల్పం చెక్కుతాడు. ఇప్పుడీ నారవస్త్రం తాత్కాలికం. ఇక నప్పుడు శిల్పంలో శాశ్వత నారవస్త్రధారణి వైపోతావు!"

"అయితే ఇక నే చెప్పేదికూడా విను వదినా! వనలక్ష్మిని ఇదే రూపంలో చెక్కడం బాగుంటుందని నా అభిప్రాయం. పూవుల్తోనిండిన తుమ్మెదల్లాంటి వెంట్రుకలు, చెవులను అలంకరించిన శ్రవణ పూలూ, కంచు కంఠం, సుందరమైన కపోలాలు............లతా బాహువులు...."

"శ్రీఫలాల్లా ఉన్నతమైన ఉరోజం, సన్నని నడుము, నారవస్త్రాల లోపల వున్న అరటి స్తంభాల్లాంటి............ఊ అన్నీ చెప్పు! ఇలా అప్పుడప్పుడు వదినెగార్ని చాస్తూండటంతో నీకు తృప్తి కలగలేదనుకొంటాను. ఆమె నగ్నసౌందర్యాన్ని శిల్పరూపంలో చెక్కి నీవు సంతృప్తిగా చూచుకోవడమే కాకుండా, అనంత కాలాల వరకూ మానవ జాతంతటికీ చూపాలని నీ ఉద్దేశ్యం !" అన్నాడు సింహవర్మ.

"అలాటి అభిప్రాయం వుండడంలో ఏమీ దోషం కనుపించడం లేదే నాకు?"

"సరె........సరె........ వదినె మరదులకు ఇష్టమైతే మధ్య నాకేం నష్టం"

"వదినె ప్రక్కనే నీ రూపాన్నికూడా మలచాలని నా అభిప్రాయం!"

"ఒక షర్తుమీద నా రూపాన్ని మలచటానికి ఒప్పుకొంటాను. మా ఇద్దరి ప్రక్కనా నీ రూపంకూడా వుండాలి!" అన్నాడు సింహవర్మ,

"కానీ నా రూపాన్ని నేను చూసుకోలేనుకదా!"

"నీళ్ళల్లో చూసుకొనేది!" వదినె ఉపాయాన్ని చెప్పింది.

"వదినెగారి ఆజ్ఞను పాలించడానికి ప్రయత్నిస్తాను. ముందుతరాల ప్రజలు సీతారామ లక్ష్మణులు ఇక్కడే వనవాసం చేశారని అనుకొంటారు. అదొక లాభ ముంది ఇందులో!"

ఎదురుగా ఆకారాల్ని కూర్చోపెట్టుకొని శిల్పాన్ని మలచడం చాలాసులువు. కానీ, అలా చేయాలంటే వ్యక్తులు మూడు నాలుగు నెల్లవరకూ రోజూ యెదురుగా కూర్చొంటూ వుండాలి. వారిని చూడడానికి ప్రేక్షకుల గుంపొకటి తయారవుతోంది. ఈ అభ్యంతరాలన్నీ లేకుండా వుండడానికి మొదట మట్టితో ఆకారాల్ని తయారు చేసుకొన్నాను. తరువాత సమయం దొరికినప్పుడల్లా పోగరా, గొడ్డలీ తీసుకొని ఈ కొండ ప్రాంతానికివచ్చి శిల్పం చెక్కుతూండేవాణ్ణి.

వదినె శిల్పం తయారయింది. సింహవర్మ శిల్పం పై భాగం తయారైంది. కాళ్ళు చెక్కాలి. ఒకరోజున శిల్పం చెక్కుతుండగా యెదురుగా వున్న పొదరో నుండి యెవరివో రెండుకండ్లు నన్ను చూస్తూండడం గమనించాను. నేను తలయెత్తి చూడగానే ఆ కండ్లు మాయమయ్యాయి. ఆ కండ్లు నాకు పరిచితమైనవే! పేరు పెట్టి పిల్చాను. 'శ్యామాంగీ' ఆమెన్నేను శ్యామాంగి అనే పిల్చేవాణ్ణి. ఆమె పలి కింది "ఆఁ!"

నే నామెను పిల్చాను. ఆమె పొద చాటునుండి యివతలకు వచ్చింది. శ్యామాంగి చాలా రోజులుగా నేను ఒంటరిగా వెళ్ళే ప్రదేశం గురించీ, చేసే పనిని గురించీ తెలుసుకోవాలను కొంటున్నది. చివరకు నా రహస్యాన్ని పట్టేసింది. శ్యామాంగి వదినె రూపాన్ని చూస్తూ నిలుచుంది, "ఎవరిదీ రూపం?" అనడిగాను.

"వాసంతి సోదరిది" "మరి రంగు అలాలేదే?"

"నేను ఒట్టిరూపాన్ని మాత్రమే చెక్కగలను. రంగును తీసుకురాలేను. రంగునుకూడా తీసుకురాగలిగితే దేవుణ్ణే అయ్యేవాణ్ణి. అది సరేనూ నీవు మరెవరి కయినా చెప్పావా?" అనడిగాను.

"నే నెవ్వరికీ చెప్పలేదు. ఒంటరిగా ఏమీ తోచడంలేదు. నిన్ను వెతు క్కుంటూ అలావచ్చాను. అంతే!"

"సరే నేను కనుపించానుగా మరింకేమిటి ఉద్దేశం?"

"మీరు రాతిరో మానవరూపాన్నెలా చెక్కుతారో చూడాలని నా ఉద్దేశ్యం!"

"మరి శ్యామాంగీ! నీ రూపాన్ని కూడా యిక్కడ చెక్కితే? యెలా వుంటుంది ?"

"నన్ను చెక్కుతావా? కానీ, నేను నల్లగా వున్నాగా ?"

"ఈ రాయికూడా నల్లనిదే. కనుక నీరూపం చాలా చక్కగా ఉత్కీర్ణమౌతుంది. కానీ నీ రూపాన్ని చెక్కాలంటే నీవు రోజూ ఇక్కడకు వస్తుండాలి!"

శ్యామాంగి రోజూ నాతోపాటు వచ్చేది. మొదట రేఖలను గీసుకున్నాను. తరువాత శరీరపు వంపుల్ని చెక్కసాగాను. నేను రోజూ శ్యామాంగిని చూస్తుండే వాణ్ణి. అయినా, ఆమె నాకు నిత్యనూతనంగా కనుపించేది. నేను ఒకమాటు శ్యామాంగి ముఖాన్నిచూసి, ఇక నా ఆకారాన్ని తలవంచుకు చెక్కుతుండేవాణ్ణి. కాని శ్యామాంగి మాత్రం అనిమేషయై నన్ను చూస్తూవుండేది. శ్యామాంగి కండ్లు చాలా అందంగా వుంటాయి. ఆ కండ్లను చెక్కేప్పుడు నన్ను నేను వశంలో వుంచుకొనలేకపోయాను. "శ్యామాంగీ! నీ కండ్లు చాలా అందంగా వుంటాయి!" అన్నాను.

"కానీ, నేను చూచుకోలేనుగదా నా కండ్లు ?"

"కానీ, నేను చూడగలను. చాలా అందంగా వుంటాయి. ముద్దు పెట్టుకోవాలనిపిస్తూంది."

శ్యామాంగి మౌనంగా తన కండ్లను నా నోటిదాపుకు తెచ్చింది. ముద్దు పెట్టుకున్నాను. తనూ నా కండ్లను ముద్దుపెట్టుకుంటూ "జయా! నువ్వు చాలా అందగాడివి. నిన్ను ఎన్నాళ్ళనుండి ప్రేమిస్తున్నానో?" అంది.

"కానీ, నీవు ఎన్నడూ నాతో ఈ మాటను అనలేదేం?"

"మా పల్లెలో ఆడపిల్లలు ముందుగా తమప్రేమను వెల్లడించరు!"

"అయితే, నీ ప్రేమను తెల్సుకోలేకపోవడం అపరాధమే!"

"కొంతమంది యువకులు సంకోచ స్వభావం కలిగివుంటారు !"

"ఇక నేను ఎన్నడూ సంకోచపడను."

కొద్దిరోజులుగా సింహవర్మనూ, వదినెనూ అటు రాకుండా చేశాను. మూడు శిల్పాలూ తయారయ్యాక వద్దురుగాని అని చెప్పాను. ఈరోపు శ్యామాంగికీ, నాకూ చాలా ఘనిష్ఠత ఏర్పడింది. చివరకు మా ప్రేమకలాపాల సంగతి వదినెకు కూడా తెలిసింది. ఒకరోజున వదినె ఇలా అంది: "మరదీ! మా చెల్లెల్ని తెచ్చిచూపరాదా! ఈ పాపిష్టి కండ్లతో చూస్తాంగా!"

"ఈ పల్లెలో చెల్లెల్ని (మరది భార్యను) చూడాలన్న కోర్కె ఏమిటి, వదినా!"

"నా మరిది ఈమధ్య చాలా ఉత్సాహంగా, ఆనందంగా వుంటున్నాడు...."

"వెనక యెన్నడూ నన్ను ఉత్సాహంగా, ఆనందంగా చూడలేదా?"

"అప్పటికీ ఇప్పటికీ వ్యత్యాసం వుంది. నీవు చాలా సంతోషంగా వుంటున్నావు! నీవు చూపకపోయినా నా చెల్లెల్ని నేను వెతుక్కొన్నానులే !"

"వెతుక్కోవాలి మరి! తోడికోడళ్ళ సఖ్యత అంటే అలావుండాలి!"

"పాటలీపుత్రపు తోడికోడళ్ళకు సఖ్యత అవసరం! వారెప్పుడూ అసఖ్యతగానే వుంటారు. సుహ్యనగరపు ఆడపడుచులు అలాంటివారు కాదు! నాకు నచ్చిన తోడికోడల్ని నేను తెచ్చుకున్నాను. నాకు నచ్చింది నా మరదికికూడా తప్పనిసరిగా నచ్చుతుందని నా అభిప్రాయం!"

"నాకేమీ అర్థం కావడంలేదు!"

"అర్థం కావడానికేముంది? ఇక నీవా 'ఉమ్మడి చావడి'లోనుండి లేచి, మా ప్రక్కన ఒక గుడిసె వేసుకో!"

"ఇల్లూ, వాకిలీ, సంసారం కాదు వదినా! మనం అన్యజాతీయులం కదా? వాళ్ళు శ్యామాంగులు. పూర్ణస్వతంత్రులు. ఎవరినీ తమకంటె గొప్పవారని ఒప్పుకోరు. తమ మనసుకు నచ్చిన విధంగా ప్రవర్తిస్తారు. అలాంటప్పుడు వారభిప్రాయం ఏమిటో తెల్సుకోనవసరంలేదా?"

"ఆ విషయంలో నీవేమీ బెంగపెట్టుకోకు మరదీ! నేను శ్యామాంగి తల్లిని ఒడబరిచాను. పల్లెలోని తరుణ స్త్రీలందరూ మీ వివాహం కోసం యెదురు చూస్తున్నారు!"

"కానీ, తుదినిర్ణయం పురుషుల్దేమో?"

"శ్యామాంగి తండ్రి గ్రామపెద్ద. ఇష్టపడ్డారు. ఇక నీ సహచరులయిన యువకుల విషయం వేరే అడగనే అవసరంలేదు!"

"మరి నీ అభిప్రాయం ఏమిటి?"

"అభిప్రాయానికేముంది? వచ్చే పౌర్ణమినాడు!"

ఈ పల్లీయులు ఎన్నడూ గౌరాంగ ప్రజల సంపర్కంలోకి రాలేదు. బాగా వృద్ధులైనవారి హృదయాల్లో గౌరాంగ ప్రజలమీద ద్వేషం ఏ మాత్రమూ లేకపోలేదు. అడవిలో అక్కడక్కడా శ్యామవర్ణ ప్రజల పల్లెలు వున్నాయి. ఒకపల్లెకూ, మరొక పల్లెకూ మధ్య మిత్రత, బంధుత్వం వుండడం సహజం. కనుక పల్లెనుండి మరొక పల్లెకు వార్తలు వ్యాపించడం కూడా సహజం. గౌరాంగ ప్రజల్లోని దోషాలు కొద్ది గొప్ప పాళ్ళలో ఈ పల్లెలన్నింటిలోనూ ప్రచారంలో వున్నాయి. ఇంకా నయం, గౌరాంగ ప్రజల దేశాల సరిహద్దుల్లోవున్న పల్లెల్లోనే మేము చిక్కుపడ్డట్లయితే మాకు మరొకరకమైన స్వాగతం లభించేది.

ఒకరోజున మేము భార్యాభర్తలమైనామని ప్రజలముందు ఒప్పుకొన్నాము. ఆ రోజు గ్రామపెద్ద, ఇతర స్త్రీ పురుషులందరూ గొప్పగా ఉత్సవం జరిపారు. రాత్రంతా పానగోష్ఠి, నృత్యప్రదర్శనలూ జరిగాయి. వివాహిత స్త్రీ పురుషులకు, గుడిసె వేసుకోవడంలో గ్రామ ప్రజలందరూ సహకరిస్తారు. మా గుడిసె ఒకే రోజులో తయారయింది. సింహవర్మ గుడిసె ప్రక్కనే, అందమైన చిన్నగుడిసెలో మేమిద్దరమూ భార్యాభర్తలుగా ప్రవేశించాము. వదినె నవ్వుతో పరిహాసంగా ఇలా అన్నది: "ఇదే మా సుహ్యనగరంలో జరిగినట్లయితే, మరిదిని శోభనపు పెండ్లి

కొడుగ్గా అలంకరించే బాధ్యత, గదిలోకి పంపించే ఏర్పాట్లూ నేను చేసేదాన్ని."

"మరి ఇక్కడ మొత్తం వివాహపు బాధ్యతను నీవే స్వీకరించావుగా?"

"మన నగరాల్లో జరిగే వివాహాల ఆనందం అవర్ణనీయం! ఆ పెండ్లిళ్ళు ఇలా వుండవు!" అన్నది వదినె.

"మరి మనం, వదినె మరుదు లిద్దరమూ ఆ ఆనందానుభూతికి దూర మయ్యాము. నీ పెండ్లి సముద్రంలోనూ, నా పెండ్లి యీ తాటియాకులమధ్యా జరిగింది. కాని నాగరిక వివాహాలకంటే యిక్కడి వివాహాల్లో ప్రేమ-ఆనందపుపాళ్లు తక్కువగా వుంటాయని అనుకోను. నిజం చెప్పాలంటే ఇక్కడి ప్రేమే నామటుకు నాకు చాలా పవిత్రమూ, మధురమూ, అకృత్రిమమూ అనిపించింది. పాటలీపుత్రపు రాజాంతఃపురంలో కూడా ఎంతోమంది నన్ను ప్రేమించడానికి ఆరాటపడ్డారు. కాని వారి ప్రేమలో హృదయపుపాలు తక్కువ. బాహ్యాడంబరపుపాలు ఎక్కువా కనిపించింది. అందువల్లే నే నక్కడ ఎవరి ప్రేమనూ స్వీకరించలేక పోయాను. ఇక్కడ ఈ శ్యామాంగి ఆ నాగరికుల్లా కృత్రిమ నటనల్ని ఏమాత్రమూ చేయలేదు. ఆమె కండ్లల్లో స్వచ్ఛమైన, సరసమైన ప్రేమ మాత్రం కనిపిస్తూంటుంది. ఆ ముఖంలో ఒక సుమధురమైన, మనోహరమైన ఆకర్షణ వుంది. ఆ ఆకర్షణ నన్ను తనకు అభిముఖుణ్ణి చేసుకొంది."

"నువ్వుకూడా శ్యామాంగిని గొప్పగా ఆకర్షించావు మరిదీ! నీకోసం ప్రాణాల నయినా అర్పించడానికి సిద్ధంగా వుంది."

"మన నాగరిక జీవితంలో, మనిషి మనిషికీ, స్త్రీ పురుషులకూ జాతి జాతికీ, వర్గ వర్గానికీ మధ్య అడ్డుగోడలు ఏర్పడ్డాయి. ఆ అడ్డుగోడలే లేకపోయినట్లయితే మన జీవితాలుకూడా చాలా పవిత్రంగా మధురంగా వుండేవను కొంటాను!"

"అంటే నీ ఉద్దేశ్యం సుహ్యా నగరంలో కూడా నే నిలా అర్ధనగ్నావస్థ లోనూ, మీ రిద్దరూ దిగంబరులుగానూ వుండాలనేనా?"

"అదికాదు నా భావన! మనం అభ్యసించిన, ఉపార్జించిన, పెంపొందించు కొన్న జ్ఞానాన్నీ, కళల్నీ, అభిరుచుల్నీ—మరచిపోమనీ, విసర్జించమనీ నేను చెప్పడంలేదు. వాస్తుకళా, లేఖనకళా, సాహిత్య సృజనం....ఇవి మానవ జీవితానికి విస్మరించలేని మహోపకారాన్ని చేశాయి. వీటిని విస్మరించడమో, తిరస్కరించ డమో చేస్తే మానవుడు తన ప్రౌఢత్వాన్ని కోల్పోయి, అజ్ఞానంతో కూడిన బాల్యా వస్థకు పోతాడు. సరిగా ఈ పల్లీయులు కూడా అలాటి అజ్ఞానంతో కూడిన బాల్యా వస్థలోనే వున్నారు. అజ్ఞానమంటే నాకు బొత్తిగా సరిపడదు. కానీ, ఈ అజ్ఞానుల్లో వున్న సమానత్వం, సహకార భావనా, సరళత్వం—నన్ను బాగా ఆకర్షిం చాయి!"

"అవును, మన విజ్ఞానమూ, కళలూ, అభిరుచులూ ఒకవైపు నుంటాయి. మరో వైపున వీరి అకృత్రిమమైన జీవితం!"

"మరి వీళ్ళ అజ్ఞానాన్ని పోగొట్టాలంటే, నూతనమైన విజ్ఞానాన్నీ, కళల్నీ అభ్యసింప చేయాలి. విజ్ఞానాన్నీ, కళల్నీ అభ్యసిస్తే వీళ్ళూ మనలాగానే తయారౌతారు! వీళ్ళలోనూ ధనికులూ, బీదలూ తయారవుతారు!"

"అది కాదు మరదీ! ధనికులూ, బీదలూ ఈ వ్యత్యాసం అనాదినుండి, వుందిటగా?"

"అవన్నీ అసత్యాలు! ఇలాటి అసత్యాలను గ్రంథస్థంచేసిన గ్రంథకర్తలు, కావాలని అసత్యాలను వ్రాసయినా వుంటారు లేదా వారికి ధనికులయొక్క మోసాలూ అన్యాయాలూ తెలియకుండానైనా వుంటాయి. ఈ పల్లెలో ఎవడేనా ధనికుడు కావటానికి వీలుందా? పొలంవుంటే అది ఊరి మొత్తానికీ వుంటుంది. ప్రజలు తమకు అవుసరమైనంత భూమిని తీసుకొని దున్నుకుంటారు. ఒకడికి పరిశ్రమ చేసినప్పటికీ ఫలించకపోతే, పొరుగువాడు తాను యివ్వడానికి సిద్ధంగా వుంటాడు!"

"నీవు చెప్పినట్లుగా వుంటే చాలా బాగుంటుంది మరదీ! ఇక్కడి జీవితం అనేక విషయాల్లో స్వతంత్రంగా, ఆనందదాయకంగా వుంది. కానీ, ఈ అజ్ఞానం అసహాయస్థితి బాగుండలేదు."

"అజ్ఞానం, అసహాయస్థితి—నాకూ నచ్చవు వదినా!"

* * * *

ఒక సంవత్సరం తరువాత మేమూ పల్లీయుల భాషను చక్కగా అభ్యసించాము. అక్కడి ప్రజల్లాగానే వాళ్ళ భాషకూడా చాలా సహజంగా వుంటుంది. మేము ఎక్కడ వుంటున్నామో తెలుసుకోవడానికి చాలా ప్రయత్నించాము. కానీ, తెలుసుకోలేక పోయాము! ఆపల్లీయులు చెప్పే పేరును మేము ఎక్కడా గ్రంథాల్లో గానీ, ఇతరంగాగానీ చదవనూలేదు, విననూలేదు. అక్కడికి ఒక్క ఇనుమ్మాత్రం ఇతర ప్రాంతాలనుండి వస్తుంది. ఇక్కడికి ఇనుము సరఫరా చేసేవారుకూడా శ్యామాంగులే! ఇనుము ఎక్కడనుండి తెస్తారని వాళ్ళ నడిగితే"మాలాటి శ్యామాంగులే ఇనుమును తయారు చేస్తారు!" అని చెప్పేవారు. వాళ్ళు ఇంతవరకూ ఎన్నడూ గౌరవర్ణ ప్రజల్ని చూడలేదు. మా ఓడ తాలూకు శవాలే వాళ్ళు ప్రథమంగా చూసిన గౌరాంగులు. ఐతే గౌరాంగుల్ని గురించి లీలగా కొన్ని విషయాలు వాళ్ళకూ తెల్సు. ఇక మేము ఎక్కడున్నామో తెలుసుకోవడం అసంభవమని నిశ్చయించుకొన్నాము. ఒక్కొప్పుడు ఇనుము తయారు చేసేవాళ్ళ స్నేహం సంపాదించి, వాళ్ళతోవెళ్ళి బయటి ప్రపంచపు ఆచూకీ తీద్దాం అనుకొనే వాళ్ళం. కానీ, అలా వెళ్ళితే తిరిగి ముగ్గురం ఏనాటికైనా కలుసుకొంటామో లేదోఅన్నది సంశయం! అందరం కలిసి ఒకేసారి వెళ్ళిపోతే పల్లీయులకు చాలా దుఃఖాన్ని కలిగించిన వాళ్ళమవుతాము. ముఖ్యంగా శ్యామాంగికి చాలా దుఃఖం కలుగుతుంది. కానీ, మరో మార్గం ఏది?

# తిరిగి నాగరికుల్లో

మా పూర్వ జీవితపు జ్ఞాపకాలు వేధిస్తూన్నప్పటికీ మేమా పల్లెల్లో చాలా సుఖకరమైన జీవితాన్ని గడిపామనే చెప్పాలి. నేనూ సింహవర్మా సముద్ర తీరానికి పోయి చేపలు పట్టేవారం. వ్యవసాయపు పని పాటల్లో నడుము వంచేవాళ్ళం. వాసంతీ, శ్యామాంగీ పల్లెలోనే వుండి తమకు తగిన పనులేవో చేస్తూండేవారు. వాసంతి వదినె త్వరలోనే జనపనారతో వస్త్రాలల్లడం నేర్చుకుంది. వెనుకటి పరిచయా న్ననుసరించి ఆ వస్త్రాలమీద లతల్నీ, తీగల్నీ, హంస మిథునాల్నీ అల్లేది. చాలామంది యువతులకు ఇలా హంస మిథునాల నల్లడం నేర్పిందికూడాను.

పని పాటలవగానే పల్లెలోని స్త్రీ పురుషులందరము అడవికి లేక సముద్ర తీరానికి విహారార్థం వెళుతుండేవారం. మేము మా ప్రేమికులను ఒక్కొక్కప్పుడు పూవుల్తోటీ, మరొకప్పుడు నత్తగుల్లలు, ముత్యపు చిప్పలు కలిపి గుచ్చిన హారాల తోటి అలంకరించేవారము. నా వేణువు ఎప్పుడూ నా దగ్గరే వుండేది. ఇప్పుడు భాషా సంబంధమైన ఇబ్బంది నాకేమాత్రమూ లేదు. నేను వెనకే మాగధీ భాషలోని, సంస్కృత భాషరోని చాలా కావ్యాలను పఠించాను. మాగధీ, సంస్కృత భాషల కంటే ఈ పల్లీయుల భాషరో శబ్దాలూ, ధాతువులూ చాలా తక్కువ. వాక్య నిర్మాణంకూడా చాలా సహజంగా వుంటుంది. మానవుడు తన అంతర్వేదనను ప్రకటించుకోవడానికి ఏ కొద్దిపాటి శబ్దభాండారమైనా సరిపోతుందేమో! ఒక్క యువకుడు అజ్ఞాతకవి రచించిన (కూర్చిన అంటే సమంజసంగా వుంటుంది.) గేయకథను గానం చేశాడంటే ఇక కన్నీరాపు కోవడం అసంభవం అవుతుంది. ఆ గేయకథానిక భావం ఇది: ఒక యువకుడు తన పడవలాటి చెక్క సాధనంమీద చేపలు పట్టడానికి వెళ్ళాడు. అకస్మాత్తుగా తుఫానొచ్చింది. చెక్కసాధనం అంతకంతకూ సముద్రం రోకి వెళుతోంది. ఆ యువకుడు కన్నీరు కారుస్తూ ఇలా విలపిస్తాడు: "సముద్రుడా! నేను మృత్యువుకు జడవను! ఓ వాయుదేవుడా, నేను నీ ప్రకోపాన్ని చూసి భయపడి కన్నీరు కారుస్తున్నానని అనుకోకండి! పల్లెరో వున్న నా ప్రేయసి కోసరం నేను విలపిస్తున్నాను. తోటి పల్లెకారు లందరూ వలల్ని భుజాన వేసుకొని పల్లెకు వెళ్ళారు. నా ప్రేయసి నా కోసరం వాళ్ళందర్నీ అడుగుతుంది. కానీ, ఎవరు ఏమీ సమాధానం చెప్పరు. చెప్పలేరు! నేరుగా ఈ సముద్రం వద్దకు పరుగెత్తుక వస్తుంది. నీలి అలల్ని చూస్తుంది. శూన్యదృక్కుల్తో తన గుండెలు వక్కలయ్యేట్టు అరు

స్తుంది. ఆ విలాపాన్ని వినలేక, ఓ గంభీర సాగరరాజా! నీ హృదయం కూడా కల్లోలిత మవుతుంది!" ఇలా గుంటాయా గేయకథానికలు.

ఈ సుఖమయ జీవితానికి అనుకోకుండా అంత్యం సమీపించింది. ఒక వారం రోజుల ముందు సూచన ప్రాయంగానైనా, ఇలా జరుగుతుందని తెలిసి నట్లయితే కొంత జాగ్రత్త పడడమో, కనీసం ఈ ఆకస్మిక పరిణామానికి మేము సిద్ధం కావడమో చేసేవారము.

ఒకరోజు సాయంత్రం అపరిచితులైన ఐదుగురు శ్యామల వర్ణులు మాపల్లె వైపు వస్తూండడం చూశాం. అన్యశ్యామాంగ ప్రజల్లాగానే వారూ నార వస్త్రాలను కట్టుకున్నారు. చేతుల్లో బల్లాలున్నాయి! భుజాలకి బాణాలు వ్రేలాడు తున్నాయి. వీపున బాణాల్తో నిండిన తూణీరా లున్నాయి. వస్తూన్న ఆగంతకులను చూస్తూ నిల బడి వున్నారు పల్లెలోని యువకులు.

సరీగా అదే సమయాన శ్యామాంగి నా వడిలో పడుకొని వుంది. అప్పు డామె గర్భిణి, నెలలు నిండాయి. ఆమె చెంపలను మెల్లగారాస్తూ "ఆడపిల్లే పుడు తుంది!" అన్నాను.

శ్యామాంగి నా వైపు అదోరకంగా చూస్తూ "కాదు, మగపిల్లవాడే అచ్చం నీలా వుంటాడు" అంది. ఇంతలో మా పల్లెలో యువకులు పెద్ద పెద్దగా మాట్లాడు కోవడం విన్నాము. మా ఏకాంతత భంగమైంది. మిగిలిన యువకులు చూస్తున్న ఆ ఆగంతకులవైపు నేనూ చూడసాగాను. శ్యామాంగి లేచి నిలబడ్డది. నేను మిగి లిన యువకులవద్దకు వెళ్ళాను.

ఆ ఐదుగురిలో ముందున్న అతని నెత్తిన రకరకాల పక్షి ఈకలు అలంకర ణార్థం అమర్చబడి వున్నాయి. అతడు మొదటగా ఎదురైన వ్యక్తిని ఏమో అడి గాడు. తరువాత గ్రామపెద్ద గుడిసె వద్దకు పోయారు. కొంతసేపు మాట్లాడిన అనంతరము సింహవర్మా, నేను మినహా గ్రామంలోని పురుషు లందరూ గ్రామపెద్ద గుడిసె వద్దకు పిలిపించబడ్డారు! ఇలాంటి ప్రత్యేకతని ఇంతవరకు ఎప్పుడూ మా పట్ల ప్రదర్శించలేదు. అయినప్పటికీ మేము ఏ అరిష్టాన్నీ ఊహించుకొనలేదు. ఎవరి గుడిసెలో వాళ్ళం ప్రశాంతంగా నిద్రపోసాగాము. ఎవరో మమ్మల్ని పిలు స్తున్న కేకల మూలంగా మా నిద్రకు భంగం కలిగింది. గుడిసెబైట మా మిత్రులు, ముగ్గురు యువకులు నిలబడి మమ్మల్ని బయటకు పిల్చారు. సింహవర్మా నేనూ మా గుడిసెల్లోనుండి బయటకి వచ్చాము. దూరంగా ఏకాంత ప్రదేశానికి వెళ్ళి కూర్చు న్నాము. ఆ యువకులు మాతో ఏమో చెప్పాలనుకొంటున్నారు. కాని, చెప్పలేక పోతున్నారు. అతి కష్టంమీద వారు చెప్పిన విషయం ఇది: "ఆ ఐదుగురు ఆగంత కులూ ఉత్తర దిశనవున్న మా శ్యామాంగజాతి తరపున ప్రతినిధులుగా పంపబడ్డారు. వారు ఉత్తరదేశంలోని సమస్త శ్యామాంగ ప్రజల తరఫునా తెలియపరచిన విష యం-ఉత్తర దేశపు సరిహద్దుల్లోవున్న గౌరాంగ సర్దారులు, శ్యామాంగ ప్రజల

మీదా, వీరి పల్లెలమీదా, దురాక్రమణలు చేస్తున్నారు. శ్యామాంగ ప్రజల పల్లెలను తగుల బెడుతున్నారు. పురుషుల్ని వధిస్తున్నారు, స్త్రీలనూ బాలుర్నీ బంధిస్తున్నారు! ప్రస్తుతం ఉత్తర దేశపు సమస్త శ్యామాంగ ప్రజలూ గౌరాంగుర్తో దీర్ఘమైన పోరాటాన్ని జరుపుతున్నారు. ఈ సందర్భంలో ఈ పల్లెలో ముగ్గురు గౌరాంగులు వున్నారని తెలియవచ్చింది. తక్షణం వారిని మీ పల్లెనుండి వెడల 'గొట్టాలి!-లేకపోతే సమస్త శ్యామాంగజాతి మీ పల్లెను శత్రుపల్లెగా భావించడం జరుగుతుంది" అని చెప్పారా ఆగంతకులు.

పల్లె ప్రజలందరూ మమ్మల్ని అతిగాఢంగా ప్రేమించారు. యువకులీ విషయాన్ని రుద్ధకంఠంతో తెలియపరచారు. అంతిమ నిర్ణయాన్ని వినడానికి గ్రామ పెద్దను కల్సుకోమన్నారు. సింహవర్మ వెళ్ళి నిద్రిస్తున్న వాసంతి వదినెను లేపాడు. పరిస్థితినంతా చెప్పి ప్రయాణానికి సిద్ధం కామన్నాడు.

తరువాత మేమిద్దరమూ గ్రామపెద్ద గుడిసె వద్దకు వెళ్ళాము. అక్కడ కొంతమంది వృద్ధులూ, ఆగంతకులూ వున్నారు. గ్రామ పెద్ద ఆగంతకుల్ని మాకు పరిచయం చేశాడు. అప్పుడు ఆగంతకుల నాయకుడు ఇలా అన్నాడు. "యువకులారా! ఈ పల్లె వచ్చాక విన్న విషయాల దృష్ట్యా మీరు చాలా వుత్తములైన గౌరాంగులని అర్థంచేసుకొన్నాము— గౌరాంగుర్లో ఉత్తమత్వం పొసగడం పూర్తి అసంభవమైన విషయం. గౌరాంగులు అన్యుల ధన ధాన్య సంపదలను, వన ప్రదేశాల్లను అపహరిస్తారు. అన్యజాతియొక్క స్త్రీ బాల వృద్ధులను పట్టుకుపోయి బానిసల్ని చేసుకొంటారు. అబద్ధమాడతారు. దేవతల భయం, పెద్దలభయం వారికసలు లేనేలేదు. ఇన్ని పాపాలు చేస్తారు గనుకనే వారి శరీరంమీద పుణ్యమనే శ్యామవర్ణంపోయి పాపమనే గౌరవర్ణం మాత్రం మిగిలింది. కాని, మీరు మంచి వాళ్ళు! అయినా మేము చేయగలిగింది, ఏముంటుంది? ఉత్తర దేశంలో గౌరాంగ ప్రజలు వేల సంఖ్యలో శ్యామాంగుల్ని వధిస్తున్నారు. వారు శ్యామవర్ణుల్ని అసలు లేకుండానే చేయడానికి ప్రతిజ్ఞపట్టారు. అలాంటి స్థితిలో మీకు మేము చేయగలిగిన సహాయం, ఇక్కడినుండి భద్రంగా వెళ్ళడానికి అనుజ్ఞ ఈయడమేను! మిమ్ములను ఇలా ఇక్కడనుండి వెళ్ళగొట్టడంవలన అందరికీ దుఃఖం కలుగుతుంది. మాకూ దుఃఖం కలుగుతుంది. కానీ, ఇంతకంటే ఇంకేమీ చేయగలిగిందిలేదు. మీరు సముద్ర తీరాన్ననుసరించి, దక్షిణ దిశగా వెళ్ళండి. ఒక పల్లెనుండి మరొక పల్లెకు మార్గం చూపడానికి, ప్రతి పల్లెలోనూ మార్గదర్శకు లుంటారు. ఉత్తరదేశం పోరాటం వార్త ఇంకా దక్షిణదేశానికి ప్రాకలేదు. అందువల్ల మీకు ఎలాటి ఉపద్రవమూ సంభవించదు. ముందు పల్లెవరకూ మార్గం చూపడానికి మా మనుషులు వస్తారు. వెళ్ళండి!" అన్నారు.

నా వరకూ నేను మృత్యుదండనను వినిపించినట్టుగా బాధపడ్డాను. సింహవర్మ కూడా చాలా ఖిన్నవదను దయ్యాడు: కాని మరొక మార్గం లేదు. అక్కడ

తుంది వెళ్ళక తప్పదు. ఆ పల్లీయులూ, మేమూ ఒకరి నొకరం మనస్ఫూర్తిగా ప్రేమించుకొన్నాం. మా హృదయాన్ని వారికీ, వారి హృదయాన్ని మాకూ ఆదాన ప్రదానం చేసుకున్నాము. కానీ, మా గౌరవర్ణాన్ని శ్యామ వర్ణంలోకి మార్చుకోలేక పోయాయి. వాసంతి ప్రయాణానికి సిద్ధమై మా కోసం యెదురు చూస్తోంది. అడుగుల శబ్దం వినగానే గుడ్డల మూటను తీసుకొని బయటకు వచ్చింది.

నా గుడిసెవైపుకు పోకుండా వుండలేకపోయాను. అప్పుడే చంద్రోదయమైంది. పసుపుపచ్చని చంద్రకాంతి నిద్రిస్తున్న శ్యామాంగి ముఖంమీద పడుతోంది. నేను శ్యామాంగి ముఖాన్ని చూడలేకపోయాను. శ్యామాంగి గాఢనిద్రలో వుంది. పెదిములు చిరునవ్వు నవ్వుతున్నాయి. బహుశ సుఖస్వప్నాల్ని కంటోంది గావును. శ్యామాంగిని ముద్దుపెట్టుకోవడానికి మనసవుతోంది. కాళ్ళు ముందుకు నడుస్తున్నాయి. కానీ, వివేకం వెనక్కిలాగుతోంది! ఇప్పుడు గనక ముద్దుపెట్టుకొంటే శ్యామాంగి మేల్కొంటుంది. ఇక నాతో వస్తానని మొండికి పడుతుంది. శ్యామాంగులెవరూ ఈ విషయాన్ని అంగీకరించరు. మొత్తం శ్యామాంగజాతిని వ్యతిరేకించి మేము నిలబడడమంటే, ఆత్మహత్యా సదృశ్యమే అవుతుంది. మా ప్రేమ కోసం మావరకూ మేము బలయిపోవడానికి సిద్ధం! కానీ, మా కోసం మరొక ప్రాణిని బలి చేయడానికి మాకేమి హక్కుంది? నేను మనస్సులోనే ఇలా అనుకొని వెనక్కి తిరిగాను "శ్యామాంగీ! ఓ నా హృదయేశ్వరీ!

"నీ కివే నా తుది వీడ్కోలు....ఈ మానసచుంబనాన్ని స్వీకరించు! నిన్ను నేను విడిచిపోయినా, నీ జ్ఞాపకాలు ఎన్నటికీ నన్ను వీడవు!"

మా పథ ప్రదర్శకుడు ఒక చిన్న ఎండిన తాటిమట్టను చేతిలో తీసుకొని ముందుకు నడుస్తున్నాడు. మే మతణ్ణి అనుసరిస్తున్నాము. మా దగ్గిర గుడ్డలమూట కాక, ఎండు చాపలూ. కొన్ని పోగరలూ, ఒక చాకూ వున్నాయి. తెల్లవారేసరికి ఒక యోజన దూరం వెళ్ళాము. మేము చాలా గంభీరంగా, వుదాసీనంగా నడుస్తున్నాం. మా వెంటవస్తూన్న శ్యామవర్ణ మిత్రులకు మమ్మల్ని విడిచి వెడుతున్నందుకు దుఃఖం కలుగుతూన్నప్పటికీ, తమ జాతీయుల్నీ—ఇతర పల్లీయుల్నీ కలుసుకొంటున్నందుకు ఆనందంకూడా కలుగుతోంది. వారు మా మనస్సులను ఆనంద పరచడానికి ఏమేమిటో వార్తలు చెబుతున్నారు.

మేమొక భయంకరమైన అడవిగుండా వెళుతున్నాం. కుడివైపున దూరంలో అక్కడక్కడా కొండలు కనిపిస్తున్నాయి. ఆ అడవుల్లో భీకరమైన ఏనుగులూ, భయంకరమైన పెద్దపులులూ వుంటాయట. అయినా మాతోపాటు వస్తున్న శ్యామాంగులకు వాటి భయం ఈషణ్మాత్రమైనా లేదు. పైగా పెద్దపులులూ, ఏనుగులూ వారి ఉత్సాహాన్ని అధికం చేయడానికి సాధనాలుగా ఉపయోగిస్తాయి.

ఒక జాము పొద్దెక్కిన తర్వాత మేము పై పల్లెకు చేరాం. మా పథ ప్రదర్శకుడు తన చేతిలోని తాటిమట్టను ఆ గ్రామ పెద్దకు ఇచ్చాడు. అతడు మమ్మల్ని

చాలా గౌరవించాడు. త్రాగడానికి 'మేయర్' యిచ్చాడు. భోజనాలు చేసి వెళ్ళం డని సగౌరవంగా ఆహ్వానించాడు.

ఇదే విధంగా ఒక పల్లెనుండి మరొక పల్లెకు పథ ప్రదర్శకుల్ని మార్చు కుంటూ అడవికి అటు కొసకు చేరాము. పథ ప్రదర్శకుడు ఒక ఎత్తైన దిబ్బమీదకు ఎక్కి, దూరంగా కనుపిస్తున్న గ్రామాన్నొకదాన్ని చూపించాడు. ఆ గ్రామంలో చాలా యిండ్లున్నాయి. ఆ ఇండ్లకూ మగధ ప్రాంతపు గ్రామాల్లోని ఇండ్లకూ వ్యత్యాసం స్పష్టంగా కనిపిస్తోంది. అయినప్పటికీ ఎత్తైన గోడలమీది పెంకుటి కప్పుల్ని చూడడంతోటే శ్యామాంగుల ప్రదేశాల్ని దాటామని తెల్సుకొన్నాం. పథ ప్రదర్శకుడు మా నుండి సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. నే నొకమాటు వెనక్కి తిరిగి శ్యామాంగ దేశపు నీలి అరణ్యాన్ని చూశాను. ఆ విస్తృతమైన అరణ్యపు అణువణువులోనూ కన్నీళ్ళు కారుస్తూన్న శ్యామాంగి దర్శనమిచ్చింది. నా కండ్లు చెమర్చాయి. వదినె ఏమో మాట్లాడ బోయింది. కాని, ఆమె మాటల్ని ఆపుతూ నే నిలాగన్నాను. "వదినా ఇక నీ వేషంలో మన మా గ్రామానికి పోరాదు. గుడ్డల మూట విప్పు!"

వదినె మౌనంగా గుడ్డలమూట విప్పింది. నేను నా గుడ్డల్ని ధరించి ఇలా అన్నాను: "మన మీ గుడ్డల్ని ఆనాడే తొడిగి చింపేసు కున్నట్లయితే ఈరోజు ఎలా బాధపడేవారమో!"

"బాధేముందిలే! మనం కళాకారులం. కళాకారుల కండ్లకు నగ్నసౌందర్యం బాగా నచ్చుతుందిలే!" అన్నాడు సింహవర్మ.

"సోదరుడి అభిప్రాయాన్ని నీవూ సమర్ధిస్తావా, వదినా?" అన్నాను.

"అన్నదమ్ముల్లో ఏదయినా అభిప్రాయభేదం వచ్చినప్పుడు నేను తమ్ముణ్ణే సమర్థిస్తాను" అన్నది.

"అవున్లే, మరిది ముందు భర్తొక లెక్కా!" అన్నాడు సింహవర్మ.

"అవును నేను మరిదిని తప్పకుండా సమర్థిస్తాను" అంటూ వదినె నాకు అభి ముఖి అయింది. "వీళ్ళు అజ్ఞానులే గాని దీనులుకారు. వీరి స్వాగతం, అతిథి సత్కారం, ఎంత సహజంగా మధురంగా వున్నాయి? ఈ పల్లెలో వుండగా ఘన నాగరిక ప్రపంచం జ్ఞాపకానికి వస్తోండేది. కాని ఇకనిప్పుడు ఈ పల్లెజీవితం జీవిత మంతా జ్ఞాపకం వస్తుంది. మనం గడిపిన పల్లెజీవితం అంత ఉత్తమమైంది, ఉన్నత మైందీనూ!" అన్నది వదినె.

నన్ను శ్యామాంగి జ్ఞాపకాలు వ్యధపెట్టసాగాయి. ఇప్పుడు నేను వెళ్ళిపోయా నని తెలిసి దుఃఖిస్తూ వుంటుంది. పల్లీయులందరు ధైర్యాన్ని చెబుతుంటారు. "ఎక్కడికో వెళ్ళారు. కొద్దిరోజుల్లో వస్తారు" అని చెబుతుంటారు: కానీ శ్యామాంగి ఆ మాటల్ని నమ్ముతుందా? నా ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ

సింహవర్మ ఇలా అన్నాడు: "జయా! వెళ్దాంపద! ఇది చాలా క్రొత్త దేశం. ప్రొద్దుకుంకక ముందే గ్రామంలోకి వెళితే మంచిది!"

మేము ప్రొద్దు కుంకకముందే గ్రామంలోకి పోయాము. అక్కడి ప్రజల వేషభాషలు చాలా భిన్నంగా వున్నాయి. మా వేషమూ, మా ఎదిగిన గడ్డాలూ అక్కడి ప్రజలనుండి మమ్మల్ని పూర్తిగా వేరుపరుస్తున్నాయి. అక్కడి ప్రజల భాషకూడా మాకు తెలియనిదే! ఒకరిద్దర్ని పలుకరించడానికి ప్రయత్నించాను. కానీ, వాళ్ళకు నా మాటలు బొత్తిగా అర్థమవడం లేదు.

"వీళ్ళభాష అర్థం కావడంలేదు. కానీ, ఈ భాషలో ఒకటీ అరా ఆంధ్ర భాషాశబ్దాలు వినవస్తున్నాయి !" అన్నాడు సింహవర్మ.

మేమొక ఎత్తైన సౌధాన్ని చూశాము. దగ్గరకుపోయి కనుక్కుంటే అదొక దేవాలయమని తెలిసింది. పూజారి భుజాన జంజం అయితే వుందిగానీ, అతడి రంగు ఆ పల్లీయుల రంగును బోలివుంది. అతడితో మాట్లాడాము. అతడు మాట్లా డేది శుద్ధమాగధీ కాకపోయినా సంస్కృతమూ, మాగధీసాయంతో అతడి భాషను అర్థం చేసుకోగలిగాం. అతడి మాటలవల్ల తెలిసిన సమాచారం—మేము కళింగ దేశపు ఒక సాధారణ బస్తీలో వున్నాము. మేము దాటివచ్చిన అడవి శబరుల్ది. దంతపురం అక్కడికి ఏమంతదూరం కాదు— మేము వుండడానికి ఒక పాంధశాలను చూపించాడా పూజారి.

ఇక్కడికి వచ్చాక మే మేదో నూతనమైన లోకంనుండి మానవ లోకానికి వచ్చినట్టుగా వుంది. ఇక్కడ మళ్ళీ అదేమోసాలు, కుట్రలూ—సత్యా-సత్యాలూ, కృత్రిమ సౌజన్యాలూ దర్శనమిచ్చాయి. ఇక నీ ప్రపంచంలో జాగ్రత్తగా ప్రవ ర్తించవల్సిన అవసరాన్ని తెలియచేస్తూ మస్తిష్కతంత్రులు నిశిత మవసాగాయి. మావద్ద నూరు దీనార్లున్నాయి. కనుక ఖర్చుకి భయంలేదు. దంతపురం పేరు నేను ముందే వినివున్నాను. దంతపురమంటే, తథాగతుని 'దంతాన్ని' భద్రపరచిన పురం. అదొక బౌద్ధక్షేత్రం కావడంవల్ల బౌద్ధభిక్షువులు చాలా మంది వుంటారు. వారినుండి అనేక దేశాల విషయాలను తెలుసుకొనవచ్చును. దంతపురానికి వెళ్ళే మార్గం కూడా నిరాపద మైనదేనని తెలిసింది.

మేమున్న గ్రామంలో ఒక పణ్య వీధివుంది. చాలా పెద్దవీధి. అనేక రకాల వస్తువులమ్మే దుకాణాలున్నాయి. అన్నింటిలోకి ఇనుప వస్తువులమ్మే దుకాణాలే ఎక్కువ. వాటిలో బల్లేలూ, బాణాలూ, గొడ్డళ్ళూ మొదలయినవి అమ్మబడు తున్నాయి. మేము కొన్ని శస్త్రాలనూ, వస్త్రాలనూ, వంటపాత్రలనూ కొన్నాము. ఈ సామానులను కొనుక్కోవడంలో పూజారి మాకు బాగా తోడ్పడ్డాడు. మా భోజన బాధ్యతను కూడా పూజారే తీసుకున్నాడు. బియ్యం, మాంసం యితర తినుబండా రాలకు కావల్సిన ఫణాన్ని అతనికి ఇచ్చాము.

పూజారి వలన మాకా దేశాన్ని గురించి అనేక విషయాలు తెలిశాయి. కళింగదేశానికి రాజధాని అయిన పిష్టపురం (పిఠాపురం) ఇక్కడికి చాలాదూరంలో వుంది. ఈ దేశపురాజు మహేంద్రుడు. కొద్దిరోజుల క్రితం చనిపోయాడు. క్రొత్త రాజుకూడా మంచివాడేను. దేశంలోని ప్రజలందరూ సాధారణంగా ఆ ప్రాంతపు భాషనే మాట్లాడుతారు. కాని మహారాజులూ, రాజపురోహితులూ, బ్రాహ్మణకుటుంబాలూ మాత్రం మాగధీ భాషను బోలిన ఒక క్రొత్తభాషను మాట్లాడుతూంటారు. ఆచార్య వసుబంధు ఒకమాటు పురాతన మాగధీ భాషలోవున్న కొన్ని జాతక కథలను నాకు చదవడాని కిచ్చారు. ఇక్కడి రాజవంశాలూ, బ్రాహ్మణ కుటుంబాలూ మాట్లాడే భాష సరిగా ఆ జాతక కథల భాషలాగానే వుంది. నే నా పురాతన మాగధీ భాషను స్వచ్ఛంగా మాట్లాడలేను. కాని, భావ వినిమయానికి అవసరమైనంత ఆ భాషను ఉపయోగించుకోగలను. అందరు బ్రాహ్మణ వనితల్లాగానే పూజారి భార్యకూడా ఇటు ప్రజల భాషావచ్చు, అటు జాతక కథల ప్రాచీన మాగధీ భాషా వచ్చు! వెళ్తూనే వాసంతి పూజారి భార్యతో గొప్పగా స్నేహం కలిపేసింది. ఒకమాటు వాసంతి వదినె పూజారి భార్యను ఇలా అడిగింది: "సోదరీ! మీ వారలా నల్లగా వుంటానికి కారణం ఏమిటి?"

"ఇక్కడ ఎండలు చాలా ఎక్కువ. పురుషులు సహజంగా ఎండల్లో పనిపాటలు చేస్తుంటారు. గనుక నల్లబడిపోతారు!" అని చెప్పింది పూజారి భార్య.

వదినె నవ్వుతూ పూజారి భార్య ఇచ్చిన సమాధానాన్ని నాకు చెప్పింది.

"మరి, వదినా! నీ అభిప్రాయం ఏమిటి?" అనడిగాను వదినెను.

"ఎండలవలన మనగౌరవర్ణం తామ్రవర్ణానికి మారుతుందేగానీ, శ్యామలవర్ణానికి మారదు!" అన్నది వదినె.

"నిజం చెప్పావు వదినా! ఉత్తరాపథంలోని బ్రాహణుల్లాగానే ఈ దక్షిణాపథంలోని బ్రాహ్మణులు కూడా తమ వర్ణస్వచ్ఛతకు గర్విస్తుంటారు. ఉత్తరాపథంలో శ్యామాంగ ప్రజలు తక్కువకనుకనే అక్కడి బ్రాహ్మణుల్లో వర్ణ (రంగు) మిశ్రమం తక్కువగా కనుపిస్తుంది. ఇక్కడ, ఈ దక్షిణాపథంలో శ్యామాంగ ప్రజల సాహచర్యం ఎక్కువ. అందువల్ల ఇక్కడి బ్రాహ్మణుల్లో వర్ణమిశ్రమం ఎక్కువగా కనుపిస్తుంది" అన్నాను.

"మరి ఇక్కడి బ్రాహ్మణులు కూడా, మన దేశపు బ్రాహ్మణుల్లాగానే ఇతర వర్ణ (జాతి) స్త్రీలను పెండ్లి చేసుకొనరు కదా! మరి, అలాంటప్పుడు....?"

"వర్ణ మిశ్రమము ఎలా సంభవమంటావు? ఇతర వర్ణ స్త్రీలను పెండ్లి చేసుకొనరు కానీ ఉంచుకొంటారు!"

"ఉంచుకొన్న స్త్రీకి కలిగిన సంతానం బ్రాహ్మణ సంతానంగా పరిగణించబడదుగా?"

"అవును, స్ఖాలిత్యం ఒక్క పురుషుల వైపునుండే కాదు స్త్రీల వైపునుం కూడా జరుగుతుంది. అదే పదతుర్లో బ్రాహ్మణ స్త్రీకి కలిగిన సంతానం బ్రాహ్మణ సంతానమనే అనిపించుకొంటుంది కదా?"

"అంటే నీ మాటలు నాకు అర్థం కావడంలేదు!"

"అంటే బ్రాహ్మణుల ఇండ్లల్లో శ్యామాంగ దాసులూ, కూలీలూ వుంటారు కదా? అనర్హుడైన భర్తవలన నిరాశచెందిన బ్రాహ్మణ స్త్రీ శ్యామాంగదాసుల మీటకు దృష్టిని పోనిస్తుందనుకో! అప్పుడు వర్ణసంకరం సంభవం కాదా?"

"అవును. సంభవమేను! మా నగరంలో ఒకటి రెండు బ్రాహ్మణ కుటుం బాల్లో ఇలా జరగడం మాకు తెల్సు!" అన్నది వదినె.

"ఈ పూజారికూడా అలాటి బ్రాహ్మణుడే! ఇతడి తల్లి మాత్రం తప్పని సరిగా బ్రాహ్మణి అయి వుంటుంది!" అన్నాను.

ఇక్కడ ఒక విషయం నన్ను బాగా బాధించింది. రాజు ప్రజల కోసరం ప్రకటించే ఆజ్ఞాపత్రాలూ, శాసనలేఖలూ మొదలైనవాటిలో మాగధీ భాషను వాడ తారు. ప్రజల కోసరం చేసే ప్రకటనల్లో, సాధారణ ప్రజలకు ఏమాత్రం అర్థం కాని భాషను వాడడం నాకు విచిత్రమనిపించింది. పాటలీపుత్రంలో పరమభట్టా రకులు కూడా తమ శాసనపత్రాలను సంస్కృతంలో ప్రకటించేవారు. నాకు అలా ప్రజలకు సంబంధంలేని భాషలో, ప్రజల కొరకు ప్రకటన చేయడం, హాస్యాస్పద మని అక్కడే అనిపించేది. కాని అక్కడి ప్రజలు కొంత ప్రయత్నించి అక్కడి సంస్కృతలేఖల భావాన్ని అర్థం చేసుకొనగలిగేవారు. కాని, ఈ కళింగ ప్రజలు మాగధీ భాషను ఏ మాత్రమూ అర్థం చేసుకొనలేరు. ఉత్తరదేశాన్నుండి వచ్చిన రాజులూ, మంత్రులూ, సామంతులూ తమ భాషను ప్రజలమీద రుద్దాలని నిరంతరం ప్రయత్నిస్తూండేవారు. ఇక్కడి ప్రజలు తాము కళింగులమని చెప్పుకోవడానికి కూడా సిగ్గుపడుతూంటారు. తాము మగధ, కాశీ, కోసల, పాంచాల దేశస్థులమని చెప్పుకుంటారు. పరాయి ప్రభువుల్ని నెత్తికెక్కించుకొంటే ఇలాటి మనఃప్రవృ త్తులే అలవరుతాయి. మరీ విచారింపదగిన విషయం: ఇక్కడి సామాన్యప్రజలు కూడా ఉత్తరదేశీయులే పరిపాలనార్హులని విశ్వసిస్తారు.

రెండురోజుల అనంతరం దంతపురం చేరాము. సముద్రతీరాన నిర్మింప బడిన గొప్ప నగరమిది. అక్కడి బౌద్ధవిహారానికి సంబంధించిన ఒక సత్రంలో దిగాము. ముగ్గురమూ మూడు మతాలకు చెందినవాళ్ళం. సింహవర్మా అతని వంశీయులు బ్రాహ్మణ మతానుయాయులు. శివుణ్ణి పూజిస్తారు. వాసంతి కుటుంబం జైనమతానికి సంబంధించినది. నా వంశీయులు కొన్నితరాలనుండి బౌద్ధులు.. శ్యామాంగుల పల్లెల్లో నివాసం కలుషాన్ని కడిగేసింది. పల్లెనివాసం ముందు మాలో కొద్ది గొప్ప తేడాలో మతాభిమానం వుంది. కానీ,ఇప్పుడు మేము ముగ్గురమూ మతా

లను గురించి ఒక సునిశ్చితమైన అభిప్రాయాని కొచ్చాము. మానవజాతి యొక్క అవస్థాభేదాల ననుసరించి మతాలు మారుతుంటాయని మా నిశ్చితాభిప్రాయం.

మొదటగా మానవులు చచ్చిపోయిన తర్వాత మళ్ళీ పుడతారనే సిద్ధాంతం అసత్యమని నేను చెప్పినప్పుడు వాసంతి వదినెకు చాలా ఆశ్చర్యం కలిగింది. కానీ, శబరపల్లె నివాసం తరువాత మానవులు చచ్చి పుడతారనేది అసహజమైన సిద్ధాంత మని వాసంతి వదినెకు స్పష్టమైంది. చచ్చి పుడతారన్న విషయం అసలు శబరులకు తెలియనే తెలియదు. వదినెతో నే నిలా అన్నాను: "చచ్చి పుట్టడమనే సిద్ధాంతం చాలా అసత్యంతో కూడినది. మన పిల్లలకు మనం ఈ అసత్యకరమైన సిద్ధాంతాన్ని నూరిపోస్తాము. ఈ పల్లె ప్రజలు కూడా ఈ సిద్ధాంతాన్ని స్వీకరిస్తే ఇక బాణా లను భుజాలకు తగిలించుకొని చావో-బ్రతుకో తేల్చుకోవడానికి ఎందుకు పోతారు? ఏనాడో రాజులకు దాసులయిపోయేవారు. పూర్వజన్మ సుకృతం వల్ల ఒకడు రాజ వుతాడు. మరొకడు బానిసవుతాడు! ఒకడు ధనికుడవుతాడు మరొకడు దరిద్రు డవుతాడు! పురుష ప్రయత్నంతో అవసరం ఏముంది? అనుకునేవారు!"

నేను చేసే తర్కాలకంటే, వాదనలకంటే—చాలా ఎక్కువగా ఉపయోగ పడ్డది శబరపల్లె నివాసం!ఆనాటి నుండి ముగ్గురం ఒకే సిద్ధాంతాన్ని ఒకే భావననూ ఆమోదించసాగాము. బ్రాహ్మణ, జైన, బౌద్ధ మతాలు మూడూ పునర్జన్మవాదాన్ని ఒప్పుకొంటాయి. కనుక మూడు మతాలూ మానవదాస్యాన్నీ, మానవపీడననీ బల పరుస్తాయని మా భావన!

ఆ రోజున మేము దంతవిహారంలోకి దంతధాతువును చూడడానికి వెళ్ళాము. అనేక దూరదేశాలనుండి ప్రజలు దంతధాతువును దర్శనం చేసుకోవడానికి వస్తూండే వారు. తథాగతుని శరీరాంగాన్ని (వింటిని) చూడడానికి ఏ బౌద్ధుడు ఉత్సాహి తుడు కాడు? అదొక విశాలమైన మందిరం. శిల్పచాతుర్యం దర్శనీయం. ఈ మందిరం (విహారం) కనిష్క విహారమంత విశాలంగా, వజ్రవైఢూర్యాది రత్ననిల యంగా లేదు. కానీ, సముద్రపు వ్యాపారులు ముక్తహస్తులై ధనాన్ని వెచ్చించారు. స్వర్ణ నిర్మితమైన దీప దానములు ఎన్నో వున్నాయి. ఒక్కొక్కటి దాదాపు మణుగు బరువుంటాయి. వాటిమీద వాటి దాతల పేర్లు చెక్కబడి వున్నాయి. దాతల్లో అన్య ద్వీపవాసులు కూడా వున్నారు. ఆ స్వర్ణ దీప దానాల్లో ఆవునేతిలో అఖండజ్యోతి వెలుగుతూ వుంటుంది.

తథాగతుని దంతధాతువును, అనేక స్వర్ణ, రజిత, రత్నఖచిత మంజూషల్లో భద్రపరచివుంచారు. నెలలో కొన్ని ప్రత్యేక తిదుల్లోనే దంత ధాతువు దర్శనం సంభవమయ్యేది. శ్రద్ధాళువులైన దర్శకులు చేతులు కట్టుకు నిలబడివున్నారు. పూజారి ఒక మంజూషలో నుండి మరొక మంజూషను బయటికి తీస్తున్నాడు. చివరి మంజూషలో బుద్ధుని దంతధాతువుంది. చివరి మంజూషను తెరిచి పూజారి అందరికీ దంతధాతువును చూపించాడు. చూస్తూనే నేను స్తబ్ధుణ్ణయిపోయాను. అక్కడేమీ

మాట్లాడలేదు గానీ, బసకు వచ్చాక యిలా అన్నాను. "ఈ మతానుయాయులు ఘోరంగా పతితులయ్యారు!"

"ఈ వేళ క్రొత్తా, నీవిలా మతాలను తిట్టడానికి .... ?" అన్నది వదినె నవ్వుతో.

"అదికాదు, వదినా! నీవా దంతధాతువును చూశావా?"

"చూశాను. రత్నఖచితమైన స్వర్ణమంజూషలు మహా బాగున్నాయి!" అన్నది వదినె.

"అవును. మెరిసిపోతూన్న రత్నాలు, మానవుల కండ్లను మిరుమిట్లు గొలిపి అసత్యాన్ని సత్యంగా ప్రకటిస్తాయి!" అన్నాను.

"పనివాడితనాన్ని మెచ్చుకో, సోదరా!" అన్నాడు సింహవర్మ.

"పనివాడితనాన్ని మెచ్చుకోవడానికి నా కెలాంటి అభ్యంతరమూలేదు. కాని అబద్ధప్రచారాన్ని నే నెన్నడూ సహించలేను!" అన్నాను.

"అబద్ధ ప్రచారం ఏముంది?"

"ఐతే, నీవు నూటికి నూరుపాళ్ళూ కళాకారుడి వనిపించుకొన్నావు!"

"నిజం చెప్పావు మరిదీ! నూరేండ్లూ బ్రతుకు ! మీ అన్నయ్య నికారసైన కళాకారుడు!" అంది వదినె.

"అసలు విషయం ఏమిటో తెలుసుకోకుండానే మరదికి వంత పలుకుతున్నావు" అన్నాడు సింహవర్మ.

"విషయం మరేమీలేదు సోదరా! మనం చూచిన దంతం మానవులదై వుండదు?" అన్నాను.

వదిన కండ్లు పెద్దవి చేసి చూచింది. "మొదటినుండీ నీ మాటలు వింటుండడం వల్ల బుద్ధుడంటే ఒక గొప్ప గౌరవభావన యేర్పడ్డది నా హృదయంలో!"

"నీవు గౌరవాన్ని తగ్గించుకోవలసిన పనేమీలేదు, వదినా! తథాగతుని మీద ప్రచారంలో ఉన్న అనేక విషయాలను నేను ఒప్పుకోను. అనేక అసత్యాలను కల్పించి తరువాత వాళ్ళు బుద్ధుడి నెత్తికి చుట్టారు. పునర్జన్మ లాంటివాటిని కొన్నింటిని బుద్ధుడే స్వయంగా ప్రచారంలోకి తెచ్చాడు. అయినా తీర్థంకరుడిలా బుద్ధు డెన్నడూ, సర్వదర్శిననీ, సర్వజ్ఞుణ్ణనీ చెప్పుకోలేదు. ఇక్కడ శ్రద్ధాశ్రద్ధలూ, గౌరవా గౌరవాలూ ముఖ్యంకాదు! మతాన్ని తమ వ్యాపారాలకు, ధనోపార్జనకు సాధనంగా పెట్టుకున్న కుటిల వణిక్కుల దుష్టచర్యను మాత్రం యిక్కడ గమనించాలి. ఆ దంతం మానవుల్ది కాదు. ఏనుగుదంతాన్ని మానవ దంతాకారంలో ఎగుడు దిగుడుగా చెక్కించారు. ఎంత మోసం? ఎంత వంచనా? బుద్ధుని దంతమని ప్రచారం చేశారు. సాధారణ మానవులవి పది తాలు కరగబెట్టి, పోత పోసినా అంత పెద్ద దంతంకాదు!"

"అసలు విషయం అర్థమైంది మరదీ! మేము జైనమతస్థులం కావడంవలన బౌద్ధమతాన్ని నిరంతరం విమర్శిస్తూ వుండేవారు మా ఇంట్లో. బుద్ధుని దర్శనం (సిద్ధాంత మతం) సమ్యగ్ దర్శనం కాదనీ, అతడి మార్గం పుణ్య మార్గం కాదని అంటుండేవారు. కానీ,నీ మాటలు వింటుండడంవలన బౌద్ధమతంమీద ఒక సద్భావన, దంతధాతువుమీద ఒక పవిత్రమైన శ్రద్ధా ఏర్పడ్డాయి! ఇప్పటి నీ మాటలు నా అభిమానాన్ని గౌరవాన్ని ధూళిక్రింద మార్చాయి!"

"చూశావా, సోదరా! స్త్రీలు ఒట్టి రామచిలుకలు!"

"ఏ పాటకు ఆ వంత పాడతాయి! అనబోతున్నావు కదా సోదరా? కానీ ఒకప్పుడు నీ మాటను నీకే వప్పగిస్తారు!" అన్నాను నేను.

వాసంతి వదినె బుగ్గలు ఎర్రబడ్డాయి. సింహవర్మ వదినెను గుండెలకు హత్తుకొంటూ "కించపడకు భట్టారికా! నీవు చిలకవైతే నేను పంజరాన్ని? సరేనా?" అన్నాడు.

"వదినె మనస్సు బాగా బాధిస్తున్నావు, సోదరా? ఆడవాళ్ళతో పరిహాసం ఆడవచ్చును. కానీ చాలా జాగ్రత్తగా ఆడాలి! కాకపోయినా వదినా, నీ ముఖం ఎందుకు ఎర్రపడ్డది? నిష్ఠురులై పురుషుల బంధనల్లో చిక్కనంత వరకూ, రామ చిలుకలు ఎంత స్వతంత్ర జీవులో నీకు తెలియదా?" అన్నాను.

"నీవు చాలా చిత్రమైన వాడివోయ్, జయా ! నీవేగనక లేకపోతే, మూషక మార్జాలమనే లోకోక్తి మీ వదినపట్ల చరితార్థ మయ్యేది?"

"విన్నావా, వదినా ? మూషకం ఎవరు ? మార్జాలం ఎవరు ?" అన్నాను.

వదినె నవ్వి వూరుకుంది. అన్నయ్య వదినె కపోలాల్ని తన కపోలాలకు అదుముకున్నాడు.

"ఐతే, మూషకం ఎవరో, మార్జాలం ఎవరో నేనే చెబుతాను విను. మార్జాలాలు ఈ ప్రపంచాన్ని మోసంచేసే స్వార్థపరులు. వీరి విక్రయశాలలు—స్వార్థ సాధన కేంద్రాలు. దేశమంతటా ఉన్నాయి. శివాలయం, విష్ణాలయం, జినాలయం, బౌద్ధవిహారాలూ, రాజమందిరాలు–ఇవన్నీ వీరి విక్రయశాలలు! సాధారణ ప్రజలు–నిత్య పీడితులు, మూషకాలు !"

దంతపురంలో మేము చాలారోజులు ఉన్నాం. సింహవర్మ క్రొత్తతూలికనీ, క్రొత్తపటలాన్నీ కొన్నాడు. కొత్త రంగుల్ని తయారు చేసుకొన్నాడు. నా శిల్ప కళకు అవసరమైన కొన్ని పరికరాలనూ నేనూ కొనుక్కొన్నాను. కానీ, మేమప్పటికింకా పని ప్రారంభించలేదు.

ఒకనాటి ప్రదోష (సంధ్య) కాలాన నేను సముద్రతీరాన్నుండి తిరిగి వస్తున్నాను. ఒక యింట్లో నుండి వీణావాదన సుస్వరాలు అతిమధురంగా విన వస్తున్నాయి. చాలా రోజుల తరువాత అంత మధురమయిన స్వరాల్ని వినగలి

గాను, తన్మయుడనై గవాక్ష స్థంభాన్ని ఆనుకొని వింటున్నాను. ఎంతోసేపు అలాగే మైమరచి సుస్వరాల్ని విన్నాను! ఎంతసేపు అలా నిలబడి వున్నానో తెలియదు? ఒక మృదు మధురమైన నారీ కంఠస్వరం నా తన్మయతకు అంత. రాయాన్ని కలిగించింది. "ఆర్యా! మీకు అభ్యంతరం లేకపోతే లోపలికివచ్చి, వీణావాదనాన్ని విని, మమ్మల్ని కృతార్థుల్ని చేయండి!" అన్నదా స్వరం.

ఆమె మధుర కంఠస్వరానికి సమ్మోహితుడనైనట్టు, నేనామె వెనకే లోపలికి పోయాను. ఆమె ముందు దీపం చూపుతూ పెద్ద గదిలోకి తీసుకు పోయింది. గదిలో ఒక దీపయష్టిపై పంచముఖ దీపం వెలుగుతోంది. దీపపు చమురులో సుగంధ ద్రవ్యాలేవో కలిశాయిలాగుంది. గదంతా సువాసనతో నిండి పోయింది. గదిలో ఒకవైపున, పరుపు వేసుకొని, పెద్ద తలగడను వీపుకు వూతంగా ఆన్చుకొని ఒక యువతి కూర్చుని వుంది. నన్ను చూడగానే లేచి నిల బడి తన సుకోమలమైన చేతి వ్రేళ్ళతో నమస్కరిస్తూ "ఆర్యా! నమస్కారం!" అన్నది ఆమె.

నేను ఎదురుగా వున్న ఆసనంమీద కూర్చున్నాను. ఆ యువతి ఎవరు? అనే విషయంలో ఒక నిశ్చయానికి రాలేకపోతున్నాను. సాధారణమైన అంద గత్తె! శరీరాలంకరణ అతి సాధారణం! ఆభరణాలు అత్యల్పం! అయినా, ఆమెలో ఏదో విచిత్రమైన ఆకర్షణ వుంది. వయస్సు ఇరవై ఏండ్లు వుండవచ్చు! ఆమె యొక్క వీణావాదన ప్రవీణతను, అభినందించకుండా వుండడం అసభ్యత అనిపిం చింది. నేను కృతజ్ఞతను ప్రదర్శిస్తూ "భద్రే! మీకు కలిగించిన కష్టానికి క్షమించ మని వేడుకొంటున్నాను! మీ వీణా స్వరాలు నాకు చాలా ఉత్కృష్టమనిపించాయి. అందువల్లే పిలువని పేరంటంగా గడపలో కూలబడ్డాను. మీకీకష్టాన్ని కలిగించాను!" అన్నాను.

"నా కేమీ కష్టాన్ని కలిగించలేదు ఆర్యా! మీరీ గృహాన్ని పావనం చేసినం దుకు చాలా కృతజ్ఞురాలను!"

చాలా రోజుల తరువాత ఇంత చక్కని వీణాగానాన్ని విన్నాను. పాటలీ పుత్రాన్ని విడిచాక నేనిలాటి వీణావాదాన్ని ఇంతవరకూ వినలేదు!"

"తమరు పాటలీపుత్ర నివాసులా?"

"ఒకప్పుడు పాటలీపుత్ర నివాసిని!"

"ఈ వీణావాయిద్యాన్ని పాటలీపుత్రంలోనే నేర్చుకొన్నాను. పిష్టపురంలోని కుమార భట్టారకుల పరిచారికగా వుండేదాన్ని. నాకు వీణావాదనంలోకల ఆసక్తిని చూచి, ప్రోత్సహించారు!" ఆమె గొంతు రుద్ధమైంది. ఏవో పాతజ్ఞాపకాలు ఆమె మనస్సును వ్యధపెట్ట సాగాయి. గట్టిగా నిట్టూర్చింది.

"ఏదో జ్ఞాపకం చేసుకొని మీరుబాధపడుతున్నట్లుంది.మిమ్మల్ని బాధపెట్టటం నా వుద్దేశ్యంకాదు."

"బాధ జీవితమంతా భరించవలసిందే! తండ్రి తరువాత ఈ కుమార భట్టారకులకే రాజ్యం లభిస్తుంది. కానీ, తండ్రి పోయాక, అన్నదమ్ములు కొట్టుకు చంపుకోవడం ఒక ఆచారమైంది. అన్నదమ్ముల్లో యుద్ధం సంఘటిల్లింది. నా కుమార భట్టారకులు ఆ యుద్ధంలోనే హతులయ్యారు. ఆర్యా! నా కష్టగాథను వినిపించి మీ హృదయాన్ని నొప్పించను. తమకు ఆతిథ్యమివ్వడానికి, ఈ దీనురాలి దగ్గర సంగీతం కాక మరేముంది!"

"సంగీతం నాకు ప్రియాతి ప్రియమైనది"

ఆ తరుణి వీణను తీసుకొన్నది. ఈసారి వీణ వాయించటంతోపాటు గాత్రం కూడా జతపరచింది. అంత చక్కని వీణాగాన సంయోగాన్ని గతంలో వినలేదు. భవిష్యత్తులో విననని రూఢిగా చెప్పగలను. మామూలు చెక్కసాధనం - వీణలో, కరుణ రసాన్ని అలా వుత్పన్నం చేయగలశక్తి వుంటుందని నే నెన్నడూ అనుకోలేదు. అలా ఆర్ద్రమైన కరుణరసంకి, ఆమె హృదయాంతరాళాల్లోనుండి పైకి ఉబికి, వీణద్వారా బయల్పడిం దనవచ్చు! ఆయువతి గీతాన్ని సమాప్తంచేస్తూ, నాకు ప్రశంసించడాని కయినా అవకాశమీయకుండా "ఆర్యా! మీరూ సంగీత ప్రియుల్లా కనిపిస్తున్నారు. శ్రమ అనుకోకుండా వుంటే, మీ గానమాధురిలో ఈ దీనురాల్ని కృతార్థురాల్ని చెయ్యండి! పాటలీపుత్రపు సంగీతాన్ని విని చాలా రోజులైంది!" అన్నది.

శ్యామాంగుల పల్లెనుండి కొద్ది రోజుల క్రితమే వచ్చాను. కనుక కృత్రిమ హావభావాలను, శిష్టాచారాలను ప్రదర్శించలేక పోతున్నాను. సహజ స్వరంలో ఇలా అన్నాను: "సంగీతం మీద ప్రేమ ఎటూ వుంది. గాదనలేను. కానీ,నాకు చాలా రోజులుగా అభ్యాసంలేదు. అయినా, ఒక ద్విపదను పాడి వినిపిస్తాను!" అంటూ ద్విపరాగంతో విరహగీతా న్నొకదాన్ని ఆలాపించాను. సమ్మేళనలో ఆనందం వుంటుంది. కానీ, సమ్మేళనాత్మకమైన గీతంలో అంత అనుభూతి, ఆనందమూ లభించవు. కానీ, విరహగీతంలో శ్రోతల్ని ఏడిపించేశక్తి ఉంటుంది. గీతం ఎంత విరహప్రధానమైతే, ఆనందానుభూతికూడా అంతేబలంగా వుంటుంది. పాట సాంతం అయ్యేసరికి ఆ యువతి కండ్లు చెమర్చాయి.

పాట సమాప్తమవగానే ఆ యువతి నా చరణాలకు నమస్కరిస్తూ "ఆర్యా! ఫలించిన వృక్షం నమ్రంగా వుంటుంది. మహాపురుషులు తమ గొప్పతనాన్ని చాటుకోరు! బయట గవాక్షం చెంత ఎవరో నూతన పురుషుడున్నాడని దాసి చెప్పినప్పుడు, ఉపేక్ష చేయలేకపోయాను! ఏమో! సాధారణుల్లా కనిపించేవాళ్ళలో ఏ గొప్పతనాలున్నాయో? ఏ మహోన్నత గుణా లున్నాయో? ఎవరో, చీకట్లో నిలబడి వీణావాదాన్ని వింటున్నాడు, బహుశః సంగీత ప్రేమికుడేమో! లోపలకు పిల్చి వినిపించితే, నా కొచ్చిన నష్టం ఏముంది? ఇలా అనుకొని లోపలకు పిలిపించాను. సభ్యమైన మీ వేషాన్ని, వినీతమైన మీ ముఖమండలాన్ని చూచేసరికి నాకో ఉన్నత

షైన అభిప్రాయం కలిగింది మీ మీద. కానీ, మీరింత గొప్ప కళాకారులని నే ననుకోలేదు!"

"సుందరీ! మీరు అనవసరంగా అనర్హులైనవారికి అర్హతను, ప్రశంసల్ని అందచేస్తున్నా రంటున్నందుకు క్షమించండి! నేనిలా అన్నందుకు బహుశః మీ మనస్సుకి గాఢంగా నొప్పి కలగవచ్చును.వీణావాదనంలో నాకు అభినివేశం వుంది. సంగీతం అంటే ప్రేమా, ఉత్సాహం కూడా వున్నాయి. ఇవి యౌవనంలో ప్రతి వ్యక్తిలోనూ సంగీతం పైనుండే సాధారణమైన ప్రేమేకాని ప్రావీణ్యత మాత్రం కాదు. మీరు నన్ను గొప్పకళాకారుణ్ణని ప్రశంసిస్తున్నారు. పాటలీపుత్రంలో కళాకారుడనిపించుకొనే సుయోగం ఎలాటి వారికి లభిస్తుందో; నేను వేరుగా చెప్పనవసరం లేదనుకొంటాను!"

యువతి మా గురించి ప్రశ్నించింది. దంతధాతువును చూడడానికి వచ్చామనీ, దంత విహారానికి ప్రక్కనే వున్న పాఠశాలలో వున్నామనీ చెప్పాను. మా నాన్నగారు గొప్ప చిత్రకారులనికూడా చెప్పాను.

"ఆర్యా! మిమ్మల్ని మళ్ళీ మళ్ళీ దర్శనం చేసుకోగల సౌభాగ్యం నాకు లేదు. మీ దర్శనం మళ్ళీ చేసుకోగల అర్హత నాకు వుందనుకుంటే, ఈ ఇంటిని మీదిగానే భావించి అప్పుడప్పుడు వచ్చిపోతూ వుండండి! కాని, నిర్మలుడైన చంద్రుణ్ణి మలిన పర్చడం చాలా క్రూరమైనపని........ నేను చాలా అసహాయురాల్ని. వివశంగా పడుపు వృత్తిలో కడుపునింపుకొంటున్నదాన్ని. మీరు నిష్కళంకులు! ఇక్కడికి రావడం వలన మీకు కళంకం సంభవిస్తుంది. కనుక తిరిగి ఒకమాటు దయచేసి మా గృహాన్ని పావనం చేయండనలేను. పోనీ, నేనే తమ నివాసానికి వద్దామన్నా అందుకూ నాకు అర్హతలేదు!"

నేను వెళ్ళడానికి లేచి నిలబడబోయాను. కాని,ఆమె నోటినుండి పైమాటల్ని విని నేను తిరిగి కూర్చుండిపోయాను. ఆమె ముఖంలో వ్యాపించిన వుదాసీనత చిరునవ్వుగా మారింది. నేనిలా అన్నాను: "భద్రే! ప్రజలు నిన్ను 'కలుషిత' వన్నంత మాత్రాన కండ్లుమూసుకోని నేను 'కలుషిత' వనడానికి సాహసించను. నీవు ఏ జాతి స్త్రీవో నాకు తెలియదు. తెలియ నవసరంలేదు కూడాను. నీ వన్నట్లు నిజంగా స్త్రీలు పురుషుల చేతుల్లో కీలుబొమ్మలు. ఇష్టమొచ్చినప్పుడు అలంకరించి ఆనందిస్తారు! ఇష్టంలేనప్పుడు చెరిపి చెదరగొడతారు!"

"కుమారిభట్టారకు లున్నప్పుడు పురుషుడి ప్రవృత్తిలోని ఈ ఘోరదురంతం నా కర్థమైందికాదు. కుమారభట్టారకులు రసపుత్రులు. రసపుత్రుల్లోని అనేకలోపాలు అతనిలోనూ ఉన్నాయి. కానీ, అతనిలో ఒక గొప్పతనం వుంది. కుమారభట్టారిక అంటే వారికి అమితమైన ప్రేమ. భర్తచనిపోగానే కుమారభట్టారిక కూడా ప్రాణత్యాగం చేసుకొన్నారు. ఇక నేను నిరాశ్రిత నయ్యాను. మరొక ఆశ్రయాన్ని వెతుక్కొందామంటే; నేను కుమారభట్టారకుడి ఆశ్రితను కావడంవలన, అన్యంగా

ఎక్కడా ఆశ్రయం దొరకదు. సాధారణ స్త్రీలా కూలీ నాలీ చేసుకు బ్రతుకుదా మంటే, రాజాంతఃపుర నివాసమూ, సంస్కారమూ చాలా అభ్యంతరాలయ్యాయి! అదీకాక, నా హృదయం ఏనాడైతే కళాత్మకమైందో కాళ్ళూ చేతులూ, శరీరం కూడా మృదుత్వాన్ని పొందాయి. సాధారణ స్త్రీలా చాకిరీ చేయగలశక్తి నశించింది నాలో! రాజాంతఃపురాల్లో లభించే మిధ్యా ఆత్మగౌరవానికి బాగా అలవాటుపడ్డాను! అక్కడ పొందే అవమానాల్లో కూడా ఒక రకమయిన గర్వం అనుభూతికి వచ్చే సింది."

"అవును మరి! అక్కడ భట్టారకులు, భట్టారిక లాంటివారు అవమానపరు స్తుంటారాయె! చాలా 'గొప్ప' అవమానం."

"అవును, దేవతల్లాగా, అనుగ్రహమూ-శాపం రెండు ఇవ్వగల మహారాజుల భట్టారకుల-ప్రతి ఒక్క చర్య గొప్పదే! నాగరికులు కూడా చాలా వంచిత మన స్కులై వుంటారు. కుమారభట్టారకులు గతించిన తరువాత ఒకరోజున, ఉద్యాన వనంలో కూర్చుని యోచిస్తున్నాను. ఇంతలో భద్ర పురుష వేషధారి ఒకడు నా వద్దకు వచ్చాడు. చాలా నమ్రంగా తియ్యగా మాట్లాడాడు. నాకు ఆశ్రయం దొరికే వరకూ తనవద్ద వుండమన్నాడు.... అతడి ఉద్యానవనంలో నివాసాన్ని చూపాడు. వుండసాగాను. మెల్లగా ప్రణయ చేష్టలు ప్రారంభించాడు. నిరాశ్రయంగా తిరగ డంకంటే ఒక ఆశ్రయంలో వుండటమే ఉత్తమ మనిపించింది. లొంగిపోయాను. అదే క్షణం నుండి నాతో దాసీలా వ్యవహరించ సాగాడు. మొదట కటువైన మాటలూ, తిట్లూ, చివరకు దెబ్బలూ-ఏమాత్రం అభిప్రాయ బేదంవచ్చినా కర్రలు తీసుకు బాదేవాడు! అదే స్థితిలో, అతని స్నేహితు డొకడు నా మీద సానుభూతిని ప్రదర్శించసాగాడు. అతనితో ఇక్కడికి వచ్చేశాను. కొద్దిరోజుల తరువాత యితడూ తన మిత్రుణ్ణే అనుకరించ సాగాడు. చివరకు ఒక వేశ్య పరిచయమైంది. అనాశ్రిత అయిన స్త్రీకి వేరు గత్యంతరం లేదని చెప్పింది. రేపు చచ్చిన తరువాత, ఏ మనుభవిస్తానో తెలియదు. కాని, ఇప్పటికి మాత్రం ఈ ప్రపంచ బాధలనుండి ముక్తి పొందాను! ఇకనప్పటినుండి, ఈ దంతపురంలో ప్రసిద్ధమైన వేశ్యని, మధు మతిని!"

వేశ్యలు నీచులని ఎందరో అంటుండగా విన్నాను. కాని, వేశ్యలెలా తయారౌతారన్నది మధుమతి చరిత్రవల్ల తెల్సుకున్నాను. స్త్రీలు వేశ్యలుగా మార డానికి సమాజం ఎంత బాధ్యత వహిస్తున్నదో స్పష్టమైంది. అపారమైన సాను భూతిని వ్యక్తపరుస్తూ, లేచి నిలబడి వీడ్కోలును అర్థించాను. ఇలా అన్నాను: "భద్రే! నేను నిన్ను తిరస్కరించడమో, తక్కువచూపు చూడడమో చేయను! నేను యువకుణ్ణయిన కళాప్రేమికుణ్ణి. తుచ్ఛమైన బంధనాలూ, స్వార్థాలూ నా దరి దాపులకు కూడా రావు. సమస్త మానవుల మీదనే నా హృదయంలో సానుభూతి వంకలు పారుతూ వుంటుంది. మే మీ దంతపురంలో ఎక్కువరోజులు వుండడానికి

రాలేదు. అయినప్పటికీ వున్నన్నాళ్ళూ ఏ సంకోచమూ లేకుండా నీ ప్రాసాదానికి వస్తుంటాను!"

మదుమతి గడప వరకూ వచ్చి, నమస్కరించి వీడ్కోలు నిచ్చింది! బసకు వచ్చాక, విషయమంతా వదినెకూ, సింహవర్మకూ చెప్పాను; "ఈనాటి స్త్రీ యెంత దీనురాలు! శబర పల్లెలోని స్త్రీ యిలా దీనంగా వుంటుందా?" అన్నాను.

నేను దంతపురంలో ఉన్నన్నాళ్ళూ, మదుమతి ప్రాసాదానికి వెళ్తూ వుండే వాణ్ణి. ఆమె గానాన్ని వినేవాణ్ని, నా గానంతో ఆమె మనసుకు వూరట కల్గించే వాణ్ణి!

# కాంచీపురంలో

దంతపురంనుండి మేము బయల్దేరేప్పుడు, మధుమతి చాలా దుఃఖపడ్డది. నిజానికి మధుమతి వేశ్య అయినా, జీవన యాత్రకు కావలసిన ధనాన్నే ఆ వృత్తి మీద సంపాయిస్తుంది. నన్ను బాగా ఆశ్చర్యపరచిన విషయం ఒకటుంది. ఆమె లోని సంగీత రసజ్ఞతని ఎవరూ గమనించరేమి? బహుశః ఆమెయొక్క సంగీత పాండితి చాలా గొప్పదేమో? సాధారణులు రసాస్వాదన చేయలేక పోతున్నా రేమో ?

మొదటి సముద్ర యాత్రలో మేము ముగ్గురం ప్రాణావశిష్టులమై బయట పడ్డాము. ఇప్పుడు దంతపురాన్నుండి కళింగ రాజధానియైన, పిష్ఠపురానికి తిరిగి సముద్రయాత్ర చేయాలి. అయినప్పటికీ మేము ముగ్గురం చాలా ధైర్యంగా ఉన్నాము!

క్రొత్తపట్టణానికి, అపరిచితుడు వెళ్ళడం వలన కొన్ని బాధలు విధిగా పడ వల్సి వుంటుంది. పైగా, ఆ పట్టణపు సాధారణ ప్రజల భాషరానప్పుడు ఈ బాధలు మరీ ఎక్కువవుతాయి. కానీ, పిష్ఠపురంలో మేమలాటి యిబ్బంది ఏమీ పడలేదు! పిష్ఠపురంలో ప్రధానమయిన భాష మాగధీయే అనిపించింది. చదువుకొన్న నాగరిక ప్రజల్లో మాగధి మాట్లాడలేని వారు అరుదు! ఇక రాజకులానికి, మాగధీ మాతృ భాషే! నగరార్లో (పేటర్లో) ఏ పరిచితులూ లేనిచోట పాంధశాలలు ఎటూ వున్నాయి. పిష్ఠపురంలో ప్రత్యేకంగా శిల్పులకు వేరు వీధులున్నాయి. అలాగే పణ్య వస్తువులకు ప్రత్యేకమైన వీధి వుంది. అక్కడి పణ్యశాలలు (దుకాణాలు) ప్రపంచంలోని అన్ని ద్వీపాలయొక్క అందమయిన వస్తువుర్తోటీ నిండి వుంటాయి. పిష్ఠపురపు సముద్రతీరానికి (రేవుకు) యవనదేశం నుండి, జావా ద్వీపంనుండి, సింహళం, చీనా—అనేక దేశాల నుండి, ద్వీపాల నుండి సరుకులు వస్తూ వుంటాయి! సముద్రం, నిజంగా భయంకర మయినదేగావచ్చు! కానీ వ్యాపారానికీ, ప్రయా ణానికీ—ఇంతకుమించి గొప్పదీ, సులువైనదీ మార్గం ఏది? పిష్ఠపురపు సముద్ర తీరంలో వేలకొలది విదేశపు నావికులూ, వ్యాపారులు కనిపిస్తూ వుంటారు. వీధుర్లో అన్నిదేశాల భాషలూ వినబడుతుంటాయి. అన్నిదేశాల వేషాలు కనబడుతుంటాయి. దుస్తుర్లోనూ, అలంకరణర్లోనూ, అభిరుచుర్లోనూ కళింగులు మగధను అనుక

రిస్తూంటారు. కళాక్షేత్రంలో యీ అనుకరణ ప్రవృత్తి మరీ విపరీతంగా కనుపిస్తుంది. కళింగులు మగధయొక్క రాజకీయ ప్రభావం నుండి పూర్తిగా ముక్తులయినా, మానసికంగా మగధకు దాసులనక తప్పదు.

పిష్ఠపురంలో కొంచెం వెతికినట్లయితే, పాటలీపుత్రపు నాగరికులు ఎందరో కనుపించేవారు. కాని, తరువాత పరిచయమౌతుంది. నేను రాజపరివారంలో వాడినని తెలుస్తుంది. అది నాకు బొత్తిగా ఇష్టంలేదు. రెండు మూడు రోజులు గడిచాక, సింహవర్మ, పిష్ఠపురంలో తన దూరపు బంధువు ఒకడున్నాడని తెలుసుకొన్నాడు.

సింహవర్మ బంధువు పిష్ఠపురపు రాజదర్బారులో ఒక గొప్ప పదవిలో వున్నాడు. ఆ పదవిని అలంకరించడానికి అతడిలో వున్న ప్రధానమైన యోగ్యత—అతడి సోదరి మంచి అందగత్తె. యువరాజుతో ఏకాంత సంబంధం కలది!

సింహవర్మ, వాసంతి వదినె, అశ్వసేనాపతి బలవర్మ (సింహవర్మ బంధువు) నివాసానికి వెళ్ళారు. వారితోపాటు నేనూ వెళ్ళక తప్పిందికాదు. సంగీతాచార్యుడిగా నన్ను పరిచయం చేశాడు సింహవర్మ. అశ్వసేనాపతి బలవర్మ, సంగీత సాహిత్యాలన్నా, కళలన్నా ప్రేమకలవాడు. కాకపోతే ప్రేమకలవాడుగా నటించాడనవచ్చు. అప్పట్లో నాగరికుడన్నవాడు, తను కళాప్రేమికున్నని చాటుకోనేవాడు! ఆచార్య వసుబంధువద్ద అంతకష్టించి ఆర్జించిన విద్యా, ఎందుకూ ఉపయోగపడనందుకు విచారించాను. సంగీతం, శిల్పకళా—అద్భుతంగా ఫలితాన్నిచ్చాయి. ఈ రెండు విద్యలు అన్ని దేశాల్లోను డబ్బు సంపాయించి పెట్టగల విద్యలు.

సింహవర్మ బలవర్మతో దర్బారుకు పోయాడు. అతడు చిత్రించిన "పోత మగ్న" అన్న చిత్రాన్ని తీసుకుపోయాడు. అందులో మునిగిపోతున్న ఓడను చిత్రించాడు. రాజాస్థానంనుండి మరికొన్ని చిత్రాలను చిత్రించమని ఆజ్ఞ వచ్చిందతడికి. నేను శిల్పాచార్యుడిగా పరిచయంకావడం ఇష్టంలేదు. అక్కడ సామంతుల, శ్రేష్ఠుల, ధనికుల కన్యలకు నృత్యగాన వాయిద్యాది కళల్ని తప్పనిసరిగా అభ్యసింపచేసేవారు. ఈ లలితకళలను అభ్యసించని స్త్రీలు నిర్గంధ కుసుమాల్లా గణనకెక్కేవారుకాదు. ఒకవేళ, అలాటికన్యను, ఎవరైనా వివాహమాడినా సవతుల పోటీలో వీగిపోతుంది! కనుక ఆడపిల్లల తండ్రులు విధిగా తమ పిల్లలకు లలిత కళల్ని అభ్యసింప చేస్తూండేవారు!

బలవర్మకు పదునాలుగు ఏండ్ల కూతురుంది. ఆ అమ్మాయి అప్పటికే సంగీత శిక్షణ పొందుతున్నది.నా పరిచయమయ్యాక, బలవర్మ తన కూతురికి సంగీతము చెప్పమన్నాడు. అంగీకరించి రోజూవెళ్ళి సంగీతం చెప్పిరాసాగాను. క్రమంగా శిష్యురాండ్ర సంఖ్య పెరగసాగింది. నేను పిష్ఠపురంలో సంగీతాచార్యుడిగా ప్రసిద్ధి పొందసాగాను. అమాత్యులవద్దనుండి, సామంతులవద్దనుండి, ధనిక శ్రేష్ఠులవద్ద నుండి—కన్యలకు సంగీత శిక్షణ నివ్వవలసిందని పిలుపులు రాసాగాయి. ఇలా ఆరునెల్లు గడిచేసరికి శిష్యురాండ్ర సంఖ్య బాగా పెరిగిపోయింది. ఇక నప్పుడు నా

ఆ(శయదాతల నడిగి (ప్రత్యేకం ఒక సంగీత విద్యాలయాన్ని నెలకొల్పాను. అందరూ ఆ విద్యాలయంలోకి తమ కన్యల్ని పంపసాగారు. విద్యాలయపు (ప్రసిద్ధి ఆనోటా, ఆనోటాపడి మహారాజుకు తెలిసింది. మహారాజు, తమ దర్బారులో సంగీత నృత్య (ప్రదర్శనల నివ్వవలసిందని కబురు పంపారు. మహారాజుగారి ఆజ్ఞను ఎలా తిరస్కరించడం? నా శిష్యురాం(డ్రతోపాటు వెళ్ళి సంగీత నృత్య (ప్రదర్శనాలిచ్చాను. మహారాజులు "మంచివసతి" అన్న పేరుతో తమ సంగీతశాలలోనే నా విద్యాలయాన్ని కూడా ఏర్పాటు చెయ్యమన్నారు. రాజాజ్ఞ! ఎలా తిరస్కరించడం? వారి సంగీతశాలలోకి మా విద్యాలయాన్ని మార్చాము. (క్రమంగా శిష్యురాం(డ్రతో ఆయన ఏకాంతంలో కలుస్తున్నాడని తెలిసింది. ఈ విషయాన్ని బలవర్మతో చర్చించాను. ఇది చాలా సాధారణమైన విషయమన్నాడు. నా దగ్గిర విద్యాభ్యాసం చేస్తున్న కన్యల తలిదం(డులుకూడా ఈ మార్పుని, ఆనందదాయకమైన విషయంగానే భావించారు. శబరపల్లెలో స్వచ్ఛందమైన (ప్రేమను చూశాను. అక్కడి (ప్రేమలో (ప్రలోభంగానీ, బలాత్కారంగానీ లేదు. కాని, ఇక్కడి యీ అనాచారమో? ఇలా (ప్రవర్తించడంవల్ల అచిరకాలంలోనే "మదుమతుల" సంఖ్య పెరిగిపోతుంది. అలాటి నీచకార్యానికి నేను సాధనంగా వినియోగపడడం దారుణ మనిపించింది. సింహవర్మా, నేనూ తుదినిర్ణయాన్ని చేసుకొన్నాము. త్వరలో తిరిగి రాగలమని చెప్పి, ముగ్గురమూ పిష్ఠపురాన్ని విడిచిపోయాము!

ఉరగపురంవెళ్ళే పడవనెక్కాం. పడవ పల్లవుల రాజ్యసీమలోని ఒక రేవులోదింపింది మమ్మల్ని. అక్కడినుండి స్థలమార్గాన (ప్రయాణంసాగించాము. ఇక నిప్పుడు మాకు భాషాసంబంధమైన ఇబ్బంది ఏ మా(త్రమూ లేదు. మేము (ద్రావిడ (ప్రాంతానికొచ్చాము. సింహవర్మకు (ద్రావిడభాష వచ్చును. పెద్ద పెద్ద నగరాల్లోనూ, పట్టణాల్లోనూ—మగధీభాషను మాట్లాడేవారు చెదురుగా తగుల్తుండేవారు. (ద్రవిడ దేశంలో గుడిమల్లం శివాలయం చాలా (ప్రసిద్ధమైందని వున్నాను. సింహవర్మ కూడా ఆ శివాలయపు (ప్రసిద్ధిని వింటూనే విన్నాడు. శివాలయంలో శిల్పకళ యొక్క (ప్రాచీన రూపాలను చూడవచ్చుననే ఆశతో, మేము గుడిమల్లం వెళ్ళాము. (ద్రవిడదేశంలో ఇది (ప్రసిద్ధమైన యా(త్రాస్థలం! ఉత్సవ సమయం కాకపోయినా, అక్కడ యా(త్రికులూ, భక్తులూ అనేకు లున్నారు. మేము ముగ్గురమూ పూలమాలలు తీసుకొని ఆలయంలోనికి (ప్రవేశించాము. అక్కడ భక్తులనేకులు అతి తన్మయంగా పూజార్చనలో మునిగివున్నారు. మరికొంతమంది కన్నార్పకుండా 'లింగం' వైపు చూస్తున్నారు! అక్కడి లింగం ఎలా వుంది? మూడు బారల ఓ పెద్ద శిలాఫలకం! ఎవడో నిపుణుడైన కళాకారుడా ఫలకంమీద తన కళను వ్యర్థం చేసుకొన్నాడు. పురుషుడి మర్మావయవాన్ని ఉన్నదున్నట్లుగా చెక్కాడా ఫలకం మీద! ఈ లింగానికి (ప్రక్కనే మరొక సుందరమైన వి(గహం వుంది. ఆ వి(గహపు మర్మావయవం కూడా బాహాటంగా (ప్రదర్శితమౌతోంది. అతి బీభత్సంగా

వున్నాయా రెండు దృశ్యాలూ. నేనక్కడ ఎక్కువసేపు నిలబడలేక పోయాను. వదినె ఒక్కచూపుచూసి కండ్లుదించేసుకుంది.పాంధశాలకు వచ్చాక ఇలా అన్నాను. "మానవుడి అవివేకం మీద జాలి కలుగుతోంది!"

"నేను చిన్నతనం నుండి ఈ దేవాలయాన్ని గురించి చాలా గొప్పగా విన్నాను! మా కుటుంబం, శైవకుటుంబమని నీకు తెల్సుగా? ఈ లింగాన్ని దర్శిస్తే, జన్మ తరిస్తుందని మా భావన!" అన్నాడు సింహవర్మ.

"మరి ఇంకా అదే భావన వుందా మీలో?" అన్నాను.

"మరదీ! అసలు అలాంటిది చెక్కవలసిన అవసరం ఏమొచ్చింది?" అన్నది వదినె.

"ఇలాటి విగ్రహాలను, దేవాలయాలనూ సామాన్య మానవులు ఎన్నటికీ నిర్మించలేరు. లక్షల దీనార్లను ఖర్చుపెట్టి ఇలాటివి నిర్మించడం వారి వశమా? మహారాజులుగానీ, ధనిక శ్రేష్ఠులుగానీ–ఇలాటివి నిర్మించగలరు. ఈ బీభత్స దృశ్యం ధనికుల జీవితానికి ప్రతిబింబంలాటిది! అబ్బ....తల్లీ దండ్రి, తమ పుత్రి క ల్ని తీసుకొని ఈ లింగాన్ని చూడడానికి ఎలా వస్తారు? వచ్చినా వారి మనస్సులో ఎలాటి భావాలు కలుగుతాయి?"

"జయా! నీవు ఈ మతాలకు వ్యతిరేకంగా మాట్లాడేప్పుడు కేవలం ద్వేషం వల్ల మాట్లాడుతున్నా వనుకునే వాడిని! కానీ, ఇప్పుడీ లింగాన్ని చూశాక, మతం మానవుణ్ణి వుద్ధరించడానికి కాదు. అధోగతిపాలు చేయడానికని తెలుసుకుంటు న్నాను! ఇలాంటి లింగాలనూ, విగ్రహాలను పూజించిన తరువాతకూడా బ్రాహ్మ ణులూ, శ్రేష్ఠులూ పశుతుల్యమైన కామాన్ని ప్రదర్శించకుండా వుంటే, నిజంగా ఆశ్చర్యపడవలసిన విషయమౌతుంది. కానీ, ఈ సిగ్గూ ఎగ్గూ లేని కళాకారు డెవడో?"

"కళాకారుణ్ణని ప్రయోజనం ఏముంది? అతనికి దీన్ని చెక్కినందుకు కూలి ఇచ్చి వుంటారు. ఒకవేళ దీన్ని తయారుచేయలేకపోతే శిక్ష పడవచ్చు. అదికాదు గానీ, సోదరా! ఇలాటి లింగాలకు సపరివారంగా పూజచేసేవారు బ్రహ్మచర్యాన్ని గురించీ, ఇంద్రియ నిగ్రహాన్ని గురించి చెబితే ఏమనేట్టు?"

"ఇది చాలా సిగ్గులేని విషయం! మన కళకే 'గొప్ప' కళంకం!"

"తీర్థంకరుడి నగ్న ప్రతిమల్ని నేను చూశాను. నాకు అవి అసహ్యమనిపిం చాయి. కానీ, వాటిల్లో కాముకత, ఇంత నగ్నంగా ప్రదర్శింపబడలేదు!"

అంతవరకూ వాసంతి వదినె మెదలకుండా కూర్చున్నది. అసలేం మాట్లాడ గలదు? కానీ, తీర్థంకరుడి విషయం వచ్చేసరికి తనూ నోరు విప్పింది. "మరదీ! మేము (స్త్రీలము)మతం విషయంలో చాలాగుడ్డిగా మూర్ఖంగా వుంటాము.నేనుకూడా తీర్థంకరుడి నగ్నమూర్తుల్ని (విగ్రహాల్ని) చూడడానికి ఎప్పుడూ వెళుతూ వుండే దాన్ని. విగ్రహాలు పసిపిల్లవాడిలాటి సరళత్వాన్ని కలిగి వున్నాయి! అయినా, ఒక

విగ్రహాన్ని చెక్కేటప్పుడు శిల్పకారుడిచేయి తప్పుదారి పట్టిందనిపిస్తోంది. కాముకత్వపు సూక్ష్మ అభివ్యంజనం ఆ శిల్పంలో గోచరిస్తోంది! ఈ అనాచార శిల్పాలకు పథభ్రష్టమైన ఆ తీర్థంకరుడి శిల్పం ప్రారంభం, ఈ శివలింగం అంత్యం, అన వచ్చు!" అంది వదినె.

* * * * * *

గుడిమల్లం తీర్థం తరువాత మేము నేరుగా కాంచీపురం వెళ్ళాం. సింహవర్మ స్వస్థానం కాంచీపురమే! కోడలితో సహా తిరిగి వచ్చిన, కొడుకును చూసి సింహవర్మ తల్లిదండ్రులు చాలా ఆనందపడ్డారు. వదినె అత్తగారి కాళ్ళకు నమస్కారం పెట్టింది. ఐదవతనం దీర్ఘంగా వుండాలని దీవించింది అత్తగారు. నన్నొక పండితుడిగా, కళాకారుడిగా పరిచయం చేశాడు, సింహవర్మ. నేనక్కడ ఉన్నన్నాళ్ళూ నన్ను తమ చిన్న కొడుగ్గా చూసుకొన్నారు.

సింహవర్మ, వాసంతి వదినె తమ స్వస్థానానికి చేరుకొన్నారు. కాని, నా యాత్ర ఇంకా సమాప్తంకాలేదు. కాంచీ అది ప్రాచీనమైన పట్టణం. పల్లవుల రాజధాని. దక్షిణాపథంలో మొత్తం రాజ్యాలూ, రాజులూ పల్లవుల్ని తమ చక్రవర్తులుగా భావిస్తారు. పల్లవరాజైన విష్ణుగుప్తుణ్ణి సముద్రగుప్తుడు ఓడించాడు. అయినప్పటికీ, వర్తమాన పల్లవనరేశుడు–సింహవర్మ–యొక్క ప్రభావము, ప్రభుత్వము. కళింగ దేశము నుండి దక్షిణ సముద్రం వరకూ అక్షుణ్ణంగా వున్నాయి. కాంచీపురాన్ని దక్షిణదేశపు పాటలీపుత్ర మనవచ్చును. ఒక్క ధనవైభవాల్లోనే కాదు, కళాకౌశలాల్లో కూడా పాటలీపుత్రాన్ని బోలివుంది. కాంచీనగరం, ద్రవిడ దేశపు ఇతర నగరాల్లో మాగధీభాష మాట్లాడేవారు అంతగా కనుపించలేదు. కాంచీపురంలో మాత్రం మాగధి ప్రచురంగా మాట్లాడబడుతోంది. ద్రవిడ దేశీయులు సాధారణంగా శ్యామలవర్ణులు. కాని, పల్లవులు మాత్రం గాంధారులంత ఎర్రగా వుంటారు. మిత్రుడు సింహవర్మ అప్పుడప్పుడూ "మా పూర్వీకులు శకవంశీయులే!" అంటూండేవాడు. మొదటగా ఈ దేశానికి వచ్చినప్పుడు అవంతిలోని శక క్షత్రపుల వద్ద నౌకర్లుగా వుండేవారుట! తరువాత శాతవాహనుల దర్బారులో ఉద్యోగులుగా వుండసాగారు. శాతవాహనుల రాజ్యం అంతరించాక పల్లవ సేనాపతి కాంచీపురం రాజధానిగా, స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించాడు!

కాంచీపురం నాకు స్వంత గృహంలాగుంది. అలాగని అక్కడే వుండిపోవడం నా అభిమతం కాదు. సింహళ దేశం పోయి, భిక్షుల నియమావళి (వినయపిటకాన్ని)ని చదవాలని నా ఆశయం! కానీ, వెంటనే కాంచీపురాన్ని విడిచి వెళతా నన్నది బాగుండదు. కొన్నాళ్ళు కాంచీపురం నివాసం వుత్తమం! అయితే నేనిక్కడ సంగీతాచార్యుడిగా ప్రసిద్ధి పొంద దలచుకోలేదు. ఇక్కడకూడా సంగీతశిక్షణ ప్రారంభిస్తే పిష్టపురంలో జరిగినట్లే జరుగుతుందని నా భయం. కాకపోతే, మా మిత్రులతో సంగీతగోష్ఠులు నడుపుకొనేవారం!

బారాకం

కాంచీనగరంలో చార్వాక పండితుడొకాయన వున్నాడని తెలిసింది. వారి పరిచయాన్ని చేసుకొన్నాను. చార్వాక మత సిద్ధాంతాన్ననుసరించి ఆత్మ, పరమాత్మ ఉత్తరజన్మ-పూర్వజన్మ ఏమీవుండవు! ఇహజన్మ ఇహజీవితం ఈలోకపు అనుభవాలే ముఖ్యమైనవి! అంతవరకూ నేను ఇతరగ్రంథాల్లో చార్వాకమతాన్ని గురించిన విమర్శ లను చదివాను. ఇప్పుడీ పండితుని వద్ద బృహస్పతి సూత్రమూ, ఇతరమైన చార్వాక దర్శన (సిద్ధాంత) గ్రంథాలూ కొన్ని దొరికాయి. కానీ ఈ చార్వాక పండితుని యొక్క జీవిత సిద్ధాంతం, నాకేమాత్రమూ నచ్చిందికాదు. అతడిలా అంటూంటాడు: "మనకీ జీవితం ఇకదొరకదు. కనుక చాతనయినంత అనుభవించు!" "రుణంచేసి ఘృతం తాగు." "చచ్చిన తరువాత అడిగేదెవడు!" ఇదీ అతడి జీవిత సిద్ధాంతం.

పై సిద్ధాంతం చార్వాక మతకర్త లందరిదీనని, చార్వాక ఆచార్యులు అలాటి జీవిత సిద్ధాంతాన్నే పాటిస్తారని ఆ పండితుడు నాతో చెబుతూ వుండేవాడు. కానీ, నాకు చాలా సందేహంగానే వుండేది. చార్వాక మతసిద్ధాంతం పైవిధంగానే వుంటుం దని ఒప్పుకోవడానికి, నా మనస్సు అంగీకరించేదికాదు. మిత్రుడిగా చార్వాక పండితుడి దగ్గరకు వెళ్తూ వుండేవాణ్ణి. కనుక ఏ సంశయమూ లేకుండా ఆ మతాన్ని గురించి చర్చించుకొనేవారము. చార్వాక పండితుడికి, బాగా ఆస్థిపాస్తులూ, సిరి-సంపదలూ వున్నాయి. ఎప్పుడూ మద్యపానంచేసి స్త్రీలోలుడై వుండేవాడు. అప్పు డప్పుడూ నాతో ఇలా అనేవాడు. "మిత్రమా, జయా! నీకు ఎంత సుందరమైన యౌవనం లభించింది! దాన్నెందుకలా అనవసరంగా జారవిడుచుకొంటావు? ఒకసారి చేయిజారిపోయిందా, తిరిగి లభించదు! జాగ్రత్త."

"చార్వాక దర్శనానికి నీవుచెప్పే వ్యాఖ్యానం సరిపడలేదని, నా ఉద్దేశ్యము. మిత్రమా! నావరకూ నేను నీ వ్యాఖ్యానాన్ని ఒప్పుకోలేకుండా వున్నాను! చార్వాక మతం, దేవుణ్ణి ఒప్పుకోలేదంటే, అందుకు కారణం-మానవుడి భాగ్యాన్ని-మాన వుడే నిర్ణయించుకోవాలని! జీవితం అనిత్యమని చార్వాకమతం చెబుతుంది. దాని కర్థం ప్రతిక్షణం పరివర్తనకు, నూతనత్వానికి సిద్ధంగా వుండమని చెప్పడం! చార్వాకమతం పరలోకాన్ని ఒప్పుకోదు. దాని అర్థం నీవు సృష్టించుకొన్న పర లోకం మిధ్య కనుక అలాగే, స్వసౌఖ్యాలతోటీ సుఖశాంతులతోటీ తులతూగే ట్లుగా ఈ లోకాన్నే తయారు చేసుకో! చార్వాక సిద్ధాంతాన్ని నేనిలా అర్థం చేసు కొన్నాను!"

"నీవు చెప్పిన ప్రకారంచేస్తే, ఏమౌతుందో తెలుసా? ఈ లోకాన్ని స్వర్గం చేసుకునే ప్రయత్నంలో, మనం గతిస్తాము. మూర్ఖులమై లభ్యమైన వర్తమాన సౌఖ్యానికికూడా దూరుల మవుతాము!" అన్నాడు చార్వాక పండితుడు.

"లభ్యమైన వర్తమాన సౌఖ్యాన్ని వదలుకోమని నే ననటంలేదు! ఏదయినా సౌఖ్యాన్ని మనం అనుభవిస్తున్నామంటే, అది ప్రజలందరి సామూహిక ప్రయత్నం

తల్లనే! కనుక సౌఖ్యాలను ఒంటరిగా అనుభవించడం శావ్యంకాదు! ఈ ప్రపంచాన్ని సర్వసౌఖ్యాలతోటి సమృద్ధం చేయాలంటే, ప్రజలందరూ కలిసి ప్రయత్నించవలసిందే! పరాన్నభుక్కులుగా బ్రతకడం పొరపాటు! మన చుట్టుపట్ల ప్రజల జీవితం, సుఖంగా వున్నప్పుడే, మన జీవితమూ సౌఖ్యప్రద మౌతుంది. మిమ్మల్నే ఉదాహరణగా తీసుకొందాము. మీ అన్నో తమ్ముడో అసౌఖ్యంతో, బాధలో వున్నాడనుకోండి; అప్పుడు మీరిలా సౌఖ్యాన్నీ, విలాసాన్నీ అనుభవించ గలరా?"

"కొన్ని విషయాలు వ్యక్తిగతాభిప్రాయం మీదకూడా ఆధారపడివుంటాయి. నా హృదయం ఇంకా పూర్తిగా 'చార్వాకం' కాలేదు! కొంతమంది చార్వాక పండితులు, పూర్తి వర్తమానానికి, భోగలాలసత్వానికి—అనుయాయులై యుంటారు! అంటే వారికి ఈ క్షణాన అనుభవించే అనుభవమే ముఖ్యం! కానీ, చార్వాకమతానికి నేనింకా అంతగట్టి అనుయాయిని కాలేకపోయాను!"

"మానవుడు అంత పాషాణ హృదయుడు ఎన్నటికీ కాలేడు. అతని హృదయము, భావాలూ కోమలంగా వుంటాయి! నిరపరాధిమీద ఎవడయినా అన్యాయం చేస్తూవుంటే, చూస్తూ వూరుకోలేడు!" అన్నాను.

"మీరు చెప్పే ఈ సిద్ధాంతాన్ని ఏ చార్వాక గ్రంథంలోనూ చూడలేదు!" అన్నాడు చార్వాక పండితుడు.

"చార్వాక సిద్ధాంతం, ఏ ఋషులూ, మునులూ చెప్పింది కాదు! ఋషుల పేరుమీద గ్రంథాలను వ్రాసి ప్రజల బుద్ధిని మలినపరిచేది కాదీ సిద్ధాంతం. ఇప్పుడు మీకు చార్వాక మతగ్రంథాలుగా లభ్యమయ్యేవి చార్వాక మతకర్తలు వ్రాసినవికావు. రాజులూ, మహారాజులూ, ధనికశ్రేష్ఠులూ — తమ భోగలాలసతకు బలాన్నియడానికి సృష్టించారా గ్రంథాలను!"

"రాజులూ, మహారాజు లంటున్నావు — వాళ్ళల్లో ఎంతమందిని చార్వాక మతానుయాయులను చూశావు?"

"ఎందరేమిటి? ఒక రకంగా రాజులందరూ ఈ భ్రష్ట (అసలు కాదు) చార్వాక మతానుయాయులే! ఇక్కడ నా అభిప్రాయం, ఇప్పుడు మీరు చెబుతూన్న సిద్ధాంతం (చార్వాకం) అసలు రాజుల్దీ, మహారాజుల్దీ, ధనిక శ్రేష్ఠుల్దీను! వారందరూ తూ.చ. తప్పకుండా యిదే సిద్ధాంతాన్ని అనుసరిస్తున్నారు. భోగం, స్వార్థం— ఇవే ముఖ్యం. తమ స్వార్థానికి అభ్యంతరం కలిగినప్పుడు తండ్రినైనా, అన్నదమ్ముల నయినా అంత మొందించడం ఇవే ముఖ్యం వారికి!"

"మరీ వాళ్ళు నా సిద్ధాంతాన్ని హేళన చేస్తున్నారుగా!"

"వాళ్ళు మీ సిద్ధాంతాన్ని అనుసరిస్తారు. కానీ, బాహాటంగా వారు చార్వాక మతానుయాయులమని ఒప్పుకోలేరు! అందుకు కారణం, వాళ్ళు తినేది దొంగతిండి! దొంగ వెన్నెలరాత్రిలో రాగలడా!" అన్నాను.

లోకాయతం.

"చాలా కఠోరమైన పదజాలాన్ని వాడుతున్నావు మిత్రమా!"

"నేనేమైనా అసత్యాన్ని మాట్లాడానా? ఈ లోకాన్ని నమ్మి ప్రాయం చేసిందెవరు? ఈ రాజులు నిజంగా పరలోకాన్ని నమ్మేవారైతే, ఈ లోకపు భోగాలతో వారికి సంబంధమేమిటి? గాలీ, నీరూ, ఎండుటాకుర్తో - జీవితాన్ని గడుపుకునే వారేగా? ఈ రాజులు నిజంగా పరలోకవాదులే అయి, ఈ లోకపు సిరిసంపదల్ని గ్రహించకుండా వున్నట్లయితే, సామాన్యులు ఇప్పటికంటే కొంచెం సుఖంగా బ్రతికేవారేమో? కానీ, వాళ్ళు పరలోకవాదుల్లా కేవలము నటిస్తున్నారు. ఈ జన్మలో తామనుభవించే సౌఖ్యాలు-భోగాలూ పూర్వజన్మలో తాము సంపాయించి పెట్టుకొన్నవేనని ప్రజల్ని విశ్వసింపచేయడానికి ఇలా ప్రవర్తిస్తుంటారు!"

"నీవు చెప్పింది నాకూ అన్వయిస్తుందే?"

"అవును. మీరూ వారితోపాటే వున్నారు. రాజుల జీవిత సిద్ధాంతమూ మీ జీవిత సిద్ధాంతమూ ఒకటేను. కాని అసలైన చార్వాకం ప్రపంచాన్ని సుఖసంపదల్తో తులతూగుతుండగా చూడాలనుకొంటుంది. మానవుల్లో పరస్పరం ప్రేమనీ, భాతృ భావననీ పెంపొందించా లంటుంది!"

"మీరు చెప్పేది ఏ చార్వాక మతాన్ని గురించి?"

"బుద్ధినీ, అనుభవాన్నీ, కార్యకారణ సంబంధాన్నీ తనకు పథ ప్రదర్శకులుగా పెట్టుకున్న చార్వాకమతాన్ని గురించి నేను చెబుతున్నాను. మీరు మొదట ఒక రకమైన గ్రంథాలకు, ఋషులకు, మునులకు దాసులై వుండేవారు. ఇప్పుడు మరొక రకమైన గ్రంథాలకు, భావాలకు దాసులయ్యారు. భేదం ఏముంది? మీరూ "వర్తమాన భోగవిలాసాలే" ముఖ్యమనే మతానుయాయులు, ఈ నగరపు రాజకుమారుడూ (పల్లవ కుమారుడు) అదే మతానుయాయులు! మీరు ఈశ్వరుణ్ని, పరలోకాన్ని ఒప్పుకోరు. పల్లవ రాకుమారుడు కూడా ఒప్పుకోడు! ఇక మీకూ, రాజులకూ, మహారాజులకూ వ్యత్యాసం ఏమిటి? కాకపోతే మీరు "నేను ఈశ్వరుణ్ణి పరలోకాన్ని ఒప్పుకోవడంలేదు. కనుక బుద్ధివాదినని గర్విస్తారు."

"ఐతే, మిత్రమా! మేము చార్వాకులం, బుద్ధివాదాన్ని వ్యాపింపచేయడంలో (హేతువాదం) కొంతపని చేశామనైనా ఒప్పుకొంటావా?"

"మీరు పనిచేశారా, చెయ్యలేదా? అనేదికాదు సమస్య! చేసిన పనిని సరిగా చేశారా లేదా? అనేదే సమస్య."

"మేము చేసే పనిని సరిగానే చేశాము మిత్రమా! భోగలాలసతనూ, బుద్ధివాదాన్నీ కలిపి, చీకట్లో కొట్టుమిట్టాడుతున్న ప్రపంచాన్ని వెలుగులోకి లాగాము."

"ఐతే, మీరు గుడిమల్లపు మహాతీర్థాన్ని దర్శించారా?"

"చాలా సార్లు దర్శించాను!"

"కేవలము దర్శనానికేనా? కాక పుణ్యాన్ని ఆర్జించడానికా?"

"మిత్రులకు, సహచరులకు ఒక విషయాన్ని స్పష్టపరచడానికి వెళ్ళేవాడిని. భోగలాలసే సర్వమతాల సారమని, భోగేంద్రియ (శిశ్నం)మే దేవుళ్ళకూ కూడా దేవుడైన మహాదేవుడనీ—తెలియపరచడానికి వెళ్ళేవాడిని!"

"మీ మిత్రుల కీ విషయం తెలియదన్నట్లు?"

"తెల్సును. కానీ ఒప్పుకోరు!"

"అవును. మీరు వప్పించారుగా. ఇక మీ మిత్రులు తమ స్వీకారాన్ని మోషిస్తూ తిరుగుతారు! "పరలోకమూ, పరాశక్తి, ఈశ్వరుడూ—ఇవన్నీ అన్ని మతాలకూ తెరల్లాంటివి. ఈ తెరల్ని వత్తిగిలించి చూస్తే సర్వమతాల సారమూ భోగలాలసేనని స్పష్టంగా తెలుస్తుంది!" అని అంటారు మీ మిత్రులు. కాని, మీ మిత్రులు ఒక్క భోగాన్నే కాదు ప్రచారం చేసేది; పశుకామాన్ని, ఏహ్యమైన, నీచమైన భోగాన్ని ప్రచారం చేస్తున్నారు; మానవ సహజమైన భోగము సదా గ్రాహ్యమే! కాని, దొంగలా పదిమందిని దోచుకొని, ఒంటరిగా అనుభవించడమున్నదే, అది పశుభోగం, పశుకామం! ఏ భోగలాలస మానవులందరికీ సులభ్యమో, ఏ భోగలాలసను భవిష్యత్తరాలు కూడా సులభంగా అనుభవించగలవో, అదీ గ్రాహ్యమైన భోగలాలస."

"మీ ఊహలు చాలా బాగున్నాయి. సుందరమైనవి. కాని, ఆచరణకు నిలవ్వు. ఊరంతటికీ ఆహారం సంపాయించ లేకపోయామని మన ముందున్న ఆహారాన్ని తినకుండా పారేసుకోగలమా?"

"ఊరంతా పస్తు పడుకొన్నప్పుడు, నీవు నీ ముందున్న ఆహారాన్ని పారేయడం కాదు చేయాల్సిన పని. నీలాటి ఆకలిగొన్న మరొక మానవుడికి అందించాలి. అది సహజమైన మానవ హృదయం చేసే పని! ఊరంతా ఆకలిగొన్నప్పుడు ఆ ఆకలిని తీర్చడానికి ఆలోచించాలి. ప్రయత్నించాలి. అదీ సహజమైన మానవ బుద్ధి!"

"ఐతే, మీరు చెప్తున్న ఈ పద్ధతిని ప్రపంచం అనుసరించడానికి సిద్ధంగా వుందా?"

"ఈ పద్ధతిని అనుసరించడానికి ప్రపంచం ఏనాడో సిద్ధమైయుండేది. కాని, కొంతమంది దొంగలూ—తోడుబోతులూ ఈ ప్రపంచాన్ని ముందడుగు వేయనీయ లేదు."

"ఈ ప్రపంచంలో మీరు చెప్పే దొంగలూ, తోడుబోతుల సంఖ్య ఎంతని మీ ఉద్దేశం? వారీ ప్రపంచాన్నే ముందడుగు వేయకుండా ఆపారంటున్నారు."

"సంఖ్య ఎంత అయినప్పటికీ, రాజ్యం వాళ్ళచేతుల్లోవుంది. వాళ్ళు పన్నిన వల చాలా గట్టిది. వాళ్ళ దగ్గిరవున్న ఆయుధాలు బలమైనవి."

"ఐతే, నీ ఆశయం చాలా దుర్లభమైంది. ఇదిగో, ఎర్రని ద్రాక్షసారాయం ఆహ్వానిస్తోంది, రా!"

పిఠాపురంలో లాగే, కాంచీపురంలో కూడా ఎప్పుడూ విదేశీయులు కనుపిస్తూం టారు. నాకు ఏదో ఒకపని చేయాలనే విధి ఏమీలేదు! సింహవర్మ తల్లిదండ్రులు బాగా సంపన్నులు. నేను ఒకటి రెండు సంవత్సరాలు అక్కడే వుండిపోయినా వారి కేలాటి బాధా వుండదు. కాని మనోరంజనానికి పోగర తీసుకుని శిల్పాలను చెక్కడం ప్రారంభించాను. దాసుల క్రయవిక్రయానికి సంబంధించిన శిల్పాన్నొక దాన్ని చెక్కసాగాను. ఇది కాల్పనిక శిల్పంకాదు. వాస్తవిక శిల్పం! కాంచీపురం సమస్త దక్షిణా పథంలోకీ గొప్ప రాజధాని. గొప్ప బానిసల వ్యాపార కేంద్రం కూడాను. ధనికులకు నెలజీతగాళ్ళయిన నౌకర్లతో సంతృప్తి కలగదు. పశువుల్లా రాత్రిం బవళ్ళు సేవచేసే బానిసలు కావాలి! కాంచీపురంలో బానిసల వ్యాపారానికి ప్రత్యేక వీధులు, అంగళ్ళు ఉన్నాయి. అక్కడి బానిసల వ్యాపారుల ఆకారాలు చాలా విచిత్రంగానూ, రకరకాలుగానూ ఉంటాయి. ఒకడు యౌవనుడులా వుంటాడు. మరొకడు చీనాదేశీయుడిలా ఉంటాడు. వాళ్ళు తమ దాసుల్ని సముద్ర తీరాలనుండి, పశువుల మందలు పట్టుకువచ్చినట్టు పట్టుకు వస్తారు. కొనుగోలుదార్లు ఆ అంగళ్ళ దగ్గరకు పోగానే వ్యాపారులు తమ చాకచక్యాన్ని చూపించ మొదలు పెడతారు. నలభై ఏండ్ల బానిసను, ఇరవై ఏండ్ల బానిస అనే అంటాడు వ్యాపారి. గొడ్డుమోతు స్త్రీ బానిసను చూపి 'ఇది ప్రతి సంవత్సరం ప్రసవిస్తోందం'టాడు. పొట్టివాడిని తీసుకువచ్చి వీడింకా పెరిగేవయస్సులోనే వున్నాడంటాడు. బలహీనుణ్ణి తీసుకువచ్చి ప్రయాణపు బడలికతో వున్నాడంటాడు. ఇలాగే అనేకం చెప్తాడు. ధర విషయంలోకూడా అన్యవస్తువుల వ్యాపారుల్లా మొదట పది దీనార్లు చెప్పిన బానిసను చివరకు అయిదు దీనార్లకే అమ్మేస్తాడు. బానిసల్లో కొంతమంది నీగ్రోలు కూడా వున్నారు. నేను పైన చెప్పిన విషయం, అన్యదేశీయులైన బానిసల్ది. వీరు కాక మన దేశపు బానిసలు కూడా వుండేవారు. మనదేశపు బానిసల్ని చిన్నతనంనుండి చూస్తూండేవాడిని. మన దేశంలో బానిసలు మూడు విధాలుగా తయారవుతారు. వంశపారంపర్యంగా, తల్లిదండ్రులు అమ్మడంవల్ల, ప్రభుత్వ దండనవల్ల—ఈ మూడు స్థితుల్లోనూ బానిసలు తయారవుతూండేవారు మన దేశంలో. కాని, అన్య దేశాల్లో మానవులు బానిసలుగా ఎలా తయారవుతారో తెలుసుకోవాలనిపించేది. పశ్చిమ దేశాల్లో మృగాలను పట్టినట్లు వలలనువేసి మానవుల్ని పడతారట! వాళ్ళ బాధలనూ, గాథలనూ తెల్సుకోవడానికి బానిసల వీధికి వెళ్తూవుండేవాణ్ణి. కాని, వాళ్ళ మాటలు ఒక్కటీ అర్థమయ్యేదికాదు. యవన దేశపు శ్వేతాంగినులు కూడా కొంతమంది, బానిసల్లో ఉండేవారు. వాళ్ళ భాష నాకు తెలిసినా ఇవ్వాళ చూసిన బానిస రేపు ఉండేదికాదు. వాళ్ళు అందంగా ఉండేవాళ్ళు. బానిసల వ్యాపారులు ఈ శ్వేతాంగినులకు, మంచి భోజనమునకూ, శృంగారానికీ తగిన సదుపాయాల్ని కలి గించేవారు. అవును మరి, ధర తక్కువ పలుకుతుందన్న బానిసల్ని అలాగే దూళిలో తిండీ, తిప్పలూ లేకుండా విడిచిపెట్టేవారు. మంచి ధర వస్తుందనుకున్న బానిసల్ని

చక్కగా శృంగారించి, అలంకరించేవారు. మానవ జీవితాలలో యిలా పరిహాస క్రమం సాగుతూ వుండేది. ఇలాటి క్రూర నాటకాన్ని చూసి "పూర్వజన్మ ఫలం" అనే ధూర్తులయిన పూర్వజన్మ వాదులను చూస్తూండేవాడిని. నీచులయిన బానిసల వ్యాపారులు అధిక ధరల కొరకు అలంకరించడం, మంచి తిండి పెట్టడం పూర్వజన్మ ఫలమా? ఒక రోజున నాకు అలగ్జాండ్రియా దాసు ఒకడు కనుపించాడు. అతడు చిన్నతనంలో భారతీయ వ్యాపారి దగ్గిర పెరిగాడుట. ఇలా చెప్పాడు: "మా గ్రామం సముద్ర తీరానవుంది. ఒక రోజున దొంగలు వచ్చిపడ్డారు మా వూరి మీదకు. మేము పౌరుషంగా పోరాడాము. చాలామంది చనిపోయారు. దొంగలు బలవంతులయ్యారు. కొంతమంది పారిపోయారు. మరికొంతమందిమి ప్రాణాలతో పట్టుబడ్డాము. మమ్మల్నా దొంగలు బానిసల వ్యాపారులకు అమ్మేశారు. నాతోపాటు పట్టుబడిన వారందరూ దారిలోనే అమ్ముడు పోయారు. నలుగురు సింహళంలో అమ్ముడు పోయారు. నే నిక్కడ అమ్ముడవడానికి వచ్చాను!"

పాపం వాళ్ళు విదేశీయులు, తాము దాసులు కాదనీ సద్గృహస్థులమనీ ఎలా చెప్పుకోగలరు?

చీకటిపడగానే బానిసల్నందర్నీ గదుల్లోకి నెట్టేవారు పశువుల్లా! మరీ ఎండగావున్న రోజున నలుగురైదుగురు బానిసల్ని ఒకే గొలుసున కట్టివేసి బయటపడేసేవారు. నే నలా గొలుసుల్తో కట్టివేయబడి బయట పడవేయబడిన బానిసల ఆకారాలనే రాతిమీద చెక్కుతున్నాను. నా శిల్పంలో ముగ్గురు మగ బానిసలూ, ఇద్దరు ఆడ బానిసలూ వున్నారు. అందరూ ఒకే గొలుసుతో కట్టి వేయబడివున్నారు. నేను ఆ బానిసల ఆకారాల్ని రాతి మీద చెక్కడానికి బానిసల వ్యాపారినడిగి అనుమతి తీసుకొన్నాను. అతడు నేను అడగడంవలన రెండురోజులా బానిసల్ని బయటపడేసి వుంచాడు. శిల్పం తయారైంది. శిల్పంలో ఒకవైపున వికృతమైన ముఖ ముద్రలో బానిసల వ్యాపారిని కూడా చిత్రించాను. బేరమాడ డానికి వచ్చిన బేరగాడిలా సింహవర్మను చెక్కాను. నా మిత్రుడు చార్వాక పండితుణ్ణి పిల్చుకువచ్చి చూపుతూ— "చూశావా మిత్రమా? పరలోకవాదానికి, మీ భోగలాలసత్వానికి ఫలితం ఈ లోకంలో యెలా వుంటుందో ?" అన్నాడు.

నల్లని ఆకారాలూ, లావాటి పెదాలూ (నీగ్రోలు) కల బానిసల్ని, బానిస వ్యాపార్లు ముట్టడించి పట్టుకొని తీసుకువస్తారట. బానిసల వ్యాపారులకు, ఇలా వీరి పల్లెలమీదపడి బంధించుకు రావడానికి ఒక ప్రత్యేకమైన సైన్యంకూడా వుందిట ! ఈ విషయాన్ని విన్నప్పుడు శబరపల్లె నా కండ్లకు కట్టినట్టయింది. "పాపం వీరికి కూడా అలాటి పల్లెలే వుండేవిగావును. తల్లీ, తండ్రీ, అన్నా, చెల్లె లూతో—చాలా ఆనందంతో కాలాన్ని గడుపుతూ వుండేవారు గావును" అను కొనేవాడిని.

బానిసత్వమూ, బానిసలూ అనేక రకాలు. మొదటిరకం బానిసలు అంతః పురాల్లో వుంటారు. రెండవరకం బానిసలు భగవద్భక్తులు. ఇక మూడవరకం బానిసలు నేను శిల్పంలో చెక్కినవారు. కొంతమంది భగవద్భక్తులయిన మిత్రులున్నారు నాకు. వాళ్ళతో ఎప్పుడయినా నాస్తికుడైన చార్వాకమిత్రుడి సంగతి చెబితే ఇలా అనేవారు : "ప్రతిపనికి ఒక కారణమంటూ వుంటుంది. కుండను తయారుచేసే కుమ్మరి ఒకడుంటాడు. అలాగే ఈ ప్రపంచానికి కర్త ఒకడుంటాడు!"

"తప్పకుండా కర్త ఒకడుంటాడు. అతడే ఈ దాసుల్ని(బానిసల్ని) కూడా సృష్టించి వుంటాడు ! మానవుల్ని ఇలా సృష్టించిన అతడెంత క్రూరుడు !" అనేవాణ్ణి.

వాళ్ళప్పుడు పూర్వజన్మసుకృతాన్ని స్మరణకు తెచ్చుకొనేవారు. నేనిలా అనేవాణ్ణి: "పాపం, అనవసరంగా దొంగను తిడతాము. చేతులు నరుకుతాము. ఉరి తీస్తాము. కొండమీది నుండి క్రిందకు తోస్తాము. అతడేం దోషం చేశాడు? పరిశ్రమ చేస్తున్నాడు. తన పూర్వజన్మ ఫలితాన్ని పొందడానికి పోతున్నాడు. మరింక నిందించడం, దండించడం ఎందుకు ?"

ఈ దక్షిణాపథానికీ ఉత్తర భారతదేశానికీ చాలా వ్యత్యాసం వుంది. అయితే, ఆ వ్యత్యాసం ప్రభువుల మనస్తత్వాల్లో మాత్రం లేదు. అంటే ఉత్తర భారతంలోని ప్రభువుల్లో ఏ భావాలూ, ప్రవృత్తులైతే వున్నాయో, అవే భావాలూ, ప్రవృత్తులూ దక్షిణా పథంలోని ప్రభువుల్లోనూ వున్నాయి. ఇక్కడ శ్రమణు (బౌద్ధభిక్షువులు) లకు చాలా గౌరవం వుంది. బ్రాహ్మణులకు మరింకా ఎక్కువ గౌరవం వుంది. కారణం ఎవడికైనా ఉత్తమజాతిని ప్రసాదించగల అధికారం వాళ్ళకే వుందాయె! భిక్షువుల్లో అన్నిజాతుల ప్రజలూ వున్నారు. కనుక వీరిసంఖ్య బ్రాహ్మణులకంటే అధికం. బౌద్ధభిక్షువుల్లో కులభేదం వుండరాదు. కాని దక్షిణాపథంలోని బౌద్ధులు కులాన్ని జాతిని విచక్షణ చేస్తూవుంటారు! పల్లవులు బౌద్ధ భిక్షువులకు ఎన్నో విహారాలను కట్టించారు. ఎన్నో గ్రామాలను దానమిచ్చారు. విద్వాంసులయిన బౌద్ధ భిక్షువులను గౌరవించేవారు కూడాను. కాని, వారికి బౌద్ధుల కంటే, బ్రాహ్మణుల వల్లనే అధిక ప్రయోజనం కలుగుతూవుండేది."

నేను ఒక సంవత్సరం నుండి కాంచిలో వుంటున్నాను. నా నిజపరిచయాన్ని తెలియపరచకుండా ఎంతోమంది పండితులను,కళాకారులను కలుసుకొన్నాను. వారిని కల్సుకోవడానికి బాగా సమయాన్ని ఖర్చుపెట్టే వాణ్ణి! సాయం సమయాల్లో, నేనూ, సింహవర్మా, వదినె చషకాలను సేవిస్తూ, వీణావాదనాన్నీ, సంగీతాన్ని వింటూ వినోదంగా గడిపేవారం. అభిప్రాయాల్లో ఎంత భేదం వున్నప్పటికీ చార్వాక పండితుడూ, నేనూ చాలా ఆత్మీయులుగా వున్నాము. అప్పుడప్పుడూ కాంచీపురపు మహా విహారాన్ని కూడా దర్శిస్తూ వుండేవాణ్ణి! పండితులైన బౌద్ధ భిక్షువుల్తో చర్చలు

జరుగుతూండేవి. నేను బౌద్ధ మతానుయాయిని కాకపోయినప్పటికీ, బుద్ధుడు పురుషుల్లో సర్వశ్రేష్ఠుడనీ ఒప్పుకొనేవాడిని. అక్కడి బౌద్ధభిక్షువులుకూడా నన్నెంతో గౌరవంగా, ఆదరభావంతో చూసేవారు. అందుకు నేను ఆచార్య వసుబంధు యొక్క శిష్యుణ్ణి కావడం కూడా ఒక కారణమైయుండవచ్చు! ఆచార్య వసుబంధు యొక్క కీర్తి సముద్రాల్ని దాటి, అన్యదేశాల్లో, ద్వీపాల్లో కూడా వ్యాపించింది. కొద్దిరోజుల క్రితం యువకుడైన బౌద్ధ భిక్షువొకడు నాకు పరిచయమైనాడు. అతడు నా దగ్గిర ఆచార్య వసుబంధు యొక్క 'వాదవిధాన' అనే గ్రంథాన్నీ మరి యితర గ్రంథాలనూ అధ్యయనం చేశాడు. ఆ యువకుడు మంచి ప్రతిభావంతుడేకాక, అధ్యయన శీలి! అతడు ఆచార్య వసుబంధు యొక్క దర్శనాన్ని చేసుకొనడానికి ఎంతో కుతూహల పడుతున్నాడు. అప్పుడు ఆచార్య వసుబంధు గాంధార దేశంలో వున్నారు. ఆ యువకుణ్ణి ఆచార్యులవారి వద్దకు వెళ్ళమని ప్రోత్సహించాను. నేను కాంచీపురంలో ఉండగానే ఆ యువకుడు ఉత్తరదేశానికి బయల్దేరి వెళ్ళిపోయాడు. తరువాత ఆ బ్రాహ్మణ యువకుడు-అతడి పేరు జ్ఞాన-ఆచార్యుల వారి జ్ఞాన రాశినుండి ఎంతో జ్ఞానాన్ని ఆర్జించి, మహాపండితు డయ్యాడు. ఆ తరువాత, మత సంబంధమైన చర్చల్లో, తర్కాల్లో అతడు ఘటికు డనిపించుకున్నాడు. అతడి పేరంటేనే బ్రాహ్మణులకు హడలు !

చివరకు నేను కాంచీపురంనుండి వెళ్ళే సమయం వచ్చింది. దాదాపు మూడు సంవత్సరాలపాటు నేను, సింహవర్మ, వాసంతి కలసి వున్నాము. కష్టాల్లో, సుఖాల్లో ఒకరిని ఒకరం వీడకుండా వున్నాం. అలాటి పరమ మిత్రుల్ని వీడిపోవడమంటే హృదయంలో ఏదో బాధ గూడుకట్టుకొన సాగింది. అప్పుడు వాసంతి వదినె ఇలా అంది: "మనం ఆజీవం కలిసే వుంటామను కొన్నాను! మరదీ! ఈ వియోగంకంటే, మన మా శబరపల్లెలోనే వుంటే బాగుండేదేమో!"

"వదినే అప్పటి నీ వేషం నీకు జ్ఞాపకం వుందా?"

"మరదీ! నీవు మొదటగా నన్నుకూడా ఆ శబర యువతుల్లాగానే వస్త్రాల్ని ధరించమన్నప్పుడు నిజంగా ఎంత బాధ కలిగిందను కొన్నావు? కాని, ఎంతబాధో అంత సంతోషం కూడా కలిగింది!"

"సంతోషం కూడానా?"

"అవును మరి, మరది చెప్పాడాయె! సంతోషం కలగదా?" అన్నాడు సింహవర్మ.

"నిజం, మరదీ! ఈ నాగరిక జీవితానికీ, ఆ పల్లె జీవితానికి పోల్చుకొని చూస్తే, ఆ జీవితం ఎంతో మధురమైందిగానూ, సరళమైందిగానూ కనిపిస్తోంది! ఈ నాగరిక జీవితంలో భోగలాలసత సర్వసౌఖ్యాలూ సులభమైనప్పటికీ, ఒక వికృతి, క్రూరత తాండవిస్తున్న యీ జీవితంలో! నీవు చెక్కిన 'ఆ బానిసల శిల్పం హృదయాన్ని ఎంత గాయపరుస్తుంది? శబరపల్లె ప్రజలు మూర్ఖులూ, అజానులూ,

అనాగరికులూ కావచ్చు. కానీ, అక్కడిలాటి బానిసత్వానికి అవకాశం వుందా! పాపమా "శ్యామాంగి" ఎంత సరళమయిన స్వభావం కలది? అలాటి సఖి జీవితంలో మరెక్కడా లభించదు?"

"లభించడం దుర్లభమేమీ కాదు! మళ్ళీ అలాగే ఒక ఓడ పగిలిపోయి మనం అక్కడికే పోకూడదా?" అన్నాడు సింహవర్మ.

"ఒక్కసారి విడివడ్డ తరువాత, తిరిగి ముడిపడడం అసంభవం! అసలు మానవ జీవితమే అంత. వియోగమే ఈ జీవితపు సహజలక్షణం! చెట్లూ, చేమలూ అయితే ఒకేచోట వుండి, పెరిగి అంతమవుతాయి!" అన్నాను.

వాసంతి వదినెను, సింహవర్మను వదిలిపోయేప్పుడు అపారమయిన వేదనను అనుభవించాను!

# సింహళంలో

సింహళం వెళ్ళడానికి స్థలమార్గం నుండి భారతదేశపు దక్షిణపు కొసవరకూ వెళ్ళి అక్కడినుండి ఒక్క ఆరు యోజనాల దూరం మాత్రం సముద్రయానం చేస్తే చాలు! మరొక మార్గం కావేరీ పట్టణం వరకూ స్థలమార్గాన వెళ్ళి, అక్కడి నుండి సింహళం వెళ్ళే ఓడను ఎక్కితే సరిపోతుంది. మొదటి మార్గాన వెళితే పాండ్యుల రాజధాని మధురనుకూడా చూడవచ్చు! కానీ, ఈ స్థలమార్గం చాలా కష్టసాధ్యమయినది. అడవులూ, అడవి జంతువుల భయమే కాకుండా, దొంగల భయం కూడా చాలా ఉంటుంది. కనుక, నేను రెండవ మార్గాన్ననుసరించి కావేరీ పట్టణం వరకూ వెళ్ళి, అక్కడ సింహళం వెళ్ళే ఓడ నెక్కాను. ఓడలో ఒంటరితనం బాగా వేధిస్తుంది. కాని, మానవుడు ఎంత అపరిచితమైన ప్రదేశంలోనూ స్నేహాన్నీ, పరిచయాన్నీ పెంపొందించుకోగలడు. నేను వెళ్ళే ఓడలో చాలామంది ప్రయాణీకులున్నారు. ఎక్కువమంది సింహళులు! వారి భాష నాకు క్రొత్తదే అయినా, కొంచం కష్టంగా అర్థం చేసుకోగలుగు తున్నాను. కాని, ఓడలోకొంతమంది పాండ్య, పల్లవ రాజ్యాల ప్రజలుకూడా ఉన్నారు. నేను రెండేళ్ళు ద్రవిడదేశంలో ఉన్నప్పటికీ వీరి భాషను అర్థం చేసుకోవడం అసంభవంగానే ఉంది. యాత్రికుల్లో ఇతర అనేక ద్వీప ద్వీపాంతరాల ప్రజలుకూడా ఉన్నారు. వారిలో యవ(జావా)ద్వీపపు బ్రాహ్మణ యువకు డొకడు నాకు స్నేహితుడయ్యాడు. ఒక సింహళ యువకుడు కూడా మాకు తోడయ్యాడు! సింహళ యువకుడి పేరు రోహణుడు. యవద్వీపపు యువకుని పేరు అర్జునుడు. సింహళాన్ని గురించి భారతదేశంలో ఉండగా యెన్నో చిత్ర విచిత్రాలయిన కథలను విన్నాను. సింహళం రాక్షసుల దేశమని, వాళ్ళు అన్య దేశీయులను పశువుల్లా మారుస్తారనీ, మార్గం పిశాచాలతో, రాక్షసులతో నిండి ఉంటుందనీ ఎన్నో కథల్ని విన్నాను. సింహళద్వీపపు చేరువకు వెళుతున్న కొలదీ అవన్నీ అసత్యాలని తెలిసిపోతున్నది.

నేను రోహణుణ్ణి యిలా అడిగాను: "బడబానలం మీ సింహళ భూభాగంమీద నుండి చూస్తే కనపడుతుం దిటగా? మీకు యెంత దూరంలో ఉంటుంది?"

"సింహళ దేశపు ఉత్తరపు భూభాగంనుండి బడబానలం కనుపించదు. సింహళదేశపు దక్షిణ తీరాన్ని రోహణ మంటారు. అక్కడనుండి చూస్తే బడబానలం

కనుపిస్తుంది. అయితే అర్థరాత్రిపూట ఎత్తైన కొండనో లేక చెట్టునో యెక్కి చూడాలి. మనం బడబానలాన్ని చూస్తున్నట్లు దేవతలకు తెల్సిందా—అక్కడే నెత్తురు కక్కుకు చనిపోతామట!" అన్నాడు సింహళ యువకుడు రోహణుడు.

"ఇలాటి కథలు అన్నిచోట్లా ప్రచారంలో వున్నాయి. మా జావా ద్వీపంలో కూడా ఒక కథ చెప్పుకొంటూ వుంటారు. బడబానలం మా ద్వీపానికి దక్షిణంగా వుందని ప్రతీతి. అక్కడా రాత్రిపూటగాని బడబానలం కనబడదంటారు. అయితే, ఎవ్వరూ చూడరు. కారణం ఏమిటో తెల్సునా? మానవుడు చూశాడా వెంటనే ఆ బడబానలం అతడిని భస్మం చేసేస్తుందిట! మా నివాసం జావాద్వీపపు దక్షిణ తీరంలోనే!" అన్నాడు అర్జునుడు.

"జావా ద్వీపపు ప్రజలు ఎలా వుంటారు?" అని నేనడిగాను.

"ఎలా వుంటారంటే? నన్ను చూస్తున్నారుగా? నాలాగే వుంటారు?" అన్నాడు అర్జునుడు.

"నే నడగడం అదికాదు. మా భారతీయులకూ, వారికీ ఏమైనా వ్యత్యాసముంటుందా?" అనడిగాను.

"చాలా భేదముంది. భారతదేశంనుండి వచ్చిన వారిలో మాత్రం జాతి భేదం వుంది. మరి యితర విషయాల్లో జావా ద్వీపవాసులకు, భారతీయులకూ సహస్రాంశం వ్యత్యాసం వుంది."

"అంటే జావా ద్వీపంలో జాతిభేదం—అంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర—ఈ భేదం లేదంటావు!"

"భారతదేశం నుండి వచ్చిన భారతీయుల్లో మాత్రం ఈ భేదం వుంది — ఐతే, వారి సంఖ్య అత్యల్పం!"

"మిత్రమా! అర్జున! నీవు అన్యథా భావించనంటే ఒక విషయం అడుగుతాను! నీవు బ్రాహ్మణుడనంటున్నావు. కానీ, నీ ఆకారం అంతా యితర జావాద్వీపవాసుల్లాగానే వుంది కదా? అదే మీసాలూ, గడ్డాలూ లేని ముఖం పైకి ఉబికిన, ఎత్తయిన ఎముకలు కల దౌడలు!" అన్నాను.

"బ్రాహ్మణులు యవద్వీపానికొచ్చాక కొంచెం ఉదారబుద్ధికల వారయ్యాం. భారతదేశంలోని తమ సహజ కాఠిన్యాన్ని కొద్దిగా తగ్గించుకొన్నారు. మా ముత్తాత ఈ కాంచీపురంనుండే యవద్వీపానికొచ్చాడు. మా పూర్వీకుల దేశాన్ని, పరివారాల్ని చూద్దామని కోర్కె కలిగింది. అందువల్లే కాంచీపురానికి వచ్చాను. కాని, యిక్కడికి వచ్చాక నేను మ్లేచ్ఛుణ్ణని నా పూర్వీకుల పరివారాల్తో నా కెలాటి సంబంధమూ లేదనీ తెల్సుకొన్నాను. అందుకు కారణం, చీనా దేశీయుల్ని బోలిన నా యీ ముఖాకృతే!"

రోహణుడు యిలా అడిగాడు: "కాని, అసలు మీ ముఖముద్రల్లో ఈ మార్పు యెందుకు వచ్చింది? మమ్మల్ని చూడు, మేము వేయి సంవత్సరాలక్రితం ఉత్తరభారతదేశంనుండి సింహళం పోయాము. ఇప్పటికీ మా ఇండ్లలో మాగధీ భాషనే మాట్లాడతాము. మా ఆకారాల్లోగాని, ముఖాకృతుల్లోగానీ ఏవిధమైన మార్పూ రాలేదు!"

అర్జున : "మా ద్వీపం చాలా పెద్దది. అక్కడి ప్రజలందరూ నాలాటి ముఖాకృతుల్ని కలిగి వుంటారు. సింహళ ద్వీపానికి మీ పూర్వీకులు ఒక పెద్ద సంఖ్యలో వెళ్ళివుంటారు. అందువల్ల మీ ఆకృతుల్లో ఎక్కువ మార్పు రాకపోయి వుండవచ్చు! మరేవో ఇతర కారణాలవల్ల మీ ఆకృతుల్లో మార్పు వచ్చి వుండ లేదు. కాని, మా యవ(జావా)ద్వీప పరిస్థితివేరు! చాలా కొద్ది సంఖ్యలో భారతీయులు వెళ్ళారక్కడికి. ఇక్కడినుండి, ఏ బ్రాహ్మణుడో, రాజవంశీకుడో, సార్థవాహుడో వెళ్ళివుంటాడనుకో? సువిస్తృతమైన యవద్వీపపుసంఖ్యలో వీరెంత? సముద్రంలో నీటిబొట్టు! ఈ వెళ్ళిన వాళ్ళుకూడా వంటరిగా వెళ్ళారు. అంటే తమ జాతి స్త్రీలను తీసికొని వెళ్ళలేదు. మా ముత్తాతగారుకూడా అంతే. సాహసవంతుడు, మంచి పండితుడు. ఇంకేం, వంటరిగా వెళ్ళిపోయాడు! మా ముత్తాతగారిపేరు భానుదత్తశర్మ! యవ ద్వీపపురాజు మహేంద్రవర్మ ఏదో యజ్ఞం చేస్తున్నాడుట అప్పుడు. వేదపాఠులైన బ్రాహ్మణులకు మంచి దక్షిణలు ముడతాయని తెలిసి, భానుదత్తశర్మగారు ఏదో ఒక ఓడమీద కూర్చుని, ఎలాగో యవ ద్వీపాన్ని చేరుకున్నాడు. మహారాజా మహేంద్రశర్మ, భానుదత్తశర్మగారి ప్రకాండ పాండిత్యానికి సంతసించి, గొప్పగా దక్షిణ నీయడమేకాకుండా, తన కూతుర్ని ఇచ్చి వివాహం చేశాడు!"

"ఐతే, యవ ద్వీపవాసుల పేర్లుకూడా భారతీయుల పేర్లలాగానే వుంటాయా?" నే నడిగాను.

"అక్కడి బ్రాహ్మణుల్లోనూ, క్షత్రియుల్లోనూ సాధారణంగా భారతదేశపు పేర్లే వాడుకలో వుంటాయి. ఐతే, ఆ పేర్లు కలవాళ్ళందరూ భారతదేశంనుండి వెళ్ళారనడానికి వీలులేదు వాళ్ళ పూర్వీకుడెవడో ఒకడు భారతదేశీయుడైయుంటాడు. అక్కడ రాజవంశాలుకూడా భారతదేశపు ప్రసిద్ధ రాజవంశాలే తమ మూలకర్తలని చెప్పుకొంటాయి. యవద్వీపపు పల్లవ రాజ వంశీయుల్ని చూశాను. భారతదేశపు పల్లవులకు, యవద్వీపపు పల్లవులకు ముఖాకృతుల్లో ఏమాత్రం పోలికలు కలవ్వు. నా తల్లి, అమ్మమ్మ, ముత్తవ—ఈ ముగ్గురూ అక్కడి రాజవంశీయులే! కనుక నాలో యవ ద్వీపవాసులయిన రాజవంశాల పోలికలు ఎక్కువగా వుండి, భానుదత్త శర్మ పోలికలు అణిగిపోయాయంటే ఆశ్చర్యపడనవసరంలేదు!"

"అంటే యవ ద్వీపవాసుల్లో భారతీయుల రక్త సమ్మిశ్రణ జరిగిందంటారు. ఈ మిశ్రణలో ఎక్కువపాళ్ళు యవద్వీప వాసుల రక్తమే వున్నా, బ్రాహ్మణ రాజ వంశాలు తమ పేర్లకు ఆధిక్యతనిచ్చుకొని అక్కడి వంశాల్ని అణచివేశారు."

"మా సింహళ బ్రాహ్మణుల విషయం ఇందుకు పూర్తి విరుద్ధం. సింహళ బ్రాహ్మణులు సహజంగా, పాటలీపుత్రం, ఉజ్జయినీ లాంటి భారతీయ నగరాలకు, విద్యాధ్యయనం కొరకు వస్తుంటారు. అక్కడి నుండి ఉత్తమ వంశీయులైన బ్రాహ్మణ కన్యల్ని వివాహం ఆడి తెచ్చుకుంటారు. సింహళ బ్రాహ్మణులకు భారతదేశంలోని తమ ప్రాచీన వంశాల్లో కూడా మంచి గౌరవం లభిస్తుంది."

"అర్జున! మా యిద్దరి ముఖాకృతుల్లో ఏమైనా వ్యత్యాసం వుందా?" అనడిగాను.

"సాధారణంగా ఒక మనిషికి, మరొక మనిషికి ముఖాకృతుల్లో వ్యత్యాసం వుంటుంది. కాని, జాతిదృష్ట్యా మీ ఇద్దరి ముఖాకృతుల్లో ఏ భేదమూ లేదు!"

"మే మిద్దరం క్షత్రియ కుమారులం. మా ఇద్దరిలో ఎలాగైతే ఆకృతుల సారుప్యం వుందో, అలాగే సింహళ—భారతీయ బ్రాహ్మణుల్లో కూడా వుంటుంది. కనుకనే వారి భాషల్లోకూడా సమానతవుంటుంది. ఆకారం— భాషా- వీటికి సంబంధించిన ఈ సమానత లేకపోతే, సింహళ బ్రాహ్మణులకు భారతీయ బ్రాహ్మణులకు సంబంధాలే వుండేవి కావు!" అన్నాడు రోహణుడు.

"యవ ద్వీపంలో నేనూ బ్రాహ్మణుణ్ణయి నందుకు గర్వపడుతూ వుండే వాణ్ణి. వేదాల్ని, శాస్త్రాల్ని – కంఠస్థం చేశాను. రాజధాని నగరం తారుమాలో, మహారాజాధిరాజ పూర్ణశర్మ కూతురు, అతిరూప సుందరి నన్ను వివాహం చేసుకోవడానికి ఎదురుచూస్తోంది. ఇప్పటికీను! కాని, నాలో నా పూర్వీకుల కులాన్నీ, వంశీయుల్నీ చూడాలన్న కోర్కె బలీయమైంది. పైగా, నాలో ఓ సన్నని ఆశ, కాంచీపురంలోని సద్బ్రాహ్మణ కుటుంబాలలోని కన్య నొకామెను వివాహమాడి తీసుకుపోవాలని! ఈ ఆదర్శాలతోనే కాంచీపురానికి పయనమయ్యాను!"

"మరి వివాహానికి కన్య లభించిందా?" అనడిగాను.

"కన్య! అక్కడి బ్రాహ్మణులు నన్ను, ఇంట్లోకే అడుగుపెట్టనీయలేదు! కాంచీపురం వెళ్ళకముందే, అక్కడ నాకు లభించబోయేస్వాగతం ఎలా వుంటుందో తెలుసుకొన్నాను. లావాటి యజ్ఞోపవీతం భుజాన వుండి, సంస్కృతాన్ని ధారాళంగా మాట్లాడగలిగి నప్పటికి కూడా నా ముఖాకృతిని చూడగానే కాంచీపుర బ్రాహ్మణులు "మ్లేచ్ఛ" డంటారని తెలుసుకున్నాను. అక్కడికి ఒకటి రెండుచోట్ల ఆత్మ విస్మృతుణ్ణయాను. వెంటనే "మ్లేచ్ఛుడు", "మ్లేచ్ఛుడు" అనే విదిలింపులు లభించాయి. ఇక నప్పటినుండి, కాంచీపురంలో ఉన్న నాలుగు రోజులూ జాగ్రత్తగా ఉన్నాను. భానుదత్తశర్మగారి వంశీయులు కనుపించారు. వారి సోదరుల సంతానాన్ని చూశాను" అన్నాడు అర్జునుడు.

"మరి వా రెలాటి స్వాగతాన్నిచ్చారు?" అనడిగాడు రోహణుడు.

"స్వాగతం! నే నసలు నా పరిచయాన్ని ఇస్తేగా? కాకపోతే మీ పూర్వీకుడు భానుదత్తశర్మ మా యవద్వీపానికి వచ్చి, గొప్పకీర్తిని గడించాడు. యవ

ద్వీపంలో ఇప్పటికీ అతడి సంతానం వున్నారు, అని మాత్రం చెప్పాను" అన్నాడు అర్జునుడు.

"నీ పరిచయాన్ని ఇవ్వకపోవడమే మంచి దయింది. యవద్వీపంలోని భానుదత్తశర్మ సంతానం, తాము బ్రాహ్మణులమని తమదేశంలో గర్వపడ వచ్చును! కానీ, ఇక్కడి బ్రాహ్మణుల దృష్టిలో వారేనాడో పతితులయ్యారు" అన్నాను.

"నాలో నేను బ్రాహ్మణున్ననే గర్వం అంతరించింది. ఇప్పుడు నన్ను నేను, జాతి, మత, కుల—ఇత్యాది భేదాలేమీలేని సామాన్య యవద్వీపవాసిగా భావించు కొంటున్నాను. సామాన్యంగా యవద్వీప వాసుల్లో కులమతాలకు సంబంధించిన భేదాలేమి వుండవు. కానీ, ఇక్కడనుండి వచ్చిన బ్రాహ్మణులు మాకో గొప్ప కులాన్ని ప్రసాదించినట్లు నటించి, మా ద్వీపవాసుల్లో భేదభావాల్ని నాటుతున్నారు. యవద్వీపవాసుల ఐక్యతకు విఘాతాన్ని కలిగిస్తున్న ఈ బ్రాహ్మణులంటే ఇపుడు నాకు చాలా ద్వేషం కలుగుతోంది!"

"బ్రాహ్మణుల చర్యలు తెల్సాయా? ఎంత బాగున్నాయో?"

"జాతిని ముక్కలు, ముక్కలు చేయడంలో వీరెంత సమర్థులో తెలిసింది కదా?"

"మా జాతిని ఇలా ముక్కలుగా చేసుకొని నిజంగా మేము అవమానాలకు పాత్రులమైనాము. నేను ద్వీపంవెళ్ళి, ఈ విషయాన్ని అక్కడి బ్రాహ్మణులమని గర్వపడేవారికి చెప్పగలను. కాని వారు స్వయంగా యీ కటువైన అనుభవాన్ని అనుభవించలేదు కనుక, బహుశః నా మాటల్ని విశ్వసించకపోవచ్చు. పైగా వారికి ఈ భేదభావం వలన, ఉత్తమ వంశీయులన్న గౌరవం, తద్వారా దాన దక్షిణలు లభిస్తున్నాయి. ఇంత తేలికగా వాటిని వదలుకొని, సామాన్య యవద్వీపవాసుల్లో తామూ ఒకరుగా మారిపోగలరా?"

"నేనొక మాట చెప్పనా? నీవు నీ ద్వీపం వెళ్ళాక అక్కడ బౌద్ధమతాన్ని ప్రచారం చేయి! బౌద్ధమతంలో కులమత వ్యత్యాసాలు ఏమీలేవు. పైగా భారతదేశం లోని కులమతాలను వ్యాపింపచేయాలన్న ఆదర్శమూ ఆ మతానికి లేదు" అన్నాను.

"కాని, భారతదేశంలో బౌద్ధులు కూడా కులమతాలతో కొట్టుకు చస్తున్నారుగా?" అన్నాడు అర్జునుడు.

"వేల సంవత్సరాలనుండి భారతదేశంలో కులమతాలు తమ వ్రేళ్ళను పాతుకు న్నున్నాయి. వాటిని పెకలించడంలో బౌద్ధులుకూడా కృతకృత్యులు కాలేక పోయారు!"

"భారతదేశంలోని బౌద్ధులు, తొమ్మిది వందల సంవత్సరాలపాటు, నిరంతరం ఈ కుల మతాలతో పోరాడారు. చివరకు అలసిపోయి, నిరాశపడి—అస్త్ర సన్యాసం చేశారు! కులమతాలకు తామే లొంగిపోయారు!" అన్నాను.

"కానీ, సింహళంలోని బౌద్ధులు, ఈ కుల మతాల వ్యత్యాసమనే మహా ప్రవాహాన్నాపడంలో చాలా వరకు కృతకృత్యులయ్యారు. సింహళంలోనూ కుల మత వ్యాత్యాసాలున్నాయి, కానీ అవి భారతదేశంలో వున్నంత క్రూరంగా మాత్రం పాటింపబడటం లేదు. ఈ విషయంలో సింహళ బౌద్ధుల్ని తప్పక అభినందించాలి" అన్నాడు రోహణుడు.

"సింహళ బౌద్ధులు ఇకమీదటకూడా ఇలాగే పట్టుదలగా పనిచేస్తే ఈ ప్రవాహాన్ని నిరోధించడంలో పూర్తిగా కృతకృత్యులవుతారు." అన్నాను నేను.

"మాకు మరొక అవకాశంకూడావుంది. అసలు మేము (సింహళులం) మేల్కొని, మాలో జాతీయత జాగృతమైన నాటినుండి, బుద్ధుడే మాకు మార్గదర్శి. బౌద్ధమతమే మా మతం. కనుక ఇతర మతాలను అనుసరించడం అంతగా జరుగదు" అన్నాడు రోహణుడు.

"బ్రాహ్మణుల మతం, జాతుల అభ్యుదయానికి ఏనాడూ సహకరించదని నేనివ్వాళ అర్థం చేసుకొన్నాను. భారతీయ జాతులకు ఈ మతం హాలాహలంతో సమానం!" అన్నాడు అర్జునుడు.

"భారతీయ బ్రాహ్మణ - మతంతోపాటు, భారతీయ రాజులు కూడా చేరారా, ఇక నసలు నీవా మతాన్ని వ్యతిరేకించనేలేవు. తలలు ఎగిరిపోతాయి!" అన్నాను.

మేము మొత్తం అయిదురోజులు ఓడలో ప్రయాణం చేశాము. ఓడలోనే స్నానపానాదులకు ఏర్పాట్లున్నాయి. కావేరీపట్టణంనుండీ కొంతమంది బ్రాహ్మణులు కూడా మాతోపాటు వస్తున్నారు. వాళ్ళు ప్రత్యేకం తమ భోజనాల్ని వండుకుంటున్నారు. వాళ్ళని విమర్శించడంలో కొంతకాలాన్ని గడిపేశాము!

తామ్రలిప్తినుండి సముద్రయానం చేసిన ఆ వెనుకటి రోజులు జ్ఞాపకానికి వస్తున్నాయి. ఆనాడు కూడా సముద్ర మిలాగే శాంతంగా ఉంది. ఆ నావ దుర్ఘటనే జరక్క పోయినట్లయితే, నే నెన్నడో సింహళానికి చేరి వుండేవాణ్ణి. కానీ, శబర పల్లెలో గడపిన రెండు సంవత్సరాల కాలం వృధాగా పోయిందని నే ననుకోవడం లేదు. ఆ రెండు సంవత్సరాల శబరపల్లె నివాసం కారణంగా నాకు యెంతో యోగ్యత, సమర్థత కలిగాయి! మధ్యాహ్నం రెండు జాములకు, మేము దిగవలసిన తీరమూ, తీరానికి దూరంగా వున్న తాళ వృక్షాలూ కనుపించాయి. సూర్యాస్తమయానికి ముందు నేను ప్రదమంగా సింహళ భూభాగంపై కాలుమోపాను!

ఎండ చాలా తీవ్రంగా వుంది. తాడిచెట్లు ఎక్కువగా వున్నాయి. ఇసుక భూమి. అక్కడక్కడ కంకర రాళ్ళున్నాయి. అక్కడి స్త్రీలు కటిస్థలానికి క్రింద కేవలం అడ్డగుడ్డనుమాత్రం ధరిస్తారు. సంపన్నులు కూడా సాధారణంగా ఇలాటి అర్ధనగ్న వస్త్రధారణలోనే వుంటారు. పై వల్లె వాడుక చాలా తక్కువ! నేను దిగినది ఒక చిన్న బస్తీ. బస్తీకి కొంచెం దూరంలో బౌద్ధవిహారం ఒకటుంది. ఆ పూటకి మేము సింహళ రాజధాని అయిన అనూరాధపురానికి చేరలేము. అయినా, ఆ

బస్తీరో ఆగడం ఇష్టంలేక ముందుకు నడిచాము. రోహణుడు, అర్జునుడు, నేనూ ముగ్గురమూ మంచి మిత్రులమైనాము! కనుకనే యవ ద్వీపానికి వెళ్ళవల్సిన అర్జునుడు కూడా మాతోటే వుండిపోయాడు.

రెండవరోజున మేము అనూరాధపురం చేరాము. ఇక్కడ భాషాసంబంధమైన ఇబ్బంది నాకు అట్టే ఏమీ కలుగలేదు. నేను పాటలీపుత్రపు వస్త్రధారణలోనే వున్నాను. అక్కడి ప్రజలకు ఈ వస్త్రధారణంటే చాలా యిష్టమని తెల్సుకొన్నాను. సింహళ ప్రజలు మాగధీయుల్లా వుంటారు. ద్రవిడ ప్రజలు కూడా చెదురుగా కనిపిస్తూంటారు. అక్కడ సాధారణంగా వ్యాపారులూ, శిల్పకారులూ ద్రవిడులే అయి వుంటారు! మార్గ మధ్యంలో రాజులూ, శ్రేష్ఠులూ పాంధశాలల్ని ఎన్నింటినో కట్టించారు.

అనూరాధపురం సింహళ దేశంలోని రాజధాను లన్నింటిలోకి పెద్దది! దాదాపుగా కాంచీపురంలా వుంటుంది. వ్యత్యాసమల్లా, అనూరాధపురంలో బౌద్ధ దేవాలయాలు ఎక్కువ! సింహళ ప్రజలకు బౌద్ధమతమంటే అపారమైన శ్రద్ధాసక్తులు. అక్కడి రాజులు కూడ బౌద్ధమతానుయాయులే! అలాగని ప్రజల్ని దోచుకోవడంలో ఉదారతని ప్రదర్శించడం ఏమీవుండదు. సామాన్య ప్రజలకు మేలు చేయడానికి ప్రభువులు ఎప్పుడూ తత్పరులై వుండేవారు. అయినా ప్రభువుల విలాసాలకు, శృంగారాలకు అంతూ పొంతూ వుండదు. లక్షల దీనార్లను విలాసాలకు ఖర్చు పెడుతూ వుంటారు. తత్ఫలితంగా, సామాన్య ప్రజలు అతిదరిద్రులు! అక్కడి 'రోహణగిరి, పద్మరాగాలకు పుష్యరాగాలకు నిధి అని ప్రతీతి. కాని అవన్నీ ప్రభువుల, సామంతుల కర్ణాలనే అలంకరిస్తాయి. వీధులు స్వచ్ఛంగా వుంటాయి. నాలుగుదార్లూ కలిసే కూడలిలో ధర్మశాల లుంటాయి. అష్టమీ, అమావాస్య, పౌర్ణమి—మొదలైన తిథుల్లో ప్రజలకు ఆ ధర్మశాలల్లో మహాపండితులైన బౌద్ధ భిక్షువులు ధర్మోపదేశాల్ని చేస్తూవుంటారు. రత్న, మాల్య, అభయగిరి చైత్యాలు ఒక మోస్తరు పర్వతాల్లా వుంటాయి. వేలకొలది స్త్రీ పురుషులు ఆ చైత్యాలు పూజించడానికి పూలమాలల్ని పుచ్చుకొని వెళ్తూంటారు.

అక్కడి రాజులను ఒక విషయంలో తప్పక అభినందించాలి. అధిక సంఖ్యలో పెద్ద పెద్ద జలాశయాల్ని నిర్మించారు! యౌధేయ భూమిలో కూడా అలాంటి జలాశయాల్ని నిర్మిస్తే ఎంత బాగుండును అనుకొన్నాను.

నేను రోహణుడి ఇంట్లోనే బసచేశాను. పాంధశాలకు పోయే అవసరమే లేకపోయింది. నేను సింహళానికి ఎందుకు వచ్చానో, ఆ విషయాన్నే మర్చిపోయాను. మొదట ఆచార్య వసుబంధు మాటల్ని విన్నప్పుడు బౌద్ధ గ్రంథాల పఠనం కొరకు సింహళం వెళ్ళాలనుకొన్న మాట నిజం! కాని, తరువాత కాలంలో సింహళంలో బౌద్ధ గ్రంథాల్ని అధ్యయనం చేయాలన్న ఆదర్శంకన్న నాలోని 'తిరుగుబోతు' ప్రవృత్తి ఈ సింహళ యాత్రకు తోడ్పడ్డది.

అనూరాధపురం కూడా నేను చూసిన ఇతర నగరాల్లాగానే ఉంది. విశాల మైన జలాశయాలు, చైత్యాలూ, ఈ అనూరాధపురపు ప్రత్యేకతలు! ఇతర విష యాల్లో అనూరాధపురం పాటలీపుత్రాన్నీ, కాంచీపురాన్నీ బోలి ఉంటుంది. అంగళ్ళూ, వీధులూ, శిల్పశాలలూ, భోగం వీధులూ అన్నీ అలాంటివే ఉన్నాయి!

అర్జునుడు ఒక వారంరోజులు మాతో గడిపి తన ద్వీపానికి వెళ్ళిపోయాడు. ఇక రోహణుడు నేనూ—ఇద్దరమే మిత్రులమైనాము. ఇద్దరమూ కలసి అనేక ప్రదే శాల్ని చూడడానికి వెళ్ళాము! సింహళ ద్వీపాన్ని గురించిన ఒక ప్రాచీన గాథను ఇలా చెప్పాడు రోహణుడు:

"రోహణుడు పూర్వీకులు సముద్రయానం చేస్తూ, దారి తప్పి ఈ తామ్రపర్ణి (సింహళ) రేవుకు వచ్చారు. వీళ్ళ గౌరవర్ణాన్ని చూసి, సింహళ ద్వీపపు ఆదివాసి ఒకామె (సింహళ ద్వీపపు ఆది నివాసులు నల్లగా వుంటారు. మన ప్రాంతపు యానాదుల్లా! అనాదికి వికృతం యానాది ॥అను॥) ఈ ఆగంతకుల్లో ఒకతన్ని ప్రేమించిందట! ఇంకేం ఈ నూతనులు ఆమె ద్వారా ఆ ఆదివాసుల రహస్యా లన్నింటినీ తెలుసుకొని, వారిని ఓడించి ఈ ద్వీపాన్ని స్వాధీనం చేసు కొన్నారుట!"

పై కథను విన్న తరువాత, శ్యామాంగీ, శబరులూ జ్ఞాపకానికి వచ్చారు. నే నలా ప్రవర్తించనందుకు నన్ను నేనే అభినందించు కొన్నాను!

# ప్రేమ - త్యాగం

అనూరాధపురంలో వున్నన్నాళ్ళూ రెండు మూడు రోజులకు ఒక మాటు మహా విహారానికిగానీ, అభయగిరికిగానీ వెళ్తూండేవాణ్ని. మహా విహారంలోనూ, అభయగిరిలోనూ ప్రకాండ పండితులైన బౌద్ధభిక్షువులు వుంటుండేవారు. వారిని తరచు కలసికొంటూ, మాట్లాడుతూ వుండేవాణ్ని. బుద్ధుడు లిచ్ఛవీ గణాన్ని ఆదర్శంగా పెట్టుకొని భిక్షు సంఘాన్ని నిర్మించాడు. ఎటూ వర్తమాన కాలంలో లిచ్ఛవి గణంలేదు. కనుక ఆ గణాన్ని గురించి తెల్సుకోవాలంటే భిక్షుసంఘపు నియమాల్ని అధ్యయనం చేయడ మొక్కటే మార్గం! భిక్షుసంఘపు నియమాలు వినయపిటకంలో ఉన్నాయి. ఆ నియమాలను అధ్యయనం చేసే అధికారం భిక్షువులకేగాని వుండదని తరువాత తెల్సింది. నే నొకరోజున భిక్షువు నవడానికి పూర్తిగా సిద్ధపడి, మహా విహారపు మహాస్థవిరుడు 'సుమన' వద్దకు వెళ్ళి, నాకు భిక్షు దీక్షను ప్రసాదించమని ప్రార్థించాను !

మహాస్థవిర సుమన యిలా అన్నారు: "నీవు యౌధేయ గణపుత్రుడవని విని చాలా సంతసిస్తున్నాను. కాని, భిక్షు దీక్షను పొందడానికి తల్లిదండ్రుల ఆజ్ఞ కావాలి !"

"భన్తే! తల్లి పసితనంలోనే గతించింది. తండ్రివద్ద ఆజ్ఞను పొందాను!"

"కాని, చిరంజీవి! ఒక వ్యక్తి ఎవరికీ భిక్షుదీక్షను ఈయలేడు! భిక్షుదీక్షను యిచ్చే అధికారం కేవలము సంఘానికే వుంటుంది. నీవు చెప్పిన విషయాల దృష్ట్యా నీకు భిక్షు దీక్ష నీయడానికి సంఘాని కెలాంటి అభ్యంతరమూ వుండదను కొంటాను!"

"కాని, భన్తే! తమరు సమస్త సింహళంలోని యాభైవేల మంది భిక్షువులకు మహానాయకులు గదా?"

"మహా నాయకుణ్ణేగాని, మహారాజును మాత్రం కాదు! సంఘంయొక్క ఆజ్ఞానుసారం ప్రవర్తించగలనేగాని, స్వతంత్రంగా నేను చేయగలిగింది ఏమీ వుండదు. నీవు భిక్షువు అవుతున్నావంటే, బుద్ధుని సంఘంలో సభ్యుడి వవుతున్నా వన్నమాట! కనుక నీకుకూడా అందరి భిక్షువులకు ఉన్నట్లు కొన్ని అధికారాలు,

కర్తవ్యాలూ వుంటాయి. ఐతే, చిరంజీవీ! గతంలో నీవు బౌద్ధ మతానికి వ్యతిరిక్తమైన మరే మతానికి అనుయాయివి కావుకదా?"

"లేదు, భన్తే! మా వంశం మొదట్నుండి బుద్ధభగవానుడి అడుగుజాడల్లోనే నడుస్తూంది!"

"ఐతే, చిరంజీవీ, భిక్షు సంఘం ఒక చిన్న సభను తీరుస్తుంది. ఆ సభలో నిన్ను పరీక్షచేసి భిక్షుదీక్ష నిస్తారు!"

కొన్ని రోజుల తరువాత సంఘం సభ తీర్చింది. మిత్రుడు రోహణుడు నాకు అవసరమైన ఎనిమిది పరికరాలనూ తెచ్చి ఇచ్చాడు. మూడు వస్త్రాలూ, ఇనుప భిక్షాపాత్ర ఒకటి, మంగలి కత్తి ఒకటి, ఒక సూది, నీటి పాత్ర ఒకటి, నడుము పటాకా ఒకటి! ఈ ఎనిమిది సామగ్రులతో, భిక్షువేషంలో మహావిహారానికి వెళ్ళాను. భిక్షు సంఘం ఎదురుగా ఆశీనమైయుంది. మహాస్థవిర సుమన ఉన్నతాసనాన్ని అలంకరించారు. సంఘం తరపున ఒక భిక్షువు నన్నిలా ప్రశ్నించాడు: "చిరంజీవి! కుష్ఠు, క్షయ మొదలైన వంశానుగతంగా వచ్చే అంటు జాడ్యాలేమైనా ఉన్నాయా నీకు?"

"లేదు, భన్తే!" అని సమాధానమిచ్చాను.

"నీవు పురుషుడివేనా?"

"పురుషుడనే భన్తే!"

"దాసుడివి (బానిసవు) కావు కదా?"

"కాను, భన్తే!"

"రుణగ్రస్తుడివి కావుకదా?"

"కాదు, భన్తే!"

"రాజ సైనికుడివి కాదు కదా?"

"కాదు, భన్తే!"

"నీవు నీ తల్లిదండ్రుల్లో ఏ ఒక్కరి వద్దనైనా, భిక్షు దీక్షను పొందడానికి అనుమతి పొందావా?"

"పొందాను భన్తే!"

"నీకు ఇరవై ఏండ్ల వయస్సు నిండిందా?"

"నిండింది భన్తే!"

"నీవద్ద, నీకు అవసరమైన వస్త్రాలూ, పాత్రలూ వున్నాయా?"

"ఉన్నాయి భన్తే!"

తరువాత ఆ భిక్షువు, ఇక మీదట నన్ను సంఘం వేయబోయే ప్రశ్నలకు సమాధానాన్నియవల్సిన విధానాన్ని తెలియపర్చాడు. తిరిగి ఒకమాటు నాచే సంఘానికి నమస్కారం చేయించాడు. ఇలా అన్నాడు: "చిరంజీవి, జయా! ఇప్పుడు సంఘం నిన్ను కొన్ని ప్రశ్నలు వేస్తుంది. 'అవును' 'కాదు' అని క్లుప్తంగా సమా.

ధానా న్నియాలి. నీవు ఒకటి మాత్రం జ్ఞప్తి ఉంచుకో. సంఘం ముందు ఎలాటి స్థితిరోనూ, ఎలాటి విషయానికిగానీ అసత్యం ఆడరాదు."

తరువాత ఆ భిక్షువు సంఘానికి అభిముఖుడై "భన్తే! సంఘాన్ని ఒక విషయంలో అభ్యర్థిస్తున్నాను! ఈ చిరంజీవి, జయుడు భిక్షువుకాగోరుచున్నాడు!" అన్నాడు.

నేను సంఘానికి నమస్కరించి ఇలా అన్నాను: "నాకు భిక్షుదీక్షని ప్రసాదించమని సంఘాన్ని వేడుకొంటున్నాను. పవిత్రమైన సంఘం కృపాదృష్టితో నాకు భిక్షుత్వాన్ని ప్రసాదించాలి!"

పై వాక్యాల్ని మూడుసార్లు వల్లించాను. మరికొన్ని ప్రశ్నోత్తరాలు జరిగాయి. శరీర యాత్రను సాగించడానికి కేవలము నాలుగు విషయాల్ని ఆశ్రయించవచ్చునన్నారు. (1) భిక్షం ఎత్తుకొని భోంచేయాలి. ఎవరైనా నియంత్రిస్తే వెళ్ళి భోజనాన్ని స్వీకరించవచ్చు. గృహస్థులు విసర్జించిన చినిగిన వస్త్రాలను కుట్టుకొని ధరించవచ్చు. ఎవరైనా మంచి వస్త్రాలను దానం చేస్తే, స్వీకరించవచ్చు. (2) వస్త్రాలు నూలు, ఉన్ని, పట్టు—వీటిలో ఏవైనా ఉపయోగించుకొనవచ్చును. (3) నివాసం, చెట్టుక్రింద ఉండవచ్చు. సంఘపు విహారంలో ఆశ్రయం దొరికితే అక్కడా ఉండవచ్చు. (4) ఔషధ రూపంలో గోమూత్రాన్నిమాత్రం స్వీకరించవచ్చు. లభిస్తే పాలూ, వెన్నా, నేయీ, మధువు చక్కెర—వీటిని స్వీకరించవచ్చును.

భిక్షు సంఘం ఒక ప్రత్యేకమైన సంస్థ! ఆ సంస్థలోని అనేక విషయాలు ఇప్పటికీ యౌధేయగణంలో ఆచరింప బడుతున్నాయి. భిక్షు దీక్షను స్వీకరించిన తర్వాత చాలా ఇష్టంగా వినయ పిటకాన్ని అధ్యయనం చేయసాగాను.

అధికారం ఒకేవ్యక్తి చేతుల్లోకి పోకుండా చూడడానికి వినయ పిటకంలో చాలా జాగ్రత్తలు సూచించబడినాయి. ముందు ఉదహరించిన ఎనిమిది వస్తువులు కాక, భిక్షువు మరేవిధమైన స్థావర జంగమ సంపత్తికీ—అధికారి కాలేడు! ఇండ్లూ, వాకిండ్లూ పెద్ద పెద్ద ప్రాసాదాలూ, పొలం పుట్రలూ అన్నీ సంఘపరంగానే ఉంటాయి. కాని చాలామంది భిక్షువులు వ్యక్తిగత ఆస్తిపాస్తుల్ని ఏర్పరచుకోసాగారు. ఈ స్థితి నా మనస్సుని చాలా ఖేదపరచింది. మహాస్థవిర సుమన అలాటి స్వార్థపరులుకాదు. ఒకనాడు వారితో బౌద్ధ భిక్షువులు వ్యక్తిగత ఆస్తిపాస్తుల్ని ఏర్పరచుకోవడాన్ని గురించి ప్రస్తావించాను. వారిలా అన్నారు: "చిరంజీవి జయా! బౌద్ధ భిక్షువులు వ్యక్తిగత ఆస్తిపాస్తులకు వారసులు కావడం, చాలా గర్హింపదగిన విషయం! బుద్ధభగవానుల వారి ఆదేశానుసారం బౌద్ధభిక్షువు తనకు లభించిన ఏ కొద్దిపాటి పదార్థాన్నయినా, అందరు భిక్షువుల్తోపాటు పంచుకు తినవల్సిందే. ఒంటరిగా తినరాదు! అలాంటి నియమాలన్నీ ఈనాడు శిథిలమైనాయి. భిక్షువులు కూడా వ్యక్తిగత ఆస్తికి వారసులౌతున్నారు. కాని, అందుకు మనం చేయగలిగింది

మాత్రం ఏముంది? రాజులు భూమి పన్ను, ఉప్పపన్ను, వ్యాపారానికి పన్ను-ఇలాగే అనేకరకాలైన పన్నుల్ని విధించి, ప్రజలవద్దనున్న ధనాన్ని లాగికొని, తమ కోశాల్ని నింపుకొంటున్నారు. సార్థవాహులూ, శ్రేష్ఠులూ, సామంతులూ వీరందరూ ఈ దోపిడీలో భాగస్వాములు. మరి భిక్షుసంఘానికి దాన దక్షిణలు ఇచ్చేదికూడా ఈ దోపిడీదార్లేకదా! వారిష్టం! ఒక్కొక్కప్పుడు సంఘానికి ఈయకుండా తమకు ప్రియపాత్రుడయిన భిక్షువుకు ఇస్తుంటారు దానదక్షిణలు. వద్దనగలమా?"

"అంతే, సంఘానికి రాజ్యశక్తిలేదు. వున్నట్లయితే తన నియమాలను సంఘ సభ్యులు ఒప్పుకొనేట్లు చేయగలిగేది! అంతేనా, భన్తే!"

భిక్షువునయ్యాక భిక్షాటనద్వారా లభించిన భోజనాన్ని మాత్రమే భుజిస్తానని ప్రతిన పట్టాను. నేను మొదటసారిగా కాషాయ వస్త్రాన్ని ధరించి, భిక్షాపాత్రను పుచ్చుకొని భిక్షాటనానికి బయల్దేరినప్పుడు, చాలాసిగ్గుపడిపోయాను. జీవితంలో అదే, నేను ప్రథమంగా భిక్షమెత్తడం! నాకు ముందు, మహాస్థవిర సుమన వెళ్తున్నారు. వారి వెనుక నేనూ మంత్రముగ్ధుడిలా నడుస్తున్నాను. ఒక ఇంటి ముందు ఆగాను. గృహిణి అన్నము, చాపలూ, కూరా,— వేసి వంగి నమస్కరించింది! రెండవ, మూడవ....అన్ని ఇండ్లముందూ అలాగే జరిగింది. చాలినంత ఆహారం దొరికాక, మేమందరం వెనక్కి తిరిగి విహారానికొచ్చేశాం. మహాస్థవిర సుమన అందరి భిక్షా పాత్రల్లోని ఆహారాన్ని ఒకచోట ప్రోగుచేశారు. మొదటగా వృద్ధులూ రోగులూ అయిన భిక్షువులకు ఆహారాన్నిచ్చారు. మిగిలిన ఆహారాన్ని అందరమూ సమాన భాగములుగా పంచుకొన్నాము.

ఒక నెల తరువాత పాటలీపుత్రపు సార్థవాహుడొకడు అనూరాధపురానికి వచ్చాడు. అతడివలన మహాభట్టారిక (అజ్జుక) మృత్యువార్తను విన్నాను. అజ్జుక మృత్యువార్తను విన్న తరువాత ఎంత ఆపుకొన్నా కన్నీరు ఆగలేదు. ఇక నామహా విహారంలో వుండలేకపోయాను. మహాస్థవిర సుమనయొక్క ఆజ్ఞను తీసుకొని చైత్య పర్వతానికి వచ్చాను. చైత్యపర్వతంలో ఏకాంతత బాగా లభిస్తుంది. వెనక అశోకుని కుమారుడు మహేంద్రుడు ఈ చైత్యపర్వతంలోనే తన జీవితాన్ని గడిపాడుట! నేను చైత్యగిరిలో వున్నన్నాళ్ళూ కేవలం మధ్యాహ్న సమయాల్లో ఆహారానికి మాత్రం బయటకు వచ్చేవాణ్ణి! మిగిలినసమయాల్లో నా గుహలో, ఏకాంతంలో కన్నీరుకారుస్తూ గడిపేవాణ్ణి. ఒక నెల రోజులవరకూ అలా దుఃఖంతో చైత్యపర్వతంలో గడిపి, తరువాత అనూరాధపురానికి తిరిగి వచ్చేశాను.

* * * *

నేను సింహళానికి వెళ్ళి రెండేండ్లు వెళ్ళిపోవస్తున్నాయి. అప్పుడే నే నా దేశాన్ని విడిచి మాతృదేశానికి మరలవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. సముద్ర గుప్తుడు స్వర్గస్థుడయ్యాడు. రామగుప్తుణ్ని చంపి చంద్రగుప్తుడు సింహాసనాన్నధి ష్ఠించాడు. నేను భారతదేశానికి అంత త్వరలో తిరిగి రావడానికి, పై సంఘటనలు

అష్టమి, అమావాస్య, పౌర్ణమి

కారణం కాకపోయినా, చంద్రగుప్తుడు సింహాసనాన్ని అధిష్టించడం నన్ను దీర్ఘ చింతలో మాత్రం పడేసింది! చంద్రగుప్తుణ్ని నేను బాగా ఎరుగుదును. అతడి ఆదర్శాలుకూడా నాకు తెలుసును. కనుకనే చంద్రగుప్తుడు, రామగుప్తుణ్ని చంపి, అతని భార్య అయిన ధృవదేవి (ధృవస్వామి)ని వివాహమాడాడని విన్నప్పుడు కూడా నాకు అట్టే ఆశ్చర్యమేమీ కలుగలేదు. పైగా సహజమే ననిపించింది. చంద్ర గుప్తుణ్ని గురించి నే నేమైతే వూహిస్తున్నానో- అది నిజమౌతుం దనుకున్నాను.

నేను సింహళ ద్వీపంలో వున్నన్నాళ్ళూ, భిక్షువు రూపంలోనే ఉన్నాను. భిక్షువులు ధరించే మాసిన, అతుకులతో నిండిన వస్త్రం, తైల సంస్కారంలేని తలా, కఠిన నియమాలతో జీవితాన్ని గడుపుతుండడం వలన శరీరంలో కలిగిన ఒక రకమైన శిథిలత— నాలోని సహజ సౌందర్యాన్నీ తారుణ్యాన్నీ ఏ మాత్రమూ తగ్గించలేకపోయాయి! భిక్షకు వెళ్ళినప్పుడు సహజంగా చూపుల్ని దించుకొని వుంటాము. భిక్షాపాత్రలో పదార్థాలను వేస్తున్న యువతుల ముంజేతులను మాత్రమే మేము చూడగలుగుతాము. కాని, మాకు భిక్ష వేసే యువతులు మమ్మల్ని సంపూర్ణంగా చూడగలరు! ఒక్కొక్కప్పుడు నేను తలఎత్తి ముందుకు చూడడం కూడా జరిగేది. అలా చూచినప్పుడు తరచుగా తరుణుల విప్పార్ల నేత్రాలు కనిపిస్తూండేవి!

అనూరాధపురంలో, ప్రత్యేకమైన కొన్ని తిదుర్లో, రాజాంతఃపురాలు, సత్రాలు, ధర్మశాలలు, నాలుగు బజార్ల కూడళ్ళూ- మొదలైన అనేకచోట్ల బౌద్ధ మతాన్ని గురించిన ధర్మోపదేశాలు జరుగుతుంటాయి. నేను విద్వాంసుణ్నని తెలిశాక, ప్రత్యేక తిదుర్లో రాజాంతఃపురానికి వెళ్ళి ధర్మోపదేశం చేయమన్నారు. కాని, కొంతను కాదని చర్చ జరిగాక రాజాంతఃపురాన్ని మార్పించుకొన్నాను. ప్రతి అష్టమీ, అమావాస్యా, పౌర్ణమి తిదుర్లో ఒక కూడలిలోగల చత్వరంలో ధర్మోపదేశం చేయడానికి వప్పుకొన్నాను.

ఈ ధర్మోపదేశాలు రాత్రి ప్రథమయామం (జాము) తరువాత ప్రారంభ మౌతాయి. రాత్రి అంతిమ యామంవరకూ సాగుతుంటాయి! నేనుకూడా ధర్మాసనం మీద కూర్చుని జాముల తరబడి ఉపదేశిస్తూ వుండేవాణ్ని! సాధారణంగా నేను చెప్పే విషయాలన్నీ ఏవో గ్రంథాల్లోనుండి కంఠస్థం చేసినవే ఐవుండేవి. కాని అప్పుడప్పుడూ నా స్వంతభావాల్ని కూడా బయలుపరుస్తూండేవాణ్ణి! ఈ ఉపదేశా లను వినడానికి ఎక్కువగా శ్రేష్ఠి- పత్నులూ, శ్రేష్ఠి—కన్యలూ వస్తుండేవారు. ఆ రోజున వీరు సహజంగానే ఉపవాసవ్రతాన్ని పాటించి వుంటారు. కనుక, పై వల్లెల్ని వేసుకొంటూ ఉంటారు. ఒక్కో యువతి రోజూలాగానే పైవల్లెలేకుండా, అడ్డగుడ్డతోనే వచ్చేది. స్త్రీలు ఆనాడు ప్రత్యేకమైన అలంకరణ ఏమీ చేసుకొనేవారు కాదు. అయినా కొంతమంది యువతులు తమ సహజ సౌందర్యంతో దీప్తించి పోతూండేవారు! ఈ శ్రేష్ఠికన్యల్లో శ్యామాంగినుల కంటే, గౌరాంగినుల సంఖ్య

ఎక్కువ! ఒకొక్క యువతి యవసుల్లా తెల్లగావుండి మహాశ్వేత అనిపించుకొంటూ వుంటుంది.

ఉపదేశకుడు తన శ్రోతలను ఎప్పుడూ చూస్తూ ఉపదేశించలేడు. మధ్య మధ్య అతని దృష్టి కొద్దిక్షణాల విశ్రాంతిని కోరుతూ వుంటుంది. నేను నాదృష్టిని విశ్రాంతి కొరకు, కుడిచేతి ప్రక్కన వున్న రాతి స్థంభం దగ్గర నిలుపుతూ వుండే వాడిని. మేము శ్రోత్రుమండలి నంతటిని సమభావంతో చూస్తాం. అంటే, ప్రత్యేకం ఎవరెక్కడ కూర్చున్నారనేదిగాని, ఎవరి ముఖాలనుండి ఎలాటి భావాలు వెలువడుతున్నాయనే విషయంగాని మాకు అనవసరం! కాని, కొద్దికాలం తరువాత, నాదృష్టిని విశ్రాంతి కొరకు నిల్పే రాతి స్థంభందగ్గిర ఎప్పుడూ ఒకే రకమైన ముఖాలు కనుపిస్తున్నా యనిపించింది నాకు! ఆ ముఖాల్లో ఒక గౌరవర్ణ యువతి ముఖం ప్రత్యేకం నావంక ఆసక్తిగా చూస్తూ కనిపించేది. ఆమె గౌరవర్ణ ముఖము, నల్లని శిరోజాలు, నీలి మేఘావృతమైన చంద్రబింబాన్ని స్ఫురింపచేస్తూ వుండేవి. కనుబొమలు ధనురాకారంలో వుండేవి. గుండ్రని ముఖంలో విశాలమైన కండ్లు, సన్నని అదరం, తెల్లని కపోలాలూ ఆమె సౌందర్యాన్ని నూరింతలు చేస్తూండేవి! ఆమెకు ఇరవైఏండ్ల వయస్సుండ వచ్చును. కొన్ని ఉపదేశాలు గడిచాక నేను ధర్మాసనం మీద వున్నంతసేపూ ఆమె దృష్టి నా ముఖంమీదనే వుంటూందన్న విషయాన్ని కూడా గమనించాను. ఐతే ఆమె నా ఉపదేశాలను చక్కగా అర్థంచేసుకుంటున్నదని మాత్రమే నేననుకున్నాను. ఆమె ప్రతి అష్టమీ అమావాస్యా, పౌర్ణమీ తిధుల్లో ఉపవాసం వుండేది. పూజకొరకు, త్రికరణం (బుద్ధుణ్ణి-మతాన్ని-సంఘాన్ని శరణు వేడడానికి) కొరకు విహారానికి వస్తూండేది. ఆ రోజున రుచ్యమైన తినుబండారాలను కూడా తీసుకువస్తూండేది. నామీద అపారమైన భక్తిశ్రద్ధలను కనబరచేది. నేనూ, ఇతర భిక్షువులుకూడా ఆమెను గురించి శ్రద్ధాభక్తులుగల ఉపాసిక (బౌద్ధ మతాన్ననుసరించే స్త్రీ) అనుకొనేవారం. ఇక నామె నామీద చూపే ప్రత్యేకశ్రద్ధను గురించి "మంచి ధర్మోపదేశకులమీద శ్రోతలుభక్తిభావాన్ని ప్రదర్శించడం సహజం" అనుకొనేవారం.

ఆమె అనూరాధపురంలోని ప్రసిద్ధుడయిన ఒక సార్థవాహుని భార్య.

కొన్నినెలల అనంతరం ఒకరోజున ఆమె తన దాసిని విహారానికి పంపించింది. ఆ దాసి చెప్పిన సమాచారాన్ననుసరించి సార్థవాహుని భార్య చాలా అస్వస్థతలో వుందనీ, నేనూ మరొక నలుగురు భిక్షువులు వెళ్ళి బుద్ధుని సూత్రాల్ని పఠించితే ఆమె మనస్సుకు వూరట కలుగుతుందనీ తెలిసింది. మహాస్థవిర వద్ద అనుజ్ఞ తీసుకొని ఆ ఉపాసిక గృహానికి వెళ్ళాము. మంగళ కలశం అమర్చివుంది. పరిత్రాణ దేశన (బుద్ధుని సూత్రాల పఠనం) ప్రారంభించాం. నాలుగు ఐదు రోజుల తరువాత ఆమె తన ఆరోగ్యం కొంచెం కుదుటపడిందని చెప్పింది. అలా ఒక నెల రోజులపాటు సూత్ర పాఠం జరిగింది. ఆమె తన పాకశాలలో మత్స్య-మాంసా

దుల్ని రకరకాలుగా వండించి, రుచ్యమైన భోజనాన్ని ఆరగింపచేసేది. ఆమె తన చేత్తో మాకు శ్రద్ధగా వడ్డించేది.

సూత్రపాఠం జరిగేటప్పుడు ఆమె అనేక రకాలైన ప్రశ్నలు వేసింది. శీలాన్ని గురించి, సదాచారాన్ని గురించి, ఆత్మవాదం, నిర్వాణం మొదలైన గహన విషయాల్ని గురించి ప్రశ్నిస్తూ వుండేది. నేను ఎప్పుడూ ఒక ఉత్తముడైన భిక్షువులా వ్యవహరిస్తూండేవాణ్ని. సమాధానాలిస్తూ వుండేవాణ్ణి. ఒకమాటు ఆ ఉపాసిక నిర్వాణాన్ని గురించి తన అభిప్రాయాన్నిలా వ్యక్తపరచింది. "భన్తే! ఆత్మ అనే నిత్యమైన పదార్థం ఏదో వుందని నేను ఒప్పుకోవడంలేదు. ఆత్మా లేదు; గీత్మాలేదు. ఒక చైతన్య (జ్ఞాన) ప్రవాహం మాత్రం ఉంటుంది. అది నిరంతరం చస్తూ పుడుతూన్న చైతన్య బిందువుల కలయిక—లేక ప్రవాహం. ఆ చైతన్య ప్రవాహం నిరుద్ధ మవడమే నిర్వాణం! నేను చెప్పడం సరైనదే నంటారా?"

"అవును. ఉపాసికా! సత్యాన్నే చెప్తూన్నావు!"

"మరైతే నిర్వాణం తరువాత ఏమీ ఉండదు. శూన్యం! ఇకనప్పుడు నిర్వాణానికి ఇటుగా వున్న ఈ జీవిత ప్రవాహాల్ని గురించి ఆలోచించడం, చింతించడం ఉచితంకదా?"

"అవును, ఉపాసికా!"

"భన్తే! దుఃఖం, దుఃఖం అంటాము. ప్రపంచంలో దుఃఖం కాక మరేమీ లేదా?"

"ఉపాసికా! బుద్ధభగవానులు ఒకమాటు ఇలా అన్నారు: జీవితం పూర్తి దుఃఖమయమైనట్టయితే మానవులు ఒక్క క్షణం కూడా బ్రతుకలేరు!"

ఉపాసిక నవ్వుతూ నా కండ్లలోకి చూసి— "భన్తే! మరొక భిక్షువు అయి నట్లయితే, ఇలాటి ప్రశ్నల కసలు అనుమతినే ఇవ్వరు! తమరు జంబూ ద్వీపపు (భారతదేశపు) భిక్షువులు! మీ సమాధానాలు నా శంకల్ని పరిహరిస్తున్నాయి!" అన్నది.

"ప్రశ్నలకు అనుమతి నీయకపోవడం మంచిదికాదు! ఈ బౌద్ధమతం మూర్ఖులు అనుసరించే మతం కాదు!"

"భన్తే, నేను చిన్ననాటినుండి భగవానుని సూత్రాలను పఠిస్తున్నాను. పైగా జీవితానుభవం కూడా 'జీవితం ఒట్టి దుఃఖదాయకమైందికాదని' చెబుతోంది. కనుక జీవితంలో సుఖ దుఃఖాలు రెండూ వున్నాయనే దృష్టి అలవరచుకోవడమే ఉత్తమం అంటారా?"

"అవును, ఉపాసికా!"

ఆ ఉపాసిక భక్తి దిన దిన ప్రవర్ధమానంగా పెరిగిపోతోంది. ఆమె భర్త (సార్థవాహుడు) వ్యాపారంలోనూ, ధనోపార్జనలోనూ చాలా ఘటికుడు. కాని,

ఇతర విషయాల్లో బహు మూర్ఖుడు. భార్య కారణంగా అతడూ నా వద్దకు అప్పు డప్పుడు వస్తూవుండేవాడు. మా మాటల్నీ, భావాల్నీ అతడు అర్థం చేసుకున్నాడో లేదో చెప్పడం కష్టం! నన్నుమాత్రం చాలా ఆదరభావంతో చూచేవాడు.

ఈ ఉపాసికకు అనూరాధపురంలోని ఇతర సార్థవాహుల భార్యల్లోనూ కొంతవరకూ అంతఃపుర రాణుల్లోనూ మంచి పేరు ప్రతిష్ఠలున్నాయి! ఈమె భక్తి జ్ఞానమూ తరచు అంతఃపురాల్లో చర్చనీయాంశంగా పరిణమించేది. ఈమె వలన క్రమంగా నేనుకూడా సార్థవాహుల పత్నుల్లోనూ, అంతఃపుర రాణుల్లోనూ ప్రసిద్ధుణ్ణి కాసాగాను. ఉత్తముడినైన బౌద్ధ భిక్షువుగా ప్రచారం పొందాను. తత్ఫలితంగా, రాణులనుండి, సార్థవాహుల భార్యలనుండి నిత్యం నాకేదో ఒక కానుక లభిస్తూవుండేది. ఏ రోజు కారోజు నాకు లభించిన కానుక లన్నింటినీ సంఘపరం చేస్తుండేవాణ్ణి!

ఒకరోజున సార్థవాహుని పత్ని ఒక అతిసుందరమైన చీనాంబరాన్ని నాకు కానుకగా ఇచ్చింది. ఇస్తూ చేతులు జోడించి ఇలా అన్నది: "భన్తే! ఈ బహు మూల్యమైన చీనాంబరం ఉపాసకుడు (సార్థవాహుడు) చీనా దేశంనుండి క్రొత్తగా తీసుకొని వచ్చాడు. నేను నా చేతుల్తో కత్తిరించి కుట్టాను. ఈ చీవరాన్ని (బౌద్ధ భిక్షువులు ధరించే పొడుగాటి చొక్కా) తమరు స్వీకరించాలి!"

"ఉపాసికా? నూతన వస్త్రాలను ధరించడం నా నియమానికి విరుద్ధం! వీధుల్లో దొరికిన, చినిగిన వస్త్రాలతో చీవరాన్ని తయారుచేసుకుంటాను!" అన్నాను.

చాలాసార్లు బ్రతిమలాడింది. కాని నేను తిరస్కరించాను. చివరకిలా అంది ఆ ఉపాసిక! "పోనీ ఒక్కమాటు మీరు ధరిస్తే, ఈ కండ్లతో చూసి కృతార్థురాల నవుతాను!"

ఇక నామె మాటను తోసివేయలేకపోయాను; అప్పుడే ప్రత్యేక కోష్టకంలోకి వెళ్ళి చీవరాన్ని ధరించి బయటికి వచ్చాను. ఉపాసిక ప్రసన్నవదనయై, విప్పారిన నేత్రాల్తో నావంక చూసింది. ఆమె అంజలిఘటించి- "చాలు, భన్తే! భగవానులు ఎలా వుంటారో చూడాలనేదే నా కోరిక! నేత్రానందమైంది!" అన్నది.

ఉపాసిక ఇలా ప్రవర్తించడం నాకే మాత్రమూ నచ్చలేదు. కాని, భక్తులు తమ భక్తి పారవశ్యంలో యిలా చేస్తుంటారని తెలుసు. క్రొత్తచీవరాల్ని ధరించడానికి నే నెప్పుడూ ఇష్టపడలేదు. కాని, ఆమె నన్ను సదా తమ యింట్లోనే భోం చేస్తూండవలసిందని ప్రార్థించింది. ఈ రెండవ ప్రార్థనను మాత్రం నేను త్రోసి వేయలేకపోయాను. ఆ ఉపాసిక సంఘానికి అనేకరకాలైన దాన దక్షిణలనిస్తూ వుంటుంది. కనుక ఆమెకు సంఘంలో మంచి పలుకుబడికూడా వుంది. నేను మొదట ఆమె ఈ రెండవ ప్రస్తావననుకూడా తిరస్కరించాను. అప్పుడు నా తోటి

క్షువులు యిలా అన్నారు: "శ్రద్ధాళువైన ఉపాసిక మనస్సును నొప్పించరాదు. అందువల్ల సంఘపు ఆదాయం దెబ్బతింటుంది!"

సంఘపు ఆదాయానికి అభ్యంతరాన్ని కల్గించడం ఒక గొప్ప అపరాధంగా పరిగణించబడుతోంది. అయితే నే నా ఉపాసిక ఆహ్వానాన్ని తిరస్కరించడం ద్వారా సంఘ ఆదాయానికి అభ్యంతరాన్ని కలిగించానా? అన్నదొక సమస్య! అయినా, నేనా సమస్యను గురించి చర్చించదలచుకోలేదు. మరుసటి రోజునుండి మధ్యాహ్న భోజనం కొరకు ఆ ఉపాసిక నివాసానికి వెళ్ళసాగాను.

ప్రథమంలో, ఆమె భక్తిశ్రద్ధల్లో నా కెలాటి ఇతర భావనా కనుపించలేదు. మంచి విజ్ఞతగల ఉపాసిక అని మాత్రం అనుకొన్నాను. నా విద్యనూ, సరళమైన నా వ్యవహారాన్నీ చూసి ప్రభావితయైందని ఊహించాను. కాని మా పరిచయం కొంచెం అధికమైనప్పటినుండి ఆమె మైమరచి గంటలతరబడి, నా ముఖంలోకి చూస్తూ వుండేది! కాని, ఆమె ఈ ధార్మికమైన ప్రేమ, శారీరకమైన ప్రేమగా ఎప్పుడు మారిందో నాకు తెలియదు! తన ప్రేమమీదా, ప్రవర్తనమీదా ఆమె నిజంగా గొప్ప నిగ్రహాన్ని కలిగివుంది. అదేస్థానంలో మరొక స్త్రీ అయినట్లయితే ఏనాడో తూలిపోయేది. ఇప్పుడామె వెనుకటిలా ప్రశ్నలు వేయడం మానుకుంది. సాధారణంగా మౌనాన్ని వహించేది. నేను వెళ్ళగానే పీటనువేసి భోజనం వడ్డించేది. అనూరాధపురంలో దాదాపుగా పన్నెండు నెలలూ ఎండలే కాస్తుంటాయి. అనూరాధపురంలోనే కాక, మొత్తం సింహళద్వీపంలోనే ఎండలు అధికం. చలి అసలు వుండదు. వర్షాకాలంలో మాత్రం కొంచం తక్కువగా వుంటాయి ఎండలు. మిగిలిన అన్ని నెలల్లోనూ ఒకటే ఎండలు. ఉపాసిక నేను భోజనం చేస్తున్నంతసేపూ విసురుతూ నా ముఖంలోకి చూస్తూండేది. నేనూ ఆమె కండ్లలోకి చూడడానికి ఇప్పుడంతగా సిగ్గుపడడం లేదు. ఆమె కండ్లలో ఒక ప్రత్యేకమైన అంతర్లీనతా, ఆకర్షణా గోచరించేవి. "భక్తి భావనలో విహ్వాలులైనవారి కండ్లలాగనే వుంటాయిగావును!" అనుకొనే వాడిని.

అప్పుడు సార్థవాహుడు చంపాద్వీపానికి కొన్ని సరకుల ఓడల్ని తీసుకొని వెళ్ళాడు. నేను అప్పటికికూడా ఉపాసిక ఇంటికి మధ్యాహ్న భోజనానంతరం అక్కడే కొంతసేపు విశ్రాంతి తీసుకోవడం అలవాటు. ఆ రోజున కూడా భోజనానంతరం వెళ్ళబోయేవాణ్ణి, విశ్రాంతి తీసుకొనందని ప్రార్థించిం దామె. విశ్రాంతికి ఆగిపోయాను. ఉపాసిక తను స్వయంగా విసరడానికి విసనకర్ర తీసుకువచ్చింది. విశ్రాంతి తీసుకునేప్పుడు దాసులు విసరడం పరిపాటి. నే నామెను చూసి, లేచి, కూర్చున్నాను.

ఆ రోజున ఉపాసిక ముఖంలో గాఢమైన విషాదరేఖలు కనుపించాయి. ఆమె కండ్లు అకారణంగా చెమర్చాయి.

నేను కొంత ఆశ్చర్యాన్ని, విషాదాన్ని స్వరంలో ధ్వనింపచేస్తూ—"ఉపాసికా! గంభీరంగావుండే నీ వదనం ఎందుకలా విషాదంలో నిండివుంది?" అన్నాను.

"నేను చాలా ధీరస్వభావంగల దాన్నికనుకనే, మీ ప్రేమ నన్నెంత పిచ్చి దాన్ని చేసినా, నేను త్వరపడలేదు! స్త్రీలలో ప్రేమోద్వేగం పురుషులకంటే కొన్నిరెట్లు ఎక్కువగా వుంటుంది. సిగ్గుకూడా అదే పాళ్ళలో వుంటుంది. మీ మీది ప్రేమ నా హృదయంలో ఎప్పుడు మొలకెత్తిందో చెప్పలేను. కొన్ని నెలల నుంచి పిచ్చిదానిలా బ్రతుకుతున్నాను!"

"నేను కొన్ని స్వనిర్మితమైన నియమాల్లో జీవితాన్ని గడుపుతున్న వ్యక్తిని. మతము, వైరాగ్యం, దేవుడు, పాపం-పుణ్యం-అవేవీ నాకులేవు! అయినప్పటికీ ద్వంద్వ వ్యక్తిత్వాలతో జీవితాన్ని గడపడం నాకిష్టం లేదు. ఉపాసికా! యోగం, వైరాగ్యం, బ్రహ్మచర్యం, నిర్వాణం, ముక్తి-వీటిలో నా కేలాటి విశ్వాసమూలేదు. మన పనులయొక్క ఉచ్చనీచాలను నిర్ణయించే వాడెవడో ఉంటాడనీ, అతడు మనకు స్వర్గాన్నో, నరకాన్నో ప్రసాదిస్తాడనీ, నాకు భయం లేదు. పునర్జన్మమీద కూడా నా కేలాటి విశ్వాసంలేదు. నే నిలాటి స్వతంత్రమైన భావాలు కలవాణ్ణే అయినప్పటికీ, ఇలా ప్రేమించుకోడానికి, మనకేవిధమైన అధికారమూ లేదని నా విశ్వాసం!" అన్నాను.

ఉపాసిక నా పై మాటల్ని వింటున్నప్పుడు కొంత తృప్తిని పొందినట్లు నిశ్వసించింది. కన్నుల్లో నీరు ఇంకింది. ముఖంలో ఆశా రేఖలు కనుపించాయి. కాని, నా చివరి వాక్యాన్ని వినేసరికి ఆమె వదనం తిరిగి విషాదాన్ని దాల్చింది. కన్నీరు చంపలమీదుగా కారింది. ఇలా అన్నది: "బుద్ధిగ్రాహ్యమైన విషయాన్ని మాత్రమే నేను స్వీకరించగలను. ఇప్పటివరకూ 'సదాచారి'గానే వున్నాను. అలా వుండడానికి ఎంత కష్టపడవలసివచ్చిందో మీకు తెలుసునా? నాకు వయసు ఎంత వుంటుందని మీ అభిప్రాయం?"

"సాధారణంగా మీకు పదహారు, పదిహేడు సంవత్సరాల వయస్సు వుంటుందనుకొంటారు. కాని మీ విజ్ఞానం, మీరు వేసే ప్రశ్నలు-వీటి దృష్ట్యా ఇరవై ఏండ్లు వుంటాయనవచ్చు!" అన్నాను.

"కాదు. నాకు ఇరవై ఐదేండ్ల వయసుంది. మరి నా సౌందర్యాన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

"ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైనా-అత్యంత సౌందర్యవతిగా నీవు ఎన్నిక కాగలవు!"

"భరుకచ్చం (భరౌంచి)లో అతిలోక సౌందర్యవంతులైన శక, యవన కన్యలున్నారు. అలాటి సౌందర్యాగారం అనదగిన భరుకచ్చానికి నేను తలమానిక లాటిదాన్నని ప్రతీతి. నా భర్తకు భరుకచ్చంలో కూడా కొంత వ్యాపారం వుంది. నా

తండ్రి సామాన్యుడైన శ్రేష్ఠి! ఈ సార్థవాహుడు (భర్త) నన్ను వివాహ మాడ గోరాడు. నా తండ్రి సమ్మతించాడు. నాకు ఇష్టమా? అయిష్టమా? అనే ప్రశ్నే రాలేదు అప్పుడు! ఒకవేళ పూర్తి అధికారాన్ని స్వాతంత్ర్యాన్నీ ఇచ్చినప్పటికీకూడా నే నీయన్ని వివాహమాడడానికి ఇష్టపడేదాన్నే నేమో! నా వయసు అప్పుడు పది హేడు సంవత్సరాలు. ఇతడు నాకంటే ఒక పదిహేను సంవత్సరాలు మాత్రం పెద్దవాడై వుంటాడు. మంచి ఆరోగ్యంగా, బలంగా వున్నాడు. వివాహం అయింది. భర్తతో పాటు అనూరాధపురానికి వచ్చాను. ఇంట్లో లక్ష్మి లాస్యం చేస్తోంది. లక్ష్మి కలచోట ఇంకేమి కొంతలుంటాయి? కాని యువతులు ఒట్టి డబ్బును చూసుకు మాత్రమే బ్రతకలేరు. నేను పతి సుఖవంచితను భన్తే!"

"కాని, నీకు భర్త వున్నాడుగా?"

"అవును. భర్త వున్నాడు. మొదట అతడు ప్రతినిష్ఠలో వుండి దగ్గిరకు రావడం లేదుగావును అనుకొనేదాన్ని. అలాగే అతనుకూడా చెప్పాడు. తనకు 'అపుత్రదోషం' వుందనీ, దాన్ని పరిహరించుకోడానికి ఒక సిద్ధుడు కొన్ని నియ మాలను చెప్పాడనీ, వాటిని పాటించడం ముఖ్యమనీ చెప్పాడు. సార్థవాహునికి ఇద్దరు ముగ్గురు వయస్కులైన మిత్రులుండేవారు. వారు మా యింటికి తరచుగా వస్తూండేవారు. సార్థవాహుడు తను వూళ్ళోవున్నా లేకపోయినా మిత్రుల సత్కా రంలో ఎలాంటి కొరత చేయవద్దని చెప్పాడు. ఒకమాటు సార్థవాహుడు వ్యాపారం నిమిత్తం అన్యద్వీపానికి వెళ్ళాడు. అతని మిత్రులు యధావిధిగా వస్తూవుండేవారు. ఫలహారంతో, పానీయంతో వారిని సత్కరించేదాన్ని. ఒకనాడు గానాభిలాషను ప్రకటించారు. సంగీతం పేరుతో వారిని తృప్తిపరచాను. వారిలో ఒకతను చాలా అందగాడు. క్రమంగా ప్రణయాభినయాన్ని ప్రారంభించాడు. ఆ రోజునుండి నే నతణ్ని యింటికి రానీయలేదు. సార్థవాహుడొచ్చాక ఈ విషయాన్ని చెప్పాను. అతడు తన మిత్రుడిమీద కోపగించుకొనకపోగా, నవ్వి వూరుకొన్నాడు."

"ఏం భర్త!"

"నేను మరికొంచం ఉద్రిక్తస్వరంలో మాట్లాడాను. అప్పుడు స్థిమితంగా, శాంతంగా సార్థవాహుడిలా అన్నాడు: భద్రే! నిన్ను నేను పెండ్లాడింది, వంశం నిలవడానికి! వంశం నిలవకపోతే, నా లక్షల దీనార్ల విలువచేసే ఆస్తిపాస్తులు రాజు పరమౌతాయి!"

"నేను చాలా విదిలింపుగా, బాధగా అన్నాను-మరలా దూరదూరంగా తిరుగుతావేం? ఇలా ఐతే వంశం నిలుస్తుందా?"

"అతడిక బాహాటంగా చెప్పేశాడు. 'నాలో పురుషత్వం లేదు!' నా హృద యంలో ఎవరో బలంగా గుద్దినట్లయింది. అతడిని గొంతునులిమి చంపేద్దామా? అన్నంత కోపం వచ్చింది. కాని మౌనంగా వుండి పోయాను. ఇలాటి స్థితిలో స్త్రీ

మరొక వివాహం చేసుకొనవచ్చును. నేనూ కోరినట్లయితే, అతడిని విడిచి మరొక వివాహం చేసుకొనేదాన్నే. కాని అలా చేసుకోవటం నా కిష్టంలేదు."

"అలా వివాహం చేసుకొంటేనే బాగుండేదేమో?"

"బాగానేవుండేది. కాని, నేనప్పుడు బౌద్ధ సన్యాసినులను, వారి జీవితాన్ని చాలా ఆసక్తిగా గమనిస్తూండేదాన్ని. నా కీ జీవితంమీదనే ఒక రకంగా విరక్తి కలిగింది. అప్పటినుండి నేను పైకి గృహస్థుగావున్నా మానసికంగా సన్యాసిని నయ్యాను! యిప్పటికి మా వివాహమై ఎనిమిదేండ్లయింది. ఈ ఎనిమిది సంవత్సరాల్లోనూ, నా మనస్సు స్వాధీనం తప్పిన సంఘటన ఇదొక్కటే." అన్నదామె.

"ఈరోజు నీ నియమాన్ని ఎందుకు భంగపర్చుకున్నావు?"

"ఈరోజు నాలో నా నియమాన్ని కాపాడుకునే శక్తిలేకపోయింది. నా మానసిక శక్తులు చాలా దుర్బలపడి పోయినాయి. మీ ధర్మోపదేశాల్ని వినడానికి నేను రాకుండావుంటే ఎంతోబాగుండేది. మీ ధర్మోపదేశాల్ని విన్నతరువాతమిమ్మల్ని తడవ తడవకూ చూడాలని కోర్కె కలిగేది! అప్పటికి నా భావాలు చాలా ఉన్నతమైనవనీ, వాటిలో ఎలాటి నైచ్యతాలేదనీ నన్ను నేను మభ్యపర్చుకొన్నాను! కానీ, మానవుడు తనను తాను మభ్యపర్చుకోలేడు!"

నేను నవ్వుతూ "ఎక్కువకాలం ఆత్మవంచన చేసుకోవడం సంభవంకాదు!" అన్నాను.

"నిజం చెప్పారు! ఆత్మవంచన యెక్కువకాలం నిలవదు. నా ప్రవర్తనలను మీరు మొదట్నుండే గమనించారనుకొంటాను. మీరు చీనాంబరాన్ని ధరించినప్పుడు నా కండ్లు చమర్చాయి. అందుకు కారణాన్ని మీరు ఊహించుకొనే వుంటారనుకొన్నాను!"

"నే నేమాత్రమూ ఊహించలేదు. ఊహించడానికి ప్రయత్నంకూడా చేయలేదు! మన ధార్మిక చర్యలు జరిగే పద్ధతిలో అసలు ఇలాంటి ఊహలకు స్థానమే లేదు!"

"అయితే, ఇప్పుడు మీరు నన్ను పతితస్త్రీగా భావిస్తారను కొంటాను?"

"నేనే స్త్రీని పతితగా చూడను. పురుషుణ్ణి పతితుడిగా చూడగలను!"

"పురుషుణ్ణి గురించి అలాటిభావన ఎందుకు మీకు?"

"ఈనాటి స్త్రీకి పురుషుడే విధాత? పురుషుడు తయారుచేసిన, ఒక ఆట బొమ్మ స్త్రీ! కనుక ఈనాటి స్త్రీ ఏంచేసినా, అందుకు బాధ్యుడూ కర్తా పురుషుడే! అంతవరకూ ఎందుకు, మిమ్మల్ని ఈ స్థితిలో ఇక్కడ పడేసిందెవరు?"

"పురుషుడు?"

"మరి ప్రాచీనకాలంనుండి మనకొక వ్యవస్థా, శాస్త్రమూ వుంది. దాన్ననుసరించి 'నపుంసకు'డైన భర్తను వదిలి భార్య మరొక వివాహం చేసుకొన

వచ్చును. ఇప్పుడు నీవు మరొక వివాహం చేసుకొన్నప్పటికీ, ఇతడి దగ్గిర గడిచిన ఎనిమిది సంవత్సరాలూ, ఒక కళంక చిహ్నంగా మాత్రం నీకు మిగుల్తాయి!"

"గడచిన ఎనిమిది సంవత్సరాల జీవితంలోను, నేను సిగ్గుపడగల సంఘటన ఒకటీ లేదు. ఇవ్వాల్టి సంఘటన నా జీవితంలోని పరమ దౌర్బల్యానికి నిదర్శనం."

"నే నీ స్థితిని దౌర్బల్యమనను"

ఉపాసిక పరమానందభరితురాలైంది. వెంటనే నా రెండు పాదాలను తన వడిలోకి తీసుకొని "ప్రియా!" అన్నది.

నేను మెల్లగా నా పాదాలను యివతలికి తీసుకొన్నాను. "సుముఖీ! అంత తొందర పనికిరాదు! ముందు నా మాట విను!" అన్నాను.

ఆమె ముఖంలో ఉదాసీనత కన్పించింది. మౌనంగా నా ముఖంలోకి చూస్తూ వుండిపోయింది. నేనిలా అన్నాను. "నా కసలు వివాహ వ్యవస్థమీదనే విశ్వాసం లేదు! నా ఉద్దేశ్యం; దేవతా స్త్రీల్లాగానే మానవస్త్రీలు కూడా వెనక వివాహాలు లేకుండా స్వేచ్ఛగా వుండేవారని! భవిష్యత్తులోకూడా అలాటిస్థితే వుంటుందని నా నమ్మకం! మానవస్త్రీలు వివాహం లేకుండా స్వేచ్ఛగా వుంటారు!"

"అంటే స్వేచ్ఛా ప్రేమా?"

"అవును. స్వేచ్ఛా ప్రేమే. అదేమంచిది!"

"మీరు స్వేచ్ఛా ప్రేమని ఒప్పుకొంటారా?"

"అవును. నేను ముక్తప్రేమను ఒప్పుకుంటాను. ఈ పెండ్లిండ్ల కంటే ముక్తప్రేమ మంచిదని నా ఉద్దేశ్యం! కానీ స్వేచ్ఛా ప్రేమకు స్వేచ్ఛాయుతమైన సమాజంకూడా వుండాలి. ఇప్పటి సమాజంలో వ్యక్తికి స్వేచ్ఛలేదు. అందువలన, ఈ సమాజానికి స్వేచ్ఛా ప్రేమ పనికిరాదు. చెడ్డగా పరిణమిస్తుంది."

"చెడ్డగానా?"

"రాజులప్రేమ స్వేచ్ఛాప్రేమకాదా? రాజు తనకు ఇష్టమైతే శ్రేష్ఠి, సార్థవాహుడు, పురోహితుడు—ఎవడి భార్యనైనాసరే ఒక రాత్రికి తనకు ప్రేయసిని చేసుకోగలడు. ఎవరైనా కాదనగలరా?"

"ఎవరూ కాదనలేరు. కాదంటే తలలు ఎగురుతాయి. అంగీకరిస్తే ధనము, పదవి."

"కాదంటే సర్వనాశనమే! అసలుకాదనే అవకాశం యెక్కడిది?....రాజులూ, రాజుల కృపాపాత్రులయిన సామంతులు యిలాటి స్వేచ్ఛా ప్రేమనే అనుసరిస్తుంటారు. కాని నేను చెప్పిన స్వేచ్ఛా ప్రేమలాటిదా ఇది?"

"మరి....!" అంటూ ఆమె దీర్ఘంగా నిశ్వసించింది.

"ఇది స్వేచ్ఛాప్రేమ యుగం అయినట్లయితే, నేను నిన్ను నిరాశపరిచేవాణ్ణి కాదు."

"అయితే మీరు నన్ను తిరస్కరిస్తారా?"

"'తిరస్కరించడం' అన్న శబ్దాన్ని ప్రయోగించి స్త్రీని అవమానపరిచిన వాడిగా చేస్తున్నావు నన్ను. స్త్రీని అవమానించానన్న అపరాధాన్ని నా నెత్తికి చుడుతున్నావు."

"ఈ అపరాధాన్నుండి తప్పుకోవడం మీ చేతిలోపని. నన్ను నిరాశ పరచకండి!"

"నేను నిన్ను నిరాశ పరచకుండా వుండలేనందుకు విచారిస్తున్నాను! కాకపోయినా నే నిలా ఎంతమంది ఆకల్ని పూర్తిచేయగలను? నాకూ కొన్ని నియమాలున్నాయి. ఇప్పుడు నేను నీతో రహస్యంగా దొంగచాటుగా వ్యవహరించాలి! అలాటి స్థితిలో నా ఆత్మగౌరవం దెబ్బతింటుంది. అది నాకు సమ్మతి కాదు!"

"నా వ్యక్తిత్వాన్నీ, నన్నూ మీరింతకాలంగా అర్థం చేసుకొనే వుంటారు. నా ప్రేమ క్షణికమైంది కాదు. నేను మీతో వచ్చేయడానిక్కూడా సిద్ధమే!"

"ఆ తరువాత అనూరాధపురంలో నా గురించి ఏమనుకొంటారు! నేను ఇక్కడినుండి ఎంత కళంకాన్ని ప్రోగుచేసుకు వెళ్ళినవాణ్ణవుతాను! అలా చేయడం ఉచితం కాదు. నేను చెప్పే ఒక మాటను నీవు వప్పుకో! మన ఇద్దరికీ శుభమూ, మేలూ కలిగేవిధంలో ఈ సమస్యను గురించి యోచించు! నేనీ అనూరాధపురంలో ఉన్నన్నాళ్ళూ మీకు అభ్యంతరం లేకపోతే ఇక్కడికి వచ్చి పోతుంటాను!" అంటూ అక్కడినుండి వచ్చేశాను.

సంఘంలో చాలామంది భిక్షువులు ఇలాటి ప్రేమను అనుభవిస్తున్నారు. చాలామంది బౌద్ధ సన్యాసినులుకూడా తమ నీరస జీవితాలను రసవంతం చేసుకోవడానికి మార్గాంతరాలను వెతుక్కొన్నారు. కాని, వాళ్ళలో ఒకణ్ణి కావడం నాకు ఇష్టంలేదు.

ఈ విషయంలో నేనింకా ఏ నిర్ణయానికి రాకముందే చంద్రగుప్తుడు సింహాసనాన్ని అధిష్టించాడన్న విషయం తెలిసింది. యౌధేయ భూమికి నా అవసరం కలిగింది.

# మిత్రలాభం

సింహళం నుండి నేను 'సోపారా' రేవుకువెళ్ళే ఓడ నెక్కాను. అప్పటి కింకా నేను నా సహజ వేషాన్ని ధరించలేదు. భిక్షువు రూపంలోనే వున్నాను. నా హృదయం మాత్రం కల్లోలితమైంది. 'సోపారా' అరబ్బు సముద్రతీరాన వుంది. ఒకప్పు డీ 'సోపారా' రేవు, ఒక గొప్ప రేవుపట్టణంగా ప్రసిద్ధిపొందింది. కాని, ఇప్పుడింకా అనేకమైన రేవులు తయారుకావడం వలన, ఈ 'సోపారా' యొక్క ప్రాధాన్యత తగ్గిపోయింది. ఇప్పుడిక, వాకాటక రాజైన పృధ్వీషేణుడి రాజ్యంలో వుంది. దారిలో దొంగలభయం అధికం! ఈ ఒక్క విషయం వల ననే పృధ్వీషేణుడి రాజశాసనం ఎంత దుర్బలంగా వుందో తెలిసిపోతుంది.

ఇక నే నిప్పుడు ఉత్తరదిశగా వెళ్ళాలి. మార్గం చాలా కఠినమైంది. మూడు యోజనాల మార్గాన్ని గడిచాక ఒక పెద్ద విహారాన్ని చేరాను. (కనేరి) ఈ విహా రంలో అనేక కక్ష్యలున్నవి. ఒక పెద్ద ప్రార్థనా మందిరం వుంది. ప్రార్థనా మందిరంలో ఒకేమారు కొన్ని వేలమంది ప్రజలు ప్రార్థన చేసుకొనవచ్చును. అంత పెద్దది! ఈ మొత్తం కక్ష్యలూ, ప్రార్థనా మందిరమూ–తొలిచి కట్టబడి నాయి. ఇలాటి కట్టడాలనూ చైత్యాలను చూసే ప్రజలు చిత్రమైన ఊహలను వూహిస్తుంటారు. సింహళమూ మొదలయిన ద్వీపాల్లో, ఇలాటి చెక్కడపు కట్ట డాలను గురించి అనేక విధాలైన వార్తలు ప్రచారంలో వున్నాయి. అసురులు కొండను తొలిచి ఈ కట్టడాలను కట్టారనీ, మయుడనే దానవుడు స్వయంగా తన చేతులతో ఈ విహారాలను నిర్మించాడనీనూ!

ఈ విహారంలోని భిక్షువులమీద రాజులు సదా కృపాదృష్టిని బరపుతూ వుండేవారు. శ్రేష్ఠులూ, సార్థవాహులు కూడ అపారమైన శ్రద్ధాసక్తుల్ని కలిగి వుండేవారు. ఈ విహారానికి బయట దాతల విగ్రహాలు నాలుగు వున్నాయి. రెండు పురుష విగ్రహాలూ, రెండు స్త్రీ విగ్రహాలూ! ఆ దాతలు, కేవలం రెండువందల సంవత్సరాల క్రితంవారే! ఈ దాతల సహాయ సంపత్తితోనే ప్రార్థనా మందిరాలు నిర్మింపబడినాయి. వీరి స్మృతి ఇంకా ప్రజల మనోవీధిలో మెరుస్తూనే వుంది. అయినా విచిత్ర ప్రచారాలు నిరాటంకంగా సాగుతూనే వున్నాయి. ఈ కక్ష్యల్లో (గుహల్లో) అందమైన శిల్పాలు చెక్కబడి వున్నాయి. ప్రతి కక్ష్యకి ముందు నీరు నిలుచుటకు ఒక చిన్నకొలను త్రవ్వబడి వుండడం చిత్రమైన విషయం.

కొండమీద కురిసిన వర్షపు నీరు ఈ కొలనుల్లోకి వచ్చి ఆగుతూ వుంటుంది. భిక్షువులు సంవత్సరం పొడుగునా తియ్యని పవిత్రమయిన నీటిని త్రాగుతూ వుంటారు.

బౌద్ధ జాతక కథల్లో ఈ ప్రాంతాన్ని గురించి ఒక చిన్న కథకూడా ఉంది. బుద్ధుడు ఒక జన్మలో నాగయువకు డయ్యాడుట! ఆ నాగయువకుడు స్వయంగా తన శరీరాంగాలను పశు పక్షులకు అర్పణచేసి, ఇతర్లకు అహింసను, జీవకారుణ్యాన్ని ప్రబోధించాడుట! ప్రస్తుతం ఈ విహారం ఉన్న ప్రాంతంలోనే ఆ నాగ యువకుడు జన్మించాడుట!

నేను సింహళం నుండి ప్రతిష్ఠానం చేరేసరికి దాదాపు రెండు సంవత్సరాలు పట్టింది. ఈ రెండు సంవత్సరాల కాలాన్ని వాకాటకుల రాజ్యంలోనూ, మహాక్షేత్రపుడి మలయరాజ్యంలోనూ తిరుగుతూ గడిపాను. సముద్రగుప్తు డుండగా ఒకమాటు ఈ రెండురాజ్యాలనూ ఓడించాడు. వాకాటక రాజు నాగసేనుడు యుద్ధ భూమిలోనే హతుడయ్యాడు. కాని, సముద్రగుప్తుడు చనిపోయాక ఈ రెండు రాజ్యాలు తిరిగి స్వతంత్రమయ్యాయి. వాకాటకుల రాజ్యం విస్తృతమైనదీ శక్తి వంతమైనదీ కూడాను. నర్మదా నదినుండి దక్షిణమున కృష్ణానదివరకూ వ్యాపించి ఉందీ రాజ్యం! కృష్ణకు దక్షిణాన కాంచీపురం రాజదానిగా పరిపాలిస్తున్న పల్లవుల రాజ్యం ఉంది. ఉత్తరాపథంలో పంజాబును దేవపుత్రశాహి (కుషాణుడు) పరిపాలిస్తున్నాడు. తూర్పున గుప్తుల రాజ్యం. మాల్వా-గుజరాతుల్లో శకవంశపురాజైన మహాక్షేత్రపుడు పరిపాలిస్తున్నాడు. బల సమృద్ధులు కల ఈ ఐదు రాజ్యాలమధ్య యౌధేయులు మాత్రం తమ గణతంత్ర వ్యవస్థను కాపాడుకొంటూ వున్నారు. నేను తిరిగివచ్చే దారిలో ఆంధ్రరాజులు నిర్మించిన గుహలనూ, విహారాలనూ కూడా చూశాను. ఆ గుహల్లో వాశిష్ఠిపుత్ర పులుమాయి, యజ్ఞ, శాతకర్ణి మొదలయిన ఆంధ్రరాజుల శిలాలేఖలుకూడా ఉన్నాయి. ఈ రాజులు ఐదారు శతాబ్దాల క్రితం వారే! అయినా ఈ విహారాలూ, గుహలూ దేవతల నిర్మాణం వలన ఏర్పడ్డాయని దూరదేశాల్లో ప్రచారం జరుగుతోంది. ఐదారు శతాబ్దాల అనంతరమే వీటిని గురించి ఇలా చెప్పుకొంటే, మరొక వేయి సంవత్సరాల అనంతరం యింకెలా చెప్పుకొంటారో?

నేను వెంటనే యౌధేయ భూమిలోకి వెళ్ళదలచలేదు. మొదట మాకు ఇరుగు పొరుగున ఉన్న రాజ్యాల పరిస్థితిని అవగాహన చేసుకొంటూ వెళ్ళాలని నిశ్చయించుకొన్నాను. ఉజ్జయినిని పరిపాలిస్తున్న క్షత్రపులకు వాకాటకులతో వైమనస్యం పెరిగిపోతోంది. వీరిద్దరి పోరుపుల వలన లాభాన్ని పొందాలని చంద్రగుప్తుడు పొంచివున్నాడు. పోతే, పల్లవుల రాజ్యం యౌధేయ భూమికి చాలా దూరం; పైగా చంద్రగుప్తుడికీ, పల్లవులకూ ఎలాటి సంబంధమూ లేదు. కనుక మిగిలిన రాజ్యాల బాహ్యాంతరంగిక పరిస్థితులను తెలుసుకోవడం ముఖ్యం.

పై ఆదర్శంతోనే నేను ఉజ్జయిని యొక్క బౌద్ధ విహారంలో కొద్దికాలం వున్నాను. సాధారణంగా బౌద్ధభిక్షువులకు రాజకీయాలకు యెలాటి సంబంధం వుండదు. కాని రాజకీయ ఆదర్శాలను సాధించడానికి బౌద్ధ విహారాలే తగిన స్థానాలు. విహారాలరోకి దేశ దేశాంతరాలనుండి భిక్షువులు వస్తూవుంటారు. ఉజ్జయినీ విహారంలో తోఖార్, ఖోతాన్, పారస్య మొదలైన దేశాలనుండేకాక సింహళం, యవద్వీపం, చీనా మొదలుగాగల దూర ద్వీపాలనుండి వచ్చిన భిక్షువులుకూడా వున్నారు. వీరిరో ఎంతోమంది రాజ్యభ్రష్టులైన ప్రభుసంతానం, ప్రచ్ఛన్నంగా రోజుల్ని గడిపే రాజకీయ శరణార్థులూ వున్నారు. అన్ని దేశాలవాళ్ళు, ప్రాంతాల వాళ్ళు ఇలా విహారాల్లో కలుసుకోవడాన్ని రాజులు అనుమానించకుండా యెన్న టికీ వుండరు. అందువల్లే, గుప్తచరులుకూడా బౌద్ధ భిక్షువుల వేషంలో విహారాల్లో తిరుగుతూంటారు. సింహళం వదిలాక నా వంటిమీద చీవరం వుందంటే (బౌద్ధ భిక్షువులు ధరించే పొడుగాటి చోగా) కేవలం రాజకీయం మాత్రమే కారణం! బౌద్ధ భిక్షువుగా వుండి దేశంలోని రాజకీయ పరిమాణాలను గమనించడమే నా ఆదర్శం! చాలారోజులవరకూ ప్రతి చిన్న విషయాన్నీ చాలా జాగరూకతతో గమనిస్తూ గడి పాను. సింహళ విహారం తన నియమపాలన వలన చాలా ప్రసిద్ధిని పొందింది. నేను సింహళ విహారభిక్షువుని కావడంవలన నన్ను ప్రత్యేకంగా గౌరవంగా చూడ సాగా రిక్కడ! పైగా విదేశంనుండి వచ్చిన భిక్షువును కావడం వలన గుప్తచరులు కూడా నన్నంతగా అనుమానించేవారుకాదు. నేను గొప్ప విద్వాంసుణ్ణన్న విషయం కూడా తోటి భిక్షువుల్లో ప్రచారమైంది. ఆచార్య వసుబంధువద్ద అభ్యసించిన విద్యా జ్ఞానాన్ని యెక్కడా ప్రదర్శించలేదుగాని, వినయపిటకంరో నాకుగల పాండిత్యాన్ని ప్రకటించాను. క్రమంగా అనేకమంది భిక్షువులు నాదగ్గిరకు వినయపిటకాన్ని పఠించడానికి రాసాగారు. వారిరో మాధవసేను డొకడు.

మాధవసేనుడు మాళవగణపు క్షత్రియ పుత్రుడు. మాంచి బలిష్టుడు, అంద గాడు, తెలివికలవాడు. గొప్ప వైరాగ్యంతో భిక్షువయ్యాడు. తథాగతుడు చెప్పిన నియమాలన్నింటినీ పఠించాలని అతడి ఆదర్శం! ఉజ్జయినీ విహారంపై మహా యాన ప్రభావం అధికంగాపడ్డది. కనుక వినయ పిటకంలోని అనేక నియమాలనూ, సూత్రాలనూ, అవహేళనా దృష్టితో చూస్తారక్కడ. క్రమంగా నాకూ, మాధవ సేనుడికీ మంచిమిత్రత ఏర్పడ్డది. వినయపిటకంలోని ప్రతిసూత్రంలోనుగణతంత్రపు ప్రభావం కనబడుతుంది. అసలు బౌద్ధ సంఘమే గణతంత్రపు నమూనాలో చిత్రించబడింది. నేను వినయపిటకాన్ని అధ్యాపన చేసేప్పుడు విద్యార్థు లకు సహజంగానే గణతంత్రాల్ని గురించి తెలుసుకోవాలన్న జిజ్ఞాసను కలిగించే వాణ్ణి! వాళ్ళలో గణతంత్ర భావాలను అధికాధికంగా నింపడానికి ప్రయత్నించే వాణ్ణి! అయితే వర్తమాన పరిస్థితులకు, వినయ పిటకంలోని సూత్రాలకు ముడి పెట్టడానికి యెన్నడూ ప్రయత్నించలేదు. అంతగొప్ప వైరాగ్యంతో భిక్షువైన

మాధవసేనుడు. నా ప్రయత్నంవలన గణతంత్ర వ్యవస్థనుగురించి తెలుసుకోవాలన్న జిజ్ఞాసలో పడ్డాడు. తరువాత ఒకమాటు నాతో మాధవసేనుడిలా అన్నాడు: "సోదరా, జయా! మొదట్లో నీవు "నిర్వాణం"లాగానే 'గణం' అనే పదానికి కూడా ఏదో లోకోత్తరమైన అర్థాన్ని చెబుతున్నావనుకొనేవారం! మరి నీవు యౌధేయుడవన్న విషయాన్ని ఎంత జాగ్రత్తగా దాచావు?"

"మన విహారంలో క్షత్రవులు, వాకాటకులు, దేవపుత్ర శాహీయొక్క గుప్తచరులున్నారన్న విషయం నీకు తెలియందికాదు. మాధవా! కనుకనే, నేను చాలా జాగ్రత్తగా మెలగవలసి వచ్చింది. యౌధేయుడు ఎలాటి స్థితిలోనూ యౌధేయుడుగానే వుంటాడన్న విషయం అందరికీ తెలిసిందే! ముందుగా నేను యౌధేయుణ్ణని తెలిస్తే నన్నందరూ అనుమానిస్తారు. అంతవరకూ ఎందుకు? నిర్వాణం, స్వర్గం, గణం వీటికి లోకోత్తర అర్థాలనుకాక లౌకిక అర్థాలనూ, అన్వయాలనూ మొదటే యివ్వడం ప్రారంభిస్తే, మీరందరూ నా దగ్గిరకు వినయపిటక పఠనానికి వచ్చేవారేనా?" అన్నాను.

"నిజమేను, సోదరా! మొదట చాలా వైరాగ్యంలో వున్నాను. ఇహలోకపు విషయాలు నా చెవులకు ఎక్కేవేకావు! నేనంత ఘోరంగా వైరాగ్యంలో పడిపోవడానికి కారణం, మా మాళవగణం యొక్క నాయకులజఘన్యమైన, నీచ స్వార్థాంధత! మా మాళవగణ నాయకులు ఘోరంగా పతనమయ్యారు. వారినుండి భవిష్యత్తుకు అంధకారం కాక వెలుగు లభించదు. మాళవగణం యిక యెన్నటికీ ఉద్ధరింపబడదన్న భావన నన్ను పూర్తిగా నిరాశా వాదిని వైరాగ్య ప్రేమికుణ్ణిచేసింది. ఈ లోకంలో నిరాశనూ, పరాజయాన్నీ పొందిన నేను వైరాగ్యం అనే ముసుగులో నుండి పరలోకంవైపు–స్వర్గంవైపు-చూడసాగాను" అన్నాడు.

"పావురం-పిల్లిముందు పడితే, తప్పించుకోవడానికి ప్రయత్నంచేయకుండా కళ్ళు మూసుకొంటుంది! అలా కండ్లు మూసుకొని,మౌనంగా బలికావడం మంచిదా? కొంత ప్రయత్నించి, బలి కావడం మంచిదా?" అన్నాను.

"ప్రయత్నించి బలికావడమే, ఉచితం!"

"ప్రతితరంలోనూ కొన్ని వేలమంది సమర్థులయిన పురుషులు, తమ సమర్థతను ప్రదర్శించకుండా, పావురపునీతి ననుసరించి గతించారు. వారేగనక, పరిస్థితుల్ని మార్చడానికి ప్రయత్నించినట్లయితే, తప్పకుండా ఈ ప్రపంచం కొంతవరకైనా బాగుపడివుండేది!"

"కానీ, జయా! ఈ ప్రపంచాన్ని బాగుచేయాలంటే కొంతత్యాగమూ, కొంత పరిశ్రమా అవసరం! లోకోత్తర సాధనకు–వైరాగ్యానికి-ఇలాటి శ్రమలు అనవసరం! అందువల్లే సమర్థులైనవారు కూడ, తమ సమర్థతను, ఈ లోకం కొరకు కాకుండా, పరలోకం కొరకు వాడడం జరుగుతోంది! మిత్రమా, జయా! అనవసరంగా వ్యర్థ

మయ్యే నా జీవితానికి సార్థకమైన మార్గాన్ని చూపించావు!" అన్నాడు మాధవ సేనుడు.

అవంతీపురంలో వున్న సంవత్సరకాలంలో కొన్ని రాజకీయ పరిస్థితుల్ని అవగాహన చేసుకొన్నాను. ఒక ఉత్తమ మిత్రుడు (మాధవసేనుడు) లభించాడు!

చంద్రగుప్తుని ఆశయాలూ, అభిప్రాయాలూ—కొంచెం మాకు తెలియసాగాయి. అతడు మొదట ఆర్యావర్తంలో, తన ఉనికిని పటిష్ఠం చేసుకొందామనుకున్నాడు. అందుకు కావలసిన జాగ్రత్తలను తీసుకొంటున్నాడు. రాజ్యాన్నీ, సైన్యాన్నీ సుపటిష్ఠం చేసుకొంటున్నాడు. అతడి ఈ కార్యక్రమాన్ని సరిహద్దు రాజ్యాలు జాగ్రత్తగా గమనించి, ఉచితమైన సావధానతలను వారూ తీసుకొంటున్నారు. అతడి రెండవ అడుగు సరిహద్దు రాజ్యాలమీద పడడం! యౌధేయ భూమిని గురించి అతడి అభిప్రాయం ఎలా వుందో తెలుసుకోవడం ముఖ్యం! అందుకు అతణ్ని కలుసుకొందామనుకున్నాను.

ఇప్పుడు మాధవసేనుడు నాకు చాలా ఆత్మీయుడైన మిత్రుడు. ఒక సంవత్సరపు సాహచర్యంతో మా యిద్దరిరో చాలా ఆత్మీయత ఏర్పడ్డది. అవంతీపురం నుండి మేము సాంచీ మహా విహారానికి వెళ్ళాము. అక్కడి చైత్యాలూ, వాటిలోని శిల్పాలూ, తోరణాలూ మహాకళాత్మకంగా వున్నాయి. ఏ కళాకారుడు కూడా వాటినిచూసి తన్మయత పొందకుండా వుండలేడు. అక్కడినుండి విదిశాపురానికి వెళ్ళాము. విదిశానగరంలో దంతకారులు అధికం (దంతంమీద ఆకారాలను చెక్కేవారు.) అయిదు వందల సంవత్సరాల క్రితం చెక్కిన కొన్ని దంతపు విగ్రహాలను చూశాము. కొన్ని తోరణాలు కూడా వున్నాయి. వాటి ఆకారాలు అతి సహజంగా వున్నాయి. ఆ విగ్రహాలను చూసినప్పుడు యవన కళాకారులు స్మరణకొచ్చారు. ఆ కళాఖండాలను చూసి మాధవసేనుడిలా అన్నాడు: "ఈ చైత్యాలూ విహారాలూ-వైరాగ్యాన్నీ,నిర్వాణాన్నీ ప్రచారం చేస్తున్నాయి. మరి వీటిప్రక్కన అతిలోక సుందరమైన ఈ స్త్రీమూర్తులెందుకు?"

"మాధవా! మరి వీటిని గురించి నీ అభిప్రాయం ఏమిటి?"

"పాపం. వీళ్ళు నేలవిడిచి ఎగురుదామనుకొంటారు. కానీ, నేల వీళ్ళను విడవదు. క్రిందికిలాగి పడేస్తోంది!"

"ఈ సౌందర్యం వాళ్ళు వూహించే నిర్వాణంకంటే చాలా గొప్పది. చాలా యదార్థమైంది కూడాను. మరొకవిషయం. ఇప్పటి స్త్రీ మూర్తుల్లో కేవలం సౌందర్యమూ, కోమలత్వమే కనిపిస్తున్నాయి. కానీ, అయిదువందల సంవత్సరాలక్రితం ఈ మూర్తుల్లో ఒక రకమైన గర్వభావనకూడా కనుపించేది!"

"వేషంలోకూడా చాలా మార్పు కనిపిస్తోంది. ఆ రోజుల్లో స్త్రీలు 'తలపాగా'లు ధరించేవారా?"

"మరి చేతులకు చూశావా ఎన్ని గాజులున్నాయో ? నడుముకు ఎంత పెద్ద కటి—ఆ భూషణమో?"

"కాళ్ళకో! ఇన్ని కడియాలను ధరించడానికి ఇప్పుడే స్త్రీ ఒప్పుకోదు. అప్పటి పురుషులుకూడా అంతే. ఎంత పెద్ద కుండలాలు! ఆ కుండలాల బరువుకి భుజాలవరకూ జారిన చెవులు ఏం సౌందర్యాన్నిస్తున్నాయో?"

"ఆ భూషణాలు ఇలాగే పెరిగిపోతూ వుంటాయి. చివరకు ఒకరోజున ఇవి సౌందర్యంకోసరం వుపయోగపడవు. బరువుచేటని తెలుసుకుని వదిలేస్తారు. వాటి స్థానాన్ని కొత్త ఆ భూషణాలు తీసుకొంటాయి. ఇలాగే పరివర్తనక్రమం జరుగుతూ వుంటుంది. దర్శాణ (బుందేల్ ఖండ్) స్త్రీలు ఈ స్త్రీ విగ్రహాల సంతానమే! అయితే యిప్పటి దర్శాణ స్త్రీలు ఈ స్త్రీ మూర్తుర్లో కనుపించే అలంకరణ పద్ధతినే వదిలివేశారు. తరాలు గడచినకొలది ఎన్నో విషయాలు, ఆమూలాగ్రం పరివర్తన చెందుతుంటాయి!"

విదిశానగరాన్నుండి మేము ఎరికన్ వెళ్ళాము. అక్కడినుండి తూర్పుకు పోయి మణిధరపురాన్ని చేరుకున్నాము. అక్కడా ఒక అందమైన చైత్యం కని పించింది. కొన్ని విగ్రహాలను చూశాము. మాధవసేనుడిలా అన్నాడు: "ఎక్కడా బుద్ధుడి విగ్రహం కనబడదేం? ఆ రోజుల్లో బుద్ధుని విగ్రహాలను మలిచేవారు కాదా?"

"బుద్ధ విగ్రహాలు ఆ రోజుల్లో లేవు. ఎవరు మలచరు. వినయపిటకం చదివే టప్పుడు ఎక్కడా బుద్ధుని విగ్రహాల ప్రసక్తే రాదు చూశావా? సింహళంలో సూత్రి పాఠానికి భిక్షువులందరూ కూడినప్పుడు ఏ విగ్రహానికీ నమస్కరించరు. ధర్మాసన మని ఒక చిన్న పీఠాన్ని తెచ్చిపెడతారు. దానికి నమస్కరిస్తారు."

"ఈ విగ్రహాలను చూస్తుంటే, ధర్మాసనానికి నమస్కరిస్తున్నారనే స్పృహ కూడా కలగడం లేదు. ఎక్కడో బోధివృక్షం వుంది. దానికి కిన్నెర మిధునాలు పుష్పచయాల్ని సమర్పిస్తున్నాయి."

"అంటే, ఈ ప్రపంచంలో మతంకూడా నిత్యం పరివర్తన చెందుతూ వుంటుంది."

"కాని, బ్రాహ్మణులు మా మతం ఎన్నటికి మారదు, అంటారుగా?"

"సిగ్గూ—శరమూ వదిలేసిన వాడికి, అసత్యమాడడం ఒక్క లెక్కా? బ్రాహ్మణుల-బ్రహ్మ-విష్ణు-మహేశ్వర్లు-త్రిమూర్తుల పేర్లు వేదాల్లో ఎక్కడైనా చూపించగలరా? వేదాలకు ఆదికర్తలైన వశిష్ఠ, విశ్వామిత్రుల—నాటినుండి యీనాటి వరకూ బ్రాహ్మణుల ఆచారాల్లో చాలా పరివర్తన జరిగింది. నేడు గుప్తవంశీయులు మేము గో బ్రాహ్మణ రక్షకులమని చెప్పుకొంటున్నారు. గో రక్షణకు ప్రత్యే కంగా శ్రద్ధ వహిస్తున్నారు. కానీ, ఈ గో భక్తి యిటీవలిదే! ప్రాచీనమైందికాదు!"

"అవును. ఇప్పటికీ ఉత్తరాపథంలో అతిథి వచ్చాడంటే గో మాంసం వండి పెడతారు. మధుపర్కాల నిస్తారు!"

"కనుక బ్రాహ్మణులు మా మతం స్థిరమైందని చెప్పుకోవడం, సత్యాన్ని హత్యచేయడమే అవుతుంది!"

మేము బీటా మీదుగా యమునాతీరానికి వెళ్ళాం. అక్కడినుండి ప్రతిష్ఠానానికి వెళ్ళాం.

# విక్రమాదిత్యుని ఆశయాలు

నేను చంద్రగుప్తుణ్ణి కలుసుకోవాలన్న ఉద్దేశంతోనే ప్రతిష్ఠానానికి వెళ్ళాను. అయినా నేరుగా రాజమహాలుకు పోలేదు. ప్రతిష్ఠానపు బౌద్ధ విహారాలలో ఆగాను. అప్పటికి చంద్రగుప్తుడు సింహాసనాన్ని అధిష్ఠించి నాలుగేండ్లయినా, చంద్రగుప్త మౌర్యుని యుద్ధ కౌశలాన్నీ, విష్ణుగుప్త చాణక్యుని కూటనీతినీ పుణికిపుచ్చుకున్నాడనిపిస్తూంది! విహారాల్లోనూ, దేవాలయాల్లోనూ, పానశాలల్లోనూ, వేశ్యవాటికల్లోనూ—ప్రతిచోటా ఇతడు గుప్తచరులను పెట్టాడు. సముద్రగుప్తుడూ యోధుడే కాని, శత్రువులపట్ల చాలా నమ్రంగా వ్యవహరించేవాడు. ఇతడి రాజ్యం దూర దూరాలవరకూ వ్యాపించింది. కాని, అతుకుల బొంత! శత్రువు ముఖతా తన అధీనతను ఒప్పుకొన్నప్పటికీ సముద్రగుప్తుడు అభయాన్నిచ్చేవాడు. అందువలననే, అతడు వృద్ధుడవగానే, సామంతులందరూ స్వతంత్రులవడానికి ప్రయత్నించారు; అయ్యారు! కాని, చంద్రగుప్తుడలాంటివాడుకాదు. గట్టి నిర్ణయాలూ, స్పష్టమైన వూహలూ కావాలతడికి! తన రాజ్యంలోని శత్రుల్ని నిశ్శేషంగా హతమార్చాలనీ, సరిహద్దు ప్రాంతాల్ని పటిష్టం చేసుకోవాలనీ అతడి వూహ.

ఆచార్య వసుబంధుయొక్క శిష్యుల సంఖ్యా, కీర్తికూడా గొప్పది. ఆచార్యులవారికి ప్రియశిష్యుణ్ణి, పరమభట్టారక దత్తాదేవికి తమ్ముణ్ణి కావడంవల్ల నన్నెరగని వారెవరూ వుండరా పట్టణంలో! విహారంలో నాతో వ్యక్తిగత పరిచయంకల భిక్షువులుకూడా కొంతమంది వున్నారు! అలాటి స్థితిలో జయయౌధేయుడు వచ్చాడని గుప్తచరులకు తెలియకుండా వుంటుందా?

నేనా విహారంలో వున్నానని తెలియగానే; చంద్రగుప్తుడు ధ్రువదేవీ సేనాపతి వీరసేనుల్తో విహారానికి వచ్చేశాడు! సైనికులూ, చారులూ ఒక పెద్ద సంఖ్యలో విహారంలోకి రావడం చూసి అక్కడున్న ప్రజలు చకితులై నిలబడి వున్నారు. చంద్రగుప్తుడు సపరివారంగా నా కోష్ఠకం ముందుకు వచ్చాడు. నేను బయటికివచ్చి నిలబడ్డాను. తన మకుటాన్ని ప్రక్కన వున్న ప్రతీహారి చేతికి ఇచ్చి, అంజలి ఘటించి, తలవంచి "భన్తే! నా మనస్సు మిమ్మల్ని 'జయా' అనో, 'మామా' అనో పిలవమంటోంది. కానీ, మీ వేషాన్ని గౌరవించడం మా కర్తవ్యం!" అన్నాడు.

ధ్రువదేవీ ,వీరసేనులుకూడా నమస్కరించారు. అదేరోజు మధ్యాహ్న భోజనానికి అంతఃపురానికి రావలసిందని నియంత్రించాడు చంద్రగుప్తుడు. గడచిన తొమ్మిది సంవత్సరాల చరిత్రనూ నాతో చెప్పాలని అతడు త్వరపడుతున్నాడు.

నేను ఒంటరిగా ప్రతిష్ఠానపు రాజాంతఃపురంలోకి వెళ్ళాను. గుప్త సామ్రాజ్యానికి పాటలీపుత్రమే ప్రధానమైన రాజధానీనగరమైనప్పటికి, ప్రతిష్ఠానం ద్వితీయ రాజధానీనగరంగా ప్రసిద్ధి చెందింది. అసలు చంద్రగుప్తుడు దేశపు నాలుగుచెరగులా నాలుగు రాజధానీ నగరాల్ని నెలకొల్పాలని సంకల్పించుకొన్నాడు. అయోధ్య,ప్రతిష్ఠానం, మధురా, ఉజ్జయిని–పై నాలుగు పట్టణాలను రాజధానీ నగరాలను చేయాలని అతడి ఉద్దేశం. వెనుకటి ప్రతిష్ఠానపు అంతఃపురానికీ, ఇప్పటి అంతఃపురానికీ, సహస్రాంశం వ్యత్యాసం వుంది. ప్రతిష్ఠానపు అంతఃపురం పాటలీపుత్రపు అంతఃపురంలా తయారయింది. కాని, అక్కడున్నంతగా రాణుల సంఖ్య, దాసీలసంఖ్య ఇక్కడలేదు. ఇప్పుడు చంద్రగుప్తుడు అంతఃపురాల్లో రాణీల సంఖ్యను పెంచడం విషయంలో తన తీవ్ర వ్యతిరేకతను కనబరుస్తున్నాడు. అప్పుడప్పుడు ఇలా అనేవాడు: "దశరథ మహారాజులా, కృష్ణభగవానుడిలాగా పదహారువేలమంది స్త్రీలను పెట్టుకొని ప్రయోజనం ఏమిటి? ఒకటి రెండు రోజులు అనుభవించడం.... ఇక జీవితాంతం అంతఃపురాల్లో బందీలుగా పడేసి అట్టే పెట్టడం!"

ప్రస్తుతం చంద్రగుప్తుడు రాజకీయమైన ప్రయోజనాన్ని సాధించడానికి గొప్ప గొప్ప రాజుల కన్యలను వివాహ మాడుతున్నాడు. ధ్రువదేవి–చంద్రగుప్తుడు ధ్రువస్వామిని అని పిలుస్తాడు–నిజంగా త్రిలోక సుందరి అని చెప్పవచ్చు. నేను రాజధానిలోకి వచ్చానని తెలిశాక బహుశః చంద్రగుప్తుడు నా గురించి ధ్రువస్వామినికి చెప్పి వుంటాడు. నా అక్క దత్తాదేవి బ్రతికి వుండగానే ధ్రువస్వామిని రామగుప్తుడికిచ్చి వివాహం చేశారు. దత్తాదేవి (అజ్జుక) అమితంగా ప్రేమిస్తుందన్న విషయం ధ్రువస్వామినికి తెల్సును.

మృత్యు సమయంలో నా జ్ఞాపకాలు అజ్జుకను బాగా వేధించాయట. చివరకు ఆమె పరమభట్టారకుల్తో ఇలా అందిట: "ఆర్యపుత్రా! మీరెలాగైనా నా జయుణ్ని ఒక్కమాటు పిలిపించండి. ఒక్కమాటు చూస్తాను. తరువాత శాంతంగా ఈ అసువుల్ని వీడతాను!"

కాని, వచ్చిన చిక్కల్లా నే నెక్కడ వుందీ పరమభట్టారకులకు తెలిస్తేగా? అజ్జుకకు వూరటను కల్పించడానికి ఇలా అనేవారట: "జయుడు చాలా దూరంలో వున్నాడు. మన అశ్వారోహకులు వెళ్ళారు. త్వరలోనే తీసుకు వస్తారు!"

ధ్రువస్వామిని అంతక్రితం నన్నెప్పుడూ చూడలేదు. కాని, నేనూ, చంద్రగుప్తుడూ బాల్యస్నేహితులమనీ, నేను బుద్ధిశాలిననీ, సాహసవంతుణ్ణనీ ఆమెకు తెల్సును! ఆమె మాళవ గణపుత్రి–నేను యౌధేయ గణపుత్రుణ్ణి. ఈ కారణం వలన

కూడా ధృవస్వామిని నేనంటే ఎంతో స్నేహంగా వ్యవహరించేది. సద్భావాన్ని కనపరచేది. ప్రతిష్ఠానంలో వున్నన్నాళ్ళూ రాజాంతఃపురంలోకి భోజనానికి వెళ్ళక తప్పదు. సాధారణంగా ధృవస్వామిని తన చేతుర్తో నాకు వడ్డిస్తూండేది. తన రాజకీయ వ్యవహారాలకు పోను సమయం మిగిలితే తనూ వచ్చి మా మాటల్లో కలిసేవాడు చంద్రగుప్తుడు. రాత్రి బాగా ప్రొద్దుపోయాక విహారానికి వచ్చి, ఏనాడు జరిగిన విషయాలను ఆనాడు మాధవసేనుడికి చెబుతూండేవాణ్ణి.

బంధుత్వదృష్ట్యా నేను ధృవస్వామినికి తండ్రినవుతాను. (భర్త మేనమామ) కాని, వయస్సులో భర్త ఈడువాడినే కావడం వలన, కొంత ప్రేమా, స్వాతంత్ర్యమూ కలిసిన దృష్టితో చూస్తూండేది. అప్పుడప్పుడు ఇలా అనేది: "మాతుల భట్టారికా! ఇక నీ కాషాయ వస్త్రాలను విసర్జించండి! స్వర్గంలో అప్సరసలు ఎటూకాదనరు. కాని భూలోకంలోని అప్సరసలు మీలాంటి పురుషులు కాషాయాంబరధారులు కావడం వలన. కాపురుషుల పాలపడుతున్నారు!" అనేది:

కాపురుషుడన్న శబ్దాన్ని ఉచ్చరించేప్పుడు ఆమె స్వరం రామగుప్తుణ్ని లక్ష్యించేది? ఒకమాటు చంద్రగుప్తుడు శకరాజైన దేవపుత్రుణ్ని అతడి ప్రాసాదంలో వధించాడట. ఆ సంఘటనను ఇలా వర్ణించి చెప్పాడు చంద్రగుప్తుడు: "మిత్రమా, జయా! నాలోని కార్యపటుతా, దీక్షా నీకు తెలియనివికావు! కాని, నా అస్త్రాలను ఇంత త్వరగా బయటికి తీయవలసి వస్తుందని నేననుకోలేదు. తండ్రి గారి తుదివర్షాలను నీవు చూడనే చూశావు కదూ? సురా, సుందరీ మినహా, వారికి మరొక లోకమేలేదు! అలాటి స్థితిలో మా శత్రువులు బాగా విజృంభించారు. ప్రధానామాత్యుడూ, సేనాపతీ ఒట్టి చాడేకోరులు! ఈ విపరీత పరిస్థితుల్లో కొంత శక్తి సామర్థ్యాలు కలవారుకూడా చేసేదిలేక మౌనంగా వుండిపోయారు! అదే స్థితిలో తండ్రిగారి స్వర్గవాసం జరిగింది. పశ్చిమ సరిహద్దుల్లో కాచుకొని వున్న శకరాజు దేవపుత్రుడు. సమయం కనిపెట్టి సరిహద్దు ప్రాంతాలమీదఆక్రమణచేశాడు. అతడి ఆక్రమణను అడ్డుకోవడానికి రామగుప్తుడు సరిహద్దు ప్రాంతానికి వెళ్ళాడు. కాని, ఇతడుకూడా వృద్ధపితృపాదుల్నే అనుసరించాడు. సురా సుందరిని వరించాడు. అలా వరించడం తప్పనను, జీవితంలో సురా—సుందరీకోసరం కూడా కొంతభాగాన్ని కేటాయించడం ముఖ్యం! కాని, సమయమూ, సందర్భమూ— ఉన్నాయి."

"సురా— సుందరి! విచక్షణా— ఈ రెండూ పరస్పర విరుద్ధమైన విషయాలు."

"అసలీ జీవితమే విరుద్ధ స్వభావాల సంగ్రహం! ఒక వైపున గుప్తవంశప్రకీర్తిపతాక శాశ్వతంగా భూమికి దిగిపోవడానికి సిద్ధమైంది. రామగుప్తుడు తన సమస్త సైన్యంతో ఆ పతాక రక్షణకు వెళ్ళాడు. కానీ, అలాటి సమయంలోకూడా అతడు సురా సుందరిని విడువలేదు. విలాసాల్లో మునిగిపోయాడు. నేను ఊరక

చూస్తూవుండడం కాక చేయగలిగింది ఏముంది? మనసులో మాత్రం చాలా బాధపడే వాణ్ణి. అలాటి రాజును కలిగిన సేన బలవంతుడైన శత్రువు నెలా ఎదుర్కొ గలదు? అటు సీమాంత ప్రదేశాలల్లో క్షత్రవులూ, వాకాటకులుకూడా ఆక్రమణలకు సిద్ధపడుతున్నారు. అందువల్ల కొంత సైన్యం అటువైపున వుండిపోయింది! శకరాజు సైన్యం లోపలికి చొచ్చుకు వస్తోంది. రామగుప్తుడి సంధి- విగ్రహకుడు (యుద్ధ మంత్రి) పరిస్థితిని చాలా నిరాశాపూర్ణంగా చిత్రించాడు. దాంతో రామగుప్తుడు ఎంత క్రిందికైనాదిగి సంధి చేసుకోవడానికి, ఎంత కొద్ది రాజ్యం దొరికినా అంత టితో తృప్తిపడి ప్రాణాల్ని రక్షించుకోవడానికి సిద్ధపడ్డాడు. అదేసమయంలో శక రాజు దూత వచ్చాడు. వాళ్ళషర్తు ఇది: "శకరాజైన దేవపుత్రశాహి, రామగుప్తునకు అభయదాన మీయడానికి సిద్ధంగా వున్నారు. కానీ, రామగుప్తుడు తన పట్టపురాణి యైన ధృవదేవిని దేవపుత్రునికి వప్పగించాలి!" సముద్రగుప్తుడికీ, దత్తాదేవికీ రామ గుప్తులాంటి సంతానం కలుగుతుందని ఎవరనుకోగలరు? రామగుప్తుడు ధృవదేవిని ఎలా దేవపుత్రశాహి వద్దకు పంపగోరాడనేది స్వయంగా ధృవదేవి నోటిమీదుగా వింటేనే తెలుస్తుంది!" ఆ తరువాతి విషయాలను ధృవస్వామిని ఇలా చెప్పింది: "అప్పుడు రామగుప్తులు చెప్పిన మాటల్ని ఎంతో వ్యధితహృదయనై విన్నాను. ఇలా అన్నాడు- "దేవీ! బలవంతుడయిన శత్రువు గుప్తవంశాన్ని నాశనం చేయ డానికి సన్నద్ధుడైనాడు. అతడు ఒక్క గుప్త వంశాన్ని నాశనంచేసి వూరుకొన్నా నేనంతగా విచారపడను. కానీ, శత్రువు మన ప్రజల్ని కూడా నాశనం చేస్తాడు. శకులు చాలా క్రూరులు. గ్రామాలకు గ్రామాలు తగులబెడతారు! స్త్రీ, బాల, వృద్ధు లన్న విచక్షణ లేకుండా ప్రజల్ని చిత్రహింస చేస్తారు. కనుక నేను ప్రజాహితం కొరకు నా భార్యను త్యాగం చేయడమే ఉచితమని భావిస్తున్నాను!"

"తనూ రఘుకుల రాము డవుదామను కొన్నాడు గావును! ఛి-ఛి!"

"నాకు వళ్ళు మండింది. నేను మాళవవంశ పుత్రిని. గుప్తవంశపు పట్టమహి షిని! నోటికి వచ్చినట్లు నాలుగు విదిలించాను! నీవే చెప్పు మాతుల భట్టారక? ఈ నీచమయిన కార్యానికి రఘుకుల రాముణ్ణి ఆదర్శంగా పెట్టుకొన్నాడు రామ గుప్తుడు! కాని, భార్యకోసం లంకా పట్టణాన్నే ధ్వంసంచేసిన ఆ వీరు డెక్కడ? ఈ భీరుడెక్కడ? ఈ భీరుడు నాకు భర్తగా వుండతగడని ఆ క్షణమే నిశ్చయించు కొన్నాను. సాళవవంశ పుత్రి యెలాటి స్థితిలోనూ వేశ్య కాలేదు. ఈ విషయాన్ని చంద్రగుప్తుడికి చెప్పాను. చంద్రగుప్తుడు అదనుకోసం ఎదురుచూస్తున్నాడు. చక్కని అవకాశం లభించింది. నాకన్నీటిని తుడిచి ఊరట కలిగించాడు. "నా ప్రాణాలను వదిలాక నీవు అంతఃపురం నుండి కదులుదువుగాని" అన్నాడు చంద్ర గుప్తుడు. అతడిలో ఎన్ని లోపాలు వున్నప్పటికీ పిరికివాడు మాత్రంకాదు."

ఆ తరువాత జరిగిన విషయాలను చంద్రగుప్తు డిలా చెప్పాడు: "రాజు యొక్క రాజ్యాన్నీ, సంపదనీ కాకుండా అతడి భార్యను కోరేవాడు ఒకి కామాం

ధుడై వుంటాడనేది నిశ్చయమైన విషయం! శకరాజుతో ముఖాముఖిని పోరాడితే సఫలత అంతగా కలగదని నాకు తెల్సు. మాకు సైనికబలం ఎంతగావున్నా, సేనా నాయకులు మాత్రం విశ్వాసపాత్రులు కారు. మోహాంధుడైన శకరాజును మోసం తోనే జయించాలనుకొన్నాను. అందుకొక ఉపాయాన్నాలోచించాను. కాని ఉపాయం చాలా ప్రమాదమయినది. ప్రాణానికే తెగించినవాడికి ఇంక ప్రమాద మేమిటి? వీరసేనుడూ, నేనూ కూడబలుక్కున్నాం. అతడూ నాతో పాటు అగ్నిలో దూకడానికి సిద్ధం అయ్యాడు. అతడు సాహసికులైన అయిదువందల మంది యువకుల్ని ఏరాడు. నేను ఆ యువకుల్తో స్పష్టంగా చెప్పేశాను. "మనం శత్రువు ఇంట్లోకే వెళ్తున్నాము! మనం మృత్యువును ఆలింగనం చేసుకోవడానికి వెళ్తున్నామనేది స్పష్టం. శత్రువు చాలా బలశాలి! ఎంత అయినా గుప్తవంశపు గౌరవాన్ని నిలబెట్టడానికి మన ప్రాణాలను ఆహుతి ఇవ్వాలి. ప్రాణాలమీద తీపి లేని యువకులు ముందుకు రండి!" అందరూ తాము సిద్ధమన్నట్టు జయఘోష పెట్టారు. ఇక వెంటనే, నేను ధృవస్వామిని వేషం వేసుకొన్నాను. మిగిలిన యువకులకు కూడా స్త్రీ వేషాలను వేశాను. మేమంతా యువకులం! కానీ, మా పురుష చిహ్నాలయిన మీసాలూ, గడ్డాలూ క్షణంలో అదృశ్యమైనాయి. పొడుగాటి జడల్తో అందమైన యువతుల్లా అలంకరించుకున్నాము. ప్రతి అయిదుగురు యువ కులకు ఒక మంగలికత్తి వుంది. నిద్రలేవగానే రోజూ కత్తితో గడ్డం, మీసాలు గీచుకోవడం ఒక నియమం! తరువాత, ముఖంలో మృదుత్వం కనుపించడానికి యేవేవో చూర్ణాలను రాసేవారము!"

"నీ నాటకాన్ని నేను చూశానుగా! ఇంకేం అయిదువందల మందిని, స్త్రీలుగా మార్చడానికి నీకు తెలిసిన కళాప్రక్రియ లన్నింటినీ ఉపయోగించావన్నమాట."

"నా చిన్ననాటి నాటకాల అనుభవం ఇంత చక్కగా ఉపయోగానికి వస్తుం దనుకోలేదు! నేను రామగుప్తుడికి నా అభిప్రాయాన్ని చెప్పాను. చివరకు యిలా అన్నాను : "సోదరా! ఒక్కమాటు నా సాహసాన్ని ప్రదర్శించడానికి అవకాశ మివ్వించు. బహుశః మనం కృతకృత్యులం కావచ్చును! నా మాటలువిని రామ గుప్తుడు చాలా సంతోషించాడు. నా ధైర్యసాహసాలను ప్రశంసించాడు; కాని అతడు, ఒకే దెబ్బకు రెండు పిట్టలు ఎగురుతున్నాయని సంతోషించాడు కూడాను! వెంటనే శకరాజుకు, ధృవస్వామినిని ఐదు వందలమంది పరివారంతో పంపుతున్నా నని కబురుపంపాడు. శకరాజు ధృవస్వామిని కలుసుకోవడానికి చాలా ఆత్రపడుతు న్నాడు. మేము ఐదువందల పల్లకీల్తో శకరాజు స్కంధావారానికి (గుడారాలకు) చేరాము. యమునాతీరాన, అవగుంఠనంలో (ముసుగులో) నా అర్ధనగ్న సౌంద ర్యాన్ని చూసి అతడు పిచ్చివాడయ్యాడు. అవగుంఠనాన్ని తొలగించాడు. విశాలమైన కండ్లకు సూక్ష్మమైన కజ్జలరేఖ. పలుచని పెదాలమీద చిన్న చిరునవ్వు—శకరాజు

పరవశుడై నా భుజంమీద చేయివేస్తూ "ప్రియతమా!" అన్నాడు. నేను క్రీగంట చూస్తూ! నా భుజంమీది అతడి చేతినితీసి, అతడి తొడమీద వుంచాను.

"నీవు ధ్రువస్వామిని ప్రాతను ఎంత చక్కగా అభినయించి వుంటావో; నేను ఊహించుకోగలను!"

"నా యీ ప్రథమ సఫలతనుచూసి నేను ఉప్పొంగిపోయాను, రాత్రి కాగానే గుడారాల్లో దీపాలు వెలిగించారు. నా హృదయం విపరీతమైన ఆవేదనతో కొట్టుకులాడుతోంది! శకరాజు తన క్రొత్తరాణి దగ్గరకు వచ్చాడు. సువర్ణచషకాల్లో ఎర్రని కాపిశేయ సురం మెరిసిపోతోంది. పరిజనం నృత్యగానాదుల్ని ప్రారంభించారు. శకరాజూ! నేను ఒకే ఆసనంమీద కూర్చున్నాము. సువర్ణచషకాలలోని కాపిశేయాన్ని నేనతని నోటికి అందించాను. అతడు నా నోటికి అందించాడు. ఇలా చాలాసేపు మేము ఒకళ్ళకు ఒకళ్ళం కాపిశేయాన్ని అందించుకున్నాము. కాని, ఎవరు ఎక్కువ త్రాగివుంటారో నీవు ఊహించుకోగలవనుకొంటాను?"

"పాపమా అభాగ్యుడికి, అపర చాణక్యుడే తన గుడారంలోకి వచ్చాడని తెలియదు !"

"మనస్సును ప్రశాంతంగా ఉంచుకోగల వ్యక్తి. ఎంత బాధల్లో నుండయినా తప్పించుటకు పైకి రాగలుగుతాడు! కాపిశేయ సురలాగానే శకరాజు కండ్లుకూడా అరుణిమను దాల్చాయి. మధ్య మధ్య అతడికండ్లు మూతలు పడుతున్నాయి. అప్పుడప్పుడు నా భుజాలమీదా, కృత్రిమస్తనాలమీదాచేతులు వేస్తున్నాడు. నా బుగ్గలను ముద్దు పెట్టుకొంటున్నాడు. నేను పరిజనులందరినీ బయటికి పంపించివేశాను. చేడియలుకూడా హంసతూలికా తల్పాన్ని అమర్చి వెళ్ళిపోయారు. శకరాజు చాలా ఆత్రంగా నా శరీరాంగాలను స్పర్శించసాగాడు. అక్కడ కేవలమూ ఒకే ఒక దీపదానం వెలుగుతోంది. నేను సిగ్గును అభినయిస్తూ "దీపం వుంటే నాకు చాలా సిగ్గు" అన్నాను వణుకుతున్న కంఠస్వరంతో. బయట నిలబడివున్న ప్రతీహారిని దీపం ఆర్పడానికి పిల్చాను. ఆ ప్రతీహారి ఎవడో తెలుసుగా?"

"ఒక్క ప్రతీహారేకాదు, మొత్తం ప్రాసాదంలో ఎవరెని ఎక్కడ నిలబెట్టి వుంటావో ఊహించుకోగలను!"

"అతడు విపరీతమైన త్రాగుడు వలన వళ్ళు తెలియని స్థితిలో పున్నాడు: అతని హృదయానికి నేను బాగా గురి చూచుకొన్నాను. ఆలింగనం చేసుకొంటున్నట్టు నటించి, బొడ్డులోని కత్తిని అతడి గుండెల్లోకి జొనిపాను! ఎడం చేత్తో గట్టిగా నోరు మూశాను! దేవపుత్రుడి నోటినుండి ఒక చిన్న కేకకూడా వెలువడలేదు: శాశ్వతంగా కన్నుమూశాడు. ఒకవేళ దెబ్బ తప్పిపోయి అతడు బ్రతికి గలాభా జరిగినా, ఎలా ప్రవర్తించవలసినది మొదటే నిర్ణయించుకొన్నాం. నా గుడారానికి చుట్టుపట్ల యాభైమంది యోధులున్నారు. అందరమూ అవే వేషాల్తో బయటికి పరుగెత్తాం. తలా ఒక మార్గానా నిర్ణీత ప్రదేశాన్ని చేరుకొన్నాం. అప్పటికి అటు

నుండి మా సైనికులు మా కొరకు గుర్రాల్ని పంపారు. గుర్రాల్నెక్కి సరిహద్దులో వున్న మా స్కంధావారానికి (శిబిరానికి) చేరాం. మా సఫలతను తెలియపరచాం. మితిలేని ఆనందంతో మా సైనికులు పిచ్చివారిలా ఎగరసాగారు. యువరాజా చంద్రగుప్తునికి జయధ్వానాలు పలుకసాగారు. వెంటనే శక–సేనమీద ఆక్రమణ జరుపవలసిందని సేనాపతులకు చెప్పాను. వీరసేనుణ్ణి మరికొందరు సేనాపతుల్ని తీసుకొని రామగుప్తుడి శిబిరంలోకి వెళ్ళాను. అప్పటికే అతడికి విషయమంతా తెలిసి పోయింది. కాని, అతడు బొత్తిగా నిర్బుద్ధుడు! పగటి సమయం అది. ధృవ స్వామినీ, మరికొంతమంది దాసీలూ వున్నారు. ప్రథమ విజయం నా సాహసాన్ని నూర్రెట్లు అధికం చేసింది. రామగుప్తుడు నన్ను ఆలింగనం చేసుకోవడానికి వచ్చాడు. శకరాజు గుండెలను చీల్చిన కత్తి ఇంకా నా మొలలోనే వుంది. అదే కత్తితో రామగుప్తుడి గుండెలను విదీర్ణం చేశాను. ఒకే కేకతో క్రిందపడి ప్రాణా లను విడిచాడు రామగుప్తుడు. ప్రక్కనవున్న ధృవస్వామిని వచ్చి నన్ను గుండె లకు హత్తుకొన్నది. దాసీలు పాషాణ ప్రతిమలా నిలబడి వున్నారు. ధృవస్వామిని కండ్లు ఆనందాశ్రుపూర్తో తడిశాయి. "నీ మనస్సు ఈ పిరికిపంద కొరకు క్షోభపడు తోందా?" అనడిగాను ధృవస్వామినిని! ధృవస్వామిని "యదు. యదు. భట్టా!" అనే జయకార స్వరంతో నన్నభినందించింది. దాసీలుకూడా "యదు. యదు. భట్టా రకా!" అన్నారు. ఇకనదేక్షణాన గుప్తవంశపు రాజ్యలక్ష్మికి నేను స్వామి నయ్యాను!"

"మరి ధృవస్వామినికి కూడా!"

చంద్రగుప్తుని ముఖంలో ఉదాసీనత గోచరించింది. నేనిలా అన్నాను "బహుశః మరొక మార్గం లేకపోయిందేమో!"

"నిజం చెప్పావు! రాజకులాల్లో భ్రాతృ హత్య అతి సాధారణమైన విష యం. రసపుత్రులకు పితృ హంతకులని పేరేవుంది! యికసలాంటప్పుడు భ్రాతృ హత్య ఒక్కలెక్కా! కానీ, వెనుక నేను నా భవిష్య జీవిత కార్యక్రమాన్ని గురించి వూహించు కొనేప్పుడు, రామగుప్తుణ్ణి చంపాలన్న వూహ నాకెన్నడూ కలిగింది కాదు. కాకపోతే అతడిని బంధించి ఆజీవనం కారాగారంలో వుంచితే చాలుననీ నా వుద్దేశ్యం! అసలు అలాటి నిర్బుద్ధుణ్ణి వధించవలసిన అవసరం మాత్రం ఏముంది? కానీ, అతడు ధృవస్వామినిని శకరాజుకు ఒప్పగించడానికి ఇష్టపడ్డంతో నా హృదయంలో కాఠిన్యత పేరుకొన్నది. సముద్రాంతాల క్షితీశుల్ని కూడా తనకు సామంతుల్ని చేసుకొన్న సముద్రగుప్తుడి పుత్ర–వధువు (కోడలు)ను నీచ మైన శకరాజు శిబిరంలోకి, పంపించేదా? రామగుప్తుణ్ణి ప్రాణాలతో వదిలితే, అత డిని ఆటబొమ్మనుచేసి ఆడిస్తున్న అమాత్యులకు కొంత అవకాశం ఇచ్చినవాడ నవు తాను. అన్ని సమస్యలకు పరిష్కారమార్గం అతడివధ ఒక్కటే!"

* * * *

శిశిర ఋతువు, సంధ్యా సమయం, నేనూ చంద్రగుప్తుడు, ధృవస్వామిని- మేము ముగ్గురమూ ఒక నావలో కూర్చుని జల విహారం చేస్తున్నాము. మాకు కొద్ది దూరంలో పరిజనులూ, దాస దాసీ జనాలూ కొన్ని నావల్లో వస్తున్నారు. యమునా గంగా సంగమ స్థానమది. మా నావలు రాజ మహలుకు ఎగువకు పోతున్నాయి. ఒకవైపున యమునయొక్క నీలి జలధార, మరొక ప్రక్కన శ్వేత గంగాధారా ప్రవహిస్తున్నాయి. రెండు నదులకు మధ్య నున్న ప్రదేశం, స్వర్ణ వర్ణ సైకత రాశితో నిండివుంది. ఆ సైకత రాశిపై పర్ణ కుటీరా లెన్నో వున్నాయి. నేను జన్మించిన ఆగ్రోదకాలో నదులు లేవు. అయినా చాలా చిన్నవయసునుండి గంగానది ఒడ్డున ఆడుకోవడం, గంగానదిలో మునకలు వేయడం చేస్తూండేవారము. కనుక గంగానది అంటే తల్లిలాటి ప్రేమ నా హృదయంలో పాదుకొన్నది. అనేక సంవత్సరాలుగా గంగానదికి దూరం కావడం వలన ఈ ప్రేమ మరీ ఎక్కువయింది. ఇప్పుడిక గంగాధారను చాలా ఉత్సుకతతో తన్మయుడనై చూస్తూ వున్నాను. చంద్రగుప్తుడిలా అన్నాడు: "ఏం జయా! ఏదో క్రొత్త వస్తువును చూస్తున్నట్టు చూస్తున్నావు గంగానదిని?"

"గంగానది నాకు సదా క్రొత్త వస్తువే! మన మిద్దరం ఈ గంగానదిని ఉద్గమ స్థానంలోనే చూశాం. చాలా సన్నధార అక్కడ....తన కలవరంతో తన అల్పతను పరిహరించు కొన్నది!"

"అవును. ఉత్సవ సంకేత, హిమాలయం! ఆ రోజులు ఎంత హాయిగా గడిచాయి. మనం చమరీ మృగాలనెక్కి కర్పూరంలాంటి శ్వేతహిమరాశిమీద ప్రయాణించడం ఎంత బాగుంది! ఆ దేవదారు వృక్షాలూ! వాటిలోనుండి వచ్చే మృదు వాసనలూ!" అన్నాడు చంద్రగుప్తుడు.

"గంగానది తన ఉద్గమ స్థానంలో కూడా చాలా అందంగా ఉంటుంది. ఇక నీ సంగమంలో దీని సౌందర్యాన్ని వర్ణించనేలేము! కాదుగానీ చంద్రా! నీవు, నీ ప్రతిష్ఠానాన్ని రెండవ రాజధానిగా చేసుకొని గంగా సంగమానికి సదా చేరువతో వున్నావు!"

"నా మిత్రులూ, అమాత్యులూ గంగా—యమున సంగమానికి మధ్యతో రెండవ రాజధానీ నగరాన్ని నిర్మించమని సలహా ఇచ్చారు."

"అలా చేసినట్లయితే, చాలా బాగుండేది. ప్రాసాదంలో కూర్చుని రెండు ధారలనూ చూడవచ్చును. పైగా, నీ పేరు శాశ్వతమయ్యేట్టు ఆ నగరానికి నామకరణం చేయవచ్చును!"

"అవును. విక్రమపురి అని పిలిచేవారు. నీకు తెలుసునో తెలియదో నేను విక్రమాదిత్యుడన్న బిరుదు నామధేయాన్ని స్వీకరించాను!"

"నీలో నిజంగా "విక్రమం" వుంది! సార్థకమైన ఉపాధిని గ్రహించావు!"

"కానీ, ప్రతిష్ఠానానికి పోటీగా మరొక నగరాన్ని నిర్మించడం నాకు ఇష్టం లేదు. కనీసం ఈ గంగా—యమున సంగమంలో పోటీ నగరాన్ని నిర్మించడం తగదని నా భావన."

"నష్టమేమీ లేదుగా?"

"యమున—గంగ ఈ రెండు నదులను నేను విడివిడిగా చూడలేను. ఈ రెండు నదులూ కలిసి ఒకే ధారగా కనిపించాలని నా కోరిక! ఈ రెండు ప్రవాహాలను విడివిడిగా చూసినప్పుడు, అవి ప్రవాహాల్లా కాక సూదుల్లా నా కండ్లల్లో గుచ్చుకొంటాయి!"

"మరి ప్రతిష్ఠానపు అంతఃపురం నుండి ఒకే ప్రవాహం కనిపిస్తోందా?"

"పితృపాదులు క్రొత్తనగరాన్ని నిర్మించుకొన్నట్లయితే నీ వన్నట్లు గంగా—యమునలకు మధ్యలోనే నిర్మించేవారు! ఈ రెండు ధారలనూ, విడివిడిగా చూడాలనే మనస్తత్వం వారిది. వారు ఈ రెండు ధారలనూ (ప్రవాహాలను) ఏకం చేయడానికి వ్యతిరేకులు. నా అభిప్రాయం మాత్రం ఏకం చేయాలనే!"

"ఒకే ప్రవాహంగా చూడడంగానీ, ఒకే ప్రవాహంగా చేయడంగానీ చాలా కష్టం!"

"నిజమే, కష్టమని నాకూ తెలుసు! కాని, మరొక మార్గంకూడా లేదు. ఊరక రాజుల కిరీటాల్ని కాలిగోటితో స్పృశించినంత మాత్రాన, అది దిగ్విజయం ఎన్నటికీ కాలేదు, కాదు! అన్యరాజ్య వంశాల్ని పూర్తిగా తుడిచిపారేసి, ఒకే ఒక బలిష్ఠమైన రాజ్యాన్ని, కొంతకాలం మనగలిగే రాజ్యాన్ని నిర్మించాలి!"

"కొంతకాలం అంటే శాశ్వతంగా ననేనా, నీ అభిప్రాయం?"

"శాశ్వతంగా మనగలగాలనుకోవడం, దురాశ మాత్రమే అవుతుంది! చిరకాలం అనవచ్చును. గుప్తవంశం చిరకాలం వర్ధిల్లాలని నేను కోరుతున్నాను."

"నష్టమేముంది? ప్రతివారూ తమ వంశపు అభివృద్ధిని కోరుతారు. అది సహజమే."

"ఒకే ఒక నష్టముంది. ఎన్నో రాజవంశాలు నామ శేష మవడాన్ని చూస్తూ కూడా, మనవంశాన్ని చిరకాలం నిలుపుకోవాలని ప్రయత్నించడం, ఒకరకంగా వ్యర్థ పరిశ్రమే అవుతుంది. ఏ రాజవంశాలుకూడా ఐదుతరాలకు మించి తమ అస్తిత్వాన్ని నిలుపుకోలేక పోయాయి. కొన్ని రాజవంశాలయితే ఒకతరంలో తమ గొప్పతనాన్ని కోల్పోయాయి కూడాను. మా గుప్తవంశాన్ని చూడరాదా! పరమభట్టారక సముద్రగుప్తులు ఈ వంశాన్ని సమస్త భారతదేశానికి చక్రవర్తిని చేశారు. కానీ వారి జీవితకాలంలోనే (వారి వృద్ధాప్యంలో) ఏమైంది?"

"ఏ వంశకర్త అయినా మొదట్లో చాలా బాధపడవలసి వుంటుంది. పేరు ప్రతిష్ఠలూ, చరిత్రా ఏమీలేని ఒక సామాన్యమైన వంశాన్ని పైకి తీసుకురావడానికి పాప మా మూలపురుషుడు చాలా శ్రమిస్తాడు. ప్రతిష్ఠనూ, వైభవాన్నీ, రాజ్యాన్నీ

మానవుల ఐకమత్యం ముఖ్యం.

సంపాయిస్తాడు. ఆ తరువాత వాళ్ళకు ఇవన్నీ ఊరకనే సంక్రమిస్తాయి. ఏమీ పరి శ్రమ చేయనవసరం ఉండదు. కానీ, నీవన్నట్లు ఏ రాజవంశమూ ఐదు తరాలకు మించి, తన ప్రతిభనూ పలుకుబడినీ కాపాడుకోలేకపోయింది!"

"అది సహజమే! ఊరకే వచ్చిన సౌఖ్యాల్ని అతిగా భోగిస్తారు. సురా—సుందరి ప్రభావంలో పడిపోయి, వంశ ప్రతిష్ఠనూ, శక్తి సామర్థ్యాలను మరచి పోతారు! అది సరే. నీవు భగవాన్ కౌటిల్యులను ఎందుకు ఒప్పుకోవు?"

"నేను భగవాన్ కౌటిల్యులను (చాణక్యుణ్ణి) మొండిగా వ్యతిరేకిస్తానని అను కోకు! యవనుల పరిపాలన నుండి ఈ దేశాన్ని రెండువందల సంవత్సరాలపాటు కాపాడగలిగింది వారి అద్భుతమైన ముందుచూపే!"

"అంతే-నేనూ అదేకోరేది! నా తరువాత వారుఆహారవిహారాదుల్లో ఒక నియ మాన్ని పాటించాలని నా వాంఛ! సురా–సుందరి శాసన వ్యవస్థను బలహీన పరచ రాదని నా ఉద్దేశ్యం! ఈ స్థితిని ఒక్క నా వంశంలోనే కాదు. అన్ని రాజవంశా ల్లోనూ కల్పించాలని నా ఆదర్శం!"

నేను ఆలోచించసాగాను—చంద్రగుప్తుడి వూహలు బాగానే ఉన్నాయి. అందరూ కలసి ఒకేరకం (ఒకేరాజ్యం) గా వుంటే శత్రువు కన్నెత్తికూడా చూడ లేడు. కానీ, మానవులు ఏ ఇటుకరాతి ముక్కలో కాదుగా? ఎవడో ఒకడొచ్చి తన యిష్టంవచ్చినట్టు గోడ కట్టడానికి? మానవుడికి కష్టసుఖాలూ, లాభనష్టాలూ బాగా తెలుసు! తన ప్రయోజనం కోసం, నలుగురితో కలుస్తాడు. తనూ ఒక ఇటుక అయి ఒక గొప్ప మహలుయొక్క నిర్మాణానికి సహకరిస్తాడు. కానీ, ఏ రాజవంశానికో, రాజుకో, కీర్తినీ, సౌఖ్యాన్నీ సంపాయించి పెట్టడానికి తను ఎన్న టికీ 'ఇటిక' కాలేడు! మా యౌధేయ గణంలో చంద్రగుప్తుడిలా మానవులందర్ని ఇటుకలుగా గోడకట్టే మహానుభావు డెవడూలేడు. అయినప్పటికీ అగ్రోదకా, పృధూ దకా, భాండిలా, రోహితకీ మొదలైన గణాల్లో విభక్తమైవున్న, మానవత్వాన్ని ఏకం చేసి మహాశక్తివంతమైన అడ్డుగోడను కట్టిందెవరు? ప్రజలు తమకు తామై, సాము హిక స్వార్థంకొరకు, ఐక్యతను, ఏకతను పొందాలి! చంద్రగుప్తుడు ఎందుకని ఇలా సహజంగా ఆలోచించలేడు. అవును, రాజవంశంలో పుట్టిన చంద్రగుప్తుడికి అసలు ఇలాటి వూహలు ఎలా వస్తాయి?

చంద్రగుప్తుడు ఇంకా చెబుతూనే వున్నాడు. "నాన్నగారు దిగ్విజయం ప్రారంభించినప్పుడు, వారివద్ద అపారమైన సాధన సంపత్తే వుంది. కానీ ఈనాడు నావద్ద అపారమైన సాధన సంపత్తి వుంది: నాన్నగారి 'అస్త్ర కౌశల్యం' నాలోనూ ఉంది. కావాలంటే నేనూ ఇప్పుడు దిగ్విజయాన్ని ప్రారంభించగలను. కానీ, నా కలాటి నామమాత్రపు దిగ్విజయాలు నచ్చవు. నా

రాజ్యాన్ని పశ్చిమ సముద్రంవరకూ వ్యాపింప చేయాలన్నదే నా వూహ!" ఏదో దృఢసంకల్పం చేసుకొంటున్నట్లు అతడి ముఖం గంభీరతను దాల్చింది.

"పశ్చిమ సముద్రంవరకా?" అనడిగాను.

"అవును. పశ్చిమ సముద్ర తీరం వరకూ రాజ్యాన్ని విస్తృతం చేయాలన్నదే నా దృఢ సంకల్పం. తూర్పు సముద్రతీరం మనచేతిలో వుండడంవలన చీనా, యవనద్వీపాల వరకు మన వ్యాపారం సాగుతోంది. అలాగే పశ్చిమతీరం కూడా మన చేతుల్లో వుంటే, యవన, పారస్య మొదలైన దేశాల వ్యాపారమంతా మన వశం అవుతుంది. అసలు ఈ రోజుల్లో 'లక్ష్మి' వ్యాపారంలోనే ఉంటోంది. అప్పుడు నా కోశాగారం సదా నిండి వుంటుంది. అన్యరాజుల రాజమకుటాలు నా చరణాలకు ప్రణమిల్లుతాయి."

"అయితే చంద్రా! నీ దృష్టి క్షత్రపులమీద, వాకాటకుల మీదా వుందా?"

"అవును, క్షత్రపులు మళ్ళీ తలయెత్తారు. వారిని సంపూర్ణంగా నాశనం చేస్తాను!"

"కాని క్షత్రపుల బలాన్ని ఆలోచించావా?"

"మహాక్షత్రపుడు సత్యసింహుడు రుద్రసేనుడికంటే బలవంతుడని నాకు తెలుసును. కాని, చంద్రగుప్తుడు సముద్రగుప్తుడిలా కిరీటం కాళ్ళమీద పెట్టినంత మాత్రాన విడువడని తెలుసుకొంటాడు. నేనూ అంతా సిద్ధంచేసుకొన్నాను. నాన్నగారి కాలపు ముసలి బలాధికృతుడు (సేనాపతి) ఇప్పుడు కేవలము గౌరవ సేనాపతి మాత్రమే. అతడికి ఎలాంటి అధికారాలూ లేవు"!

"అధికారాలు లేవా? అంటే?"

"అంటే ఇక నిప్పుడు 'సేనా సంచాలనం' ఆ ముసలి, దుర్బలమైన పిరికి చేతుల్లో లేదు!"

"మరి అతడు మంచి అనుభవజ్ఞుడుగా?"

"అతడి అనుభవాన్ని నేను ఒప్పుకొంటాను. ఆ అనుభవం నుండి లాభాన్ని పొందడానికి నేను సదా సిద్ధంగా వుంటాను. అతడి సలహాలను, అభిప్రాయాలనూ గౌరవిస్తాను. కాని, అతడి యుద్ధనీతి మీద, అతడి నిర్ణయాల మీదా నాకు ఆట్టే విశ్వాసం లేదు. వాటిని నేను పాటించను! అతడు నేర్పిన అనుభవం యాభై సంవత్సరాల క్రితపు ముసలి ప్రపంచం నుండి, ఇప్పటి ఈ యువక ప్రపంచానికి ఆ అనుభవం అంతగా సరిపడదు!"

"ఐతే వృద్ధులకు అధికారాన్ని వప్పగించడం నీకు ఇష్టంలేదా?"

"వృద్ధులకుగానీ పురాతన రాజవంశాలకుగానీ, అధికారాన్ని వప్పచెప్పడం నాకు బొత్తిగా ఇష్టంలేదు. వృద్ధులు చెదపురుగుల్లాటివారు. తినేస్తారు. పోతే, పురాతన రాజవంశాలు సదా తమ ప్రాచీన ఉన్నతిని పొందడానికి ప్రయత్నం

చేస్తుంటాయి. కనుక ఈ ఇద్దరి చేతుల్లోనూ అధికారాన్ని వుంచడానికి వీల్లేదు! నేను రాజ్యంలోని మొత్తం కుమారామాత్యుల్నీ, ఉపరికుల్నీ మార్చేశాను!"

"ఐతే, ఇప్పటికి ఉపరికులు (వైస్రాయి) మహారాజులు కాదా?"

"వారిని 'మహారాజ' బిరుదుతో మేము భూషిస్తాము! అంతేగాని వంశ పారంపర్య మహారాజులు కావడమనేది నిషేధింపబడ్డది. మరొకచిన్న రహస్యం కూడా వుంది. ఒక్క సేనలో మినహాయించి మిగిలిన పదవులు బ్రాహ్మణుల కీయడం ఉత్తమం! రాజులకు ఉపయోగపడడానికి వారిలో కావలసినంత బుద్ధిబలం వుంది. ఎన్నటికీ కత్తిపట్టలేరు. ఎదురు తిరగలేరు!"

"కాని, చంద్రా! పుష్యమిత్రుణ్ణి ఎరుగుదువా?"

"అవును, పుష్యమిత్రశుంగుడు బ్రాహ్మణుడు, మౌర్యుల సేనాపతి! స్వామి ద్రోహంచేసి స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించాడు. మౌర్యులు పొరపడ్డారు. ఖడ్గధారి ఐన బ్రాహ్మణుడు మన కవసరంలేదు. బుద్ధిశాలియైన (చాణక్యుల్లాటి) బ్రాహ్మణుడు మనకు్కావాలి!"

"ఐతే, సైన్యంలో క్షత్రియుల్ని నియుక్తం చేయడమే వుత్తమ మంటావు?"

"అవును. కాని, అనాది కాలంనుండి వంశపారంపర్యం సైనికవృత్తిలోవున్న క్షత్రియులే కావాలి! ఒకప్పుడు సింహాసనాన్నధిష్టించి దురదృష్టులై మకుటాల్ని పోగొట్టుకొన్నవారు పనికిరారు. రాజమకుటం చాలా విచిత్రమైంది. వ్యక్తి దాన్నొకమాటు ధరించాడా ఇక అతని శౌర్యం తిరోముఖం పడుతుంది. భీరుత్వం, శృంగారం మాత్రమే మిగుల్తాయి!"

"రాజమకుటం అంత చెడ్డదంటావు?"

"ఏం అలా అంటే నీకు సంతోషంగా వుందా? అవున్లే యౌధేయుడివైతివి!"

"కానీ, చంద్రా ! యౌధేయ రక్తం నీ శరీరంలోనూ వుందిగా?

"యౌధేయ రక్తం నాలో వున్నందుకు నేను చాలా గర్వపడుతున్నాను. భవిష్యత్తులో కూడా ధ్రువస్వామినీ పుత్రుడే నా పేరు నిలిపేది" అంటూ చంద్రగుప్తుడు తన మహాదేవివైపు చూశాడు. ధ్రువస్వామిని చంద్రగుప్తుడు చేతిని తన చేతిలోకి తీసుకొని ప్రముదితయై "ఆర్యపుత్రుడి గణసంతానం నుండే శౌర్యాన్నీ, వీరతను ఆశించగలరను కొంటాను?" అన్నది.

"అవును, గణసంతానానికి కిరీటాన్ని ధరించాలన్న కాంక్షవుండదు. నా తండ్రి గణ—పుత్రికకు కలిగారు. నేనూ గణ—పుత్రికకే పుట్టాను! నీవు నాకు కూడా అలాటి పుత్రుణ్ణే ప్రసాదిస్తావని ఆశిస్తున్నాను దేవీ!" అంటూ చంద్రుడు, ధ్రువస్వామిని చుబుకాన్ని (గడ్డాన్ని) స్పృశించాడు.

ధ్రువస్వామిని దత్తాదేవికి తగిన కోడలు. ఆమె భావాలూ, అభిప్రాయాలూ చాలా స్వతంత్రమైనవి. చంద్రగుప్తుడు సదా ఆమె భావాలను గౌరవిస్తుండేవాడు.

ఆమెను చంద్రగుప్తుడు 'ధృవదేవి' అనక ధృవస్వామినీ అనీ, ఒకి 'స్వామినీ' అనీ పిలుస్తుంటాడు. అతడు ఆమెను పిల్చే పై పిలుపుర్లోనే, అతడికి ఆమె మీదవున్న గొప్ప భావన వ్యక్తమవుతోంది. ధృవస్వామిని నా మీద చాలా ప్రభావాన్ని కలిగించింది. నా స్థానంరో మరో వ్యక్తి వున్నట్లయితే, ఆమె ప్రవర్తన యొక్క గొప్ప ఆకర్షణలో కట్టుబడి శాశ్వతంగా రాజ పరివారానికి బానిస అయ్యేవాడు ! నేను తన భర్త యొక్క మాతృ వంశీయుణ్ణి! అంత మ్మాత్రాన వందల సంఖ్యలో దాసీలు వుండగా తనేవచ్చి నాకు ఆహార — పానీయాల్ని ఈయవలసిన అవసరం ఏముంది ? నా సుఖం కొరకు, ఆనందం కొరకు ప్రత్యేకమైన జాగ్రత్తలు తీసు కోవలసిన పనేముంది? ధృవస్వామిని పరిహాసమాడడంరో కూడా చాలా నిపుణత కలది ! ఒక పర్యాయం ఇలా అన్నది: మాతుల భట్టారకా ! మీ రిద్దరూ దత్తాదేవి ఒడిలో పెరిగి పెద్దవారయ్యారు. మిమ్మల్నిద్దర్నీ జంటగా చూసే భాగ్యం వారికి లేదు. గతించారు ! కాని, నాకు మ్మాత్రం మీ ఇద్దర్నీ ఎప్పుడూ జంటగా చూడా లన్న కోర్కె వుంది!"

పై మాటలు అంటూ వుండగా ధృవస్వామిని కండ్లు ఆర్ద్రమైనాయి. నేను చిరునవ్వు నవ్వుతూ, "ఇలా చీవరాన్ని ధరించిన నాకూ, అతనికీ ఎలా జంట కుదురుతుంది?" అన్నాను.

"ఈ చీవరాన్ని శాశ్వతంగా ధరించాలన్న నియమం ఏముంది? ఎంతో మంది రాజకుమారులు, ప్రత్యేకమైన పరిస్థితిలో ఈ చీవరాన్ని ధరించి బౌద్ధ భిక్షువులవడమూ, తిరిగి వీటిని వదిలి సహజంగా వుండడమూ నాకు తెలుసును. నిన్ను చూసినప్పటినుండి, ఎలా నిన్ను సదా నా సమక్షంలో వుంచుకోవడమా అని ఆలోచిస్తున్నాను!"

"అంటే కొంగుకు కట్టుకుందామనేనా?"

"ఆఁ! అలాగే అనుకో! నా కొంగు కాకపోతే, నా చెల్లెలు మరొకామె కొంగుకు!"

"అలా ఐతే, ఇక నేను మాతుల భట్టారకుణ్ణి కానుకదా?"

"నేను మాతుల భట్టారకా, అనే పిల్చేదాన్ని ! కాని, పరమ భట్టారకులూ, నీవూ, 'నీవు' 'నీవు' అని సంబోధించుకోవడం విన్న తర్వాత నేనూ నిన్ను 'నీవు' 'నీవు' అనడం ప్రారంభించాను! మీరు తప్పుగా ఏమీ భావించరు కదా, మాతుల— భట్టారకా?"

"మీ జిహ్వాను సృష్టించేప్పుడు బ్రహ్మ స్వర్గ – మర్త్య – పాతాళలోకాల్లోని అతి మధురమైన పరికరాలను ఉపయోగించి వుంటాడు. అందువల్లే మీ రింత మధు రంగా మాట్లాడుతున్నారు!"

"ఈ విషయంలో నా సహోదరి నా కంటే ఏమీ తక్కువకాదు!"

"అయితే, ఆమెకు మరో చంద్రగుప్తు డెవడైనా కావాలి!"

"నా మాటల్ని నీవు పరిహాసాలుగా భావిస్తున్నావా? నిన్ను చూసినప్పుడల్లా నా సోదరి ముఖం నా కండ్లకు కట్టినట్లవుతోంది! అబ్బ....మీ ఇద్దరికి వివాహం జరిగితే ఆ శుభదినం ఎంత ఆనంద దాయకంగా వుంటుందో?"

"ధృవ భట్టారికా! నీ మాటల్ని నేను కాదనను. కాని ఈ విషయంలో నీవు పూర్తిగా పొరపడుతున్నావు! ఆనందప్రదం కా దగిన ఒక యువతి జీవితాన్ని, ఒక బౌద్ధసన్యాసితో జతపరిచి, శాశ్వతంగా విషాదమయం చేద్దామనుకొన్నావా?"

"ఈ చీవరాన్ని వదిలేస్తే, ఇక నిన్ను పెండ్లాడిన యువతి జీవితం విషాదమయం ఎందుకవుతుంది? నీవు మొదట్నుండి కూడా చాలా నీరసమైన జీవితాన్ని గడుపుతున్నావని విన్నాను. జీవితాన్ని అంతగా నీరసపరచుకుంటే ఇక మీ దృష్టికి అర్థమేముంటుంది? అంతఃపుర స్త్రీలంటే నీవెప్పుడూ దూరదూరంగా తిరుగుతావుట; ఈ పరమ సౌందర్యాన్ని సృష్టించడంలో బ్రహ్మకూ్కడా కొంత ఆదర్శం వుండి వుంటుంది!"

"అంతఃపుర పరిచారికలు అలా అని చెప్పారా? అయినా నేనెవ్వరినీ అవమానపరచలేదే?"

"నీవు ఎవరినీ అవమానించవు, ముఖ్యంగా స్త్రీని అసలు అవమానించవు! కాని, నోటితో అవమానించక పోయినా (తిరస్కరించక పోయినా) చేతలద్వారా అవమానింపవచ్చుగా?" అని వాళ్ళంటారు! కాని నేను మాత్రం అలా అనుకోను. నీవు ఏ స్త్రీని ప్రేమించినా హృదయమంతటితో ప్రేమిస్తావని నాకు తెలుసు!"

"అయితే, పరమభట్టారిక, తన సోదరికి హృదయమంతటి ప్రేమా ఇప్పించాలను కొంటున్నదిగావును! కానీ చీవరం అసలీ శరీరాన్ని విడిస్తేకదా? హృదయమంతటి ప్రేమా ఇప్పించడానికి?"

"సరే, చూస్తాగా, నీ పసుపురంగు చీవరంలో ఎక్కువశక్తి వుందో, నా సోదరి నల్లనికండ్లలో ఎక్కువశక్తి వుందో? త్వరలో నా సోదరి ప్రతిష్ఠానపురానికి రాబోతోంది. ఒక్కమాటు ఆమెను చూసి, తరువాత మాట్లాడుదువుగాని!"

ధృవస్వామిని చాలా గొప్పగా నా చుట్టూ వలపన్నింది. ఆ వల చాలా పలుచనిదే అయినా భేదించడం మహాకష్టం! ఆమె ఆహ్వానాల్నీ, ఆతిథ్యాల్నీ ఒకేసారి తిరస్కరించడానికి కూడా వీలులేదు. చంద్రుడు మరోవైపునుండి వల పన్నుకు రాసాగాడు. ఒకరోజున ఇలా అన్నాడు: "జయా! నా ఆదర్శంలో ఒకవంతు పూర్తయింది. మరొక వంతు మాత్రం అలాగేవుంది! జయయౌధేయుడు చంద్రగుప్తుడి మహాబలాధికృతుడయిన రోజున (ప్రధాన సేనాపతి) దేవతలకు కుమారస్వామి లభించడం వలన ఎంత ఆనందించారో, అంత ఆనందిస్తాను!"

కాని, వాళ్ళ ప్రస్తావనల్ని నేను ప్రత్యేకంగా తిరస్కరింపనవసరం వుండేది కాదు. ఆ పనిని నా కాషాయాంబరాలే పూర్తిచేసేవి.

# విక్రమాదిత్యుడితో ప్రథమ యుద్ధం

చాలాకాలం తరువాత ఆగ్రోదకాకు తిరిగి వచ్చాను. ఇప్పుడు నేను వెనుకటిలా కుర్రవాణ్ణికాను. ముప్పై ఏండ్లు నిండిన ప్రౌఢవ్యక్తిని. మాధవసేనుడూ, నేనూ- ఇద్దరమూ యమునానది దాటి, ఆగ్రోదకా యొక్క సరిహద్దుల్లో కాలుపెట్టకముందే, మా వంటినవున్న కాషాయాంబరాల్ని తీసి యమునలో పారేశాం. మా సహజమైన- గణ-క్షత్రియ దుస్తుల్ని ధరించాం. చంద్రగుప్తుడు నన్ను అనేకవిధాల తనలో కలుపు కోవడానికి చూశాడు. అనేక రకాలైన ప్రలోభాల్ని చూపాడు. ధనం, గౌరవం, ప్రేమ, అధికారం—లభిస్తాయన్న ఆశను కల్పించాడు. ఇంత చేయడానికి కారణం ఒకటుంది. నన్నొక్కణ్ణి తనలో కలుపుకొంటే యౌధేయులందరూ తనలో కలుస్తారని అతడి ఆశ! యౌధేయుల స్వభావం అతడికి పూర్తిగా తెలుసును! యౌధేయులు తమ మాతృభూమి కొరకు, గణవ్యవస్థను కాపాడుకోవడం కొరకు, ఎంత త్యాగానికయినా వెనుదీయరు! చంద్రగుప్తుడు యౌధేయుల మీద ఆక్రమణ చేస్తాననేమీ నాతో చెప్పలేదు. చెప్పకపోయినా అతడి అభిప్రాయం నాకు తెలియును. అతడు క్షత్రపుల్ని, వాకాటకుల్ని, కుషాణుల్ని—గురించి చెప్పాడు. కాని, క్షత్రపు లకు కుషాణులకు మధ్యలో, తన సరిహద్దులో ఉన్న యౌధేయుల్ని గురించి మాత్రం చెప్పలేదు. అతడు కావాలని యౌధేయుల పేరు ఎత్తలేదు! సముద్ర గుప్తుడికి మత మాతృకులమైన లిచ్ఛవీగణం మీద కొంత ప్రేమా, ఆదరభావం వున్నాయి. కాని, చంద్రగుప్తుడికి అతడి మాతృకులమైన యౌధేయగణం మీద అలాంటి ఉన్నతమైన భావన ఏమీలేదు. చంద్రగుప్తుడు మొదట యౌధేయుల స్వాతంత్ర్యాన్నే అపహరిస్తాడని నాకు తెలుసు!

సముద్రగుప్తుడు, దీనార్లమీద తన తలిదండ్రుల బొమ్మలను వేయించాడు. రెండవవైపున 'లిచ్ఛవివయః' అని ముద్రించి మాతృకులంమీద ప్రేమనూ, కృత జ్ఞతనూ ప్రకటించాడు. కాని చంద్రగుప్తుడి నుండి యౌధేయులు అలాటిదేమీ ఆశించలేరు!

ఆగ్రోదకాలో నా యింటిని జాగ్రత్తగా వుంచారు బంధువులు. నాన్నగారి నుండి వారసత్వరూపంలో లభించింది ఆ ఒక్క యిల్లేను. ఆగ్రోదకాలోని బంధువు లందరూ నన్నుచూసి పరమానందభరితు లయ్యారు. నేను ఎక్కడ వున్నానో తెలుసుకోవడానికి వారెంతో ప్రయత్నం చేశారుట! ఆగ్రోదకాలోని బంధువుల్ని,

మిత్రుల్ని కలుసుకొన్నప్పుడు నేను చాలా ఆనందాన్ని పొందాను. కాని, రాబోయే ప్రమాదం వారి కేమాత్రం తెలియదు. అందుకు బాధపడ్డాను. పాపం సరళహృదయులైన యౌధేయులు లిచ్ఛవి దౌహిత్రుల్లాగానే యౌధేయ దౌహిత్రుణ్ణుండి కూడా ఎంతో ఆశించారు. కాని, అవన్నీ పగటికల లౌతాయని వారికి తెలియదు. నేను గణవృద్ధుల్ని కలుసుకొన్నాను. వారికి మన మాటలు చెవికెక్కేట్టుగా లేవు. వారింకా వెనకటి ప్రపంచంలోనే వున్నారు. వృద్ధులవల్ల లాభం కలుగకపోవడాన్ని చూసి యువకుల్ని కలుసుకొన్నాను. పరిస్థితిని వివరించి చెప్పాను. "చంద్రగుప్తుడు మాతృవంశీయులమని మనమీద దయ చూపుతాడనుకోవడం పొరపాటు! దయ చూపక పోవడం అటుంచి మొదటగా మననే (యౌధేయుల్నే) యుద్ధంలోకి లాగుతాడు!" అన్నాను.

నా సమవయస్కుడైన రోహతకుడు యిలా అడిగాడు : "అతడి ముందు క్షత్రపులూ, వాకాటకులూ వున్నారుగా? ఇంకా దేవపుత్రుడి విషయం పూర్తిగా అటో, ఇటో తేలలేదు! అలాటప్పుడు వాళ్ళందర్నీ వదిలి ముందుగా మనమీదకు వస్తాడా?"

"అవును. వాళ్ళందరికన్నా మనమే బలహీనులుగా కనిపిస్తున్నాము. అందువలన మొదట మనతోటే తలబడతాడు!"

"ఐతే యౌధేయుల విషయం అతడికి తెలియదా?"

"మన విషయం అతడికి బాగా తెలుసు! కాని ఈ నలుగురుశత్రువుల్లో ఎవరో ఒకర్ని మొదట ఎన్నుకోవాలికదా? కాక నలుగురితోటీ ఒకేమారు యుద్ధాన్ని ప్రారంభించేంత మూర్ఖుడను కొంటున్నారా చంద్రగుప్తుణ్ణి?"

"ఒక్కొక్కసారికి ఒక్కొక్కణ్ణి, అదే అతడనుసరించే పద్ధతి!"

"మరి నా ఉద్దేశం ప్రకారం—మొదటి 'ఒకళ్ళం' మనమే అవుతాం."

"మనని అంత బలహీనులుగా ఎందుకు భావిస్తున్నాడు?"

"గడచిన ముప్పై సంవత్సరాలలో మనం మనలోవున్న శౌర్యాన్నీ, పరాక్రమాన్నీ నశింపచేసుకొన్నాము. ఈ విషయం మన పెద్దల్ని అడిగినా చెబుతారు. కాకపోతే, యౌధేయుల ఇతర నగరాలైన పృథూదకా, రోహతకీలకు వెళ్ళి విచారించినా తెలుస్తుంది. మనలో వచ్చిన ఈ మార్పే అతడు మనల్నింత దుర్బలులుగా భావించడానికి కారణమైంది!"

"కానీ, యౌధేయ యువకులు యిప్పటికీ తమ జన్మభూమికోసం సర్వస్వాన్ని త్యజించడానికీ, బలికావడానికి సిద్ధంగా ఉన్నారు. ఆ యౌధేయ వృద్ధులు మాత్రం మారిపోయారు. వారినుండి ఏమీ ఆశించలేము. ఈ ముప్పై ఏండ్లలో వ్యాపారం ద్వారా లక్షల దీనార్లను సంపాయించిన కుటుంబాలు కొన్ని వున్నాయి. ఆ కుటుంబాలు యుద్ధానికి సిద్ధం అవుతాయా? ఆ కుటుంబాల్లోని యువకుల్లో యౌధే

యత తగ్గిపోయింది. వైశ్యత్వం పెరిగింది. వాళ్ళు తిరిగి కఠోరమైన, కష్టతర మైన జీవితానికి ఇష్టపడతారా? వాళ్ళు విలాసాల్ని మానతారా?"

రోహతకుడు నా అభిప్రాయాలకు తన ఆమోదాన్ని తెలియజేశాడు. యౌధేయ యువకులు నా మాటల్లో ఏ ఒక్కదాన్నీ తిరస్కరించలేదు. చంద్రగుప్తుడ్ని బహి రంతరాల్లో నా అంత దగ్గిరగా ఎరిగున్నవాళ్ళు మరెవరూలేరని వాళ్ళకు తెలుసును. తోఖారం, కాంభోజం, సింధూప్రాంతం నుండి గుర్రాలు విరివిగా యమునా తీరానికి రాసాగాయి. మంచి ధరల్లో అమ్ముడవసాగాయి. గుర్రాలకు యింత ధర ఎన్నడూ పలకలేదు. నేను వేరు వేరు నగరాల యువకుల్ని యాభైమందిని అశ్వవణికుల రూపంలో పాటలీపుత్రం పంపించాను. యువకులు తిరిగివచ్చి తమ అభిప్రాయాల్ని వెల్లడించారు. "చంద్రగుప్తుడేదో భీభత్సకాండకు సిద్ధమౌతున్నాడు!"

విక్రమాదిత్యుడి గుప్తచరులు బహుళసంఖ్యలో యౌధేయ భూమిలో తిరు గాడుతున్నారని నా మిత్రులకు చెప్పాను. తూర్పు దేశీయులు, భిక్షువుల వేషంలోను, వణిక, జ్యోతిష్యుల వేషాల్లోనూ యౌధేయ భూమిలోకి రాసాగారు. వారిలో చాలా మంది చంద్రగుప్తుడి గుప్తచరులే కనుక మా ఏర్పాట్లన్నీ చాలా జాగ్రత్తగా రహ స్యంగా జరగాలి. నేను యువకుల్లో కత్తిసాము, గుర్రపుస్వారీ పీటిమీద తిరిగి ఆసక్తిని కలిగించాను. తిరిగి యౌధేయులు అఖాండాల్లో ప్రోగుపడసాగారు. ఆయు ధాలమీద పూర్వపు ప్రేమను చూపసాగారు. కాని, ఇవన్నీ రహస్యంగా జరిగేవి. పైకి యువకులు "సురా-సుందరి" యొక్క ఆకర్షణలో పడిపోయారన్న భావన కలిగేటట్టు ప్రవర్తించేవారం. ఇరవయ్యో, ముప్పయ్యో జంటలుగా యువతీ యువ కులం ప్రోగుపడి పానగోష్ఠుల్ని, నృత్య ప్రదర్శనలనూ జరుపుకొనేవారం. ఆ క్షణాన దేశంలోని యువక సమూహమంతా చిన్న చిన్న సమూహాలుగా విడిపోయి నట్లు కనుపించసాగేది. కాని దేశంలోని ఈ చిన్న చిన్న సమూహాలకు మధ్య ఒక సన్నని లింకు వుండేది. అది అన్యులకు కనబడనంత సూక్ష్మమయిందిగా వుండేది. ఇక ఆ సమూహాల్లో ఉపయోగించే సుర, నిజమైన సుర కాదు! నీళ్ళా లంగూ! దాంతో నిషా యెక్కడం అసంభవం. గానీ, యువకులు నిషా యెక్కి నట్లు నటన చేసేవారు!

మా రహస్యాన్ని మేము వృద్ధులకు తెలియపర్చలేదు. యువకుల ఈ సమూ హాలు బాగా విస్తృతమైనాయి. సురాపానం కూడా పెద్దలు అనుమానింపదగినంతగా వృద్ధయింది. ఒకరోజున మా గణపురస్కర్త బాప్ప యౌధేయుడు నన్ను పిల్చి ఇలా అడిగాడు : "వత్సా, జయా! నీవంటే మాకెంతో గౌరవమూ, ఆశా కూడాను. యువకులకు నీవంటే చాలా గురి! కానీ, యువకులు వళ్ళు తెలియకుండా త్రాగి, యువతుల్తో నాట్యమాడడంకోసం, ఒకళ్ళు మరొకళ్ళతో పోట్లాడుతూ, కొట్లాడుతూ తిరగడం ఏం బాగుంటుంది?"

"మీ రన్నది నిజమని నేను ఒప్పుకొంటాను. కానీ, ఆర్యా గడచిన ముప్పై ఏండ్లలో, యువకులకు వృద్ధులే ఈ మార్గాన్ని నేర్పారు!"

"కానీ! మేము ఎన్నడూ ఇంతగా త్రాగలేదు!"

"మధురలోని ఉపకరిక మహారాజును అనుకరించిం దెవరు? అతడి అంతఃపురాన్ని చూసివచ్చి తమ ఇండ్లరోనూ అందమైన దాసీల సంఖ్యను పెంచిందెవరు? కాకపోతే, ఇప్పటి యువకులంత బాహాటంగా మీరు చేయలేదు. బాహాటంగా చేసినా, రహస్యంగా చేసినా ఫలితం ఒకటే కదా? యౌధేయ యువకుల్లోని శౌర్యం తిరో ముఖం పట్టడమే!"

"జయా! కొంచెం అర్థంచేసుకో! గుప్తులయొక్క వక్రదృష్టి మన భూమి మీద పడ్డదని నీవే చెపుతున్నావుకదా? ముప్పైమూడు సంవత్సరాల క్రితం వచ్చిన అశుభ ఘడియ తిరిగి వస్తే, గుప్తుల అశ్వసేన తిరిగి మన భూమిని అపవిత్రంచేస్తే అప్పుడిక మన గౌరవాన్ని నిల్పేదెవరు? మన స్వాతంత్ర్యాన్ని కాపాడేదెవరు?"

"స్వాతంత్ర్య రక్షణ అన్న వూహే తప్పు! రెట్టుకు రెట్టు లాభం వస్తుం దని, మనమే ప్రతిసంవత్సరం తోఖారంనుండి కాంభోజం నుండి లక్షల సంఖ్యలో గుర్రాలను చంద్రగుప్తుడికి అమ్ముతున్నాము! మీరు మీ ఇష్టప్రకారం రెట్టుకు రెట్టు లాభాన్ని కొట్టే వుపాయంలోనైనా వుండండి. లేక యౌధేయ భూమిని కాపాడ డానికి బద్ధకంకణులు కండి! కానీ, నా వరకూ నాకు రెట్టుకు రెట్టు లాభాన్ని కొట్ట డమే మంచిదని తోస్తోంది!హాయిగా గంధశాలి ధాన్యాన్ని, కమ్మనిగోధుమని తింటూ స్వార్గికజీవితాన్ని గడుపుతూన్న మన పెద్దల్ని జొన్నరొట్టెల్ని తినమనడం, సాధా రణమైన ఇండ్లలో కాపురం చేయమనడం—నాకేమీ బాగుండదు!"

"జయా, నీ మనస్సు చాలా బాధపడ్డది. అందువల్లే, ఇంత కఠినంగా మాట్లాడుతున్నావు! నీ మాటలను మేము చాలా నిర్లక్ష్యం చేశాం! అందుకు నీవు మా మీద కోపించవచ్చు. కానీ, యౌధేయ భూమిమీద కోపం తెచ్చుకోవడం తగదు. మేము ఒకవేళ యౌధేయ భూమిని అవమానపరుస్తామనుకో. నీవుకూడా అందుకు ఇష్టపడి వూరుకోవడం తగునా? అంటూవుండగా పురస్కర్త కండ్లు నీటిలో నిండాయి. గొంతు రుద్ధమైంది. "య....వ....ధే....య మా....త....!" అన్నారు బలవంతాన.

నేను అమాంతం పురస్కర్త కాళ్ళమీదపడి పోయాను. కన్నీళ్ళు కారుస్తూ "ఆర్యా! నేను ఉచ్చరించిన కఠోరమైన పదజాలానికి క్షమించండి! మేము (యౌధేయ యువకులం) మా రక్తంతో యౌధేయ భూమి గౌరవాన్ని కాపాడు తాము. మీరేమీ విచారించకండి! రాత్రికి ఒక మాటు తమరు నా వెంట రండి! చంద్రగుప్తుడి కండ్లలో దుమ్ముచల్లడానికి యువకులు ఎలా ప్రవర్తిస్తున్నారో మీకు తెలుస్తుంది!"

రాత్రికి ఏదో ఒక పానగోష్ఠికి పురస్కర్తను తీసుకొని వెళ్ళాలి. ఆగ్రోదకా లోని అసంఖ్యాకమైన పానగోష్ఠుల్లో వారినే ఒకదాన్ని ఎన్నుకోమన్నాను. ఆగ్రోదకా మొత్తంలో పెద్దదని పేరుపడిన ఒక పానగోష్ఠిని ఎన్నుకున్నారు పురస్కర్త!

వెన్నెలరాత్రి ఒక ఇంటిముందు వందమందిదాకా యువతీ యువకులు ప్రోగు పడివున్నారు. ఇంటిలోని పెద్దవాళ్ళెవరూ లేరు. ఇంటి యజమాని యువకుడు. గుంపులో కూర్చుని తాగినవాడిలా పాట పాడుతున్నాడు. మేము దగ్గిరకు పోగానే యువతీ యువకులు పెద్దగా చప్పట్లు చరిచి నవ్వారు. రోహతకుడి సర్వం ఇలా అంది! "వ....వ....వ....చా....చ్చా....డు....ము....స....లి....లి! ఏ.... ఏ .... మం....టా....టా....డు....లే!" మరొక యువతి స్వరం ఇలా అంది "ము.... ము....సి....లి....కి....కూ....కూ....డా....ఒ....క....చ.... చ.... ష .... కం!"

ఇదే విధంగా అనేకమైన స్వరాలు వినిపించాయి. వృద్ధ పురస్కర్తను తలా ఒక విధంగా దూషించారు. ఒకడు పురస్కర్త నుద్దేశించి వెన్నెల రాత్రి జంట లేకుండా తాగడన్నాడు. కొంతమంది నన్నుకూడా నోటికి వచ్చినట్లుగా అన సాగారు!

పురస్కర్త బాప్ప నా చేయిపుచ్చుకుని ఇలా అన్నాడు: "జయా! వాళ్ళు వళ్ళు తెలియని స్థితిలో వున్నారు. అవమాన పరుస్తారేమో. వెళ్దాం పద!"

నేను పురస్కర్త చేతులను విడిపించుకొని, యువతీ యువకుల్లోకి పరుగెత్తి పోయాను. గాజుపాత్రలోవున్న సురను పురస్కర్త వద్దకు తెచ్చాను. మూతివద్దకు తీసుకుపోయి వాసన చూడమన్నాను. సుర వాసన లేదు. ఒక గుక్క నోట్లో పోసుకు చూడమన్నాను. అలాగే చేసి- "అరె ఇది సురకాదుగా!" అంటూ చిరునవ్వు నవ్వారు. యువకులందరూ మామూలు స్థితికి వచ్చి, శాంతంగా కూర్చున్నారు. పురస్కర్త ఇలా అన్నాడు: "యౌధేయ యువకులారా! మాతృభూమి గౌరవం మీ చేతుల్లో వుంది!"

వందమంది యువతీ యువకులు ఒక్కసారిగా ఘోషించారు. "మా ప్రాణా లను అర్పిస్తాము. మాతృభూమి గౌరవాన్ని కాపాడుతాము!"

పురస్కర్త బాప్ప తన ముఖాన్ని ప్రక్కకు తిప్పుకున్నారు. వారి కండ్ల నుండి కన్నీరు అవిరామంగా కారసాగింది.

యౌధేయగణ పురస్కర్త మహా సేనాపతి, మహారాజ బాప్ప ఇకనిప్పుడు అన్ని విధాల మాకు బాసటగా వున్నాడు. మా రహస్యాల నన్నింటినీ వారికి చెప్పే శాము. ఎన్ని ఆయుధాల్ని ప్రోగుచేసిందీ వాటి అభ్యాసం ఎంతవరకు జరిగిందీ చెప్పాము. ముప్పై ఏండ్లనుండి పెద్దలు ప్రోగుచేసిన ఆస్తిని యువకులు ఆయు ధాలకోసం ఖర్చుపెట్టడంచూసి పురస్కర్త చాలా ఆశ్చర్యపడ్డాడు. యువకులే కాదు; యువతులుకూడా విలువిద్యలోనూ, గుర్రపు స్వారీలోనూ నైపుణ్యాన్ని సంపాయించారు.

నేను గణపురస్కర్తతో ఇలా అన్నాను: "ఆర్యా! మన మింకా పూర్తిగా సిద్ధం కాలేదు. మన రహస్యం ఇప్పుడే చంద్రగుప్తుడికి తెలియడం శ్రేయస్కరం; కాదని నా ఉద్దేశం! మన యౌధేయ గణంలోకూడా ఎవడైనా ఒక విభీషణుడు వుండవచ్చు.... మన రహస్యాలు చంద్రగుప్తుడికి చేరవచ్చు! కనుక మీకు పూర్తి విశ్వాసం కలవారికి మాత్రమే ఈ రహస్యాన్ని చెప్పండి!" బాప్ప అలా జరగదు. నిశ్చింతతో మీ ప్రయత్నాల్లో మీ రుండండని చెప్పాడు.

ఒక సంవత్సరం గడిచింది. అగ్రోదకారో యౌధేయగణ పరిషత్తు సమావేశమైంది. సభ్యులందరూ వచ్చారు. నాన్నగారు స్వర్గవాసులయ్యాక నేనూ గణ సంస్థకు సభ్యుణ్ణయ్యాను. సామాన్య కార్యక్రమాలయ్యాక గణ పురస్కర్త బాప్ప లేచి నిలబడి, "పూజ్యులైన గణ పెద్దలారా! నేను చెప్పబోయే మాటల్ని దయతో ఆలకించాలని మనవి చేసుకొంటున్నాను! చాలాకాలం క్రితం మన గణ పురస్కర్తకు మహారాజ్ అనే బిరుదు నిచ్చాము. నన్నూ మహారాజ్ అనే పిలుస్తున్నారు. కానీ, నేనీరోజున గణంముందు అంజలి బద్ధుణ్ణయి నిలబడి ప్రార్థిస్తున్నాను. ఈ 'మహారాజ్' అనేది చాలా భయంకరమైన శబ్దం! ఈ బిరుదును తీసివేయండి. మనకు తూర్పున, పశ్చిమానకూడా రాజాధి రాజులూ మహారాజులూ వున్నారు. ప్రజల్ని గొర్రెల్ని చేసి తాము కాపర్లు కావడమే మహారాజులపని. కనుక ఆ బిరుదు మనకు వద్దు!" అన్నాడు.

క్రొత్తగా లక్షల దీనార్లను ఆర్జించిన జాలుకుడు మృదుస్వరంతో ఇలా అన్నాడు: "పూజ్యులైన గణ పెద్దలారా! మహారాజ మహాసేనాపతి బాప్పగారికి వ్యక్తిగతంగా ఈ బిరుదుమీద అయిష్టత వుండవచ్చును. కాని,ఈ బిరుదు వ్యక్తిగతమైంది కాదు. గణం సమర్థుడైన తన పుత్రుడికి ఈ బిరుదునిచ్చి గౌరవిస్తుంది. తద్వారా తనూ గౌరవింపబడుతుంది! కనుక అనాదినుండి వస్తున్న యీ బిరుదును తీసివేయవలదనీ, యధాతధంగా వుండవలసిందనీ కోరుతున్నాను!"

జాలుకుని సమర్థించడానికి మరొక పదిమంది లేచి నిలబడ్డారు. వారందరూ లక్షాధికార్లయిన వ్యాపార్లు! నేను గణ పురస్కర్తవద్ద అనుజ్ఞను తీసుకొనిలేచి నిలబడ్డాను. "పూజ్య గణ పెద్దలారా! నేను వయస్సులోనూ, అనుభవంలోకూడా చాలా చిన్నవాణ్ణి! అయినప్పటికీ నేను పెద్దల ఎదుట మాట్లాడడానికి నిలబడ్డాను. నా మాటల్లో పొరపాట్లు దొర్లితే క్షమిస్తారని ఆశిస్తాను! 'మహారాజా' శబ్దం కేవలం నాలుగు అక్షరాలదే, అయినా హాలాహలం లాటిది. ఆర్యబాప్ప చెప్పినట్టు ఆ బిరుదును తీసివేయడమే ఉచితము - ఉత్తమము అనుకొంటున్నాను. మనకు తూర్పున, పడమరన, దక్షిణమునా వున్న మహారాజులు ఈ నాలుగు అక్షరాల బిరుదుల్నిచ్చి మనుష్యుల్ని విశ్వాసఘాతకులుగా, దేశద్రోహులుగా తయారుచేస్తున్నారు. 'మహారాజ' బిరుదు అనాదికాలంనుండి వస్తోందనుకోవడం పూర్తి పొరబాటు! రాచరికం కంటే గణవ్యవస్థే ప్రాచీనమైంది. ఇప్పటికి రెండువేల సంవత్స

మతదానం = ఓటింగ్.

రాల క్రితం యమునానదికి అటు తీరాన కురుగణం వుండేది. దానికి కొంచెం అవతల పాంచాలగణం వుండేది. కాని, ఆ గణాల గణపతో, లేక గణ పురస్కర్తో, ప్రజల్ని మోసంచేసి, అధికారాన్ని హస్తగతం చేసుకొని మహారాజై కూర్చున్నాడు. అప్పటి నుండి ఆ రెండు గణవ్యవస్థలూ రాచరికాలుగా మారాయి. తరువాత ఇదే విషయం అన్య గణతంత్రాలపట్ల కూడా జరిగింది. ఈ రోజున కోసల, కాశీ, చేది, వత్స - మొదలుగాగల గణతంత్రాలన్నీ ఏమయ్యాయి? మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, పరమభట్టారకుల పొట్టల్లోకి పోయాయి. గణతంత్రాలను ఘోరంగా మోసం చేసి, విశ్వాసఘాతం చేసిన వీరే, 'ప్రజాపాలనకు భగవంతుడు మమ్ము సృష్టించాడ'ని చెప్పుకుంటున్నారు సిగ్గులేక ! దురాచారులూ, పరమకాముకులూ అయిన ఈ రాజులు లేకపోతే ప్రజలకు వచ్చిన నష్టం ఏముంది? మనకు-యౌధేయులకు రాజులేడు. అంత మాత్రానికి మనం దురాచారుల మైనామా? అసత్యవాదుల మైనామా ? పరదారాసక్తుల మైనామా? లేక యమునకు అటుగా వున్న రాజరిక ప్రజలు మన ప్రజలకంటే సుఖంగా వున్నారా? కొంత కాలంక్రితం మన గణ పురస్కర్తకు 'మహారాజ' అన్న బిరుదు ఈయడం జరిగింది. బహుశః అప్పుడు శకులు, యవనుల నుండి మనకు గట్టి వత్తిడి సంభవించి వుంటుంది. అందువల్ల మన పెద్దలు అలాచేసి వుంటారు. కాని, చాలా ప్రమాదమైనది. మన పురస్కర్త ఎప్పుడైనా నిజంగా మహారాజై మన నెత్తిన కూర్చున్నాడా? ఇక మన గణతంత్రానికి స్వస్తివాచకం చెప్పాల్సిందేనా – కనుక పూజ్యులయిన గణ పెద్దలను నేను వినీత బాహువుణ్ణయి ప్రార్థిస్తున్నాను. యౌధేయగణం నుండి యీ మహారాజ పదవిని తొలగించండి!"

నా ఉపన్యాసం తరువాత మరికొంతమంది యౌధేయులు మాట్లాడారు. అందరూ నా వాదనను సమర్థించారు. గణపురస్కర్త లేచి నిలబడి, అభ్యంతరం చెప్పినవారు కావాలంటే మతదానం (ఓటింగ్) ద్వారా నిర్ణయం జరుపుదామన్నారు. కాని, వ్యతిరేకులు తమకు బలంలేదని తెలుసుకొన్నారు. తమ అభ్యంతరాన్ని ఎత్తివేసుకొన్నారు. యౌధేయగణంనుండి మహారాజ బిరుదు ఎత్తివేయబడ్డది. ఇకమీదట పురస్కర్తను కేవలం "ఆర్యా!" అనిమాత్రమే సంబోధించడం జరుగుతుంది.

ఒక సంవత్సరంలో మా యువక సైన్యం పూర్తిగా తయారయింది. మా కార్యక్రమాలన్నింటినీ యౌధేయ పెద్దలు ఆసక్తితో గమనిస్తున్నారు. కాకపోతే, జాలుకుడిలాటి కొద్దిమంది లక్షాధికార్లు మాత్రం మమ్ములను నిరంతరం నిందిస్తూనే వున్నారు. మావల్ల దేశం నాశనమైపోతుందనీ, మా ఈ ప్రయత్నాలవల్ల తప్పక గుప్తసైనికులు దేశంమీదకు వచ్చి పడతారనీ, దేశంలో తిరిగి యుద్ధజ్వాలలు లేస్తాయనీ– అనసాగారు! కాని మేము యువకులం మాత్రం ఊరుకున్నామా? "జాలుకుడికి డబ్బుకావాలి. దేశమెటుపోతే ఏం! అందుకే ఇలా అంటున్నాడు!" అని

చెప్పేవారము ప్రజలతో! మా యువకసైన్యం పూర్తి పటిష్టతను పొందింది. దేశం నలుమూలలా మా యువక సైన్యపు శాఖలు పనిచేయసాగాయి. చివరకు ఒకరోజున గణపురస్కర్త ఆర్యబాప్ప నన్ను యువక సైన్యానికి సేనాపతిగా నియమించారు. కొద్దిరోజుల తరువాత మా యౌధేయ భూమినుండి, గుర్రాలను, ఇతర యుద్ధ పరికరాలనూ తూర్పుదేశాల్లో అమ్మకూడదన్న శాసనాన్ని ప్రకటించాము.

నేను యౌధేయ భూమికివచ్చి రెండు సంవత్సరాలకు పైనయింది. ఒకరోజు మా దూత ఒకడు గుప్తసైన్యం యౌధేయ భూమి మీదకు వచ్చేస్తోందని చెప్పాడు. అప్పటికి పశ్చిమ, దక్షిణ రాజ్యాలనుండి మా కెలాటి ఉపద్రవమూ లేకపోవడం మా అదృష్టమేను! గణ పురస్కర్త బాప్ప వెంటనే గణపరిషత్తును సమావేశపరచి విషయ మంతటినీ చెప్పాడు. సమావేశంలో ముగ్గురు వ్యక్తులతో ఒక యుద్ధసమితి ఏర్పడ్డది. ఆ సమితిలో నేనూ, మహాసేనాపతి, రోహతకుడు—సభ్యులం. సేనా సంచాలన బాధ్యత యుద్ధ సమితికి వప్పగించబడ్డది. కుణిందులు, అర్జునాయణులు కూడా తమ గణసంస్థల తరపున ధనమిత్రుణ్ణి, శివుణ్ణి యుద్ధ సమితిలోకి సభ్యులుగా పంపించారు! మధురకు పశ్చిమాన్నుండి సృఘ్న (అంబాలా) వరకూ వున్న సమస్త దుర్గాలను యుద్ధసామగ్రితో నింపాము. మా పెద్ద పెద్ద నగరాలన్నీ ఇంద్రప్రస్థానికి (ఢిల్లీకి) దగ్గరలో వున్నాయి కనుక ఇంద్రప్రస్థం దగ్గిరే మొదట ఆక్రమణ జరగవచ్చునని మా వూహ! నేనూ మాధవసేనుడు, రోహతకుడు-ఇంద్రప్రస్థపురానికి దాపులో ఉండసాగాం. హస్తినాపురం, ఇతర ప్రదేశాల్లో గుప్త సైన్యాలు స్థావరాల్ని ఏర్పరచుకోసాగాయి. గుప్తసైన్యంలో ఐదువందల ఏనుగులు వున్నాయనికూడా మాకు తెలిసినది. మే మసలు గుప్తసైన్యాన్ని యమునకు ఆవలి తీరాన్నే ఎదుర్కొనేవారము. కానీ, అందువలన అనేకమైన ఇబ్బందులకు లోను కావలసివస్తుంది. మా సైన్యాన్ని యమునకు ఆవలివడ్డుకు తీసుకుపోవాలి. పైగా ఆహారపదార్థాలనుకూడా అక్కడికే చేరవేయవలసివస్తుంది. అందువలన మాకు పూర్తి క్షతి కలుగుతుందని తెలుసు. కనుక యమునకు ఈవలి వడ్డునగల మా గ్రామాల్ని కొన్నింటిని ఖాళీ చేయించాము. మేము చాలా ఉత్సాహంతో శత్రువు యొక్క ప్రథమ ఆక్రమణ కొరకు ఎదురు చూడసాగాము.

యమునకు ఆవలితీరాన గుప్తసైనికులున్నారు. ఈవలి తీరాన మేము శిబిరాలను నిర్మించాం. నేను ఇంద్రప్రస్థపురపు దుర్గంనుండి చూస్తే గుప్తసైనికుల జండాలు, పతాకాలూ కనుపిస్తూండేవి. గుప్తసైన్యపు రథపంక్తులు మమ్మల్ని ఏమీ చేయలేవు. కారణం రథాలు యమునను దాటి ఈవలి తీరానికి రావడం తేలికైన పనికాదు. అటునుంచి సైనికులుగానీ, నావలుగానీ ఇటు రావాలంటే మా నావల పంక్తుల్ని మూడింటిని దాటిరావాలి. కనుకనే యమునకు ఇటు మేమూ, అటు గుప్త సైనికులూ డేరాలు బిగించాము.

గుప్తసైన్యం అటు వడ్డున యుద్ధ వాయిద్యాలను తీవ్రస్వరంలో వాయిస్తూంది. వాళ్ళ నగారాలనూ, భేరీ ఖాంకారాలనూ విని మేము ధైర్యాన్ని కోల్పోతామని వారి అభిప్రాయం. కాని, యౌధేయులు గడ్డిపరకలుకాదు ఊర్పులగాలికే ఎగిరిపోవడానికి. మా వైపున యుద్ధ వాయిద్యాలు మ్రోగసాగాయి. యౌధేయ గణపు జయాకారాలు మిన్నుముట్టసాగాయి. గుప్తసైనికులు అవకాశాన్ని కనిపెట్టి తమ ఏనుగులచే యమున దాటిస్తారనుకొన్నాము. అలాగే జరిగింది. ఐదు రోజుల ప్రతీక్ష తరువాత, అష్టమి వచ్చింది. అర్ధరాత్రి, అంధకారం నాలుగువైపులా వ్యాపించింది. హేమంతం, ఆకాశంలో నక్షత్రాలు మినుకుమినుకు మంటున్నాయి. రెండు వైపులా వేలమంది సైనికులు పడివున్నారు. కాని, ఎక్కడా ఏ మాత్రం శబ్దం కావడంలేదు. ప్రకృతి అతి నిశ్శబ్దంగా, గంభీరంగా వుంది. అదే సమయాన యమున నీటిలోనుండి బరువైన అడుగులసవ్వడి వినపడసాగింది. మా సైనిక వీరులు సంసిద్ధులయ్యారు. అశ్వికదళం తీక్షణమైన బల్లేలను తీసుకొని సిద్ధంగా వుంది. ధనుర్ధారులు విల్లునమ్ములతో సిద్ధంగా వున్నారు. పదాతిదళం కూడా శత్రువుకోసం అతి జాగరూకతతో నిరీక్షిస్తోంది! గుప్తసైనికులు, ఆ అర్ధరాత్రి అంధకారంలో, మా ధనుర్ధారులు సరిగ్గా గురిచూచుకో లేరనుకొన్నారు! కాని, వారికి మేము యెలాటి స్వాగతాన్నియడానికి సంసిద్ధులమై యున్నామో తెలియదు!

మూడు నాలుగు వరుసలుగా ఏనుగులు తీరానికి వస్తున్నాయి. ఏనుగుల అడుగుల శబ్దం సముద్ర మథనాన్ని స్ఫురణకు తెస్తోంది. మా హృదయాలు కూడా కల్లోలితవౌతున్నాయి. ఏనుగులబారు దగ్గిరకు రావడం గమనించి మా ధనుర్ధారులు బాణాలను విడిచారు. కాని, ఇంకా అటునుంచి ప్రత్యాక్రమణ ప్రారంభంకాలేదు. కొంచెం ఆగాం. ఏనుగులు మరికొంచం దగ్గిరకు వచ్చాయి. ఒక్కసారిగా ఊహించని వేగాన్తో బాణవర్షం ప్రారంభించాం. ఎదురునుండి వస్తోన్న బాణాలను తప్పుకొని ఏనుగులు ప్రక్కకు తిరగ చూస్తున్నాయి. కాని అక్కడక్కడా భూమిలో గోతుల్ని త్రవ్వి వుంచాం. భూమిమీద ఇనుప ముళ్ళను వెదజల్లాం. ప్రక్కకు మళ్ళిన ఏనుగులు ఘోరంగా ఘీంకరించి గోతుల్లో పడిపోసాగాయి. ఇనుపముళ్ళు గుచ్చుకొని వివశంగా తొండాలను పైకి ఎత్తి ఘీంకారం పెట్టసాగాయి. ఈ ముళ్ళూ, గోతులూ మా విజయానికి బాగా తోడ్పడ్డాయి. ఇక మా బాణాలు, అంబులూ వుండనే వున్నాయి. మా సైనికులు గుప్తుల ఏనుగులమీద సింహాల్లా విరుచుకుపడ్డారు. రెండు ఘడియల యుద్ధానంతరం పరిణామాన్ని స్పష్టంగా వూహించుకొన్నాం. సూర్యోదయం అయ్యేసరికి యుద్ధం పరిసమాప్తమైంది. తీరానికివచ్చిన ఒక్క ఏనుగుకూడా తిరిగి వెనక్కుపోలేదు. క్షతగాత్రులు కాక కొంతమంది గుప్తసైనికులు బందీలుగా దొరికారు. వారిలో గుప్తుల మహా బలాధికృతుడు వీరసేనుడు కూడా క్షతగాత్రుడై వున్నాడు!

వీరసేనుడు నా ముందుకు తీసుకురాబడ్డాడు. నేను అతడి వద్దకుపోయి చాలా నమ్రంగా "విక్రమాదిత్యుని బలాధికృతునకు యౌధేయభూమి ఘన స్వాగతాన్నిస్తోంది!" అన్నాను.

వీరసేనుడు తలయెత్తి నన్నుచూచి, చిరునవ్వు నవ్వి వూరుకొన్నాడు.

నేను తిరిగి ఇలా అన్నాను: "మిత్రమా! మనం యెలాటి ప్రదేశంలో కలుసుకోవడం జరిగింది? కాని, ఇప్పుడు మనం శత్రువులంకాదు. కేవలం మిత్రులుగా కల్సుకొందాము."

వీరసేనుడికి జాగ్రత్తగా కట్టుకట్ట వలసిందని చెప్పి నా నివాసస్థానానికి పంపించివేశాను. సూర్యోదయమైనాక యమునా జలరాశికి అటువైపున ఒక పెద్ద సంఖ్యలో గుప్తసైనికులు నిలబడివుండడాన్ని చూశాను. బహుశః తిరిగి ఆక్రమణ చేస్తారేమో అనుకొన్నాను. కాని కొద్దిక్షణాల తరువాత గుప్తసైనికులు వెనకకు బోసాగారు. మా సేనలో విజయనాదం మార్మ్రోగింది. యౌధేయ తరుణులు తమ మాతృభూమి గౌరవాన్ని నిల్పారు. బందీలను తీసుకొని మహాసేనాపతి బాప్ప దగ్గరకు వెళ్ళాను. విజయాన్నిగురించి సవిస్తారంగా చెప్పాను. ఆగ్రోదకా, రొహతకీ, ఖాద్రా మొదలుగాగల యౌధేయ నగరాలకే కాకుండా కుణిందులకూ, అర్జునాయనులకూ కూడా, మా విజయానికి సంబంధించిన వార్తల్ని పంపించాం. మొత్తం యౌధేయ భూమిలోనే ఆనందం వెల్లివిరిసింది. బందీలతో సహా ఆగ్రోదకాకు బయలుదేరాం.

# నూతన యౌధేయులు

మేము విక్రమాదిత్యుడిమీద ప్రథమ విజయాన్ని పొందాం. కాని, విక్రమాదిత్యుడు పూర్తి నిర్బలుడు కాలేదు. పైగా అతడి హృదయానికి ఎన్నటికీ మరువలేని గొప్ప ఆఘాతం తగిలింది. దీని కతడు ప్రతిక్రియ తప్పక చేస్తాడు. విక్రమాదిత్యుడిలో విక్రమమూ వుంది. నైపుణ్యమూ వుంది. అతడు పడిన పొరపాటల్లా, శత్రువు బలాన్ని చాలా తక్కువగా అంచనా వేశాడు. అతడి సైనిక సంచాలనం కూడా ఏమంత చెప్పుకోదగినట్టుగా లేదు. వీరసేనుణ్ణి చాలా జాగ్రత్తగా వుంచాం. గాయాలు నయమైనాక పంపించి వేయబడతాడని చంద్రగుప్తుడికి కబురు పంపాం. యౌధేయ గ్రామాలన్నింటిలోనూ విజయోత్సవాలను జరుపుకొన్నాం. నన్నూ, నా మిత్రులయిన మాధవసేనుణ్ణి, రోహితకుణ్ణి—గణపరిషత్తు ఘనంగా అభినందించింది. రోహితకుడు సర్వ సేనానాయకుడు. నేను ఇంద్రప్రస్థ సైన్యసంచాలకుణ్ణి. మాధవసేనుడు ముఖ్యంగా గోతులుతీయడం, ముండ్లు పరచడంలో అద్భుతమైన నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. కనుక మేము ముగ్గురం ప్రత్యేక అభినందనల నందుకొన్నప్పటికీ ఈ ఘనకీర్తికి నిజమైన వారసులు యౌధేయ యువతీ యువకులు. యువకులకంటే కూడా యువతులు గొప్పగా తమ ధైర్యాన్ని ప్రదర్శించారు. మేము యువతులకు ఖడ్గాన్ని ధరించి, యుద్ధం చేయడానికి అనుజ్ఞనీయలేదు. ముందువరసలోవున్న సైనికులకు పథ్య పానాదుల్ని చూస్తూండవలసిందని గణ నిర్ణయం! కాని, వారా నిర్ణయాన్ని తిరస్కరించి తామూ ముందుకువచ్చి యుద్ధం చేశారు. పరిషత్తు నిర్ణయాన్ని ఇలా తిరస్కరించినందుకు స్త్రీలను గట్టిగా మందలించాము. పరిషత్తు సమావేశంలో నిందించాము కూడా!

కాని, యువతులే అలా నడుములు బిగించక పోయినట్లయితే మా విజయం ఎలా వుండేదో చెప్పలేను. చంద్రగుప్తుడు గట్టి నిర్ణయాన్ని చేసుకొని యుద్ధానికి బయల్దేరాడు. ముందు యౌధేయ భూమిని తాను భుక్తం చేసుకొని, అక్కడ తన ఉపరికుణ్ణి నియమించితే, ఆ తరువాత కాంభోజ, బాహ్లిక మొదలైన దేశాలమీద ఆక్రమణ చేయవచ్చునని అతడి ఊహ! తన ఆశయ సఫలతకు అతడెంత క్రూరానికైనా సిద్ధపడతాడు. తన ఆశయ సిద్ధికోసం మొత్తం యౌధేయ భూమిని స్మశానం చేస్తాడనడంలో సంశయంలేదు. మా గణవ్యవస్థను నామరూపాలు లేకుండా చేస్తాడు! అటువంటి విషమ పరిస్థితిలో స్త్రీ, బాల, వృద్ధులనే వ్యత్యాసం లేకుండా యౌధేయు

లందరూ కదన భూమికి కదలాలని కూడా పరిషత్తు నిర్ణయించింది. అలాటి మహా విపత్సమయంలో రక్షిత (రిజర్వు) సైన్యంగా స్త్రీలను ఉపయోగిద్దామని పరిషత్తు ఆశయం! కానీ, ఈ మహాసంరంభంలో స్త్రీలు మా నిర్ణయాలను పాటించకుండానే కత్తిపట్టి కదన రంగానికి వురికారు!

ఇదే విషయాన్నిగూర్చి గణపరిషత్తులో ఇలా అన్నాను. "పూజ్యగణ పెద్ద లారా, యౌధేయస్త్రీల ఈ స్వేచ్ఛాప్రవర్తన మంచిదని మీరెవరూ అనుకోవడంలేదు. నేనూ అనుకోవడంలేదు. వారిప్రవర్తనను నేనూ నిందిస్తున్నాను. ఎవరి ఇష్టమొచ్చినట్టు వారు ప్రవర్తిస్తే ఇక సైన్యానికీ అల్లరిగుంపుకూ వ్యత్యాసం ఏమిటి? సైన్యంలో లక్ష మంది మానవులు ఒకే పంక్తిలో, ఒకే ఆజ్ఞానువర్తులై, ఒకే అనుశాసనానికి బద్ధులై నడుస్తారు. "పుర్రెకోబుద్ధి" అన్నసామెత సైన్యంలో వుండదు. కాని, అల్లరిగుంపులో "ముండే ముండేమతిర్భిన్నా" "పాదేపాదేగతిర్భిన్నా" అన్నలోకోక్తులు చరితార్థ మౌతాయి. మన స్త్రీలు మన సైన్యాన్ని అల్లరిగుంపుగా మార్చచూశారు. ఇది నిజంగా గర్హింపదగ్గ విషయం. కానీ అందుకు పురుషులమైన మనంకూడా కొంతవరకూ బాధ్యులమైనామని చెప్పడానికి విచారిస్తున్నాను. మన శత్రువు చాలా క్రూరుడు. అందువల్లే మన స్త్రీలకు శస్త్రవిద్య నభ్యసింప చేశాము. కాని, కంకణధారియైన స్త్రీ ఖడ్గధారి అయినతరువాత చేతులు ముడుచుకొని మూలకూర్చో గలగడం అసంభవం. అదే పురుషులు (మనం) చేసిన పొరపాటు. స్త్రీకి ఖడ్గమైతే ఇచ్చాము కాని, యుద్ధం చేయవద్దన్నాము. ఈ పొరపాటు ముఖ్యంగా నాది. నేను పరిషత్తునర్థించి, ముందుగానే స్త్రీలలో కూడా సైనిక సమూహాలను ఏర్పరచవలసింది. అలా చేయకపోవడం నిజంగా గొప్ప తప్పిదం. రెండవది, యౌధేయభూమి అంతా యుద్ధపు కోలాహలంతో, ధ్వంసలీలతో నిండివున్నప్పుడు ఖడ్గధారిణులైన యౌధేయ స్త్రీలు చూస్తూ కూర్చోగల రనుకోవడం కూడా హాస్యాస్పదమైన విషయం. వైశ్వానరుణ్ణి (అగ్నిని) ప్రజ్వలితుణ్నిచేసి అతడు వేడినివ్వడు, ప్రకాశాన్ని ఇవ్వడు అనుకోవడం ఎంత హాస్యాస్పదమైన విషయం! ఇంత అయినప్పటికీ కూడా ఇంద్రప్రస్థపు ప్రథమరంగంలో యౌధేయ స్త్రీలు ప్రదర్శించిన సాహసాన్ని, శౌర్యాన్ని అభినందించకుండా వుండలేను. అలాటి స్త్రీలు ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైనా గర్వకారణులే. సునందవదిన చూపిన సాహసం, మహా పరాక్రమం ఈ భూమి మీద యౌధేయజాతి ఉన్నంతవరకూ నిలిచివుంటుంది. సునంద వదినె చాలా ఆసక్తిగా ఆయుధవిన్యాసాన్ని నేర్చుకొంది. వదినె స్వభావం అందరికీ తెలిసిందే! హాస్యప్రవృత్తి ఎక్కువ. ఆమెలో అలాటి స్త్రీ జీవితాన్ని ఇంత గంభీరంగా అర్థం చేసుకోగలుగుతుందని ఎన్నడూ అనుకోలేదు. అగ్రోదకాలో సునంద వదినె హాస్యానికి, తన్మయులై నవ్వనిదెవరు? అగ్రోదకా మొత్తంలో ఆమె సలహా లేకుండా పరిష్కారమైన భార్యా భర్తల తగాదాను ఒకదాన్ని చూపండి? నా వరకూ నన్ను మృదువైన ఆమె ప్రవర్తన, సున్నితమైన ఆమె హాస్యమూ పరవశుణ్ణి చేస్తూం

దేవి. అంత వినోదప్రియ అయిన సునంద వదినె ఇంత భయంకర రూపాన్ని దాలుస్తుందని ఎవరూహించగలరు? రహస్యంగా త్రవ్వి వుంచిన గోతులను, యినుప ముండ్లనుకూడా లక్ష్యపెట్టకుండా ఐదు ఏనుగులు మన ప్రథమ పంక్తిని సమీపించాయి. అప్పుడు సునందా, వసునందా, నంద—ముగ్గురు సోదరీమణులు మరొక యిరవైమంది యౌధేయస్త్రీలను వెంటతీసుకొని, ఆ ఏనుగులమీద పడ్డారు. సునంద వదినె ప్రళయకాళికలా ఏనుగులమీద పడ్డది. బల్లేలతో రెండు ఏనుగుల కండ్లను పొడిచేసింది. ఒక ఏనుగు కోపంతో సునంద వదినెను తొండానికి చుట్టుకొని కాలి క్రిందవేసి త్రొక్కింది! ఆమె రెండుకాళ్ళూ విరిగిపోయాయి. ఇది చూసిన వసునంద చప్పున తన కరవాలాన్ని తీసి ఏనుగు తొండాన్ని నరికేసింది. ఆ ఏనుగు సగం తెగిన తొండంతో భూమ్యాకాశాలు దద్దరిల్లేట్లు ఘీంకరిస్తూ పరుగెత్తింది. తోటి సఖీజనులు సునందను సురక్షితమైన స్థానానికి తీసుకొని వచ్చారు. తుదిశ్వాసల్ని పీలుస్తున్న సునంద మిగిలిన సఖీజనాన్ని చూసి ఇలా అంది: "మిగిలిన రెండు ఏనుగుల్నీ అడ్డగించండి!" సునంద వదినె మాట్లాడిన తుదిమాట అదే! శౌర్యమూ, పౌరుషమూ కలిసి రూపాన్ని పొందిందా? అనిపించిందామెను చూస్తే! ఆ ఏనుగులతో తలపడిన స్త్రీలందరూ కొద్దిగానో, గొప్పగానో గాయపడ్డారు. అందరికంటే వసునంద ప్రమాదంగా గాయపడ్డది? ఈ స్త్రీలను సన్మానించడానికి ఏ భాషలోనూ తగినపదాలు దొరకవేమో ననుకొంటున్నాను. కాగా, ఇకమీదటనైనా, యౌధేయ పురుషుల్లాగానే యౌధేయ స్త్రీలక్కూడా దేశం కోసం బలికావడానికి అధికారాన్ని ఈయవల్సిందని గణ పరిషత్తును వేడుకొంటున్నాను."

సంవత్సరాలుగా ఎదురుచూస్తున్న విషయం క్షణాల్లో జరిగిపోయింది. గుప్త సైన్యం రగిల్చిన ఈ పౌరుషాగ్ని యౌధేయ భూమిని గుర్తుపట్టడానికి వీలు లేనంతగా మార్చివేసింది. ఇంకా మాలో జాలుకుడిలాటి ధనికులు వున్నారు. వాళ్ళకు నిజంగా చంద్రగుప్తుడు గెలిస్తేనే పరమానందం కలిగేది! ధనం మానవుణ్ణి ఔన్నత్యానికి తీసుకు పోతుందా నైచ్యానికి లాగుతుందా?— అనే విషయం జాలుకుడి, తదితరుల ప్రవృత్తులవలన తెలిసిపోతుంది. పరిషత్ దేశరక్షణలో స్త్రీ—పురుష భేదాన్ని యెత్తివేసింది. బీద, ధనిక భేదాన్నికూడా తీసివేసి నట్లయితే, ఎంతో బాగుండేది. యౌధేయ భూమిలోకి యితరులు అడుగు పెట్టడానికి కూడా సాహసించలేరు.

వర్షఋతువు వచ్చింది. ప్రతి కుటుంబానికి కావలసిన భూమిని పరిషత్తు ఇస్తోంది. మేము ఒక యాభైమంది యువకులం ఉమ్మడిగా కొంత భూమిని తీసుకొన్నాం. ఉమ్మడి వ్యవసాయం యౌధేయభూమిలో చాలా క్రొత్త విషయం! మొదట నలుగురూ రోరోన నవ్వుకొన్నారు. కొంతమంది పైకే ఉమ్మడి వ్యవసాయం ఫలించదనేశారు. కాని మేము నిరాశ పడలేదు. వ్యవసాయానికి కావల

సిన సాధన సంపత్తి మాకులేదు; కూలీలను పెట్టి పనులు చేయించడానికి కావలసిన ఆర్థిక స్తోమతూ లేదు!

ప్రథమ వర్షంపడ్డది. మే మందరమూ పలుగులూ, పారలూ, నాగళ్ళు తీసుకొని మా ఉమ్మడి క్షేత్రానికి వెళ్ళాం. కొంత సంపన్నులయిన యౌధేయులు, తాము పనిపాటలు చేయటం అవమానకరంగా భావిస్తారు. సంపన్న కుటుంబాల్లోని స్త్రీలు అసలే పనికి మసలరు! మా కుటుంబాల్లోని స్త్రీలు కూడా నడుములు విగించి చేలల్లోకి వచ్చారు. పెసర, మినుము, కంది — మొదలైన పంటలు, ఎంతెంత భాగంలో ఏఏ పంటల్ని వేయారో మొదటే నిర్ణయించుకొన్నాం.

ప్రధానసేనాపతి(నేను) నాగలి పట్టుకొన్నాడు. ఉపసేనాపతి-మాధవసేనుడు-పారపుచ్చుకొన్నాడు. సేనానాయకుడు — రోహతకుడు — కలుపు తీస్తున్నాడు. కులీనలైన యౌధేయ స్త్రీలు గట్లు కట్టడంలో నిమగ్నులయ్యారు. ఇలాటి దృశ్యాల్ని ఆగ్రోదకాలోని ప్రజలెన్నడూ చూడలేదు. నగరంలోని ప్రజలందరూ ప్రత్యేకంగా పనిని చూడడానికి వచ్చిపోసాగారు. అక్కడికీ ఒక వృద్ధుడు అననే అన్నాడు: "ఆఁ! ఇది నాలుగు రోజుల ఉత్సాహం! తరువాత తెలుస్తుంది! పొలంపని అనుకున్నంత తేలికైందికాదు! చిన్ననాడు త్రాగిన ఉగ్గుపాలు జ్ఞాపకం రావాలి!"

ఎండ చుఱుమంటోంది. చేతులు బొబ్బలెక్కాయి. కొద్దిసేపు పనిచేయగానే నడుములూ, కాళ్ళూ నొప్పులు పెట్టేవి. ఒక నెల తరువాత పనిపాటలకు కొంత వరకూ అభ్యస్తులమైనాం. ఒకరోజున నంద, తన భర్త అయిన రోహతకుడితో ఇలా అన్నది: "ఆర్యపుత్రా! కొంచెం విశ్రాంతి తీసుకొనండి, రొప్పుతున్నారు!"

రోహతకుడు చిన్నగా నవ్వి — "నీకోవిషయం ముఖ్యంగా చెప్పాలి. ప్రాసాదాల్లో ఉపయోగించే భాషను ఇక్కడ మాట్లాడవద్దు! మట్టికొట్టుకున్న ఈ శరీరాన్ని 'ఆర్యపుత్రా!' అని సంబోధించడం, అటు ఆ శబ్దానికీ, ఈ శరీరానికూ్కడా అవమానకరం అవుతుంద!" న్నాడు.

"మరేమని పిలవమంటారు?"

"రోహతకుడనే పిలు. ఒకవేళ అలా పిలవడం సిగ్గుగావుంటే ఈఁగా, దోమా, పేనూ, నల్లీ – నీ యిష్టం ఏ పేరునైనా పిలు!"

నంద మూతి విరిచి "నా భర్త అలాటిపేర్లకు తగివున్నట్లయితే అలాగే పిలిచేదాన్ని!" అన్నది.

"నా మాట విని, నందా! సహజంగా 'రోహతకా!' అనే పిలు. సరే, ఇక రొప్పుతున్నా నంటావా? పోనీ ముందు నీవే ఎందుకు విశ్రాంతిని తీసుకోరాదు?"

"నేను మా స్నేహితురాండ్రకు నాయకురాల్ని! నేనే కూర్చుంటే ఎలా?"

'సరే, ఐతే, మా నాయకుడు జయుడు, కనుక నేను విశ్రాంతి తీసుకొన వచ్చును' అన్నాడు రోహతకుడు. నేను ప్రక్కనేవుండి వారి మాటల్ని వింటున్నాను. "ఏం నందా వదినె! అబద్ధం చెబుతావేం? ఓడిపోతే ముక్కు చెంపలు వేసుకోవలసి వస్తుంది. కనుక కూర్చోనని చెప్పరాదా?" అన్నాను.

"మరిదీ, నాటి విషయం జ్ఞాపకం వుందా ? పాల కడవ తీసుపోకువడానికి వచ్చావుగా!"

"అలాటిది ఏనాడైనా మరచిపోగలనా?"

"కాని, నన్ను నీవా రోజు బాగా మోసగించావు. తమకన్న బలవంతులైన వారి గుప్పెడ విప్పడం ఎప్పటికీ సంభవం కాదు!"

"ఆనాటి నీ వేషం మరువరానిది వదినే! మనిషివి చెమటతో తడిసిపోయావు. వల్లె క్రిందికి జారింది. జుట్టుముడి వూడింది. నల్లని వెంట్రుకలు ముఖానపడి చంద్రబింబాన్ని కప్పే మేఘాలను స్ఫృహకు తెచ్చాయి!"

"చాలు మరిదీ! నీ కవిత్వాన్ని ఆపు అంతటితో...." అన్నది నంద. ఆమె ముఖం రక్తవర్ణంలో క్షణం మెరిసిపోయింది.

"కవిత్వం కూడా ఒక్కొక్కప్పుడు ప్రయోజనకారి అవుతుంది. నేనూ, రోహతకుడూ, నీవూ, పారలువేసేవారూ, కలుపు తీసే స్త్రీలూ—అందరమూ విశ్రాంతి తీసుకొంటున్నాము. నాలుగే రోజుల్లో మన చేతులుచూడు ఎలా ఉక్కు స్తంభాల్లా తయారయ్యాయో! శ్వాసావయవాలు చూడు ! ఎంత గొప్పగా పనిచేస్తున్నాయో! ఇది, ఒక గొప్ప వ్యాయామం!"

"ఇది చాలా గొప్ప వ్యాయామం. వ్యాయామంతోపాటు దీంట్లో మరొక ప్రయోజనం కూడా వుంది. భూమి నుండి కొంత ప్రతిఫలాన్ని పొందుతున్నాం!"

"మరిదీ! నీ ఉద్దేశం ఏమిటో మమ్ములను ఈ బురదలోదింపావు" అన్నది నందా వదినె.

రోహతకుడు చిన్నగా నవ్వి—"నిజంగా. జయా! నీవు చాలా కఠినుడివి! గోరింటాకుతో శృంగారాన్ని ఒలికించే మీ వదినె చేతులు చూడు కఠిన పరిశ్రమతో ఎలా కాయలు కాచాయో?" అన్నాడు.

నందా వదినె నవ్వుతూ—"అలా గోరింటాకు పెట్టుకొన్నప్పుడు—రోహతకుడు అటువస్తే– ఆర్యపుత్రా ! కొంచెం కొంగు జారింది. సరీగా వేసిపోదురూ! అంటుంది!" అన్నది.

రోహతకుడు చప్పున నందా వదినె నెత్తిమీది కొంగు సవరిస్తో 'నాకా సదవకాశం ఎక్కడైనా లభిస్తుంది. కాని, గోరింటాక్కు బదులు నీ చేతులకు ఏముందో చూచుకో?" అన్నాడు.

"రోహతకా ! నీకు అభినయం కూడా బాగా చాతనవు ననుకొంటాను. కాని, అందరూ నీవంకే చూస్తున్నారు, అది గమనించావా?" అన్నది వదినె.

ఉమ్మడి వ్యవసాయం

"అభినయం చేసేవాడికి మరొకరు చూస్తున్నారన్న బాధ ఏముంది?" అన్నాడు రోహతకుడు.

"గొప్పగా చెప్పావు, సోదరా!" అన్నాను నేను.

"ఏం, మరిదీ! మళ్ళీ ఒకమాటు నమస్కారం పెట్టించుకొంటాను.... ఆ నాటి విషయం జ్ఞాపకం లేదా?" అన్నది వదినె.

వెంటనే నాకు సునంద వదినె జ్ఞాపకం వచ్చింది. నా స్వరం ఆర్ద్రమైంది— "నందా వదినే! నేను నీకు వందసార్లు నమస్కారం పెట్టమన్నా పెడతాను. కాని, ఇప్పుడు సునంద వదినె ఎక్కడ నుండి వస్తుంది? ఆరోజున మన ఇద్దరి తగాదానూ ఎంత సులువుగా పరిష్కరించింది! మన ఇద్దరినీ ఎంత తేలికగా విడదీసింది!" అన్నాను.

అక్కడున్న వారి ముఖాల్లో ఉదాసీనత నెలకొన్నది. ఎవరి పనుల్లోకి వారు వెళ్ళిపోయారు.

ఉమ్మడి వ్యవసాయం ప్రారంభించాక మా జీవితాల్లో ఊహించరాని పరివర్తన జరిగింది. ముఖ్యంగా బానిసల విషయంలోనూ కూలీల విషయంలోనూ మా దృష్టి కోణం పూర్తిగా మారిపోయింది. ఉమ్మడి వ్యవసాయాన్ని ప్రారంభించిన యాభై కుటుంబాల్లోనూ కొంత మంది దాసులనూ, కూలీలనూ కలిగివున్నారు. వాళ్ళిప్పుడు ఇంటి మనుషుల్లా అయిపోయారు. సామాన్యంగా బానిసల్ని పశువులుగా చూడడం పరిపాటి. కూలీలచేత అధికాధికంగా పని చేయించేవారు. స్వల్పంగా ప్రతిఫలాన్నిచ్చేవారు. వాళ్ళకు కుక్కలకు పారేసినట్టుగా ఆహారాన్ని పడేసేవారు. కాని, మా ఉమ్మడి వ్యవసాయపు కుటుంబాలు మాత్రం గోధుమ రొట్టెలు, వెన్న ముద్దలు, చిక్కని మజ్జిగ – ఇలాటి ఆహారాన్ని బానిసలకు, కూలీల కూడా ఇస్తూండేవారు! మధ్యాహ్న సమయాల్లో ఇండ్లదగ్గిర నుండి రొట్టెలు– వెన్న— చట్నీ– మజ్జిగ పొలాలకు వచ్చేవి. స్వామి, సేవకుడు, స్త్రీ, పురుషుడూ అన్న భేదం లేకుండా అందరం గుమిగూడి కూర్చునే వారం! ఒకదాని తరువాత ఒకటిగా వెన్న, చట్నీలు పెట్టిన రొట్టెలు వచ్చేవి! తరువాత చిక్కని మజ్జిగ ముంతలు! రొట్టెలు తింటూనే వుండేవారం. పరిహాస ప్రవాహాలు సాగిపోతూ వుండేవి! ఒకడనే వాడు – "ఈ రోజు చట్నీ ఎవరు నూరారో మహాబాగుంది. ఏ రంభో పూర్వశో ఆకాశం నుండి దిగివచ్చి నూరినట్టుగా వుంది!"

మరొకడు–"చట్నీ నూరిన వాళ్ళందరూ రంభలే!" అనేవాడు.

"శ్యామ నూరింది చట్నీని. ఎంత బాగా నూరింది! ఆ చేతిని ముద్దుపెట్టుకోవా లనిపిస్తోంది!"

వెనక బానిసలు కూలీలదొక ప్రపంచం, యౌధేయులది వేరొక ప్రపంచంగా వుండేది. ఈ రెంటికీ మధ్య ఒక పెద అఖాతముండేది. అన్య యౌధేయ కుటుం

ఖార్లో ఇప్పుడూ అలాగేవుంది. కాని, ఉమ్మడి వ్యవసాయాన్ని ప్రారంభించిన మా యాభై కుటుంబాల్లోని దాసులపనీ, కూలీలపనీ చాలా మెరుగయింది. మా బానిసలు కూలీలు మేమంటే చాలా సంతృప్తిగా వుండసాగారు. మేము మా ప్రవర్తనద్వారా వారి హృదయాల్లో ఆత్మవిశ్వాసం కలిగించడానికి ప్రయత్నించేవారం. ఇక పంటలు కోతలకొచ్చే రోజుల్లో వారుపొందే ఆనందాన్ని వర్ణించలేం. వెనక చినిగిన పేలికల్ని ధరించేవారు. ఇప్పుడు అందరిలాటి మంచి వస్త్రాల్ని ధరిస్తున్నారు. మంచి భోజనం లభిస్తూండడం వలన వంటికి రక్తమాంసాలు పట్టి నిగనిగ లాడుతున్నారు. శుభ్రమైన ముఖాలవలన రోజూ స్నానంచేసే అభ్యాసాన్ని కలిగించుకొన్నారని కూడా తెలుస్తోంది. వెనకలా ఎల్లప్పుడూ చూపుల్ని దింపుకోవలసిన పని లేదు. వారూ ఆత్మవిశ్వాసాన్ని కలిగి తల యెత్తి ఇతర్ల ముఖాల్లోకి చూడగలుగుతున్నారు. మా దాసులకూ, కూలీలకూ—తాము కష్టించి తయారుచేసిన ప్రతిదాన్నీ అనుభవించే అధికారం తమకూ వుందన్న విశ్వాసాన్ని కలిగించాం. మా ఈ ప్రవర్తనవల్ల ఒక చిన్న ఇబ్బంది కూడా సంభవించింది. అన్యకుటుంబాల్లోని బానిసలూ, కూలీలు—మా దాసుల్నీ, కూలీలనూ చూశాక-తమ పరిస్థితిమీద పూర్తి అసంతృప్తిని కనబరచసాగారు. బానిసలు యిక ఎక్కడికీ పోలేరు. కాని కూలీలు మాత్రం వాళ్ళ పనిపాటల్ని వదలి మా పనిపాటల్లోకి రావడానికి ఆత్రపడేవారు. ఒకరోజున మా దాసుడు (బానిస) కుంభీలకుడు నేసిన వస్త్రాన్నొకదాన్ని జాలుకుడు తన దాసుడికి చూపుతూ—"చూడు! కుంభీలకుడు ఎంత చక్కని వస్త్రాన్ని నేశాడో? ఏం, నీవూ నేయలేవు?" అన్నాడు.

దాసుడిలా సమాధానా న్నిచ్చాడు: "స్వామీ! కుంభీలకుడెక్కడ? నేనెక్కడ? అతడి శరీరాన్ని చూశారా! అతడి వస్త్రాలను చూశారా, ఎలా వున్నాయో?"

జాలుకుడు మౌనంగా వుండే ఘటంకాదు. వృద్ధుల్ని రెచ్చగొట్టసాగాడు. అయితే మావద్ద యువక సైన్యం ఎటూ వుండనే వుంది!

మేము వుమ్మడి వ్యవసాయం వరకే వుండిపోలేదు. భవిష్యత్తుకు అవసరమైన భావాత్మక చైతన్యాన్ని కూడా ప్రజల్లో తీసుకువస్తూండే వారం. "ఈ పర్యాయము విక్రమాదిత్యుడు కేవలం ఐదువందల ఏనుగుల్తోనే రాడు. తన శక్తిని పది రెట్లు పెంచుకొంటాడు. కనుక మనంకూడ యిరవై రెట్లు అధికంగా మన శక్తిని పెంచుకోవాలి!" అని చెపుతూండే వారం.

శరదృతువులో కోతలయ్యాయి. అగ్రోదకాలోని అన్య పరివారాలకంటే, మా ఉమ్మడి పరివారంలో (ఉమ్మడి వ్యవసాయ దారుల మందరమూ ఒకే పరివారంగా వుంటున్నాము. దాసులూ, కూలీలు, వారి సంతానంకూడా ఈ పరివారంలో స్వతంత్ర సభ్యులయ్యారు) చాలా అధికంగా పంటలు పండాయి. ఆ పంటలమీద అధికారం మా పరివారంలోని సభ్యులందరిదీను!

నేను సింహళంలో విశాలమైన జలాశయాల్ని చూశాను. "అలాటి జలాశయాల్ని యౌధేయ భూమిలో కూడా నిర్మిస్తే ఎంత బాగుండును" అన్న వూహ అప్పుడే కలిగింది. కాని యౌధేయభూమి చాలావరకు సమతల ప్రదేశంలో వుంది. సమతల ప్రదేశంలో అలాటి గొప్పగొప్ప జలాశయాల్ని నిర్మించడం చాలా కష్టసాధ్యమైన విషయం. సింహళ భూమిలో పర్వతాలు యెక్కువ కావడం వలన సహజంగానే భూమి హెచ్చుతగ్గులుగా ఉంటుంది. ఒక్కోచోట కొన్నిక్రోసుల విస్తీర్ణంలో నాలుగువైపులా పర్వతాలు వుంటాయి. అలాంటి ప్రదేశంలో సాధారణమైన ప్రయత్నంతోనే గొప్ప జలాశయాన్ని నిర్మించుకోవచ్చును. కాని, మా యౌధేయ భూమి అలాటిది కాదు. మా భూమికి నీటి సాధనాలు రెండే రెండు ఉన్నాయి. ఒకటి వర్షాధారం, రెండు బావులు! ప్రథమ సంవత్సరం మా దృష్టి బావులమీదికి అంతగా పోలేదు. అందుకు కారణం వుంది. ఈ సంవత్సరం మేము తీసుకొన్న భూముల్ని మరుసటి సంవత్సరం మరొకరు తీసుకొనవచ్చును (యౌధేయ భూమిలో 'భూములు' వ్యక్తిపరమై ఉండవు. ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం గణసంస్థ 'భూముల్ని' పరివారాలకు ఇస్తూ తీసుకొంటూ వుంటుంది) అలా మరొకరు తీసుకొన్నట్లయితే మేము తీసిన బావులూ, నీటివనరులు కూడా వారికే పోతాయి.

పై కారణంవల్లనే మేము బావుల విషయం అంతగా పట్టించుకొనలేదు. కాని, గణపురస్కర్త బాప్ప మాకు అన్ని విషయాలలోనూ బాసటగా నిలబడ్డాడు. మా భూములు మరొకరికి పోకుండా చూస్తానని మాట యిచ్చాడు. కనుకనే రెండవ సంవత్సరంలో యాభైవరకూ బావుల్ని తీయాలన్న నిర్ణయాన్ని చేసుకొన్నాం. ఈ బావులు ఒక్క మా పరివారం వ్యవసాయం నిమిత్తం తీసుకొన్న భూముల్లోనే కాక, అన్యులు తీసుకొన్న భూముల్లోకూడా తీయాలని మా నిర్ణయం. ఈ విధంగా ప్రజలు పూర్తి వ్యవసాయంలో కాకపోయినా, నీటిసరఫరా వరకైనా ఉమ్మడిగా వ్యవహరించడం నేర్చుకొంటారని మా ఆశ!

మొదటి పంట అయింది. రెండవపంట హేమంతంలో వస్తుంది. హేమంతంలో వర్షం పడితేనే ఈ రెండవ పంట బాగా అవుతుంది. అదృష్టవశాత్తు హేమంతంలో వర్షంపడ్డది. సనగలు, తిలలు, గోధుమలు—విరగపండాయి. మా ఉమ్మడి వ్యవసాయంలోని యువతులూ, యువకులూ—మొదటి పంటలో సంపాయించిన అనుభవంతో—చాలా ఉల్లాసంగా,ఉత్సాహంగా పనిపాటలు చేయసాగారు. ఒక్క పనిచేయడమే కాదు, చేస్తూన్న పనిని విసుగు కలక్కుండా, వినోదాత్మకంగా చేయడాన్ని కూడా నేర్చుకొన్నాం! యువతులు నూతనమైన పాటల్తో యువకుల అలసటను హరించేవారు. హేమంతపు పంటలు కోశాక యువతీ యువకులు ఇటుకల్ని తయారుచేయడంలో, బావుల్ని త్రవ్వడంలో నిమగ్నులయ్యారు.

గ్రీష్మ ఋతువులోనే బావులన్నీ తయారయ్యాయి. కనీసమైనా ఇంకా రెండు నెలలకుగాని వర్షాలు పడవు. అంతవరకూ సమయాన్ని వృధాపుచ్చడం బాగుంట

లేదు. ఈ రెండు నెలల్లోనూ ఒక విశాల సరోవరాన్ని త్రవ్వాలని నిశ్చయించాం. పలుగులూ, పారలూ అశేషంగా ప్రోగుపడ్డాయి. వందల సంఖ్యలో స్త్రీ పురుషులు త్రవ్వడానికి రాసాగారు. గ్రీష్మఋతువు. యౌధేయ భూమిరో ఎండలు విపరీతంగా కాస్తాయి; అందువలన ఉదయం ఒకజాము, సాయం సమయాన రెండు జాములు పనిచేసేవారం. మధ్యాహ్న సమయంలో విశ్రాంతి తీసుకొనేవారం. వెనక వళ్ళు అలవకుండా కబుర్లు చెబుతూ, తలా వళ్ళూ మాయకుండా కూర్చునే ఎందరో యౌధేయ స్త్రీలు త్రవ్వకం పనిలోకి రాసాగారు. శృంగార సాధనకు ఉపయోగించే సంపన్నులైన స్త్రీల శరీరాంగాలు దుమ్ముకొట్టుకొని ఉండడం చూసి నంద వదినె ఇలా అంది! "మరిదీ! నీవు, యౌధేయ భూమిలోని స్త్రీల సౌందర్యాన్ని పూర్తిగా నాశనం చేసిగాని పూరుకోవనుకొంటాను!"

నేను మాట్లాడడానికి ముందే రోహతకుడిలా అన్నాడు: "అవును. నా అర్ధాంగి చెప్పిన పై వాక్యాన్ని నేను సంపూర్ణంగా సమర్థిస్తున్నాను. యౌధేయ స్త్రీలకు అసలు ఇప్పుడే కొంచెం పేరు వస్తోంది. ఇంతలో ఈ ఉపద్రవం వచ్చిపడ్డది. ఇక వీరిని స్మరించేదెవరు? పాపం, నందాదేవి యొక్క పద్మాల్లాటి ఎఱ్ఱని చరణ కమలాలు యెలా నల్లగా అసహ్యంగా........!"

నంద ఆత్రంగా— "ఇక చాలు, పూరుకో రోహతకా! నీవు ఎటూ కవివవుతావని మాకు తెలుసు!" అన్నది.

"నారీ సౌందర్యాన్ని సదా పురుషులే గానం చేశారు. కనుక నేనూ కవినై నీ సౌందర్యాన్ని గానం చేయడంలో ఆశ్చర్యం ఏమీలేదు. కానీ నే నెంత అభాగ్యుణ్ణి? సౌందర్యం స్త్రీలలోనుండి తిరోముఖం పట్టే రోజుల్లో కవి నయ్యాను. ఆ అసౌందర్యాన్ని గానం...." అన్నాడు రోహతకుడు.

"చాల్లే ఇక ఆపు.... పెద్ద గానం చేయడానికి వచ్చావు!"

"నా దురదృష్టానికి ఏడవనుకూడా ఏడవ నివ్వరు కదా? నేనేమైనా అసత్యం చెబుతున్నానా?"

నేను మధ్యలో కల్పించుకొని ఇలా అన్నాను: "వదినే! నేను నా తప్పి దాన్ని ఒప్పుకోవడానికి, అందుకుగాను తమరేమన్నా శిక్ష విధిస్తే అనుభవించడానికి సిద్ధం. కాని అసలు యౌధేయభూమిలో నుండి స్త్రీ సౌందర్య తిరోహిత మౌతున్న దంటావా?"

"జయా! నీవు గాయానికి కారం పూసే మాటలు మాట్లాడుతున్నావు. అసలే వాళ్ళు కుమిలిపోతున్నారు. పైన నీ యెత్తిపొడుపులు ఒకటి? వెనక యెలా వుండేవారు. కొవ్వుమీద కొవ్వు, కొవ్వుమీద కొవ్వు పొరలు కప్పి వుండేవారు. శరీరం చేయివేస్తే జారిపోతూ వెన్నపూసలా గుండేది. సంవత్సరంక్రితం ఈ నంద యెలా వుండేది! అప్పటిరూపం జ్ఞాపకమొస్తే గుండె చెరువవుతుంది" అన్నాడు రోహతకుడు.

"బ్రరెలు అలా వుంటాయి. నీవు సౌందర్యాన్నికాదు కోరేది. బ్రరెల్ని." అన్నది నంద వదినె.

"అలా అనకు, నా ప్రేయసీ! నా నంద ఎన్నడూ బ్రరెలా అలా లేదు. ఒకవేళ వున్నదే అనుకొందాం! అయితే మటుకేం? యౌధేయ భూమిలోని బ్రరెలు కూడా సౌందర్యానికి ప్రసిద్ధిచెందే వున్నాయి. అటూ ఇటూ కదుల్తూన్న చిన్ని గుండెలు, నల్లని శరీరాలూ, పెద్దకుండలాటి పొదుగు, నేలను తాకే కడుపును చూసి నప్పుడు పొరుగు దేశస్థులకు నోట్లో నీళ్ళూరుతాయి!" అన్నాడు రోహతకుడు.

"ఐతే, నారీ సౌందర్యానికి నీవు ఇచ్చే పరిభాష ఇదేనా?" అన్నాను.

"జయా! నీవూ నేనిచ్చే పరిభాష తగదనుకొంటున్నావా? ఆ రోజున ఎవరో బ్రరెల్ని తిడుతూవుంటే, నీ వెలా ఉపన్యాసం ఇచ్చావు వాళ్ళకు!" అన్నాడు రోహతకుడు.

"మరిదీ! నీవు రోహతకుణ్ణి పూర్తిగా పాడుచేశావు. ఇప్పుడతడు సేనా నాయకుడేకాదు; సౌందర్యోపాసి అయిన కవికూడా అయ్యాడు! అతడిచ్చిన పరి భాషే సౌందర్యానికి తగ్గిపోతుందనుకొంటే, ముందుగా అతడి పరిభాష అతడి శరీ రానికే అన్వయిస్తుంది!" అన్నది నందా వదినె.

"నిన్నుకూడా కలుపుకొనే నేను చెబుతున్నాను. గాని, ఏం చేయను; ఈ జయుడు నా కసలు అలా కావడానికి అవకాశం ఇస్తేగా? జాలుకుడి భార్యను చూసి నప్పుడు, నాకు చాలా ఈర్ష్య కలుగుతుంది" అన్నాడు రోహతకుడు.

నేను నవ్వుతూ "ఐతే, నీ చూపు జాలుకుడి భార్యమీద పడ్డదంటావు?" అన్నాను.

"మొగుడూ పెళ్ళాలకు—మా ఇద్దరిలో పోట్లాట పెట్టావు. ఇక సవతులకు కూడా పోట్లాట పెట్టాలని చూస్తున్నావా?" అన్నాడు రోహతకుడు.

"నా పనే పోట్లాట పెట్టడమన్నట్టు చెబుతున్నావు రోహతకా! కాని నీవు వదినెను సదా నెలలునిండిన మనిషిలాగానే చూడాలని కోరుతున్నావుగదా! ఆ విష యాన్ని బైటపెట్టవేం?" అన్నాను.

నంద కనుబొమల్ని ముడిచి "అంటే నేను ముమ్మూర్తులా బ్రరెలా గుండాలనా నీ కోర్కె? కండ్లు లోపలికిపోయి, ముఖం ముందుకువచ్చి, గుండెలు లోపలకు నెట్టుకుపోయి, పొట్ట పైకి ఉబికి వచ్చి — అంతేనా? అయ్యో! నా మొగు డికి ఏమో అయింది" అన్నది.

"స్త్రీ సౌందర్యం పురుషుడి కంటికి నచ్చినప్పుడే ఎన్నికకు వస్తుంది....! పురుషుడి కంటికి నచ్చిందే సౌందర్యం!" అన్నాడు రోహతకుడు.

"నీలాటి పురుషులకు అలాటిదే సౌందర్యంగా కనుపించేమాట నిజం. చూశావా మరిదీ! నే నేమో యౌధేయస్త్రీల సౌందర్యం ఇంకా కూడా అభివృద్ధి కావాలని కోరుతున్నాను. నీ సోదరుడేమో యౌధేయ స్త్రీలందర్ని జాలుకుడి భార్య

లాగా–బఱ్రెల్లాగా–మార్చా లనుకొంటున్నాడు" అన్నది నంద.

"కోపగించుకోకు నందా! నిజంగా యౌధేయస్త్రీలు ఎఱ్ఱని అరచేతులూ, వెన్నలాటి శరీరమూ కావాలని కోరుకొన్నారా? కొన్నాళ్ళ తరువాత తప్పకుండా జాలుకుడి భార్యలాగా తయారౌతారు" అన్నాడు రోహతకుడు.

నే నందుకొన్నాను: "సోదరుడు చెప్పినమాట చాలా యథార్థం.బాగా పాలూ, నెయ్యి, మాంసం తింటూ ఏమాత్రం వళ్ళు అలవకుండా నీడన బ్రతుకుతుంటే జాలుకుడి భార్యలాకాక మరెలా తయారవుతారు?" అన్నాను.

అంతవరకూ మౌనంగావున్న వసునంద "మీకు యింకేమీ పనిలేదా? ఇలా సౌందర్యాన్ని దుమ్ములేపుతున్నారు!" అన్నది.

"దీనికి సరైన న్యాయం చెప్పగలిగింది నీవే వసు!" అన్నాను నేను.

"న్యాయం ఎందుకు చెప్పదు, చెబుతుంది! బంగారు పోగుల్లాటి తలవెంట్రుక లాయె; ఎందరో మరీ మెరిసిపోతుంటాయి. పాపం, వసు ! నీవే భట్టారకుడితో పట్టపురాణివి కావలసినదానవు. ఈ జయుడు నీచేత మట్టిముద్దలు మోయిస్తా నంటు న్నాడు" అన్నాడు రోహతకుడు.

"ఐతే, బావగారూ! అక్కను వదిలి ఇక నామీదకు వచ్చారన్నమాట"అన్నది వసునంద.

"అవునులే నువ్వు విక్రమాదిత్యుని విక్రమాన్నే తునాతునకలు చేసి వేశావు. ఇక నీ రోహతకు డొకలెక్కా! ఏమో నాకు తెలిసిన విధంగా సౌందర్యానికి పరి భాషను చెప్పాను. చేతనైతే నీవూ చెప్పు?" అన్నాడు రోహతకుడు.

నందావదినె వసునంద తలను తన కపోలాలకు అదుముకొంటూ "చూశావా చెల్లీ! మీ బావగారి ప్రతాపాన్ని, ఎలా టకటకా మాట్లాడేస్తున్నారో, కత్తియుద్ధంలోనే కాదు మీ బావగారు నిపుణులు! వాగ్యుద్ధంలోనూ నిపుణులే!" అంది.

రోహతకుడు "మీ చెల్లెల్ని చెప్పనివ్వు ! సౌందర్యానికి తగిన పరిభాష నిస్తుంది. నేను ఒప్పుకొంటాను" అన్నాడు.

వసునంద 'ఐతే, విను బావా నేను పురుషుని సౌందర్యాన్ని గురించి చెపు తున్నాను. స్త్రీకి కూడా యిదే తగిపోతుంది. శరీరంలో బాగా మాంసముండాలి. క్రొవ్వు మాత్రం వుండరాదు. భుజాలు బలిష్టంగా వుండాలి. చాతి విశాలంగా వుండాలి. కటి సన్నం........బాహువులు ఆజానువులుగా, ముంజేతులు ఇనుప పంజాల్లా వుం...." అన్నది.

"అంటే జయుడిలా వుండా లంటావు?"

పాపం వసునంద సిగ్గుపడ్డది.నంద తన పెదాలతో వసునందకండ్లను మూసింది.

వర్షాకాలం రాకముందే సరోవరం తయారైంది. వర్షపు నీటితో పూర్తిగా సరోవరం నిండినప్పుడు దానిశోభను వర్ణించడానికే వీలులేదు. గణ పురస్కర్త చొప్ప ఆ సరోవరానికి "సునందా సాగరం" అని పేరు పెట్టారు.

# వి వా హం

నేను వసునందను వెనుక కూడా ఒకటి రెండుసార్లు చూశాను. అప్పుడు చాలా చిన్న బాలికగా వుండేది. యమునాతీరాన యుద్ధంలో దెబ్బలు తగిలి, అగ్రోద కాలో మంచంలో వుండగా నేనూ చూడ్డానికి వెళ్ళేవాణ్ణి. ఆమె శరీరంలో ఎన్నో దెబ్బలున్నాయి. కుడిడొక్కలో తగిలిన దెబ్బ మాత్రం చాలా ప్రమాదకరమైంది. బల్లెపు దెబ్బ శ్వాసకోశాలకు ఒక్క వద్లగింజ వారగా పోయింది. వైద్యుడు వెంటనే మందుచేసి కట్టుకట్టాడు. అయినప్పటికీ ఆమె అనేక రోజులు మృత్యువు సాన్నిధ్యంలో గడిపింది. పచ్చని ముఖం రక్తం విరిగి తెల్లబడ్డది. శరీరంలో రక్తం ఏమాత్రం లేదు. గణపురస్కర్త బాప్పకూడా ప్రతిరోజూ వెళ్ళి వసునందను చూసి వస్తూండేవారు. యౌధేయ స్త్రీ పురుషులందరూ గుంపులుగా వసునందను చూడడానికి వస్తూండేవారు. ఒక్కోసారి దర్శకులను కావాలని అడ్డగించవలసి కూడా వచ్చేది; ఒకనాడు నందవదినె నాతో ఇలా అంది: "మరదీ! నీమాటలంటే వసునందకు చాలా యిష్టం. నీవు మాట్లాడుతున్నావంటే ఎంతో ఆసక్తిగా, ఆనందంగా వింటుంది. వసు హృదయానికి ఇప్పుడు మనం యెంత ఆనందాన్నియ గలిగితే అంత త్వరగా బాగుపడుతుంది. కనుక నీ వొక పనిచేయి. నీ యాత్రల్లోది ఏదైనా ఒక కథ చెప్పు, వింటూ వుంటుంది!"

నేను వసునంధ వద్దకు పూర్తి స్వస్థత దొరికేవరకు వెళ్ళివస్తూనే వున్నాను. ఏవేవో కథలతో గాథలతో ఆమె మనస్సును ఆనందపరుస్తూండేవాణ్ణి! అంత శుష్కించి వున్నప్పటికీ వసునంద ముఖంలో ఓ అద్భుతమైనసౌందర్యం వెలుగుతూ వుండేది. మా చిన్ననాటి కబుర్లు, చంద్రుడి చిలిపి పనులు, మా ఆటలూ చెప్తూండేవాణ్ణి! అప్పుడప్పుడూ తెల్లని పలువరస కనుపించేట్టు మౌనంగా నవ్వుతూండేది. ఒకనాడు మా సముద్రయానం, నౌకాభంగం, నేను సముద్రంలో ఈదడం మొదలైన విషయాల్ని గురించి చెప్పాను. "అబ్బ—అలర్లో ఎంత పోరాడేరో? ఎలా వుందో?" అన్నది వసునంద.

"కాని, వసూ! నీవు అనంత నీలి ఆకాశాన్ని తాకే జలరాశిని చూసినప్పుడు, ఆ జలరాశిలో ఉన్న ప్రమాదాన్ని ఊహించలేవను కొంటాను!" అనడిగాను.

"ఆ ప్రమాదాన్ని ఊహించుకోగలను! అందుకే ఈర్ష్యపడుతున్నాను!"

"అవునులే, నేను నీ దెబ్బలను చూసి ఈర్ష్యపడుతున్నట్టు!" అన్నాను.

నిర్భయం, స్థిరచిత్తం, శౌర్యం

"ఇందులో ఈర్ష్యపడవలసిన విషయం ఏముంది? మృత్యువుతో అలా ముఖాముఖిని పోరాడే అవకాశమే నాకు దొరకలేదు. ఒక్క క్షణంలో తేలిపోయింది. సునందను మృత్యువు జయించగలిగింది. కాని నా దగ్గిర మృత్యువే పరాజితమయింది! మృత్యువూ, నేనూ పోరాడింది ఒకే ఒక క్షణం. మరుక్షణంలోనే ఫలితం నిర్ణయింపబడ్డది!"

నందా వదినె వసు తలను నిమురుతూ—"పిచ్చిదానా! నీవూ ఆరురోజుల పాటు మృత్యువుతో పోరాడావు!" అన్నది.

"వదినె! నే నొక ఆరు ఘడియల కాలమన్నా మృత్యువుతో పోరాడలేదు" అన్నాను.

గుప్తుల శేషశాయి (విష్ణుభగవానుడి)లా, హాయిగా కాష్ఠ — ఫలకంమీద పడుకొన్నారు! ఔనా, సేనాపతీ? కాని మీ ధైర్యాన్ని మాత్రం కీర్తించనవసరం లేదా? మృత్యువు తన కరాళగళాన్ని తెరుచుకొని వచ్చింది, మిమ్ము జడిపిద్దామని. కాని, మీ రస లా మృత్యువును లెక్కచేస్తేగా? పాపం మీ గాంభీర్యాన్నిచూసి అదే జడుసుకు పారిపోయింది!" అన్నది వసునంద.

"నీవు చెప్పింది నిజమమ్మా చెల్లీ! మన జయుడికి అనేక విషయాలు చాలా తుచ్ఛమైనవిగా కనుపిస్తుంటాయి. అతడిలోని నిర్భయం, స్థిరచిత్తం, శౌర్యం—మొదలైన ఉదాత్త లక్షణాలను, మనం తెలుసుకో గలంగాని అతడు తెలుసుకో లేడు!" అన్నది నందా వదినె.

"వదినె పై మాటల్ని చెబుతూవుంటే వింటానికి చాలా బాగున్నాయి. కాని, వసుచూపిన శౌర్యం ముందు నా నిర్భయం ఏ పాటిది? అదిసరేగాని వసూ! అసలు నీ వెందుకు యుద్ధజ్వాలల్లోకి దూకావు? నీకి ప్రేరణను కలిగించిం దెవరు?"

"మా అందరినీ ప్రోత్సహించింది, ప్రేరణ కలిగించింది–పెద్ద అక్క!" అంటూ వుండగా వసుకండ్లు నీటితో నిండాయి. క్షణం ఉద్వేగాన్ని ఆపుకొని—"నన్నెవరూ తమవెంట తీసుకుపోవడానికి ఇష్టపడలేదు. చిన్నదాని వనేవారు! చిన్న అక్కకూడా అలాగే అంది!" అంటూ వసునంద నందవైపు చూసింది.

"మా నందా సోదరీమణుల్లో కనీసం ఒకరైనా ఈ ప్రపంచంలో లేకుండా వుండడం మా అభిమతంకాదు. పైగా పదహారేళ్ళ పసిపాప కత్తిపట్టి కదనానికి కదలడమా?" అన్నది నంద వదినె.

"కదనానికి కదలకపోతే బొమ్మలాడుకో మన్నావా? మేము బొమ్మలాడుకో వలసిన వారమే అయినప్పుడు మా కసలు ఖడ్గాలు ఎందుకు ఇచ్చారు, ఎవరిచ్చారు?" అన్నది వసు.

"ఇదిగో! ఈ జయుడే ఖడ్గాన్నయితే ఇచ్చారు. కాని కదనానికి మాత్రం కదల వద్దన్నారు. పురుషుడు స్త్రీని స్పష్టంగా అర్థంచేసుకోలేనప్పుడు మా కసలు ఖడ్గాలిచ్చిం దెందుకు? గుప్తుల రక్తంతో ఖడ్గాలను తడిపామన్న మహాపరాధానికి,

త్యాగం వల్ల అధికారం పొందారా

గణ పరిషత్తులో మనని నిందించారు కూడాను! మరి ముందు మనని నిందించిం దెవరో తెలుసా?" అన్నది నంద.

"ఎవరక్కా?" అడిగింది వసు.

"ఇదిగో, ఈ మహానుభావుడే!"

"మన సేనాపతి, జయా?" అన్నది వసు.

"కాక...." అన్నది నంద.

"నన్నుకూడా ఏమైనా చెప్పుకోనిస్తారా?"

"నిండు పరిషత్తులో నిందించడం, ఏకాంతంలో కారణాల్ని చెప్పుకోవడం. అంతేగా! జయుడి ఉపన్యాసాల్ని వింటూన్నప్పుడు, నిజంగా హృదయంలో మంట ల్లేచాయంటే నమ్ము! ఈ పురుషులు గణసంస్థలో కనీసం సభ్యత్వాన్నయినా మన కీయలేదు. వారు చెప్పిన తీర్పు, చేసిన న్యాయ విచారణా, పూర్తిగా ఒకే పక్షానికి చెందింది!" అన్నది నంద వదినె.

"మీ అక్క అసలు విషయాన్ని తల్లక్రిందులు చేస్తోంది! పైగా నన్ను మాట్లాడనీయడంలేదు" అన్నాను.

"మీ పురుషులు పరిషత్తుల్లో మా స్త్రీలకు మాట్లాడే అవకాశాన్నీయలేదు. నే నిక్కడ నీపట్ల అలాగే ప్రవర్తిస్తానని భయపడుతున్నావా?" అంది నందా వదినె.

"కాని, నేను పురుషులలాగానే స్త్రీలుకూడా దేశరక్షణలో పాల్గొనే అవకాశం వుండాలని పరిషత్తులో చెప్పానా లేదా? పరిషత్తు అందుకు సమ్మతించిందా లేదా?" అన్నాను.

పై మాటలు వినగానే వసునంద ముఖం వికసించింది. గౌరవ సూచకంగా నా పైపు చూస్తూ—"అయితే మన సేనాపతి, మనకు ఖడ్గాలనీయడమేకాదు, వాటిని ఉపయోగించే అధికారాన్నికూడా ఇప్పించారన్నమాట!" అన్నది.

"ఆఁ, యిప్పించారు! ఎంత రభస అయ్యాక?" అన్నది నంద.

"మీ అంతట మీరు యుద్ధంలోకి దూకిన అపరాధాన్ని నా నెత్తిన వేసుకో లేదా?" అన్నాను.

"సేనాపతి మీద కోపగించుకోవద్దక్కా! ఆయన ఎప్పుడూ యౌధేయ స్త్రీలపక్షమే మాట్లాడుతుంటాడు! పైగా పురుషుల్లాగానే స్త్రీలక్కూడా దేశంకోసం పోరాడే అధికారాన్నిప్పించి, మనకు మహోపకారం చేశాడు!" అన్నది వసు.

"మీకు నేనేమి ఉపకారం చేయలేదు. మీరు మీ త్యాగంవల్ల ఈ అధికారాన్ని పొందారు!" అన్నాను నేను.

ప్రత్తిలా తెల్లగా వున్న వసుముఖంలో అరుణిమ పరుగెత్తింది. లోపలికి పీక్కుపోయిన కండ్లు ఆనందంతో మెరిశాయి. ఆమె బంగారు రంగు వెంట్రుకలు మరింకా మెరిశాయి.

మేము ఉమ్మడి వ్యవసాయం ప్రారంభించేనాటికి వసునందకు కొంచెంలేచి తిరగగల ఓపికవచ్చింది. ఒకరోజున నందా వదినె వ్యవసాయ క్షేత్రంనుండి తిరిగి వచ్చింది. తలా శరీరమూ మట్టికొట్టుకొని ఉన్నాయి. అక్కను చూసి వసు యిలా అన్నది: "అక్కా! మొదట నేను ఉమ్మడి వ్యవసాయం అంటే యిలా ఉంటుందను కోలేదు. ముఖాన స్వేదబిందువులు! అక్కడక్కడా స్వేదంతో కలిసిన యెర్రని మట్టి, ఎంత బాగుందక్కా?"

"నీ విలా అనారోగ్యంలో వుండడమే నయమయింది. మిగిలిన యువతుల్లా నీవూ చేలల్లో పనిచేస్తానని గోలచేసేదానివి!" అన్నది నంద.

"మిగిలిన యువతులు గోల చేస్తున్నారా అక్కా? కాని, నే నలా గోల చేయను!" అన్నది వసు.

"నువ్వొట్టి పిచ్చిదానివి సునంద, నందల చెల్లెలివంటే ఎవ్వరూ నమ్మరు. నీకు వంట్లో కులాసాగావుంటే నీవూ అందరికంటే ముందు క్షేత్రానికి వెళ్ళేదానివి!" అన్నది నంద.

"కాని, అక్కా! ఈ యువతులందరూ ఎందుకలా పనులకు వస్తామని పోట్లాడతారు?"

"మరి నీవా రోజున యుద్ధం చేస్తానని ఎందుకు పోట్లాడావు?" అన్నది వదినె.

"మన సేనాపతి ఏం దాచాడనో, ఆడవాళ్ళిలా పరిగెత్తుకు వస్తున్నారు?" అన్నది వసునంద.

"నిజం చెప్పావు వసు! మన సేనాపతిలో అంత మహాత్మ్యం వుంది. ఏ పనికైనా తను ముందుకు దూకుతాడు. ఇక యువతీ యువకులు అతణ్ణనుసరిస్తారు? కాకపోతే ఈ ఎండలో ఏ యౌధేయ స్త్రీ అయినా క్షేత్రానికి వెళ్ళడానికివప్పుకొంటుందా? పని విషయం తరువాత! కాని, ఇప్పుడుచూడు పోటీపడి పనిచేస్తున్నారు. ఒకచెంప కోతలు జరుగుతూనేవున్నాయి. చేతుల్లో కొడవళ్ళు-కంకులు—పల్లెటి పాటల్తో దిశలు మారుమ్రోగుతున్నాయి!"

"అబ్బ....అలాటి ఆనందాన్ని అనుభవించలేక పోతున్నందుకు విచారిస్తున్నా నక్కా!" అంది వసు.

"అది నాకు తెలుసులే! నువ్వు ఇతర యువతులకంటే పది ఆకులు ఎక్కువ చదివావు! వంట్లో బలంలేదుగాని, వుంటే ఇలా కూర్చునేదానివా?" అన్నది నంద.

"ఐతే, అక్కడ పనిచేస్తున్నట్టు కాదు, ఆట ఆడుకొంటున్నట్టుంటుందను కొంటాను!"

"అక్కడ పనిచేస్తూ వుంటే సమయం ఎలా దొర్లిపోయిందో తెలీనే తెలియదు. ఒకవైపున పనులు జరుగుతూనే వుంటాయి. మరోవైపున పోటీపడి పాటలు పాడు తుంటారు. ఒక జట్టు: "శ్రావణమాసం వచ్చింది" అంటుంది. మరొకజట్టు "చల్లని వర్షం తెచ్చింది" అంటుంది. కొడవళ్ళూ, పలుగులూ, పారలూ-వాటంతటవి నడు స్తున్నట్టుగా వుంటుంది! ఎవరు కడతారో, ప్రతిరోజూ క్రొత్తక్రొత్త పాటలు వస్తూ వుంటాయి!"

"ఇక నేను కొద్దిరోజుల్లోనే నీతోపాటు పనికి రాగలుగుతాలే, అక్కా!"

వసునందయొక్క గాయాలన్నీ నయమైపోయాయి. డొక్కలో గాయం మాత్రం ఇంకొంచెం పచ్చిగా వుంది. అయినా తనూ క్షేత్రానికి వస్తోంది! గోధుమ పంట కోసేశాము. పంట బాగానే పండిందనే ఆనందంలో యువతులందరు వసుకు 'అన్నపూర్ణ' వేషం వేశారు. పసుపు పచ్చని గోధుమ కంకుల్తో వసును అలంకరిం చారు. మిగిలిన స్త్రీలుకూడా పచ్చని ఆకుల్తో లతల్తో అలంకరించుకున్నారు. అదే రోజు సాయంత్రం నృత్యోత్సవం జరుపుకున్నాము. వసుకు, మనస్సులో నాతో నాట్యంచేయాలని వుంది. కాని, నన్ను అడగలేకపోతోంది. నేనే యిలా అన్నాను "వసూ! నేను నీతో నాట్యం చేస్తాను!"

వసునందతో నాట్యంచేయడం అదే ప్రథమం. ఆనాటి నాట్యమూ, గానమూ కూడా వెనక యెన్నడూ కలిగించనంత ఆనందాన్ని కలిగించాయి-నాలో! రెండవ పంటకూడా బాగా కావడంతో మా ఉత్సాహం మరింతలయింది.

నాకు ఇల్లు వుంది. అయినా నేను రోహతకుని యింట్లో భోంచేస్తుండేవాడిని! ఇప్పుడు నా యిల్లు వ్యక్తిగతమైనదికాక, సామూహికమైందిగా మారిపోయింది. మరుసటి సంవత్సరం మా ఉమ్మడి వ్యవసాయంలో మరికొన్ని కుటుంబాలు వచ్చి కలిశాయి. వ్యవసాయం ఉమ్మడిగా జరిగినా, ధాన్యం మాత్రం చేసిన పనిని అనుస రించి పంచేవారం. ధాన్యపు పంపిణీలో బానిసలకు, కూలీలకుకూడా సమానమైన భాగాలనిచ్చేవారం. మేము ఉమ్మడి వ్యవసాయాన్ని ప్రారంభించిన మూడవ సంవ త్సరంలో మా పరివారాల్లోని బానిసలందర్నీ స్వతంత్రుల్ని చేసివేశాం. మాతోకలిసి వుండడానికి, లేక వేరుగా ఉండడానికి—వారికి పూర్తి స్వాతంత్ర్యానిచ్చాం. అయినా వారు మాతో కలిసి ఉమ్మడి వ్యవసాయంలోనే వున్నారు. కాని ఎంత ప్రయత్నించి నప్పటికీ, దానిసలకూ, కూలీలకూ గణసంస్థలో సభ్యత్వాన్నిమాత్రం యిప్పించలేక పోయాం!

యౌధేయులం, కేవలం వ్యవసాయంలోనే కాదు మార్పు తీసుకు వచ్చింది. పశు సంపదలో కూడా బాగా అభివృద్ధిని తీసుకొని వచ్చాం. కేవలం మంచి ఆబోతు లనే వుండనీయడం వలన ఉత్తమ జాతి ఆవులూ, కోడెలూ లభించసాగాయి.

గుర్రాలతో, గేదెలు, దున్నల విషయంలోకూడా గొప్పగా అభివృద్ధిని పొందాం. గత పది సంవత్సరాలుగా యౌధేయ భూమిలో అశ్వజాతి అభివృద్ధిని చూస్తే ముందుతరం గుర్రాలకోసం సింధు, కాంభోజ, కాబూల్—మొదలైన దేశాలవైపు చూడనవసరం వుండదనిపిస్తుంది. మా శిల్పకళనుకూడా అభివృద్ధి పరచుకొన్నాం. మానవులుకూడా ఉత్తమ స్వాస్థ్యకర సంతానాన్నే కనాలన్న ప్రతిపాదనను చేయ డానికి నేను చాలా సంకోచిస్తున్నాను. ఒక రోజున మాధవసేనుడు యువక సేనా నాయకులముందు ఇలా అన్నాడు: "ఎంతకీ పశువుల సంతానాన్నే బాగుచేసుకొంటూ వుంటారా? మానవ సంతానాన్ని కూడా బాగుచేసేదేమైనా వుందా?"

"అంటే నీ ఉద్దేశం? మనము బలహీనమైన ఆబోతులను దేశంలో లేకుండా చేశాము. పొట్టివీ, గొడ్డుమోతివీ అయిన ఆవులనూ, గేదెలనూ, యమున ఆవలి వడ్డుకు తగిలేశాం. అలాగే యౌధేయ స్త్రీ పురుషుల్ని గురించికూడా ఆలోచిస్తు న్నావా?" అన్నాడు రోహతకుడు.

"మిత్రమా, రోహతకా! నిన్నుగాని, నందనుగాని, యమున అవతలికి తగిలేస్తామని భయపడకు. కాని, నీవు ముగ్గురు యౌధేయుల్ని మాత్రమే కలిగి వూరుకొన్నావు. ఆ సంఖ్య బహుస్వల్పమనీ, యింకా సంఖ్యను పెంచవలసిన అవసరం వుందనీ చెప్పక తప్పదు!" అన్నాడు మాధవసేనుడు.

"అంటే, సంవత్సరానికి ఒక సంతానం చొప్పునకంటే చాలదనీ, ఆరు నెల్లకో సంతానం చొప్పున కనవల్సిందనీ వదినకు చెప్పమంటావు?" అన్నాను నేను.

"జయుడు చేసిన ప్రస్తావన నాకు పూర్తిగా నచ్చింది. ఒకవేళ ఆరునెల్లకో మాటు కనడం కష్టం అనుకొంటే, ఒకేమాటు యిద్దర్నీ, ముగ్గుర్నీ కనేది! నేను మరొక ప్రస్తావననుకూడా చేయాలను కొంటున్నాను. ఈ విషయాన్ని నందకు చెప్పే బాధ్యత, మాధవుడిదే!" అన్నాడు రోహతకుడు.

అందరూ ఒకేసారి అన్నారు. "మాధవసేనుడే ఈ విషయాన్ని నందకు చెప్పాలి!"

పాపం మాధవుడు అనవసరంగా చిక్కుకొన్నాడు. యిలా అన్నాడు: "ఈ పని జయుడు చేయాల్సిందే! నందా వదినెను ఓడించగలిగింది జయుడొక్కడే! ఆనాటి పాలవిషయం జ్ఞాపకం వుందిగా?" అక్కడున్న వారందరూ నావైపు చూడ సాగారు. మాధవుడు తన మాటను పూర్తి చేశాడు "అసలీ మానవులు ఉత్తమ సంతానాన్ని కనాలనే విషయం నా బుద్ధికి పుట్టిందికాదు. జయుడే నాతో చెప్పాడు ఎక్కడో యవనదేశంలో ఇందుకు శాసనంకూడా చేశారుట! అక్కడ పిల్లల్ని పుట్ట గానే కొండమీదకు తీసుకుపోయి వదుల్తారుట. ఆ ఎండకు వేడికి తట్టుకొని, ఇరవై నాలుగు గంటలు బ్రతికేట్లయితే, ఆ పిల్లవాడిని తిరిగి తెస్తారుట. అలా బ్రతకలేని వాడి కసలు బ్రతికే హక్కు లేదనుకొంటారుట."

బంధుకుడు అందుకొన్నాడు— "అలాటి ఆచారం మనలో జరగడం కష్టం. మనలో జైనమతస్థులు కూడా చాలామంది వున్నారు!"

రోహతకుడు అన్నాడు—"అయితే ఆ గణ ప్రజలు చాలా బలంగా వుంటారనుకొంటాను."

"చాలా బలంగానూ ఉంటారు. గొప్ప వీరులుకూడాను. సన్నగా, పొట్టిగా, బలహీనంగా వుండే స్త్రీ పురుషులు అక్కడసలు కనుపించరు!" అన్నాను నేను.

"మనమూ యౌధేయుల్లో మంచి సంతానం కలగడానికి ప్రయత్నించవచ్చు!" రోహతకుడు అన్నాడు.

"ఆ యవనగణం చేసినటువంటి క్రూర ప్రయోగాలు మనగణంలో సరిపడవు. ఒకవేళ సరిపడినా అలా చేయడం ఉచితమని నే నను! కారణం; స్త్రీ పురుషులు పశువులు కాదు. వారి ఇష్టాఇష్టాలను లెక్కచేయకుండా మనం ఇష్టం వచ్చిన ప్రయోగాల్ని చేయడానికి! పోతే, బలహీనంగా పుట్టిన శిశువులు బుద్ధిలో కూడా బలహీనంగా వుంటారని ఎక్కడుంది? మానవుడు బుద్ధిజీవి! ఒక బలహీనుడు మహా మేధావియై యుండవచ్చు. బలం లేకపోయినంత మాత్రాన ఆ మేధావిని చంపుకొంటామా?" అన్నాను నేను.

"అయితే, యౌధేయులు ఏ నిబంధన లేకుండా స్వేచ్ఛగా సంతానోత్పాదన చేయవచ్చునా ?" అన్నాడు మాధవసేనుడు.

"అలా కాదు. ఆరోగ్యవంతులూ బలిష్ఠులూ అయిన భార్యాభర్తల్ని, అధికంగా సంతానం కనేట్లు ప్రోత్సహిద్దాం!" అన్నాను నేను.

బంధుకుడు అన్నాడు—"అయితే జయా! నీవు వదినెను వప్పించు, కనీసం ఇరవై మంది సంతానాన్నయినా కనాలి! మేము ఇక్కడ రోహతకుడి కాళ్ళూ, గడ్డాలూ పుచ్చుకొంటాం. గాంధారి నూరుగుర్ని కన్నది. వీళ్ళు ఇరవైమందినైనా కనకపోతే ఎలా?"

"ఏయ్ బంధుకా! నీవు చాలా పెద్దగా మాట్లాడేస్తున్నావు. నీ మాటలు గనక నంద చెవుల పడ్డాయా? జుట్టు వూడగొడుతుంది!" అన్నాడు రోహతకుడు.

"సరేనయ్యా. ఆరోగ్యవంతుల్ని, బలిష్ఠుల్ని ఎలాగో బ్రతిమలాడి కనేట్టు చేసుకొంటాం. కాని జాలుకుడి లాటి వారి విషయం ఏమిటి?" అన్నాడు మాధవుడు.

"మనం మన యువతుల్ని వున్నతమైన అభిరుచులు కలవారుగా చేసుకొంటే, ఇక జాలుకుడిలాటి వారిని కన్నెత్తి చూసేవారే ఉండరు!" అన్నాను.

"ఐతే మన భవిష్యత్ స్త్రీ పురుషుల మీద ఆధారపడవల్సిందేనా?" అన్నాడు మాధవుడు.

"భవిష్యత్ స్త్రీ పురుషులేనని నిరాశపడవల్సిన పనేముంది? ముసలివాళ్ళు ఎన్నాళ్ళుంటారు? ముసలివాళ్ళు పోయాక ఈ యువతరం వాళ్ళందరూ ఉత్తమ సంతానాన్ని కనడానికి బద్ధులైతే సరి" అన్నాను.

"మరి యువకుల్లోనే, భార్యాభర్త లిద్దరూ దుర్బలులైతే?" అన్నాడు మాధవుడు.

"నేనొక ఉపాయం చెబుతాను. అలాటి వారిని జైన, బౌద్ధ మఠాల్లోకి తోలితే సరి!" అన్నాడు రోహతకుడు.

అందరూ చప్పట్లు చరిచి నవ్వారు. మాధవుడిలా అన్నాడు: "జయా! మనమూ చాలారోజులు బౌద్ధమఠాల్లో గడిపాము గదా! వాళ్ళ బోడిగుండ్లనూ, కాషాయ వస్త్రాలనూ ప్రతి ఊళ్ళోనూ ప్రతి పట్నంలోనూ చూడవచ్చును. మంచి మంచి భవనాలూ, కమ్మని భోజనం—అక్కడ ఎలాటి దుఃఖమూ వుండదు!"

యౌధేయ యువకుల్లో రాజకీయ స్వాతంత్ర్యమే కాకుండా బౌద్ధిక స్వాతంత్ర్యంకూడా తగు మాత్రంలో ఉన్నందుకు సంతోషించాను.

నందా వదినెకు నిజంగానే మాధవుడూ, బంధుకుడూ అన్న మాటలు తెలిశాయి. మేమున్న దగ్గిరకు వచ్చేసింది. నందను చూడగానే మాధవుడు జారుకున్నాడు. బంధుకుడు దొరికిపోయాడు. అతడి కుడిచేతిని బలంగా పుచ్చుకొని "ఏరా, బంధుకా! నేను లేకుండా చూసి, అందర్లో ఎగతాళిచేస్తావా?"

"లేదు వదినే! ఎవరో నామీద అనవసరంగా అబద్ధాలు చెప్పారు!" అన్నాడు బంధుకుడు.

"కాదు....కాదు....ఇందాక అంత ధైర్యంగా మాట్లాడితివే. ఇప్పుడూ అలాగే మాట్లాడు!" అన్నాడు రోహతకుడు.

"వదినే! వీళ్ళందరూ నామీద అబద్ధాలు చెబుతున్నారు. ప్రమాణం చేసి చెబుతాను, గుంజీలు తీస్తాను!"

నందా వదినె రెండు చేతులతో బంధుకుడి భుజాన్ని బలంగా వూపింది— "అయ్యబాబోయ్! వదినే! నీకో దణ్ణం! వీళ్ళందరూ అబద్ధం చెబుతున్నారు, సోదరా, జయా! నీవైనా చెప్పు, వదినెకు!" అన్నాడు బంధుకుడు.

వదినె మరికొంచెం గట్టిగా కుదిపి "ఏం జయుణ్ణి పిలుస్తున్నావు? భయం అనుకొన్నావా? యుద్ధ సమయంలో సేనాపతి, ఇప్పుడేం భయం? అతన్నీ ఏమైనా అనిచూడమను తరువాత చెబుతాను" అన్నది.

నేను రెండు చెవులూ పుచ్చుకొని గుంజీలు తీస్తో-"వదినే నా జోలికి రాకు! దాసానుదాసుణ్ణి! కాని, వదినే! నిజం చెబుతున్నాను. బంధుకుడు నిన్నేమీ అనలేదు!" అన్నాడు.

వదినె బంధుకుణ్ణి వదిలి నావైపు పరుగెత్తింది. నేను మనుషుల చాటున దాక్కున్నాను. అందరూ పెద్దగా చప్పట్లు చరిచి నవ్వారు.

మూడు సంవత్సరాలు గడిచిపోయాయి. వసునంద పందొమ్మిదేండ్లదయింది. ఆమె సౌందర్యం కూడా వృద్ధయింది. నేను తరచుగా వసునందతో కలిసి నాట్యం చేస్తూండేవాణ్ని. అప్పుడప్పుడూ మృదువైన పరిహాసంతో ఆమె పెదాలమీద చిరునవ్వు చిందించేవాణ్ని సాధారణంగా వసునందతో సరదాగా మాట్లాడడానికి నాకు సమయమే లభించేదికాదు. ఒక్క ఆగ్రోదకాలోనే కాక, ఇతర యౌధేయ నగరాల్లో కూడా ఉమ్మడి వ్యవసాయం ప్రారంభించారు. వాళ్ళకు ఉచిత సలహాల నీయడానికి ఎప్పుడూ వూరూరూ తిరుగుతుండేవాడిని. ప్రజల్లో సేనాశిక్షణ నీయవలసిన బాధ్యత నాదేను. నేనెప్పుడూ తిరుగుతూనే వుండడంవల్ల వ్యవసాయపు పనిపాటల్లో నేనంతగా పాల్గొనడం లేదు. నందా సోదరీమణుల పరాక్రమాన్నీ, విక్రమాదిత్యుని ఓటమినీ చిన్న పిల్లలు కూడా విచిత్రంగా చెప్పుకొనేవారు. ఒకరోజున అనేక గ్రామాలు తిరిగి అప్పుడే ఆగ్రోదకాకు వచ్చాను. నందా వదినె దగ్గర కూర్చొని భోజనం పెడుతోంది. ఇలా అన్నది: "మరిదీ! ఆ రోజున అనవసరంగా బంధుకుడు చీవాట్లు తిన్నాడు. అసలిదంతా నీ కుట్ర!"

"పోనీ, నేనే అన్నాననుకో. అన్నదాంట్లో అబద్ధం ఏమైనా వుందా? ఇప్పుడు పులిబిడ్డలాటి వారిని నలుగుర్ని కన్నావు. మరో పదహారుగుర్ని కంటే, యౌధేయ భూమికి ఎంత మేలు చేసినదానవవుతావు!" అన్నాను.

"పదహారేం ఖర్మం. ఇరవై ఆరుగుర్ని కంటే?" అన్నది వదినె.

"ఓ....హో....అలాగైతే నీకు అనేకానేక ధన్యవాదాలర్పిస్తా నొదినె!"

నా వీపును మెల్లగా చరిచి—"నీవు చాలా దుష్టుడవోయ్, మరదీ!" అన్నది వదినె.

"వదినె మరదిని—"దుష్టుడవోయ్!" అంటే అర్థం ఏమిటో తెలుసునా?"

"అర్థం ఇది" అంటూ మెల్లగా నా రెండు చెంపలనూ వాయించింది.

"వదినె చాలా సంతోషంగా వుంది. అంటే మరిది అదృష్టం పండిందన్న మాటే?" అన్నాను.

"అవును, మరిదికి అతడి అదృష్టాన్ని తెలియ పరుద్దామనుకొంటున్నాను!"

"ఏమిటది?"

"నీవు ఇరవై మంది యౌధేయుల్ని కనాలి!"

"అదెలా?"

"నీకేమీ తెలియదు. లోకాని కంతటికీ చెబుతావుగానీ, నీ గురించి మాత్రం ఏమీ తెలియదు."

"అంటే?"

"అంటే పెండ్లి చేసుకొని ఇరవై మంది యౌధేయుల్ని కనాలి?"

"పెండ్లా? నేను పెండ్లి చేసుకోవలెనా?"

"అవును, పెండ్లి చేసుకోవా? జీవితమంతా బ్రహ్మచారిగానే వుంటావా?"

"నేను చేసుకోవాలన్నా, నన్ను చేసుకొనే పెండ్లికూతు రుండవద్దా ?"

"చాలామంచి పెండ్లికూతురు. చూశావంటే కడుపు నిండుతుంది. అలాటి సుందరి ఇంద్రలోకంలో కూడా దొరకదు. అప్సరస అంటే నమ్ము!"

"చెప్పరాదా! వింటాగా ?"

"జాలుకుడి పెద్దకూతురు!" అని నంద వదిన పెద్దగా నవ్వింది.

నేను కోపంగా చూస్తూ— "ఆమె నుండేనా, ఇరవై మంది యౌధేయులు పుడతారని ఆశిస్తున్నావు?" అన్నాను.

"దానిబొంద, అది యౌధేయుల్నేం కంటుంది? నల్లుల్ని కనగలదు. యౌధేయుల్ని కనాలంటే నాలాంటివారే కనాలి!" అంది వదినె.

"బంధుకుడు ఆమెను ఉపాశ్రయంలోకి పంపుతా నంటున్నాడు!"

"మరి ఉపాశ్రయంలోకి పంపక యింకేం చేస్తాడు. దాదాపు ముప్పై ఏళ్ళొచ్చాయి. జాలుకుడు ఒకటి రెండువేల దీనార్లను యిచ్చి అయినా మంచి యువకుణ్ణి కొనేవాడే. కాని, నీ బోధల్లో పడిపోయాక యౌధేయ యువకు లసలు అతడి గడప ఛాయలకే పోవడం మానుకున్నారు. నీ మూలకంగా యౌధేయ యువకులు రంభా, ఊర్వసుల్లాంటివారే కావాలని పట్టుపట్టి కూర్చున్నారు" అన్నది వదినె.

"ఐతే, వదినా! వీళ్ళందర్నీ ఉద్ధరించడానికి నీవు సిద్ధమైనావా?"

"అవును. గుప్తులు గో—బ్రాహ్మణ ఉద్ధారకులమని చాటుకొంటున్నారు. పోనీ, పాప మీ అభాగినుల రక్షణభారాన్ని స్వీకరిద్దామనుకొన్నాను."

"నీ భుజం చాలా బలమైనది; నీ వా భారాల్ని ధరించగలవు. కాని, నా భుజం చాలా బలహీనమైంది వదినే!"

వదినె నవ్వి— "నీకు తగిన బరువే నీకెత్తుతాలే మరదీ!" అన్నది.

"చూడు వదినే! నీ మాటల్లోపడి నే నసలు అన్నమే తినలేదు."

వదినె నావైపు ప్రేమపురస్సరంగా చూస్తూ— "మరదీ! వసునందా, నీవూ.... జోడీ ఎలా వుంటుంది ?" అనడిగింది.

"వదినే! ఆ మాత్రం మేలు చేశావంటే వేల వేల నమస్కారాలు పెడతాను."

"ఇంతకూ యిష్టమే నంటావు?"

"ఒక మాటుక్కాదు, వేయిసార్ల కిష్టం."

నందా వదినె నవ్వుతూ లోపలికి పోయింది. వసునంద చేయి పుచ్చుకొని తిరిగివచ్చింది. ఇలా అన్నది. "వసూ! సిగ్గుపడకు! నేను జయుడితో చెప్పానులే! నా సోదరి నీవంటే మహా ఇదవుతోంది. కనీసం అప్పుడప్పుడూ ఒకచూపు చూస్తూ వుండు అన్నాను!" అన్నది వదినె.

వసు సిగ్గుపడుతోంది. ఆమె బుగ్గలు ఎర్రపడ్డాయి. నేను భోజనం చేయడం పూర్తయింది. పళ్ళెంలోనే చేయికడుక్కుని— "వసూ! నందా వదినె విషయం నీకు

తెలుసుగా? అందర్నీ ఏడిపిస్తుంది! నే నివ్వాళ్ళే వదినెతో ఒక చిన్న విన్నపాన్ని చేసుకొన్నాను. యెలాగైనా వసుచరణ సాన్నిధ్యాన్ని నాకు కలిగించ వలసిందని చెప్పుకొన్నాను" అన్నాను.

వసు ముఖంలోని సిగ్గు దొంతరలు మాయమయ్యాయి. కపోలాల మీది అరుణిమ అదృశ్యమైంది. ఒకమాటు మౌనంగా కనులెత్తి నా ముఖంలోకి చూసింది.

నందా వదినె నన్ను చేయి పుచ్చుకు పైకి లేపుతూ "మరదీ నా చెల్లెలు మూగది, ఏమీ మాట్లాడలేదు. ఆమె తరపున నేనే నీ ప్రార్థనకు అంగీకారాన్ని తెలియచేస్తున్నాను!" అంటూ వసునంద చేతిని నా చేతిలో వుంచి– "ఈ నాటినుండి మీరిద్దరూ భార్యాభర్తలైనారు!" అని ఒకమాటు గట్టిగా నిశ్వసించింది. ఆమె కండ్లనుండి ఆనందాశ్రువులు జలజలా రాలాయి. "ఈ నాటితో నా కర్తవ్యంకూడా తీరిపోయింది!" అన్నది.

# సంతానమే మా భవిష్యత్తు

అగ్రోదకాలో వరిపంట అంతగా కాదు. అయినా మేము ఖిలతిక్రా నుండి వరి చిత్తనాలను తెప్పించి, నార్లు పెంచి, పదెకరాల భూమిలో వరి నాటించాం. వరి బాగా పెరిగింది. ఆ రోజున నేను, వసు వరిచేను చూడడానికి వెళ్ళాము. మా ఎత్తున పెరిగిన వరి కంకుల్ని స్పర్శిస్తూ మహదానందాన్ని పొందుతున్నాం. ఇంతలో ఆకాశం గాఢ మేఘావృతమైంది. ఆకాశంలో చల్లనిగాలి వూపుకు మేఘాలు మెల్లగా కదుల్తున్నాయి. క్రింద, పచ్చని వరికంకులు కూడా చల్లనిగాలికి మెల్లగా కదుల్తున్నాయి. నేను మౌనంగా నడుస్తున్నాను. పచ్చగా తలలూపుతున్న కంకుల్ని రెండింటిని తుంచి చేతులలోనికి తీసుకొన్నాను. నా చేతిలో ఉన్న వరి కంకుల్ని చూసి వసు ఇలా అన్నది : "ప్రియతమా! ఈ సస్యం ఎంత బాగుంది. ఎంత పచ్చగావుంది! స్పృశిస్తే ఎంత ఆనందాన్నిస్తోంది; కాని, అలా తుంపారెందుకు?" నేను వసు కండ్లలోకి చూస్తున్నాను. ఆమె కండ్లల్లో అపారమయిన వేదన కనిపించింది !

"నిజమే, వసూ! ఈ సౌందర్యం చూడడానికి మాత్రమే ! ఈ మృదుత్వం స్పృశించడానికి మాత్రమే! తుంపరాదు!" అన్నాను.

ఇంతలో కండ్లు మిరుమిట్లు గొలిపేట్టు మెరుపు మెరసింది. మే మిద్దరమూ తూర్పుదిశకు చూశాం. వసు ఇలా అంది: "ప్రియతమా ! అటుచూశావా? ఆకాశంలోని మేఘాలు లోపల్లోపల రగులుకొంటున్న ధూమరాశి లాగున్నాయి!"

"అవును, లోపల నిప్పు రగులు కొంటున్నట్టుగానే వుంది. మధ్య మధ్యా నిప్పురవ్వల రూపంలో మెరుపులు ప్రకటిత మౌతున్నాయి!"

"సరేగాని, పిడుగంటే మనుషులు ఎందుకింత భయపడతారు?"

"పిడుగుయొక్క వికృతమైన శబ్దం చెవుల్ని చిల్లుల్ని పొడుస్తుంది. పైగా అది ఎక్కడపడితే, ఆ ప్రదేశాన్ని జీవరహితం చేసేస్తుంది. ధ్వంసం చేస్తుంది!"

"అలాగే, పిడుగులు పడడం కూడా చాలా అరుదుగా గాని జరగదు."

"అవును, వసూ! మానవుడు చేతనైతే వడ్లనుకాక బియ్యాన్నే పండిస్తాడు. కాని, అలా చేసినప్పుడు పంటలోని అధికభాగం పక్షులే తినేస్తాయి! ఇంటికి చాలా కొద్దిభాగం మాత్రం వస్తుంది!"

"జీవితంలోని ఒకభాగం ఔన్నత్యం, సౌఖ్యం — రెండవభాగం కష్టాలూ, అసఫలతలు! ఈ కష్టాలూ, అసఫలతలే లేకపోతే జీవితం పరమ సోమరిపోతుగా తయారౌతుంది."

"అలాటి స్థితిలో మానవులు, మానసికంగా – శారీరకంగా కూడా సోమరి పోతు లవుతారు. మానవుడు ఒట్టి మాంసపుముద్దగా తయారవుతాడు!"

"ఇక అలాటి స్థితిని జీవితమని యెలా అనగలం?" అన్నది వసు.

"అలాటి స్థితిని జీవితమని అనలేక, జీవితానికి మారుపేరు 'గతి' లేక పరి వర్తన. పరివర్తన ప్రతిక్షణమూ మనముందు క్రొత్త రూపాన్ని వుంచుతుంది. మన ముందున్న వరిని గురించే ఆలోచించు! మొదట గాఢ - ఆకుపచ్చని చిన్ని మొక్కలు, తరువాత ఆకుపచ్చ, పసుపుపచ్చ కలిసిన రూపం. తీరా పంటకు వచ్చాక యిప్పుడో? పసుపుపచ్చ, తెలుపు కలిసిన రంగు."

"అవును. ఇప్పుడు పసుపు-తెలుపు కలిసిన రంగు!"

"ఇక కొన్నాళ్ళుపోతే, ఈ సన్నని కంకులు లావవుతాయి; నడుములు తలలు వంచుతాయి."

"తలలు యెందుకు వంచుతాయి?"

"జీవితంలో అభివృద్ధి తన చరమస్థాయిని చేరాక, ఇక పతనమే శరణ్యం. సహజమైన జీవితధర్మం మరొకటి వుంది. తన తరువాత తన స్థానాన్నలంకరించ డానికి మరొక జీవిని ఉత్పన్నం చేయడం."

వసు నా కండ్లల్లోకి తన్మయంగా చూస్తూ, నా మెడచుట్టు చేతులను వేసి కౌగలించుకొంది. నేను వసు నడుము చుట్టూ చేతుల్నివేసి, ఆమె ముఖాన్ని ముద్దు పెట్టుకొన్నాను.

"మన స్థానం కొరకు క్రొత్త జీవితాన్ని ఉత్పన్నం చేయడం–ఎంతబాగుం టుంది?" అంటూవుండగా వసు నేత్రాలు మనోహరంగా మెరిశాయి.

"ఇకనిప్పుడు నల్లని మేఘాలతో ఆకాశం ఆవరించింది. ఇంకా ప్రొద్దు ఉన్నప్పటికీ ముందుగానే చీకటి పడ్డట్లయింది. మధ్య మధ్య పిడుగులు పడుతు న్నాయి. నేను వసు చేయిపుచ్చుకు ముందుకు నడుస్తూ "వసూ! వర్షం వచ్చేస్తోంది మనం యింటికి వెళ్ళలేము; సునందా–సాగరం ఒడ్డున కొంచెం ఆగి వెళ్దా పద" అన్నాను.

మేము సునందా–సాగరం వైపుకు బయల్దేరాము. మేఘాలు తడవ తడవకూ గర్జిస్తున్నాయి. పెద్ద పెద్ద చినుకులు పడసాగాయి. మేఘ గర్జనకు ప్రతిగానే నెమళ్ళు క్రేంకారాల్ని సల్పుతున్నాయి. వసునంద ముఖం వికసించింది! ఇలా అన్నది "ప్రకృతి సౌందర్యం మానవుణ్ణి బాగా ప్రభావితుణ్ణి చేస్తుంది."

"మన సౌందర్యం–అసలు మన జీవితంలోని అధికభాగం, ప్రకృతి యొక్క ఈ బాహ్యరూపం లేక సౌందర్యం మీదనే ఆధారపడివుంది. ఈరోజున ఆకాశం

మేఘావృతమైయుంది. ఒకవైపున సునందా-సాగరం యొక్క శ్వేత జలరాశి, మరోప్రక్క ఈ ఆకుపచ్చని సస్యం! నెమలి కూతలు....చల్లని, శరీరాన్ని గిలిగింతలు పెట్టే వర్షపుగాలి! యివన్నీ కలిసి మన మనస్సులమీద, శరీరాలమీద ప్రత్యేకమైన ప్రభావాల్ని కలిగిస్తున్నాయి!"

ఇంతలో నెమలికూత ఒకటి మాకు దగ్గిరలోనే వినిపించింది. ప్రక్కనే వున్న పూపొదరింట్లోకి తొంగిచూశాము. అక్కడ ఒక మొగనెమలి తనకు ఎదురుగా వున్న ఆడ నెమల్ని ఆకర్షించడానికి పించం విప్పుకొని నాట్యం చేస్తోంది.

"ప్రియా! దాని పించమూ, మందగమనమూ ఎంత బాగున్నాయో" అంది వసు.

"అవి రెండూ-ఆడా, మొగ-వుండడంవలన ఆ పించం విప్పుకొన్నది. తోడు లేకుండా వంటరిగానే వున్నట్లయితే అసలా పించం విప్పుకోనే విప్పుకోదు" అంటూ వసును గుండెలకు అదుముకున్నాను.

"ఎంత మనోహరం."

"ఇది కూడా ఈ జీవితంలో సుఖాన్ననుభవించడానికి, నూతన జీవితాన్ని నిర్మించడానికి చేసే ప్రయత్నమేను. మొగనెమలి అలా నృత్యం చేయడం తన ప్రణయాన్ని ఆడనెమలికి తెలియచేయడానికి. ఇక ఈ క్రేంకారానికి అర్థం, భయకంపితయైన తన ప్రేయసికి ఊరట కల్పించడం."

"ఐతే, ఈ నెమళ్ళకుక్కూడా, మానవులకులాగా హృదయాలున్నాయా."

"ఎందుకులేవు. వివిధ జాతుల జీవితాల్లోనూ ఎంత వైవిధ్యం ఉన్నప్పటికీ, సుఖానుభూతి, సృష్టి ప్రయత్నం—అన్ని జీవరాసుల్లోనూ ఒకటే. తన ప్రేయసిని ఎదురుగా పెట్టుకొని అలా నాట్యం చేయడంలో మొగనెమలికి ఎంత ఆనందం కలుగుతోందో. ఆ ఆనందం యీ క్షణంతోనే అంతమయిపోకుండా వుండడానికే కొత్తరూపాల సృష్టి జరుగుతుంది."

"మానవ జీవితంలో ఎటుచూసినా ఆశా, ప్రయత్నమే గోచరిస్తున్నాయి."

"ఆశా, ప్రయత్నం జీవితానికి ముఖ్యలక్షణం. జీవితం అనంతరం మృత్యువే. అంటే శూన్యం."

"మరి పునర్జన్మ?"

"అవును, పునర్జన్మ చాలా బాగుంటుంది. పునర్జన్మ అంటే నాకు చాలా ఇష్టం. కాని ప్రేయసీ, నీకు ఏ పునర్జన్మ అంటే ఇష్టం? కంటికి కనపడే పునర్జన్మా, కంటికి కనపడని, సందేహాత్మకమైన పునర్జన్మా?"

వసు నా కండ్లలోకి చూస్తూ చిరునవ్వు నవ్వింది! నేను వసును కంఠాలింగనం చేసుకొంటూ "ఎందుకు నవ్వావు" అన్నాను.

"మనమూ పునర్జన్మను పొందబోతున్నాము."

నేను వసుని గట్టిగా కౌగలించుకొని పెదాలను ముద్దుపెట్టుకొన్నాను.

వర్షం అంతకంతకు ఎక్కువ కాసాగింది. బాగా ప్రొద్దు క్రుంకింది. అప్పుడే వర్షం తగ్గే సూచనలు ఏమీ కనుపించడంలేదు. ఇద్దరమూ వర్షంలో తడుస్తూనే ఇంటికి పోయాము.

* * * * *

నేను ఒక్కోమారు నెలల పర్యంతం ఆగ్రోదకాలో వుండడం జరిగేదికాదు. పనులమీద బయటి వూళ్ళల్లో తిరుగుతూండే వాణ్ణి. విక్రమాదిత్యుని ప్రతి చిన్న కార్యక్రమాన్ని మేము చాలా జాగ్రత్తగా పరిశీలిస్తున్నాము. అతడు తన కోశాగారాన్ని బాగా నింపుతున్నాడు. కానీ, ప్రజాసుఖాన్ని కూడా చూస్తూనే వున్నాడు. దారి దోపిళ్ళను అరికట్టాడు. దొంగలభయం లేకుండా చేశాడు. బాటసార్లు సార్థవాహులు వుండడానికి వీలుగా మార్గమధ్యల్లో పాంధశాలల్ని నిర్మించాడు. బావులు, చెరువులు తవ్వించాడు. దార్లకు ఇరుప్రక్కలా చల్లదనాన్నిచ్చే చెట్లను కూడా నాటించాడు.

దీనార్లలోకూడా ప్రత్యేకతను కనబరచాడు. అతడి దీనార్లు అచ్చం బంగారానివై యుండేవి. రకరకాలుగా కూడా వుండేవి. కొన్ని దీనార్లమీద అతడి బొమ్మ ధనుస్సు పుచ్చుకొని వుంది. బొమ్మపైన ఇలా వ్రాసివుంది. "శ్రీ విక్రమ" మరొక దీనారులో విక్రమాదిత్యుడు సింహముపై బాణాల్ని విడుస్తున్న చిత్రముంది. అదే దీనారుకు రెండవవైపున లక్ష్మి చిత్రముంది. విక్రమాదిత్యుడు ఒకరకంగా ఈ దీనార్లను తన ప్రచారానికి వాడుకొన్నాడు. దీనార్లమీద చిన్నచిన్న ప్రభావోత్పాదకమైన వాక్యాలను కూడా ముద్రిస్తూ వుంటాడు. "నరేంద్రచంద్ర ప్రథితాదివ జయత్యజేయో భువిసింహ విక్రమః" అనీ "సింహ విక్రమః" అని "సింహ చంద్రః" అని "దేవీ శ్రీ మహారాజాధిరాజ శ్రీ చంద్రగుప్తః" అనీ రకరకాలుగా దీనార్ల మీద వాక్యాలు ముద్రింపబడి వుండేవి. అతడి ఈ దీనార్ల ప్రభావం ప్రజల హృదయాల్లో ఎంత గాఢంగా హత్తుకుపోయిందో తెలుసుకోవడానికి చిన్న విషయం చెప్పితే సరిపోతుంది. విక్రమాదిత్యుడు ముందు వెళ్తా వుంటే వెనుకనుండి వామనుడొకడు ఛత్రం పడుతున్న చిత్రంకల దీనార్లుకూడా వున్నాయి. కురు రాజ్యంలోని ఒక పల్లెలో వృద్ధుడొకడు ఆ దీనారును చూసి ఇలా అన్నాడు: "విక్రమాదిత్యుణ్ణిక ఎవరూ ఓడించలేరు. మానవుల దొకలెక్క; దేవతలూ, దానవులు, రాక్షసులు బేతాళులు కూడా అతడి ఆజ్ఞను శిరసావహిస్తారు" అన్నాడు. పాపమా వృద్ధుడి దృష్టిలో ఆ దీనారులోని వామనుడు మరెవడో కాదు. బేతాళుడే!

దక్షిణమునవున్న మహాక్షత్రపుడి వలనగానీ పశ్చిమమునవున్న దేవపుత్రుడి వలనగానీ మాకెలాటి భయంలేదు. మేము తమ రాజ్యసీమలను ఉల్లంఘించమని వారికి తెలుసు. మా గణ సీమను అతిక్రమిస్తే ప్రథమ యుద్ధంలో చంద్రగుప్తుడికి పట్టినగతే తమకూ పట్టుతుందనికూడా వారికి తెలుసు. చంద్రగుప్తుడి భారీ

అయిన ఏర్పాట్లను చూస్తుంటే మాత్రం మా హృదయాలు చింతాక్రాంతమవ సాగాయి. మేమూ తగిన ప్రయత్నాల్లో వున్నాము. క్షణం వృధాపోవడానికి కూడా యౌధేయులు సమ్మతించే సమయం కాదది. నేను ఎప్పుడూ తిరుగుతూ నిరీక్షణ చేస్తూ వుండేవాణ్ణి; ఆరోజు నేను ఖాండిలాలో వున్నాను. సాయంత్రం వరకు కర్రసాము, కత్తిసాము, విలువిద్య—మొదలుగాగల ఆయుధ విన్యాసాలను యువకులు ప్రదర్శించారు. సాయంత్రమయ్యాక మిత్రులమందరమూ కూర్చుని ఇష్టాగోష్టి మాట్లాడుకొంటున్నాము. ఇంతలో మాధవుడు అక్కడికి వచ్చాడు. అశ్వారోహకుడి వేషంలో వున్నాడు. మే మందరమూ అతడివైపు చూస్తున్నాము. అతడు వస్తూనే "సోదరా, జయా! నీకో శుభవార్త చెప్పడానికి వచ్చాను. ఇది నీకే కాదు, మా అందరికి కూడా శుభవార్తే" అన్నాడు.

నేను ప్రసన్న వదనుడనై "ఏమిటా, శుభవార్త? క్షత్రపుడికి, విక్రమాదిత్యుడికి యుద్ధం పడ్డదా? అలా జరిగివుంటే నిజంగా అది గొప్ప శుభవార్తే!" అన్నాను.

"నీవెప్పుడూ భవిష్యత్తు నాలోచిస్తుంటావు జయా?"

"ఇప్పుడు ప్రతి యౌధేయుడు కూడా, భవిష్యత్తును చాలా దీర్ఘంగా ఆలోచించవలసిన స్థితిలో పడ్డాడు. ఇంత క్లిష్ట పరిస్థితి యౌధేయుల్ని గతంలో ఎన్నడూ ఎదుర్కొని వుండదను కొంటాను! చంద్రగుప్తుడు మనని సంపూర్ణంగా నాశనం చేయాలని సంకల్పించు కొన్నాడు."

"మనం ఒకమాటు చంద్రగుప్తుడికి చక్కగా శాస్తి చేశాము! మళ్ళీవస్తే మళ్ళీ చేద్దాం! కానీ నేను చెప్పేది మరొక రకమైన శుభవార్త! వసు వదినె ఒక యౌధేయుణ్ణి కన్నది!" అంటూ మాధవుడు ఆనందాతిరేకంలో నన్ను కౌగిలించు కున్నాడు. మిగిలిన యౌధేయులు కూడా నన్ను ఆలింగనం ద్వారా తమ ఆనందాన్ని తెలియపరుస్తున్నారు. నా ఆనందానికి మితిలేదు.

మాధవు డిలా అన్నాడు: "ఒక నూతన సభ్యుడు తమలోకి వచ్చాడంటే యౌధేయులకు ఎంత ఆనందమో?"

"మనం మరొక విషయానికి కూడా గర్వించవచ్చు! యౌధేయ స్త్రీలు ఇప్పుడు వీరమాతలే కారు. వీరవనితలు కూడాను."

ఖండిలాయొక్క పురస్కర్త నా చేయి పుచ్చుకుని "జయా! నాకో కోర్కె వుంది. నా మనుమడికి 'విజయు'డని పేరు పెట్టడం నా అభీష్టం" అన్నారు.

అందరూ ఒక్కసారిగా అన్నారు — "ఔను. మాకా పేరే కావాలి. "విజయు"డనే పెట్టాలి!"

మాధవు డిలా అన్నాడు! "జయుడు యౌధేయులకు చిరస్మరణీయమైన మేలు చేశాడు. అతడికొడుకు "విజయుడు" నిజంగానే విజయ సాధకుడౌతాడు."

నే నిలా అన్నాను; "బాబాయిగారి ఆజ్ఞను ఎవరు తిరస్కరించగలరు!"

ఆ రోజు రాత్రి నాకు ఎంతసేపటికీ నిద్ర పట్టిందికాదు. వర్తమానాన్ని గురించి, భవిష్యత్తుని గురించి చాలాసేపు ఆలోచిస్తూ పడుకొన్నాను. నేను వృద్ధుణ్ణి అయ్యేసరికి నా స్థానాన్ని స్వీకరించడానికి మరొక జీవి తయారౌతున్నందుకు మహదానందాన్ని పొందాను. ఎప్పుడు తెల్లవారుతుందా? ఎప్పుడు అగ్రోదకా వెళ్ళామా? అని తహతహలాడాను.

అగ్రోదకాకు, ఖాండిలాకు మధ్య దూరం పదహారు ఆమడలవరకూ వుంటుంది. మేము దారిలో కేవలం ఒకే మజిలీని చేసుకొన్నాం. రెండవ మజిలీకి అగ్రోదకాకు వచ్చాం. వస్తూవుండగానే నందా వదినె ధూళికొట్టుకొన్న నా నుదిటిని ముద్దుపెట్టుకొని, "మరదీ! నేను చాలా ఆనంద పడుతున్నాను. మన యింట్లోకి మరొక నూతన సభ్యుడొచ్చాడు! అచ్చం నీలాగే వుంటాడు!"

నేను వదినె భుజంమీద చేయివేస్తూ "మరొక యౌధేయుడు పుట్టడం బాగానే వుంది. కాని, నాలుగు రోజుల పిల్లవాడిలోనే పోలికల్ని ఎలా కనిపెట్టావు వదినె?" అన్నాను.

"పోలికల్ని కనిపెట్టే విద్య మా స్త్రీలకే వచ్చు! సరే, పదండి అలసిపోయారు. కాళ్ళూ చేతులూ కడుక్కొని మొదట ఏమైనా ఆహారాన్ని తీసుకోండి! తరువాత కొడుకును చూసుకొనవచ్చును!" అన్నది వదిన.

మాధవు డిలా అన్నాడు: "మరి ఈ నూతన యౌధేయుడికి ఖాండిలా ప్రజలు పేరుకూడా పెట్టేశారు!"

"ఖాండిలా ప్రజలు పేరు పెట్టేశారా? నే నా పెట్టవలసింది వాళ్ళా?" అన్నది వదినె.

"మన ఖాండిలా పురస్కర్త, ఇతర మిత్రులు "విజయుడ"ని పెట్టారు. నీకు నచ్చితే వుంచు?" అన్నాను నేను.

వదినె నా రెండు చేతులనూ పుచ్చుకొని "నేను అనుకొన్న పేరే వాళ్ళూ పెట్టారు!" అన్నది.

మమ్మల్ని లోపలకు తీసుకుపోయి వదిన భోజనం పెట్టింది. భోజనానంతరం కాపిశేయసుర నిచ్చింది. ఇంట్లో పుత్రోత్సవాన్ని ఘనంగా జరుపుకొంటున్నారు. పాటలూ, నృత్యాలూ జరుగుతున్నాయి. నేను వదినెతో ఇలా అన్నాను: "యౌధేయ పురుషులు అనవసరంగా కీర్తిని కొట్టేస్తున్నారు. యౌధేయ పురుషుల్ని ఇలా యోధులుగా చేసింది యౌధేయ స్త్రీలు! కీర్తికి నిజమైన వారసులు స్త్రీలేను!"

"కానీ, మరదీ! ఈ యౌధేయ భూమికోసం నీవు చేసిన త్యాగాన్నీ, శ్రమనీ మే మెన్నటికీ మరువలేం! మమ్మ (స్త్రీలను) ఈ వున్నతమైన స్థితికి తీసుకు వచ్చింది నీవేను!"

"అదేమిటి వదినే, అలా అంటావు? నేను మిమ్ములను ఉన్నతమైన స్థానానికి తీసుకురావడం ఏమిటి? యౌధేయ స్త్రీలు ఉగ్గుపాలతో వీర రసాన్ని పోసి యౌధేయ పురుషుల్ని నిజమైన యోధుల్ని చేశారు!" అన్నాను నేను.

"నీవు చెప్పింది నిజమే కాని, మేము ఇన్నినాళ్ళు యౌధేయ పురుషులకు తల్లిగా, సోదరిగా, భార్యగా మాత్రం వున్నాం. కాని, మా వ్యక్తిత్వాన్ని నిలబెట్టి మాకో స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించింది నిజంగా నీవు! నీవు మమ్ముల్ని యౌధేయ స్త్రీలను చేశావు మరదీ!"

నేను మరుసటిరోజు ఉదయాన్నే కొడుకుని చూడ్డానికి సిద్ధమైనాను. నా ఉత్సాహాన్ని చూసి వదినె రోహతకుడితో ఇలా అన్నది; "ఏయ్ రోహతకా! నీవూ వున్నావెందుకు? మరదిని చూడు. కొడుకుని చూడడానికి ఎలా తయారయ్యాడో?"

"నేను మాత్రం ఏం తక్కువ చేశాను?" అన్నాడు రోహతకుడు.

"ఏం తక్కువ చేశావా? నీవూ—మొదటి సంతానాన్ని చూడడానికి ఇంత ఉత్సాహంగా వచ్చావా?" అంది వదినె.

నేను చాలా సిగ్గుపడి పోయాను. వదినె చప్పున దగ్గరకువచ్చి నాభుజానికి తన కపోలాల్ని రాస్తూ "సిగ్గుపడవలసిన పనేమీ లేదు, మరదీ!" అన్నది. తరువాత నన్ను ప్రసూతి గృహంలోకి తీసుకుపోయింది.

పిల్లవాడికంటె ముందు వసును చూశాను. మనిషి నీరుతీసి సన్నబడ్డది. వెనుకటి రక్తారుణిమను దాల్చిన కపోలాలు, రక్తం విరిగి తెల్లబడ్డాయి. కండ్లూ ముఖమ్మూ, మొత్తం శరీరమే ఒక రకమైన శిథిలతనూ, బలహీనతనూ కనబరుస్తోంది! అయినా వసులోని మాతృత్వపు త్యాగమిశ్రితశోభ నన్ను ముగ్ధుణ్ణి చేసింది. తరువాత చిన్ని చేతులూ, కాళ్ళు కదలిస్తూ తల్లివడిలో పడుకొనివున్న శిశువును చూశాను.

"చూశావా, మరిదీ! ఎంత అందంగా వున్నాడో? అచ్చం నీలా వున్నాడు కదూ?" అంది వదినె.

"అందంగానే వున్నాడు కానీ, వదినే వీడు నీలా వున్నాడు!"

"నాలాగానా? అంటే వసులాగా అని అర్థం! ఔనా? కండ్లూ తలవెంట్రుకలూ వసులాగా వుంటాయి. లలాటము, చుబుకము (గెడ్డం) నీలా వుంటుంది. చూశావా పోలికల్ని కనిపెట్టే విద్య స్త్రీలకే వచ్చని చెప్పాను కానా? మేము ఇరవై సంవత్సరాల తరువాత ఉద్భవించే పోలికల్ని స్పష్టంగా వూహించగలం!"

"ఇరవై సంవత్సరాల తరువాత విషయాన్ని ఇవ్వాళ చెబుతున్నావు; ఇదీ ఒకరకమైన జ్యోతిషమే!"

వదినె పిల్లవాణ్ణి తన చేతుర్లోకి తీసుకొన్నది. నా చేతికి ఇచ్చింది. నిజంగానే వాడి నేత్రాలూ, కేశజాలు తల్లిపోలికల్ని స్ఫురింపచేస్తున్నాయి. మిగిలిన శరీరమంతా నా పోలికలతో వికసించవచ్చు ననిపించింది.

వదినె పిల్లవాడిని నా చేతిలోనుండి తీసుకొని వసుచేతికి ఇచ్చింది. వసు క్రీగంట నన్ను చూస్తూ, చిరునవ్వు నవ్వుతూ పిల్లవాణ్ణి అందుకొన్నది. వదినే, నేనూ ప్రసూతి గృహంనుండి బయటికి వచ్చాం.

వదినె ఇలా అన్నది. "ఎంత విచిత్రం! కొన్ని తల్లి లక్షణాలు, కొన్ని తండ్రి లక్షణాలు! సజీవ నూతన శరీర ప్రాదుర్భావం........మహాద్భుతం!"

# కాళిదాసు - యౌధేయులు

కాలం దొర్లిపోతోంది. యౌధేయుల జన, ధన, ధాన్య, వస్తుసంపదలుకూడా అనునిత్యం పెరుగుతున్నాయి. ప్రతి గ్రామంలోనూ జలాశయాలు, బావులూ బహుళంగా తయారయ్యాయి. యౌధేయ భూమిలోనుండి కరువుకాటకాలను శాశ్వతంగా తరిమేశాం. ఇప్పుడు యౌధేయులు పెసర, మినుమూ, కంది, సెనగలాంటి కాయ ధాన్యాలనే కాకుండా సుందరమైన శాలి (వరి) ధాన్యాన్నికూడా పండిస్తున్నారు. తియ్యని రసపూర్ణమైన పుండ్రయిక్షు (బెల్లపుచెరకు)ను కూడా పండిస్తున్నారు. దానిమ్మ, ద్రాక్షలాంటి అన్యదేశీయ ఫలాల్నికూడా యౌధేయభూమిలో పండించసాగారు. గడిచిన ఈ ఇరవై సంవత్సరాలలో యౌధేయులు కేవలము సైనికదృష్ట్యానే అభివృద్ధి పొందలేదు. ఇతర అనేక విషయాల్లో అభివృద్ధిని పొందారు. యౌధేయుల పొలాలనూ, తోటలనూ చూస్తుంటే కనులపండువుగా వుంటోంది. పశుసంపదలో కూడా పూర్తి పరివర్తన జరిగింది. యౌధేయుల పశుసంపద దేశ దేశాంతరాల్లోనూ ప్రసిద్ధి పొందింది.

మనుష్య సంపదకూడా బాగా అభివృద్ధయింది! వదినె అన్నట్లు నేను ఇరవై మందికి తండ్రిని కాలేకపోయాను. కాని ముగ్గురు పుత్రుల్ని కన్నాం. విజయుడు, రిపుంజయుడు, సంజయుడు. విజయుడి కిప్పుడు పదిహేడవ ఏడు. రిపుంజయుడికి పన్నెండు, సంజయుడికి ఎనిమిది సంవత్సరాల వయసు. విజయుడు బలిష్ఠుడైన యువకుడయ్యాడు. వసు అన్ని విషయాల్లోనూ నాకు సహభాగిని అయింది. నంద ఇంకా అలాగే మమ్మల్ని నవ్విస్తోంది. మేము సాహిత్యం, శిల్పం—మొదలైన కళల్నీ, విద్యల్నీకూడా పూర్తిగా అభివృద్ధి పరిచాం. యౌధేయులు అన్నివిధాలా సంతృప్తితో జీవితాల్ని గడుపుతున్నారు.

మహాసేనాపతి బాప్ప స్వర్గస్తుడయ్యాక, నేను యౌధేయ గణానికి మహాసేనాపతిని, పురస్కర్తను అయ్యాను.

నా జన్మభూమియొక్క సంపదను, సమృద్ధినీ చూసినప్పుడు మహదానందాన్ని పొందేవాడిని. కాని యమునకు అవలివైపున ఘటిస్తున్న కొన్ని సంఘటనల్ని చూస్తూవుంటే మనస్సు వికలమైపోతోంది. చంద్రగుప్తుడి రాజ్యం తూర్పు సముద్రం నుండి పశ్చిమ సముద్రం వరకూ వ్యాప్తిచెందింది. పశ్చిమ తీరంలోని వాకాటకుల్ని మహానైపుణ్యంతో లొంగదీసుకొన్నాడు. నర్మదానది నుండి పశ్చిమ

సముద్రం వరకు వ్యాపించివున్న వాకాటకుల మహా సామ్రాజ్యాన్ని హస్తగతం చేసు కోడానికి చంద్రగుప్తుడు ఒక్క బాణాన్నికూడా వ్యయపరచుకోలేదు. ఒక్క భటుణ్ణి కూడా కోల్పోలేదు. చంద్రగుప్తుని రెండవరాణీ "కుబేరనాగ"కు ప్రభావతి అనే కన్య జన్మించింది. ప్రభావతి అపర సరస్వతీ అవతారమని చెప్పుకొంటారు. ఏది యెలా వున్నా ఆమె చాలా తెలివికలది. వాకాటకరాజు పృధ్వీషేణుడికి తన కుమార్తె నిచ్చి వివాహం చేశాడు చంద్రగుప్తుడు. అచిరకాలంలోనే రుద్రసేనుడు చంద్ర గుప్తుడికి సామంతుడయ్యాడు. సమస్త వాకాటక రాజ్యానికి చంద్రగుప్తుడు ప్రభు వయ్యాడు.

మాళవ రాజ్యంకూడా చంద్రగుప్తుని హస్తగతమైంది.

మహాక్షత్రపుడి పని బాగా ఇరకాటంలో పడ్డది. అతడికి మూడువైపులా చంద్రగుప్తుడి సైన్యాలో, లేక అతడి సామంతుల సైన్యాలో ముట్టడించి వున్నాయి. మహాక్షత్రపుడి రాజ్యంలోనే పశ్చిమ ప్రాంతపు రేవుపట్టణాలున్నాయి. వాటిని స్వాధీనం చేసుకోవాలన్నది చంద్రగుప్తుడి ప్రధానమైన ఆశయం. కాని చంద్ర గుప్తుడు మొదట యౌధేయ భూమిమీద పడతాడా లేక క్షత్రపుల రాజ్యంమీద పడ తాడా అనేది సంశయంగానే వుంది.

చంద్రగుప్తుడి సైన్యమూ, ధనాగారంకూడా సముద్రగుప్తుడినాటికంటె బాగా అభివృద్ధి పొందాయి. పైగా తండ్రికంటే కూడా పదాకులు ఎక్కువ చదివాడు. సముద్రగుప్తుడికంటె ఇతడు చాలా వివేకి, కూట నీతిజ్ఞుడు. కఠినుడు కూడాను. గత్యంతరంలేని పరిస్థితిలోగాని తన సైనిక బలాన్ని కదల్చడు చంద్రగుప్తుడు. తనను గురించి గొప్పగా ప్రచారం చేసుకోగలడు. భేతాళుడి కథల్లాటి వందల కథల్ని సృష్టించడానికి అతడు స్వయంగా ప్రోత్సాహాన్నిచ్చేవాడు. ఇలాటి కథలవల్లె చంద్రగుప్తుడు అజేయుడన్న భావన ప్రజల్లో వ్యాపిస్తుంది. అతడు తనను గురించి మహా వైష్ణవుడని ఎటూ వ్రాసుకొంటూనే వున్నాడు. కాగా తాను భూ-వారాహు దన్న ప్రచారం కూడా చేసుకొన్నాడు. భూమాతను రాక్షసుల బారినుండి ఎలాగైతే భగవాన్ విష్ణువు రక్షించాడో, అలాగే మ్లేచ్ఛులబారినుండి భారతదేశాన్ని తను రక్షించాడని అర్థం. నేను చంద్రగుప్తుడు కట్టించిన ఒక వరాహ మందిరాన్ని కూడా చూశాను. విగ్రహం తలమాత్రం వరాహపుతల, మిగిలిన శరీరమంతా ఒక బలిష్ఠ మైన పురుష శరీరంలాగుంది. వరాహపు దంష్ట్రిలగ్న పృధ్వీమాతను చూసినప్పుడు నాకు అపరిమితమైన ఆశ్చర్యం కలిగింది. దంష్ట్రిలగ్న పృధ్వీమాత రూపంలో ధృవదేవి ఆకారం మలచబడ్డది. విగ్రహం అతి సుందరంగా,కళాత్మకంగా వుందని చెప్పక తప్పదు. కాని తన రాణీ రూపాన్ని వరాహదంష్ట్రి దంశనిగా ఎందుకు చెక్కించాడు. కుషాణుడి నుండి ధృవదేవిని, గుప్తరాజ్యలక్ష్మిని కూడా రక్షించిన మాట నిజమే కాని అంతమాత్రానికి ఇంతదూరం వూహించడమనేది చంద్రగుప్తుడి వల్లనే కాగలదు.

ప్రథమ విజయం జరిగి పందొమ్మిది సంవత్సరాలు గడిచాయి. ఈ దీర్ఘ కాలంలో మేము సైనిక బలాన్ని బాగా సమకూర్చుకొన్నాం. నేడు యౌధేయ స్త్రీ, పురుష, వృద్ధ, బాలులందరూ ఒకే ఒక విషయాన్ని గురించి ఆలోచిస్తున్నారు.చంద్ర గుప్తుడికి ఎలా తుదిసారిగా బుద్ధిచెప్పాలనేదే యౌధేయుల యూహ!

* * * * *

వర్షా లాగిపోయాయి. భూమి ఎండింది. కాయధాన్యపు పంటలు చేలల్లో తల లూపుతున్నాయి. నేనూ, రోహతకుడు, వసునందా పంటలను నిరీక్షణ చేస్తున్నాం. ఇంతలో ఎవరో బాటసారి అటునుంచి వచ్చాడు. అతడు గుర్రంమీద వున్నాడు. పరిచారకు డొకడు క్రిందనడిచి వస్తున్నాడు.

బాటసారి మాకు బాగా దగ్గరకువచ్చి ఇలా అన్నాడు: "ఆర్యా మహాసేనాపతి, జయయౌధేయుని నివాస మెక్కడో, కష్టమనుకోకుండా చూపుతారా?"

నేనా అగంతకుడి ముఖంవైపు చూశాను. అతడి వయసు ముప్పై, ముప్పై ఐదు మధ్యలో వుంటుంది. ముఖంలో నమ్రత గోచరిస్తోంది. కండ్లలోని ఆకర్షణ మరువరానిది. అతని శరీరంమీద శ్వేత కంచుకము శ్వేత ఉష్ణీషము, శ్వేత అంత ర్యాసకమూ ఉన్నాయి. భుజాన ఉత్తరీయం మాత్రముంది. మరే ఇతర ఆభూష ణాలూ లేవు! నేను నమ్రస్వరంతో అడిగాను "ఆర్యా! ఎక్కడి నుండి వస్తున్నారో?"

నేను ఇప్పుడు మధుర నుండి వస్తున్నాను. కాని, నేను అవంతీపురంవాసిని! బ్రాహ్మణుణ్ణి! మహాసేనాపతి విద్వాంసులనీ కళామర్మజ్ఞులనీ విన్నాను. నేనూ ఒక తుచ్ఛ కళాకారుణ్ణి. కనుకనే జయయౌధేయుని కలుసుకొందామని వచ్చాను!"

"నేను రెండుచేతులను జోడించి "ఆర్యా వందే! నేనూ కళాభిరుచికల ఒక తుచ్ఛయౌధేయుణ్ణి కాని ఎవరో మీకు మా సేనాపతిని గూర్చి మిధ్యా ప్రశంసా వాక్యాల్ని చెప్పివుంటారు. మహాసేనాపతి ఒక గొప్పయోధుడు. ఆ విషయం అందరికీ తెలిసినదే! కాని, కళలతో వారి కేలాటి పరిచయమూ లేధు" అన్నాను.

ఆగంతకుడు కొంచెం నవ్వుముఖంతో "ఆర్యా! తమరు పొరబడి వుండ వచ్చును. నేను చాలా విశ్వాసులైన పురుషులనుండి మహాసేనాపతి కళామర్మజ్ఞులని విన్నాను. ఇందులో నాకు ఎలాటి సందేహమూలేదు. కనుక దయవుంచి నన్ను వారి నివాసానికి తీసుకుపొండి!" అన్నాడు.

నేను ఆగంతకుడితో ఇలా మాట్లాడుతున్న సమయంలో, వసునందా, రోహత కులు నవ్వును ఆపుకోలేక బాధపడుతున్నారు. "ఆర్యా! మీ విశ్వాసాన్ని గురించి నేనిక ఏమీ చెప్పను! జయయౌధేయుడు మాకు మహా సేనాపతి అయినప్పటికీ, వారికి స్వంత యిల్లులేదు!" అన్నాను నేను.

ఆగంతకుడు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ, "మరి సేనాపతి ఎక్కడ వుంటారు? అగ్రోదకారోనే వుంటారని విన్నానే?" అన్నాడు.

"అగ్రోదకా వారి జన్మభూమి, ఇక్కడ వారి బంధుమిత్రులున్నారు. వారెప్పుడూ తిరుగుతూనే వుంటారు. ఎప్పుడైనా అగ్రోదకాకు వస్తే బంధువుల ఇండ్లలో వుంటూవుంటారు!"

కొంత నిరాశ కలిసిన స్వరంలో "ఇంతకూ ఈ రోజు మహాసేనాపతి అగ్రోదకాలో వున్నారా?" అనడిగాడు ఆగంతకుడు.

"మీరు మహాసేనాపతి వూళ్ళోలేని సమయంలో వచ్చినందుకు చాలా విచారిస్తున్నాను. పైగా వారు ఎప్పుడు వస్తారో కూడా తెలియదు!"

"వారు ఎక్కడ వున్నా నేను వెళ్ళి కలుసుకొంటాను."

"మీరు చాలా బాధపడవలసివస్తుంది. నేనూ ఒక మాటు వారిని కల్సుకోవడానికి ఇరవై రోజులపాటు వారి వెనుక తిరిగాను. ఇక్కడ ఉన్నారనివస్తే మరొక చోటికి వెళ్ళేవారు! అక్కడికి వెళ్తే ఇంకోచోటికి వెళ్ళేవారు!" అన్నాను.

"ఏమైనా కానీ, నేను కలుసుకోవలసిందే!"

"సరే, మీరు వారిని కలుసుకొని తీరాలనుకొన్నా, ఇక నీరోజుకు ప్రయాణించలేరు. ఆర్యా, ఈరోజు నా ఆతిధ్యాన్ని స్వీకరించండి!" అని ప్రార్థించాను.

ఆగంతకుడు ప్రహసితవదనుడై మా ఆతిధ్యాన్ని స్వీకరించాడు. నిజంగా నేను నా పైతృక సంపత్తిని (ఇంటిని) కూలీలకు ఇచ్చాను. నేను రోహతకుడి ఇంట్లో వుంటున్నాను. మేము ఆగంతకుణ్ణి అతిశుభ్రమైన, సుందరమైన కక్ష్యంలోకి తీసుకుపోయాం. కాళ్ళు కడిగాం. మధు మిశ్రిత శీతలోదకాన్ని త్రాగడానికి ఇచ్చాం. ఆగంతకుణ్ణి గురించి అతడొక కళాకారుడనీ, అవంతీపురవాసియైన బ్రాహ్మణ కుమారుడనీ మాత్రమే నాకు తెలుసును. కాని, భోజనానికి ముందు తనే స్వయంగా "ఒక చిన్న కవి"నని చెప్పాడు. తన దొక శృంగార మూలకమైన పద్యాన్నిగూడా వినిపించాడు.

నేనిలా అడిగాను: "ఆర్యా, మీరు మదిరను సేవిస్తారుకదా?"

"ఎందుకు సేవించను; నేను కవిని. పైగా కాళీ భక్తుణ్ణి. ఇక మదిరను సేవించకుండా వుంటానా?"

ఇక నా సందేహం తీరిపోయింది. నేను మహాకవి కాళిదాసుతో మాట్లాడుతున్నానని తెలుసుకొన్నట్లు వారికి తెలియనీయలేదు.

మా అందరికీ మహదానందం కలిగింది. మేము మహాకవి పేరు విని వున్నాం. వారి "మేఘదూత" కావ్యం మా యౌధేయ తరుణులకు అత్యంత ప్రియ కావ్యం. నేనూ ఆ కావ్యాన్ని చదివాను. మేఘుణ్ణి అలకాపురికి పంపేప్పుడు దారిలోవున్న యౌధేయ భూమిని వర్ణించనందుకు చాలా విచారించాను. భోజనా

నంతరం, మదిరను సేవిస్తున్నాం. చషకాలు ఖాళీ అవుతున్నాయి. మహాకవి కంఠ్లూ కపోలాలూ అరుణిమను దాల్చాయి.

నేనిలా అన్నాను: "మహాకవీ...."

"నన్ను మహాకవి అనకండి"

"మీరు అనవద్దంటే మాత్రం ఎలా. యౌధేయ భూమిలోకూడా మహాకవి కాళిదాసు సుప్రసిద్ధులే."

"అందుకు యౌధేయభూమికి నేను సదా కృతజ్ఞుణ్ణి. కానీ, నేనంత గొప్ప కావ్యం ఏం వ్రాశాను! అశ్వఘోషుడు, సౌమిల్లుడు, భాసుడు – వీరి ముందు నేనెంత ?" అన్నాడు మహాకవి.

"అలా కాదు. మేము మీ ముఖప్రీతికి ప్రశంసించడంలేదు. మీ "మేఘదూత" ప్రతియింట్లోనూ గానం చేయబడుతోంది. ఆ చిన్నకావ్యం మీ ప్రతిభకు నిదర్శనం మహాకవీ! అలకాపురి మార్గంలోనే యౌధేయభూమికూడా వుంది కదా? మీరు యౌధేయభూమిని గురించి ఏ కొద్ది వర్ణనకూడా చేయలేదేం ?"

"యౌధేయభూమిని నే నెన్నడూ చూడలేదు. ఇప్పుడు చూస్తున్నాను. నిజంగా యౌధేయభూమి చాలా రమణీయమైంది!"

అగ్రోదకాలో కాళిదాసు ఒక వారం రోజులవరకూ వున్నాడు. ఘనమైన సత్కారాన్ని చేశాం. కాళిదాసే స్వయంగా యిలా అన్నాడు: "యౌధేయభూమి నాకు ఘనమైన స్వాగతాన్నిచ్చింది. తన హృదయంలో నాకు ప్రత్యేకమైన స్థానాన్ని ఇచ్చింది; ఈ అకృత్రిమ సహృదయతముందు మహాక్షత్రపుడి అభ్యర్థన, విక్రమాదిత్యుడి దయాదృష్టి – ఇవేవీ లెక్కకు రావు !"

మేము మహాకవి కాళిదాసు కొరకు ప్రత్యేకం నృత్య – గాన మహోత్సవాలను నడిపాం. అతడు క్రొత్తగా రచించిన గీతాలను యౌధేయ యువతులు తమ మధురకంఠాలతో గానం చేశారు. యౌధేయ ప్రజలందరూ అతనితో చాలా నమ్రంగా వ్యవహరించారు. నేనీ వారంరోజుల్లోనూ కావ్యకళను కాక, మరొక విషయం కాళిదాసుతో మాట్లాడలేదు. మహాసేనాపతిని కలుసుకోవాలన్న అభిప్రాయాన్ని అప్పటికయినా పరిత్యజిస్తాడేమో అనుకొన్నాను. కాని, అతడా పట్టును విడువలేదు. ఒకనాటి సంధ్యాసమయాన నేనిలా అన్నాను. "నన్ను క్షమించండి, మహాకవీ ! మీరు కలుసుకోగోరుతున్న 'జయయౌధేయుణ్ణి' నేనేను !"

కాళిదాసు ఒక్కక్షణం విప్పారిన నేత్రాలతో నా ముఖంలోకి చూశాడు. తరువాత లేచి నన్ను గాఢాలింగనం చేసుకొన్నాడు.

ఇలా అన్నారు: "మిత్రమా, జయా ! కాదు – మహాసేనాపతి, జయయౌధేయా !...."

"అలా వద్దు. మీ మొదటి సంబోధనే నాకు చాలా ఇష్టం! మీ అమృత వాక్కుతో మీరే పేరుతో పిలిచినా యీ జయుడు కృతార్థుడుగానే భావించు కొంటాడు."

"సరే, మిత్రమా, జయా! నన్ను నీ ప్రతిద్వంది వైపునుండి పంపబడిన దూతగా భావించు. అయితే ఇప్పుడు నేను నీ దూతనా? కాక, విక్రమాదిత్యుని దూతనా? అనే విషయాన్ని నిర్ధారించుకోలేని స్థితిలో వున్నాను. యౌధేయ భూమి నన్ను పూర్తిగా తనవాణ్ణి చేసుకొంది. మరొక విషయం కూడా నేను స్పష్టంగా తెలుసుకొన్నాను. ప్రజలకు యౌధేయ భూమిలో లభిస్తున్నటువంటి సుఖకరమైన జీవితం మరోచోట లభిస్తున్నదని నేననుకోను. ఇక్కడి స్త్రీ పురుషుల్లోని స్వాతంత్ర్య ప్రియత, ఆత్మగౌరవ భావన—నావరకు నాకు, ఏ స్వాప్నిక విషయాల్లాగానో అనిపిస్తున్నాయి. యౌధేయ ప్రజలు నా హృదయంలో ఒక స్వతంత్రమైన, పవిత్రమైన స్థానాన్ని ఏర్పరచుకొన్నారు. మిత్రమా, జయా! ఇక నీవు జాగ్రత్తగా వినేట్లయితే, నే వచ్చిన విషయాన్ని వెల్లడిస్తాను."

"నేను వింటున్నాను మహాకవీ. మీరు చెప్పదలుచుకొన్న విషయాన్ని నిస్సంకోచంగా చెప్పండి."

"మీ సహృదయత మొదట్లోనే నా సంకోచాన్ని పోగొట్టింది. నా నోటి మీదుగా మీ మనసుల్ని బాధించేమాట ఏమైనా వెలువడితే దాన్ని మీరు లక్ష్య పెట్టవద్దనీ నేను మాట్లాడే ప్రతి మాటకూ వెనుక చంద్రగుప్తుడు వుండి మాట్లాడిస్తున్నాడన్న విషయాన్ని మరువవద్దనీ ప్రార్థిస్తున్నాను."

"ఏమిటీ, చంద్రగుప్తుడు మిమ్మల్ని పంపించాడా? మరి అవంతీ నివాసులమన్నారుగా."

"అవును. అవంతీపురంలో జన్మించిన గౌవరం నాకు దక్కింది."

"మహా క్షత్రపుడి ప్రసిద్ధ శాసనం క్రింద అవంతీనగరపు విద్యా, కళా వైభవోపేతంగా వున్నాయనీ విన్నాను."

"ప్రద్యోతకుడు, అతడి వంశజులు పరిపాలించిన నూటపాతిక సంవత్సరాలు మినహాయిస్తే, అవంతీపురం మరెన్నడూ ఇంత మహోన్నత స్థితికి పోలేదు."

"తమ పూర్వీకుడు రుద్రదామాలాగానే, మహాక్షత్రప రుద్రసింహుడు అతని కుమారుడు కూడా సరస్వతీ భక్తులనుకొంటాను."

"సరస్వతిమీద భక్తి క్షత్రవంశంలోనే వుంది."

"ఐతే మహాకవీ, నీవు నీ జన్మనగరాన్ని వదలి పాటలీపుత్రాన్నెందుకు ఆశ్రయించావు."

"పాటలీపుత్రంలో ఎక్కువ ప్రతిష్ఠ లభిస్తుంది. నీకు తెలియదనుకొంటాను మిత్రమా, విక్రమాదిత్యుడు ఇప్పుడు తన ఎక్కువ సమయాన్ని గంగా—యమునా సంగమంలో గడుపుతున్నాడు."

"గంగా—యమునా సంగమం పరమ భట్టారకులకు ఇంత ప్రియమైంది ఎందుకనో."

"గంగా – యమునా సంగమాన్ని గురించి "తను త్యజాం న శరీరబద్ధం" అని నేను వ్రాసేశాను."

"ఐతే పరమభట్టారకులు తనువును త్యజించి మోక్షాన్ని పొందాలనే ఆశతో, గంగా- యమునా సంగమంలో వుండడంలేదుకదా?"

"పరమభట్టారకుల్ని గురించి నా కంటే బాగా నీవే ఎరుగుదువు మిత్రమా."

"కానీ, అది యుగాల్రకితం విషయం."

"నిజమే, యుగాల్రకితం చంద్రగుప్తుణ్ణి నీవు చూశావు. అయినా అతడి మానసిక బాహ్య జీవిత పరిస్థితుల్లో అంతగా పరివర్తన జరగలేదు."

"నిజమే అతడిలో కాలం తీసుకువచ్చే మార్పులు ఏమీ వుండవని నేనూ ఒప్పుకొంటాను. కాని మహాకవీ! మీరు అవంతీపురాన్ని విడవడానికి కారణం ఏమిటో?"

"నా జన్మస్థానం అవంతీపురం. నన్ను పెంచి, పెద్దచేసి విద్యా బుద్ధుల్ని గరపింది కూడా అవంతీపురమే. ప్రథమ దశలో నేను చేసిన చిలుకపలుకుల్లాటి కవిత్వానికే అక్కడి ప్రజలూ, రాజులూ కూడా ఆదరించి ఆకాశానికి ఎత్తారు! మేఘదూత వ్రాశాక, మహాక్షత్రప రుద్రసింహుడు నన్ను అంతఃపురంలోకి పిలిపించాడు. అర్ధసింహాసనాన్నిచ్చి సత్కరించాడు. తన అంతఃపురంలోని మధురగాయినిని ఒకామెను పిలిపించి మేఘదూతను గానం చేయమని ఆజ్ఞాపించాడు. గానం సమాప్తమయ్యాక, ద్రవితహృదయుడై "ఓ యువకవీ! నిజంగా నీవు శాపగ్రస్తుడివా? నీ ప్రేమకు ఎవరైనా ఆటంకాల్ని కలిగించారా?" అనడిగాడు. "లేదు మహారాజా! ఇది కేవలం కవి కల్పన మాత్రమే" అన్నాను. కాని, రుద్రసింహుడు ఇలా అన్నాడు: "ఇది కేవలం కవి కల్పన మాత్రమేకాదు. ఒట్టి కల్పనే అయితే హృదయాన్ని కదిలించే ఈ అద్భుత శక్తి ఉండదు కవిత్వంలో. క్షత్రపవంశం ఎంతోకాలం నుండి విద్వాంసుల, విద్యాధురీణుల చరణసేవలో ప్రత్యేకమైన ప్రసిద్ధిపొందింది. ఏ క్షత్రప కుమారినైనా మీరు ప్రేమించి తద్వారా అభిశపులైనట్టయితే చెప్పండి; మీకా ప్రేమను సమకూర్చి పెట్టడానికి మా సర్వశక్తుల్ని వినియోగిస్తా మన్నాడు. నా కవిత్వ మింకా క్షిప్రా తీరాన్ని దాటకముందే, రుద్రసింహుడు నా మీద ఇంతటి దయను కనబరచాడంటే నా గురించిన వారి అభిప్రాయాలు ఎలా వుంటాయో నీవు వూహించుకొనవచ్చును."

"మహాకవీ" మీరు దూతకార్యానికి వచ్చానని చెప్పినప్పుడు, మహాక్షత్రపుడైన రుద్రసింహుని వద్ద నుండి వచ్చారనుకున్నాను."

"రుద్రసింహుని వద్దనుండే వచ్చినట్లయితే నాకి కర్తవ్యాలూ, బాధ్యతలూ కూడా చాలా తేలికపడేవనుకొంటాను."

"నిజంగా చాలా తేలికపడేవి."

"నా నగరం తరపున నేను దూతకార్యానికి రానందుకు, చంద్రగుప్తుని దూతగా వచ్చినందుకు చాలా విచారిస్తున్నాను. ఇలా నేను రావడానికి కో ముఖ్య కారణం కూడా వుంది. కవిగా కీర్తి నార్జించడం ప్రారంభించాక, నాలోని విలాస ప్రియత, మదిరా మదిరేక్షణలమీది తృష్ణా అధికమయ్యాయి. వాటి సాధనకు, కీర్తిని ఇంకా ఇంకా ఆర్జించాలన్న కీర్తికాముకత పరితృప్తికి విక్రమాదిత్యుణ్ణి ఆశ్రయించవలసి వచ్చింది. నా కీర్తికాముకతకు పరితృప్తి ప్రభావంతుడైన రాజా శ్రయం లభిస్తేనే నని నేననుకొన్నాను, ఈ యశఃకాముకతే నన్ని దౌత్యకార్యానికి పురిగొల్పింది."

ఆ నాటికి అంతటితో మా సంభాషణను ఆపేశాం.

రెండవరోజున కవిని తీసుకొని నేను అగ్రోదకాకు వెలుపలవున్న నా ప్రత్యేక ఉద్యానవనానికి పోయాను. ఇంకా చెట్లక్రింద పచ్చిగడ్డి అలాగే వుంది. మేము పుష్కరిణి ఒడ్డునవున్న శిలాఫలకం మీద కూర్చుని వున్నాం. దృష్టిని నాలుగువైపులా బరపుతూన్నా." నా కవిత్వానికి పనికివచ్చే ఉపకరణాలు యౌధేయ భూమిలో ప్రచురంగా లభిస్తాయి. కాని వీటితో కవిత్వమల్లాలంటే, నేను తిరిగి క్రొత్తగా ప్రయోగాల్ని నేర్చుకోవలసి వస్తుంది. మిత్రమా జయా! ఒక్కోమారు నా కవిత్వం మీద నాకు చాలా అసంతృప్తి కలుగుతుంది" అన్నాడు కాళిదాసు.

"మీరు మీ అసంతృప్తిని తప్పక పరిహరించుకోవాలి. మీ వాక్కులో ఏదైనా త్రుటి వుండవచ్చు! కాని, అది చంద్రుడిలోని కళంకంలా మీ కవిత్వపు సౌందర్యాన్ని ఇనుమడింపచేస్తుందే కాని తగ్గించదు!"

"బహుశః యౌధేయుల్ని, వారి భూమిని స్నేహదృష్టితో చూసే అవకాశమే దొరక్కపోయినట్లయితే, నా కీ అసంతృప్తి అంతగా కలిగేది కాదేమో, నా యశస్సును చిరస్థాయి చేసుకోవడానికి ప్రత్యేకమైన ప్రయత్నం నే నేమీ చేయనవసరం వుండదన్న నీ అభిప్రాయాన్ని నేను కాదనను. నా కవిత్వంలోనే నా కీర్తిని దశదిశలా వ్యాపింపచేయగల సౌరభం ఉందన్న విషయాన్ని నేను కాదనను. కాని, ఈ ప్రపంచంలో ఎంతమంది మహాత్ములైన కవులు, గొప్ప కవిత్వ సౌరభాల్ని వెదజల్లినవారే, నామరూపాలు లేకుండా కాలగర్భంలో కలిసిపోలేదు? వాల్మీకి, అశ్వఘోషుడు, భాసుడు, సౌమిల్లుడు—మొదలుగాగల ఐదారుగురు కవులూకాక, ఇక మహాకవులే ఈ దేశంలో ఉద్భవించలేదా? వారందరూ ఏమయ్యారు? వారి కవిత్వం ఏమైంది? ఏమో నా పట్లకూడా అలాటి దుర్ఘటనే జరిగితే ? ముందుతరాల వారికి కాళిదాసన్న కవి ఒకడు ఉన్నాడన్న విషయం కూడా తెలియదేమో? వెనక కవిత్వాలు ముఖతః జ్ఞాపకం వుంచుకొంటూండేవారు. నే నిప్పుడు భూర్జపత్రాలమీదా, తాళపత్రాలమీదా కవిత్వాన్ని వ్రాసి, దేశ దేశాలా వ్యాపింపచేస్తున్నాను. అయినా కవిత్వాలకూ, కవులకూ చిరస్థాయిని ప్రసాదించడానికి ఆ మాత్రం ప్రయత్నమే

చాలదు. వ్యాసుని భారతము, వాల్మీకి రామాయణము చిరస్థాయి పొందాయంటే వాటిని బ్రాహ్మణులు స్వీకరించారు. ఈ కాలంలో బ్రాహ్మణుల తరువాత రాజులే కవిత్వాలకు చిరస్థాయిని ప్రసాదించగలరు.

"కాని అసలు రాజులకే స్థిరత్వం లేదుగదా ఇంక మీ కవిత్వాని కెలా స్థిరత్వాన్ని ప్రసాదించగలరు?"

"మిత్రమా కాళిదాసు చంద్రగుప్తుణ్ణి గురించిగాని, అతడి కొడుకు కుమారగుప్తుణ్ణి గురించిగాని కావ్యం రాయబోవడంలేదు. ఈ గుప్తవంశాన్ని ఆకాశానికి యెత్తాలన్న అభిప్రాయమూ నాకు లేదు."

"అలాంటప్పుడు చంద్రగుప్తుడిక మీ కావ్యాలకు స్థిరత్వాన్ని ప్రసాదించడానికి ప్రయత్నం ఎందుకు చేస్తాడు."

"శ్లేషోక్తికూడా కవిత్వపు చమత్కారాల్లో ఒకటి. నేను రఘువంశ కావ్యం వ్రాస్తున్నాను. నేను పరమభట్టారకుర్తో యిలాగని చెప్పాను: ఈ కావ్యంలో దిలీపు డెవరో కాదు. మీ పితామహుడు చంద్రగుప్తుడు. సుదక్షిణ మీ పితామహి కుమారదేవి దిగ్విజయి 'రఘు' దివంగత పరమభట్టారకులు సముద్రగుప్తులు. ఇక అజుడు తమరు అని చెప్పాను."

"చంద్రగుప్తుడు ఇంతకే సంతృప్తిపడ్డాడా?"

"మహాకావ్యం వ్రాయడం వలన మంచి అవకాశాలు లభిస్తాయి. నేను నా కావ్యంలో రాజులు స్వార్థరహితులని చెప్పడానికి ఈ శ్లోకాన్ని రచించాను."

ప్రజానా మేవ భూత్యర్థం స తాభ్యో బలిమగ్రహీత్
సహస్రగుణ ముస్రష్టు మా దత్తే హి రసం రవిః॥

(సూర్యుడు ఎలాగైతే ఒకవంతు రసాన్ని స్వీకరించి, తిరిగి వేయివంతులుగా ప్రసాదిస్తాడో రాజులు కూడా అలాగే ప్రజాసేవా తత్పరులై వుంటారు.)

నేను నవ్వుతూ ఇలా అన్నాను: "ప్రజాశ్రేయస్సు కొరకే రాజులు పన్ను తీసుకొంటారనటం పూర్తి అబద్ధం కాదా? పరమభట్టారకులూ, యువరాజులూ, రాజకుమారికలూ, కుమారులూ, పరమభట్టారికా—వారి వేల సంఖ్యలో వున్న సవతులూ, సఖీజనులూ—వీరందరి కొరకు కోట్లదీనార్లు ఖర్చు అవుతూవుంటాయి కదా! ఇదంతా ప్రజాసౌకర్యం కొరకేనా; తరువాత సూర్యుడిలా కొద్దిగా రసాన్ని స్వీకరించి వేయిరెట్లు అధికం చేసి తిరిగి ప్రసాదిస్తాడన్న ఉక్తివున్నదే, దాన్ని వింటేనే చెవులకూ, హృదయానికీ కూడా బాధ కలుగుతోంది. రాజుల యొక్క ధనాగారాలు నిండడానికి ఏకైక సాధనం, ప్రజల పరిశ్రమ. ఏ రాజు దగ్గిరా దీనార్ల వృక్షం లేదు కోసి ఈయడానికి; మరి ఇక ఎక్కడినుండి తెచ్చి యిస్తారు."

"నే నిది అబద్ధం కాదని అనడంలేదే? మరొక విషయంకూడా చెపుతున్నాను. అబద్ధమే చెప్పదల్చుకొన్నప్పుడు, చిన్న అబద్ధం కాదు, పెద్ద అబద్ధాన్నే చెప్పాలి! ఇలా అబద్ధాలు చెప్పడానికి నేనే ప్రథముణ్ణికాదు. వ్యాస, వాల్మీకాదులు నాలాంటి

వారికి ఈ విషయంలో కూడా మార్గదర్శకులే! విక్రమాదిత్యుడు చిన్ని చిన్ని అబ ద్ధాలతో సంతృప్తి పడేంత అమాయకుడు కాదు!"

"మౌర్య చంద్రగుప్తుణ్ణి, చాణక్యుణ్ణి-ఇద్దర్నీ మించాడు!"

"నే నిలాంటి ఉక్తుల్ని చెప్పినప్పుడు చంద్రగుప్తుడు చాలా సంతోషిస్తాడు. నేను "భువీ మహావరాహ దంష్ట్రియా" అని ఒక శ్లోకాన్ని వ్రాశాను. విక్రమా దిత్యుడు శ్లోకాన్ని వినగానే ఎగిరిపడ్డాడు. శ్లోకంలోని భావాన్ని రాతిలో మలచా లన్నాడు. ఒక నిపుణుడైన శిల్పిచేత శిల్పాన్ని చెక్కించాడు. చూసి నేను చకితు ణ్ణయ్యాను. వరాహ రూపంలో తల మినహా మిగిలిన శరీరమంతా తనది. దంష్ట్రి లన్నీ భూదేవిగా ధ్రువదేవి ఆకారాన్ని చెక్కించాడు."

"నేను మధురలోనూ ఇలాటి మూర్తినొకదాన్ని చూశాను!"

"మధురలో కూడానా? మిత్రమా! నే నానాడు మధురనుండి వచ్చానని అసత్యం చెప్పాను. కాని, చంద్రగుప్తుడు ఎన్నడూ తనను గాని, తన వంశాన్ని గాని కీర్తించమనీ నాతో చెప్పలేదు. ఒకవేళ అలాచెబితే, ఏం చేసేవాడినో తెలి యదు. నేను నా కవిత్వాల్లో ఒక అమరసౌందర్యాన్ని అంతర్వేదననీ సృష్టిస్తు న్నాను. కనుక అవి మానవజాతి ఉన్నంతవరకు నిల్చివుంటాయి. పైగా నా కవి త్వాన్ని కొంతవరకు రాజుల స్వార్థ రక్షణకు కూడా ఉపయోగపడేటట్టుగా చూస్తు న్నాను. ఇందువల్ల ఒక గుప్తవంశమే కాదు, ప్రతి రాజవంశమూ నా కవిత్వాన్ని రక్షించడానికి ప్రయత్నిస్తుంది."

"మీ ఈ అభీష్టాన్ని మహాక్షత్రపుడు కూడా నెరవేర్చగలడు కదా?"

"క్షత్రపవంశం వయస్సు మీరిన దయింది! ఏ రాజవంశం కూడా రెండు వందల సంవత్సరాలకంటే తన వైభవాన్ని కాపాడుకోలేదు."

"క్షత్రప వంశానికి మూడు వందల సంవత్సరాలకు పైన వయస్సుంది."

"అస్తాచలగామియైన సూర్యభగవానుడి కిరణజాలం కూడా బాలసూర్యుణ్ణి జ్ఞప్తికి తెస్తూ ఎర్రగానే వుంటాయి. కాని, మానవుడు బాలసూర్యుడి నుండే వేడినీ, ప్రకాశాన్నీ ఆశిస్తాడు."

"అంటే మీరు గుప్తవంశమనే బాలసూర్యుడి మీద ఆశ కలిగి వున్నారన్న మాట?"

"నిజమేను! గుప్తవంశమనే బాలసూర్యుణ్ణే నా ఆశయసిద్ధికి మార్గదర్శిగా ఎన్నుకొన్నాను. అంతేకాదు, ఆ బాలసూర్యుడి కిరణాల రూపంలో ఒక నూతన మతావిర్భావాన్ని చూస్తున్నాను. ఆ మతం అందరూ అర్థం చేసుకోదగింది. అందరూ అనుసరించదగింది."

"గో బ్రాహ్మణుల పూజా, గుళ్ళూ, గోపురాల ఆడంబరం, పురాణపఠనం! ఇదేగా ఆ నూతన మతం?"

"బ్రాహ్మణుల శక్తి ఇంకా పెరుగుతుందని నే ననుకొంటున్నాను. సేనాపతీ! మీరేమీ అనుకోకుండావుంటే ఒక విషయం చెబుతాను. నేను మీ గృహంలో సుందరమైన బుద్ధప్రతిమను చూశాను. కాని, భవిష్యత్తులో ఆ మతానికి ఈ దేశంలో ఎలాటి స్థానమూ లేదు!"

"మీ అభిప్రాయాన్ని నేను బలపరుస్తున్నాను. బౌద్ధమతం బహుజన హితంకొరకు ప్రవర్తింపబడ్డది. అలాంటిది ఎప్పుడైతే రాజుల్ని ఆశ్రయించిందో అప్పుడే పతనానికి మార్గాన్ని ఏర్పరచుకొంది! కాకపోయినా బౌద్ధమతంలో రాజుల ఆశ్రయాన్ని శాశ్వతంగా నిలబెట్టుకోగల లక్షణాలు ఏమీలేవు! బౌద్ధులు వర్ణ వ్యవస్థను నిర్మూలించనూ లేరు. కాదని విదేశ రాజులకు ఉత్తమ వర్ణాన్ని ప్రసాదించనూ లేరు!"

"కాని, బ్రాహ్మణులు తమ తప్పును తెలుసుకున్నారు! తమ శక్తిని పూర్తిగా ఉపయోగించుకొన్నారు. నిన్నటి మ్లేచ్ఛులకు ఈ రోజు ఉచ్చవర్ణాలలో సభ్యత్వాన్నిచ్చారు. ఇప్పుడు దేవపుత్రశాహి, మహాక్షత్రపుడు బ్రాహ్మణులకు పరమ భక్తులు! కనుకనే నేను బ్రాహ్మణుల ఈ కొత్త ధర్మాన్ని, మతాన్ని నా కవిత్వానికి ఆలంబనం చేసుకొంటున్నాను. రాజు లెటూ ఈ మతాన్ని, ధర్మాన్ని చిరస్థాయి చేస్తూనేవున్నారు గదా? ప్రస్తుత పరిస్థితిలో ఆశ్రయించదగిన మహారాజు చంద్రగుప్తుడే!"

"మహాకవీ! మీ కృతులమీద మీకు విశ్వాసం లేకపోవడం, రాజుల ఆశ్రయము వలనగానీ మనలేననుకోవడం చాలా పొరపాటనుకొంటున్నాను! మీ కృతుల్లో అమరతను పొందగల శక్తివుంది!"

"కావచ్చును. మిత్రమా, జయా! నేను ఏ తర్కంద్వారా నిన్ను వశం చేసుకొనదలచి వచ్చానో ఆ తర్కం నిరుపయోగమై పోయినది. నీవు వుండడానికి స్వంత గృహాన్నయినా వుంచుకోలేదు. ఇక ఏ ఆశను చూపి చంద్రగుప్తుడి వైపుకు నిన్ను నేను మరల్చను? చంద్రగుప్తుని మాటలుగా నీకు నేను యౌధేయ భూమిని, మాళవభూమినే కాకుండా, భవిష్యత్తులో గెలువబోయే అవంతి, సౌరాష్ట్రి భూముల్ని నీ చరణాల ముందు వుంచుతామని చెబితే, అందుకు నీవు అవమానపడతావే గాని ఆనందపడలేవు!"

"విక్రమాదిత్యుడు నన్ను మాళవరాజును చేద్దామనుకొంటే చాలా పొరపడుతున్నాడంటాను!"

"అదెటూ తెలుస్తూనేవుంది. కాని భరతఖండాన్నంతటినీ ఏకచ్ఛత్రంగా చేయాలని విక్రమాదిత్యుడి ఆకాంక్ష!"

"అదికూడా ధర్మంకొరకు, పరోపకారం కొరకు, శాంతికోసం, విదేశ ఆక్రమణలనుండి భారతభూమిని రక్షించడం కొరకు! ఔనా? మౌర్యచంద్రగుప్తుడూ, చాణక్యుడూకూడ ఇలాగే చెప్పారులే!"

"కాని వారు సఫలు లయ్యారనబోతున్నావుకదా? కాని, విక్రమాదిత్యుడు గణాలు మమ్ము సఫలురను కానీయడం లేదంటున్నాడు." అన్నాడు కాళిదాసు.

"నిరంకుశులైన రాజులకు గణాలు ఎప్పుడూ 'కంటినలుసు' లాగానే వున్నాయి. ఇప్పుడసలన్నిగణాలుకూడా లేవు. మాళవగణాన్ని ఎటూ దిగమింగాడు విక్రమాదిత్యుడు. ఇక పోతే యౌధేయ గణంవుంది. చంద్రగుప్తుడు దీన్ని దిగ మింగాలని చూస్తున్నాడు. బ్రాహ్మణులూ, మీరూ కూడా గాఢమైన మీ మౌనం ద్వారా, చరిత్రలోనే "యౌధేయ" అన్న పదంకూడా లేకుండా చేయటానికి, తద్వారా చంద్రగుప్తుడికి సహకరించడానికి సిద్ధపడ్డారు."

"నీవు చెప్పినది నిజమే అయివుంటుంది. సేనాపతీ! యౌధేయ గణాన్ని మింగడం చంద్రగుప్తుడి కంత తేలికైన పనికాదు."

"యౌధేయుల్లో విభీషణు డెవడూ లేడు."

"పరిణామం ఎలా వుంటుందో తెలుసునా సేనాపతీ?"

"యౌధేయులు దేశంకోసం బలి అవుతారు."

"విక్రమాదిత్యుడు యౌధేయభూమిని సర్వనాశనం చేస్తాడు!"

"చేయవచ్చును. అయినా ఆత్మగౌరవాన్ని, స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొన్న తరువాత, సర్వనాశనం ఒక లెక్కా?"

"యౌధేయులు వీరులు. వీరులకు సర్వకాలాల్లోనూ గౌరవం లభిస్తూనే ఉంటుంది. కాని సువిస్తృతమైన విక్రమార్కుడి సైనికబలాన్ని యౌధేయులు ఎలా ఎదిరించగలరు?"

"అలాగని అసలు ఎదిరించకుండా అస్త్రసన్యాసం చేయడం ఏం బుద్ధిమంత తనం? చంద్రగుప్తుడితో నేను చెప్పగలిగిం దేమీ లేదు. సముద్రగుప్తుడివద్ద సమ్మ తించిన షరతను యౌధేయులు చంద్రగుప్తునివద్దగూడా సమ్మతిస్తారు."

"చంద్రగుప్తుని ఊరకనే రాజోచ్ఛేదకు డంటారు. నిజాని కతడు గణోచ్ఛేద కుడు. గణాలవలన భారతదేశపు ఐక్యత, బలమూ క్షీణిస్తాయంటాడు అతడు."

"అంటే రాజాజ్ఞ ననుసరించి కండ్లు మూసుకొని, యుద్ధభూమికి ఉరికే గొర్రెల్లాటి ప్రజలు కావాలని అతడి ఆశయం! నిజంగా భారతదేశపు ప్రజలందరూ అలా ఏనాడైతే గొర్రెలౌతారో, ఆనాడే భారతదేశపు శాంతికి, ఘోరమైన ప్రమాదం వాటిల్లుతుంది."

"నిస్సందేహంగా!"

"యౌధేయప్రజలు అలాటి గొర్రెలు కారు. యౌధేయభటులు యుద్ధంలో మహానేర్పరులు. శతాబ్దాలనుండి శత్రువులుకూడా వారిని కీర్తిస్తున్నారు. ఈనాడు నేను యౌధేయ ప్రజలవద్దకు వెళ్ళి, చంద్రగుప్తుడు మిమ్మల్ని గొర్రెలుగా మార్చ బోతున్నాడు. ఆయుధ విసర్జన చేయండి! అంటే ఏమంటారు?" అన్నాను నేను.

"ఒప్పుకోరు. వాళ్ళు నిన్నే మింగేస్తారు."

చంద్రగుప్తుడు దేశాన్నంతా గొర్రెలతో నింపాలని చూస్తున్నాడు. నేను వివేకవంతులైన యోధులవలన దేశం పటిష్టతను పొందుతుందంటున్నాను. ఈనాడు కాకపోయినా మరొకనాటి కయినా నా యీ 'కల' యథార్థం కాకపోదు. సరే, ఇక నీ విషయాన్ని యింతటితో ముగిద్దాం."

నా సమాధానంవలన కాళిదాసు చాలా నిరాశపడ్డాడు. అయినా, వెళ్ళేప్పుడు గొప్ప స్నేహభావాన్ని ప్రదర్శించాడు. బహుశా కాళిదాసు, తన కవిత్వప్రతిభను మా గణాలకోసంకూడా ఉపయోగిస్తాడేమో. కాని, నా అనుమానమే సత్యమై అతడు మా గురించి వ్రాసిన అంశం రాజుల ద్వేషానికి గురియై వశించిపోతేవో.

# ఉపసంహారం

ఇక ముందు విషయం వ్రాయడానికి అసలు వ్రాసే వ్యక్తే యీ ప్రపంచాన్ని విడిచి, మహాశూన్యంలో పరివ్యాప్తమైనాడు. ఇకముందు వ్రాయవలసినది కూడా చాలా వుంది. కాని, శోకతప్త హృదయుడయిన మాధవసేనుడు, తరువాత జరిగిన విషయాలను సూచనప్రాయంగా మాత్రం వ్రాస్తున్నాడు—

కాళిదాసు వెళ్ళిన తరువాత, జయుడు యుద్ధానికి అవుసరమైన సన్నాహాల నన్నింటినీ పూర్తి చేసుకొన్నాడు. చంద్రగుప్తుడిక ఆలస్యం చేయడన్నది స్పష్టమైంది. చంద్రగుప్తుడి రాజ్యసీమలోకి వెళ్ళి ముందుగా మేమే ఆక్రమణను ప్రారంభించినట్లయితే ఫలితం మరోరకంగా వుండేదేమో! యౌధేయులు ఇతర్లభూమినికోరరు. తమ భూమిని ఇతర్లు కోరితే క్షమించరు. యౌధేయుల యుద్ధనీతి పరిశుద్ధమైనది. చివరకు మృత్యువే మా యిద్దర్నీ వేరుపరచగలిగింది. జయుడు తుదిసారిగా యౌధేయుల ఒక మహాసభలో వుపన్యసించాడు.

ఇలా అన్నాడు: "యౌధేయ స్త్రీ పురుషులారా, మనముందు ఒక పెద్ద విపత్తు తన కరాళ గళాన్ని తెరుచుకొని వుంది! ఇంతవరకూ ఏ శత్రువు మనల్నియౌధేయ నామాన్ని, యౌధేయమతాన్ని విడవండని బలవంతం చేయలేదు. మన మతాన్ని, పేరును సర్వస్వాన్ని త్యజిస్తేనే బ్రతకనిస్తానంటున్నాడు చంద్రగుప్తుడు. మన మతమూ, మనజాతి నామధేయము పోయాక ఇక బ్రతికి ప్రయోజనం ఏమిటి? శత్రువు బలవంతుడని మనకు తెలుసు. కాని రాజుల బలాల్ని యౌధేయులు ఏనాడైనా లెక్కపెట్టారా? మనం ఒకమాటు చంద్రగుప్తుడికి బుద్ధిచెప్పాం. కాని మర్చేపోయినట్లున్నాడు. మళ్ళీ ఒకమాటు గట్టిగా బుద్ధిచెప్పాలి. ఈనాడు యౌధేయ స్త్రీలు కూడా పురుషుల్తో సమానంగా యుద్ధం చేస్తారు. ఇది చాలా హర్షించదగిన విషయం. యౌధేయ స్త్రీలకు, సునంద ఆదర్శ మార్గదర్శిక; ఈనాడు ప్రతి ఇంటా సునందలు వెలిశారు. ఒక్క యౌధేయ స్త్రీలే కాకుండా, కుణింద స్త్రీలూ, ఆర్జునాయన స్త్రీలుకూడా వీరవనితలు, వీరమాతలు, వీరసోదరీమణులు, వీరపత్నులు అయ్యారు. సంతానానికి ఉగ్గుపాలతోనే శౌర్యాన్ని రంగరించిపోసే మీకు కర్తవ్యాన్ని ప్రబోధించ నవసరం లేదనుకొంటాను."

విక్రమశకం 80లో (380క్రీస్తుశకం) ఈయుద్ధం జరిగింది. అప్పటికిజయుడు యాభై ఏండ్లవాడయ్యాడు. ఈమారు చంద్రగుప్తుడు బహుముఖాలుగా ఆక్రమణ

జరిపాడు. విస్తృతమైన యుద్ధపు వర్ణనలతో విసిగించడం ఇష్టంలేదు. శక్తికూడా లేదు. మొదటి ఆక్రమణ స్రుఘ్న (అంబాలా) వద్ద జరిగింది. గుప్తసైనికులకు యమునను దాటే అవకాశాన్నీయలేదు మేము. అక్కడినుండి మధురవరకూ గల అనేక తీరాలనుండి యమునను దాటడానికి గుప్తసైనికులు ప్రయత్నించారు. మధుర మొదట్నుండి గుప్తుల వశంలోనే వుంది. అదే మాకు ప్రమాదకరమైన ఆపదను తెచ్చిపెట్టింది. గుప్తసైనికులు మధురవద్ద యమునను దాటడంలో చివరకు కృతకృత్యులయ్యారు. రెండు మాసాల ఘోర యుద్ధం తరువాత గుప్తసైనికులు యమునను దాటి అర్జునాయన్ల భూమిలో కాలూనగలిగారు. ఈ రెండు నెలల్లో గుప్తవాహినిని ఆపగలిగింది జయుని పరాక్రమమే. మధురలో, స్వయంగా చంద్రగుప్తుడే వచ్చి కూర్చుని సైన్యాన్ని నడిపాడు. ఉభయసైన్యాలూ బాగా దెబ్బతిన్నాయి. యౌధేయులు పూర్తిగా దెబ్బతిన్నారు.

ఇంద్రప్రస్థపురంలో కూడా గుప్తసైన్యం యౌధేయుల్ని ఘోరంగా ఓడించింది! యౌధేయులకు అన్నిటికంటే గొప్పదెబ్బ తన మహాసేనాపతిని కోల్పోవడం! సేనాపతి జయుణ్ణి ఎలాగైనా ప్రాణాలతో పట్టుకురావలసిందని విక్రమాదిత్యుడు ఆజ్ఞాపించాడు. క్షతగాత్రుడై యుద్ధభూమిలో స్పృహతప్పి పడిపోయేవరకూ అతడిని పట్టుకోలేకపోయారు. యౌధేయులు తమ సేనాపతిని ఎలాగైనా తెచ్చుకుందామని అనేకమార్లు ప్రయత్నించారు. ఆక్రమణలను జరిపారు. కాని, గుప్తసైనికులు ఒక ప్రకాండమైన దుర్గంలా అడ్డు నిలబడి సేనాపతిని అందనీయలేదు. గుప్తసేనాపతి వీరసేనుడు జయుడివద్దకు వచ్చి నమస్కరించి తనను పరిచయంచేసుకున్నాడు. అప్పుడు జయుడు కేవలం యిలా అన్నాడుట: "గుప్తసైనికులు నా శవాన్ని మాత్రమే యౌధేయభూమి నుండి తీసుకొనిపోగలరు!" వీరసేనుడు జయుణ్ణి బ్రతికించడానికి ఎంతో ప్రయత్నించాడు. కాని, జయుడు కొద్దిక్షణాల తరువాత శాశ్వతంగా కన్ను మూశాడు.

మా సేనాపతి చనిపోయాడు. అయినా మా యుద్ధం ఆగలేదు. జయుడు చెప్పినట్లు యౌధేయ సైనికులు గొర్రెలు కారని స్పష్టపరిచాం. విస్తృతమైన యౌధేయ భూమే ఒక మహా యుద్ధరంగంగా తయారయింది. పురుషులూ, స్త్రీలూ, బాలురూ-అంగుళం అంగుళం ప్రదేశం కోసం ఒక్కొక్కళ్ళుగా ప్రాణాల నర్పించారు. చంద్రగుప్తుడు ఆగ్రోదకా, ఖాండిలా, రోహతక్, పృథూదకా మొదలైన యౌధేయ నగరాలను వశపరచుకొన్నాడు. ఆ నగరాల్లో కనుపించిన ప్రతి పురుషుణ్ణి చిత్రహింస చేశాడు. అనేకమంది యౌధేయవీరులు అడవుల్లోకి పారిపోయారు. అక్కడ నుండి తమ పోరాటాన్ని సాగించారు.

గుప్తసైన్యం విచక్షణారహితంగా ప్రతి యౌధేయుణ్ణి వధించడమే తన కర్తవ్యంగా పెట్టుకొన్నది. లక్షలకొలది యౌధేయ, కుణింద, అర్జునాయన స్త్రీ–పురుషులు తమ స్వాతంత్ర్య పరిరక్షణకొరకు బలి అయ్యారు. అందమైన యౌధేయ

భూమి శ్మశానమైంది. వాళ్ళు నిర్మించుకొన్న విశాల జలాశయాలు, ఆనకట్టలు నాశనమైనాయి. ఎంతోమంది యౌధేయులు ప్రాణాలను రక్షించుకొని పరదేశాలకు వెళ్ళారు. మహా వీరులైన యౌధేయులు విదేశాల్లో వ్యాపారంద్వారా అన్యవృత్తుల ద్వారా పొట్ట పోసుకుంటున్నారు.

యౌధేయభూమిని జయించిన తరువాత, వెంటనే అవంతీపురం మీద ముట్టడి జరిపాడు విక్రమాదిత్యుడు. మాళవ, వాకాటక సైన్యాలు కూడా అతడి ఆజ్ఞ ననుసరించాయి. జయుడు ముందుగానే ఈ ప్రమాదాన్ని తెలియబరచాడు. కాని, క్షత్రపులు యౌధేయులతో కలిసి చంద్రగుప్తుణ్ణి ఎదిరించడానికి యిష్టపడలేదు. వైష్ణవ, రుద్రదామాల రక్తం రుద్రసేనుడిలో ప్రవహిస్తోంది. అతడూ గుప్తసైన్యాన్ని ధీరతతో ఎదిరించాడు. కాని, ఎంతవరకు ధీరత? కొద్ది మాసాల అనంతరం అవంతి, సౌరాష్ట్రం కూడా విక్రమాదిత్యుడి ముందు తలవంచాయి. క్షత్రపవంశం శాశ్వతంగా లుప్తమైంది! విక్రమాదిత్యుడు విజయోత్సాహంతో కొన్ని వెండినాణాలను కూడా ప్రవర్తిల్ల చేశాడు. ఆ వెండి నాణాలు ఒక దీనారుకు పదహారు. వాటి మీద ఇలా వ్రాయించాడు : "శ్రీ గుప్తకులస్య మహారాజాధిరాజ శ్రీ చంద్రగుప్త విక్రమాదిత్యస్య!" ★

